# శ్రీకృష్ణుడు

## దేవుడా! భగవంతుడా!!

దేవుడే భగవంతుడే




రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు



www.thraithashakam.org





# శ్రీకృష్ణుడు

## దేవుడా! భగవంతుడా!!


రచయిత : త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ.శ్రీ.శ్రీ. ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము–42 తృతీయ ముద్రణ : మార్చి–2020

ప్రతులు : 1000 **వెల : 250/-**

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్దమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్దమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

"ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మపత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర.
41) భావము-భాష.
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము.
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము.
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు.
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.
76) నాది లోచన-నీది ఆలోచన.

77) ధ్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్ర వాక్యములు.
92) బ్రహ్మ-రావణబ్రహ్మ-భగవాన్ రావణబ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) హిందూ ధర్మమునకు రక్షణ అవసరమా?
95) వేదములు మనిషికి అవసరమా?
96) ఉపనిషత్తులలో లోపాలు.
97) ఖుర్ఆన్, హదీసు ఏది ముఖ్యము?
98) సుప్రసిద్ధి బోధ.
99) భక్తిలో మీరు సంసారులా? వ్యభిచారులా?
100) ౧౦౦, శతము, 100.
101) సిద్ధి బోధ.
102) సత్యార్థ ప్రకాశికలో సత్యమెంత.
103) రూపము మారిన గీత.
104) పోలీసులు-నేరస్థులు.
105) ఇప్పటి మానవుని పరిస్థితి.
106) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు–అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్–అలక్‌నిరంజన్.
05. మాయకుడు–అమాయకుడు.
06. తల్లి తండ్రి–గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ–పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం–దేహం మోహం.
11. ఎదమీదముద్ర–తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు–రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు–ఆరు–తొమ్మిది.
15. మాయ మర్మము– ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం–లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము–మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు–ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం– తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం– రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు–కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు–అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ, 28. తాత,
29. తల్లి, 30. భయం.
31. ఆత్మపని, 32. బట్టతల.
33. యాదవ్, 34. జ్ఞానశక్తి.
35. సమాధి, 36. 6-3=6.
37. సంతకము, 38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము, 40. తోలేవాడు.
41. తల్లి తండ్రి, 42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ, 44. గురు చిహ్నం.
45. ఆస్తి-దోస్తి, 46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము, 48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు, 50. పురుషోత్తమ.
51. మతద్వేషము, 52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ, 54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు, 56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి, 58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు, 60. దశ-దిశలు.
61. మాట-మందు,
52. సృష్టి-సృష్టికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?
79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.

106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము.
126. లలా జలము.
127. దైవ ధర్మములు
మత సాంప్రదాయములు.
128. ఆహారము నీకా!
నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు.
130. కాలచక్రం.
131. బ్రహ్మవిద్య. 132. శక్తి.
133. పౌర్ణమి-అమావాస్య.
134. ఈశ్వర-పరమేశ్వర.
135. పురుషోత్తమ-శ్రీరామ.
136. దేవునికి ఒక్కడే కుమారుడు-
దేవునికి అనేకమంది కుమారులు.
137. జలం. 138. అధిపతి.
139. గ్రహాంతర వాసులు.
140. దేవుడు ద్వితీయుడా? అద్వితీయుడా?
141. మనిషి చేతిలో భగవంతుడు-
దేవుని చేతిలో మనిషి.
142. శరీరములో రక్తము-
గ్రంథములో జ్ఞానము.
143. గ్రంథములో జ్ఞానము-
మనిషిలో రక్తము.
144. త్రైత సిద్ధాంత చరిత్ర.
145. కుశాల్ కుశాల్ లంజమ్మ
నా నెత్తిమీద రెండు తన్నమ్మ.
146. రాజాధి రాజా - దేవాధి దేవా.
147. ఎనిమిది మంది భార్యలున్న
శ్రీకృష్ణునికి గోపికల మీద ధ్యాస ఎందుకు?
148. కులం-మతం, 149. గుడి.
150. గురుపౌర్ణమి సందర్భముగా మీటింగ్
151. భగవంతుడు ఎవరు?
152. విశ్వదాభిరామ వినుర వేమా.
153. కాలం, 154. యమధర్మ.
155. కుడి ధర్మం-ఎడమ ధర్మం
156. ఇందుత్వము అందరిలో కలదు-
హిందుత్వము కొందరిలో కలదు.
157. ధర్మములు మూడే ఉన్నవి
అధర్మములు ఆరు అయినవి?
158. నేను-నా తండ్రి-నా తాత,
నేను-నా అమ్మ-నా అవ్వ.
159. ఆద్య ఆత్మీకము-ఆధ్యాత్మికము,
ఆద్య దేవీకము-ఆద్యేవీకము.
160. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

08

### ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి (ప్రెసిడెంట్)**
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ (సూర్య మీ సేవా)**
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య (టీచర్) (ప్రెసిడెంట్)**
ప్రబోధాశ్రమము, తాడిపత్రి (మం)
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ (ప్ర.సభ్యుడు)**
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర (ప్రెసిడెంట్)**
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య (ప్ర.సభ్యుడు)**
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక (Head Office)**
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు (ప్ర.సభ్యుడు)**
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు (టీచర్) (ప్రెసిడెంట్)**
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్ (వైస్ ప్రెసిడెంట్)**
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ (వైస్ ప్రెసిడెంట్)**
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు (ప్రెసిడెంట్)**
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ (ప్రెసిడెంట్)**
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి** (ప్రెసిడెంట్)
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్)
MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 7989100433, 9246770277.

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్రెసిడెంట్)
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 9704651223, 9542385963

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హోస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**LAVANYA KANUMURI**
Cleveland, Ohio, U.S.A,
+1(440) 427 1158.

**S. RAGHU RAMI REDDY**
Seattle, WA, U.S.A,
+1 (425) 698 0375.

# శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!

నేటి ప్రజలందరికి తెలిసిన ప్రకారము దేవుడనినా, భగవంతుడనినా రెండు ఒకటే అను భావముతో ఉన్నారు. చాలామంది స్వామీజీలు కూడ తమ తమ ఉపన్యాసములలో సృష్ఠికర్త అయిన పరమాత్మను గురించి తెలుపునపుడు ఒకప్పుడు దేవుడని, మరొకప్పుడు భగవంతుడని పలుకుచు చెప్పుచుందురు. దీనినిబట్టి ఇటు ప్రజల దృష్ఠిలోను, అటు బోధకులైన స్వామీజీల దృష్ఠిలోను దేవునికీ, భగవంతునికీ ఏమీ తేడా లేదనీ, అందువలన వారు ఇలా ఆ పదములను వాడుచున్నారని తెలియుచున్నది. ఆధ్యాత్మిక రంగములో ఇది చాలా ముఖ్యమైన విషయము, అందరికి అవసరమైన విషయము. కావున దేవుడు మరియు భగవంతుడు అను పదములకు శాస్త్రీయత ఉందా? లేదా? అని యోచించవలసిన అవసరమున్నది. అంతేకాక ఒక పనిని చేయుటకు ఒక కారణముంటుంది. అలాగే ఒక పదమును పలుకుటకు కూడ కారణముంటుంది. అటువంటి కారణమునే హేతువు అంటాము. ఇక్కడ దేవుడు అనుటకు, భగవంతుడు అనుటకు హేతువును చూపకపోతే అది హేతుబద్ధము కాదు. హేతువాదులు ఒప్పుకోరు. నాస్తికవాదులు ఒప్పుకోక పోయినా ఫరవాలేదు. కానీ హేతువాదులు తప్పక ఒప్పుకోవలసియున్నది. ఎక్కడైతే శాస్త్రీయత ఉంటుందో అక్కడ హేతువాదమునకు జవాబు ఉన్నట్లే. ఎక్కడైతే శాస్త్రీయతలేదో అక్కడ హేతువాదమునకు జవాబు లేనట్లే. హేతువాదమునకు శాస్త్రబద్ధమే అసలైన జవాబు. కావున మనము **దేవుడు, భగవంతుడు** అను పదములకు శాస్త్రీయతను వెదకాలి.

ఒకమారు నా చిన్నవయస్సులో ఒక స్వామీజీని తిరుపతి కపిల తీర్థమువద్ద కలిసి దేవుడు అంటే అర్థము ఏమిటి? భగవంతుడు అంటే అర్థము ఏమిటి? అని నేను అడగడము జరిగినది. దానికి ఆ స్వామీజీ ఈ విధముగా సమాధానము చెప్పాడు.

**స్వామీజీ :-** దేవునికి ఎన్నో పేర్లు ఉన్నాయి. అందులో అందరికి తెలిసినవి దేవుడు, భగవంతుడు.

**నేను :-** ఇంకా ఎన్ని పేర్లున్నాయో చెప్పండి స్వామీ?

**స్వామీజీ :-** విష్ణువు, నారాయణ, కేశవ, మాధవ, లక్ష్మీపతి, వైకుంఠపతి, బ్రహ్మపితా ఇలా అనేక పేర్లు కలవు. ఒకమారు విష్ణు సహస్రనామావళి చూడు తెలుస్తుంది. అందులో వెయ్యి పేర్లున్నాయి.

**నేను :-** అయితే విష్ణువునే దేవుడు, భగవంతుడు అని అనుచున్నామా?

**స్వామీజీ :-** విష్ణువే సమస్త దేవతలకు పెద్ద. కావున ఆయననే మన మందరము దేవుడని, భగవంతుడని, వైకుంఠపతి అని అనుచున్నాము. వెంకటేశ్వరుడు కూడ ఆయనే కదా!

ఈ విధముగా ఒక స్వామీజీయే చెప్పినపుడు సాధారణ మానవుడు వినక తప్పదు. కానీ నేను అంతటితో తృప్తి చెందక హేతుబద్ధముగా పరిశోధించాలనుకొన్నాను. ఆ ప్రయత్నములో నా మొదటి ప్రశ్న ఈ విధముగా ఉన్నది. విష్ణువు దేవుడా? దేవుడు భగవంతుడా? భగవంతుడు ఎవరు? దేవుడు ఎవరు? అను ఈ ప్రశ్నలకు జవాబు కావాలంటే ఎక్కడ వెదకాలి? నాలుగు వేదములలోనా? ఆరు శాస్త్రములలోనా? పదునెనిమిది పురాణములలోనా? మనము చూడవలసినవి, మనకు పెద్దలు తెలిపినవి, వేదములు, పురాణములు, శాస్త్రములు. అయితే భూమిమీద ఆధ్యాత్మిక విషయముల కొరకు నూటికి 95 మంది వేదముల మీద ఆధారపడుచున్నారు. మిగతా వారిలో నలుగురు పురాణముల మీద ఆధారపడుచున్నారు. ఒక్కడు మాత్రము వేదములను కొంత, పురాణములను కొంత, శాస్త్రములను కొంత కలుపుకొని చూస్తున్నాడు. మిగత 99 మంది కూడ అవసరాన్ని బట్టి శాస్త్రము పేరు చెప్పుచున్నప్పటికి వారు చెప్పునది శాస్త్రమునకు సంబంధించి

ఏమాత్రము ఉండదు. ఉదాహరణకు ఒక స్వామీజీ ఒక దేవత యొక్క ఆరాధనను గురించి చెప్పునపుడు, మామిడి ఆకుతో నీళ్ళు ఇలా దేవత మీద చల్లాలి, శాస్త్రము ఈ విధముగా చెప్పింది. కావున ఇలా తప్పని సరిగ చేయాలి అని చెప్పుచుండుటను నేను విన్నాను. దైవత్వమునకు సంబంధించిన ఆరవ శాస్త్రములో అలా ఎక్కడా చెప్పలేదు. అయినా ఆ స్వామీజీ అలా వేదములలోని విషయమునో, పురాణములలోని విషయమునో తీసుకువచ్చి శాస్త్రము పేరు చెప్పుచున్నాడని అర్థమగుచున్నది. ఈ విధముగా చాలామంది బోధకులు తాము చెప్పుచున్న మాటలు వాస్తవముగ ఏ శాస్త్రమునకు సంబంధము లేకున్నా, శాస్త్రమిలా చెప్పింది అనుట అలవాటై పోయింది. ఇంకొక విచిత్రమేమంటే చెప్పబడే మాట పురాణములలోనిది గానీ, శాస్త్రములలోనిది గానీ, వేదములలోనిది గానీ ఏమాత్రము కాకున్నా దానిని కూడ శాస్త్రమిలా చెప్పింది అని అనుచున్నారు. ఇది చాలాచోట్ల కనిపించే పెద్దతప్పు, అయినా ఎవరూ దానిని తప్పుగా గుర్తించడము లేదు.

చెప్పబడే విషయమునకు శాస్త్రమును ఊత పదముగ జోడించి చెప్పడమే కాకుండ, వ్రాయబడే విషయమునకు కూడ శాస్త్రము అను పదమును జోడించడము జరుగుచున్నది. ఒక పుస్తకమును తెరిచి చూస్తే అందులో ఇటు పురాణ విషయములుగానీ, అటు వేదముల విషయములు గానీ, శాస్త్రములకు సంబంధించిన విషయములుగానీ ఏమాత్రము ఉండవు. అయినా ఆ పుస్తకము పేరు చివర శాస్త్రము అని ఉండును. ఉదాహరణకు ఒక రచయిత ప్రేమను గురించి పుస్తకమును వ్రాశాడు. అందులో భార్యను ఇలా ప్రేమించాలని, తల్లిని ఇలా ప్రేమించాలని, సోదరులను ఇలా ప్రేమించాలని, జంతువులను ఇలా ప్రేమించాలని వ్రాసి, ఆ పుస్తకమునకు

ప్రేమశాస్త్రము అని పేరు పెట్టాడు. మరొకరేమో కొన్ని కామసూత్రములను వ్రాసి దానికి కామశాస్త్రము అని పేరు పెట్టాడు. ఇంకొకడు ఎనిమిది దిక్కుల పేర్లను వ్రాసి, ఆ దిక్కులలో ఇలా గృహమును నిర్మించుకోవాలని కొన్ని పద్ధతులను చెప్పి దానికి వాస్తుశాస్త్రము అని పేరు పెట్టాడు. మరొక స్వామి అబద్ధమును చెప్పరాదు, సత్యమునే చెప్పాలి, నీతిమాలిన పనులు చేయరాదు, చాడీలు చెప్పరాదు, జూదమాడరాదు అని కొన్ని మంచి వాక్యములను వ్రాసి దానికి నీతిశాస్త్రము అని పేరు పెట్టాడు. ఇట్లు ప్రేమ శాస్త్రము, కామశాస్త్రము, వాస్తుశాస్త్రము, నీతిశాస్త్రము, నాడీశాస్త్రము, భక్తి శాస్త్రము, ముక్తిశాస్త్రము, రక్తిశాస్త్రము, వృక్షశాస్త్రము, అష్టదిక్కుల ఆరూఢ శాస్త్రము, శరీరధారుద్యశాస్త్రము, మూలిక ఔషధశాస్త్రము ఇట్లు ఎన్నో విషయములు శాస్త్రముల పేరుతో వ్రాయబడినవి. వాస్తవముగ ఇవన్నీ శాస్త్రములేనా అని ప్రశ్నించుకొని చూస్తే శాస్త్రములు ఏమాత్రము కావు. ఇవన్నీ శాస్త్రములు కావు అనే విషయము క్రొత్తతరము వారికి తెలియదు.

శాస్త్రములు ఎన్ని? అను సత్యము తెలిసినపుడు, అవి ఏవి? అను విషయము తెలిసినపుడు మాత్రమే మిగతావి ఎన్ని ఉన్నా, అవి శాస్త్రములు కావు అను విషయము తెలుస్తుంది. తినే వంటలు వండుకొను విషయము లను పుస్తకరూపములో వ్రాసి దానికి పాకశాస్త్రము అని పేరుపెట్టు ఈ కాలములో, వాస్తవమైన షట్ (ఆరు) శాస్త్రములను గుర్తించలేక పోవు చున్నాము. దేవుడు, భగవంతుడు అను విషయమునకుగానీ, వివరమునకు గానీ శాస్త్ర ప్రమాణము అవసరమైనపుడు, ఏ శాస్త్రమును అనుసరించాలో తెలియని స్థితిలో నేటి మానవుడున్నాడు. ఈ అయోమయ స్థితిపోయి నిజమైన శాస్త్ర భావమును తెలియుటకు శాస్త్రములను, పురాణములను, వేదములను గురించి ముందు తెలిసియుండాలి. అందువలన నాలుగు

వేదములను, పదునెనిమిది పురాణములను, ఆరు శాస్త్రములను గురించి తెలుసు కొందాము.

**వేదములు నాలుగు :-** 1) యజుర్వేదము 2) ఋగ్వేదము 3) అధర్వణవేదము 4) సామవేదము.

**పురాణములు పదునెనిమిది :-** 1) బ్రహ్మ పురాణము 2) పద్మ పురాణము 3) విష్ణు పురాణము 4) శివ పురాణము 5) భాగవత పురాణము 6) నారద పురాణము 7) మార్కండేయ పురాణము 8) అగ్ని పురాణము 9) భవిష్య పురాణము 10) బ్రహ్మ కైవర్తన పురాణము 11) లింగ పురాణము 12) వరాహ పురాణము 13) స్కంధ పురాణము 14) వామన పురాణము 15) కూర్మ పురాణము 16) మత్స్య పురాణము 17) గరుడ పురాణము 18) బ్రహ్మాండ పురాణము.

**శాస్త్రములు ఆరు :-** 1) గణితశాస్త్రము 2) ఖగోళశాస్త్రము 3) రసాయన శాస్త్రము 4) భౌతికశాస్త్రము 5) జ్యోతిష్యశాస్త్రము 6) బ్రహ్మవిద్యాశాస్త్రము.

వేదములలోను, పురాణములలోను ఏవీ చేరలేదు, ఏ మార్పులూ రాలేదు. కానీ శాస్త్రములలోనే ఎన్నో చేరిపోయి, అన్నీ శాస్త్రములు అను పేరుతో చెలామణి అగుటవలన ఏది శాస్త్రమో, ఏది శాస్త్రము కాదో తెలియ కుండపోయినది. ఇప్పుడు పైన చెప్పిన శాస్త్రములు మినహా ఏ శాస్త్రమైన అది శాస్త్రముకాదని గుర్తుంచుకోవాలి. ఉదాహరణకు వాస్తుశాస్త్రము ఉందనుకోండి అది శాస్త్రము కాదని, అందులో చెప్పిన ప్రకారము గృహముల ఫలితములుండవని తెలియాలి. **శాస్త్రము అను పదము నిబంధనతో కూడుకొన్న శబ్దము.** 'శాస్త్రము' అను పదము 'శాపము' అను పదము నుండి పుట్టినది. శాపము అనగా జరిగి తీరునదని అర్థము. శాపము నుండి 'శాసనము' అను పదము పుట్టినది. శాసనము అనగా తప్పక

అమలు జరుగునదని అర్థము. అలాగే శాసనములతో కూడుకొన్నదే శాస్త్రము. శాస్త్రములో చెప్పినవన్నీ శాసనములై ఉంటాయి. సూత్రము ప్రకారము వాస్తుశాస్త్రములో వ్రాసినవి అమలుకాని వాక్యములు. కావున అది పేరుకు శాస్త్రమైనా, పనికి శాస్త్రముకాదు. ఇలాంటి శాసనములు లేని ఎన్నో పుస్తకములకు శాస్త్రములు అని పేరు పెట్టినా, అవి శాస్త్రములుగా గుర్తించబడవు మరియు శాస్త్రములుగా లెక్కించబడవు. అందువలన వాస్తవమైన శాస్త్రములు భూమిమీద ఆరే గలవని గట్టిగా చెప్పుచున్నాము.

ఇప్పుడు అసలు విషయానికి వస్తాము. ఏ విషయమైనా అది సరియైనదా, కాదా? వాస్తవమా, అవాస్తవమా? భావము సరియైనదా, కాదా? అమలు జరుగునదా, జరగదా? అని పరిశీలించుటకు వేదములు ప్రమాణములు కాదు, పురాణములు ప్రమాణములు కాదు. శాస్త్రములు మాత్రమే ప్రమాణములు. అందువలన దేవుడు, భగవంతుడు అను విషయమును శాస్త్రప్రమాణముతోనే పరిశీలించి చూడాలి. మొదట దేవుడు, భగవంతుడు అను పదములు రెండు, ఆరుశాస్త్రములలో ఏ శాస్త్రములకు సంబంధించినవో తెలుసుకోవాలి. ఈ రెండు పదములు దైవత్వమునకు, ఆధ్యాత్మికమునకు సంబంధించినవి. కావున దైవమునకు సంబంధించిన విషయములు, వివరములు ఎక్కడున్నాయో ఆ శాస్త్రమునే మనము ప్రమాణముగా తీసుకొని చూడాలి. ఇక్కడ ఒక చిన్న సమస్య కలదు. అదేమనగా అందరికీ శాస్త్రములు ఆరు అని తెలియవు మరియు అవి పలానా పేర్లుగలవని కూడా తెలియదు. మాకు తెలుసు కాబట్టి సులభముగా బ్రహ్మవిద్యా శాస్త్రముతోనే చూడాలని చెప్పగలము, చూడగలము. మిగతావారు కూడ సులభముగ ఆరు శాస్త్రములను జ్ఞప్తిలో పెట్టుకొనుటకు మరియు ఏ శాస్త్రము దేనికి సంబంధించినదో సులభముగా తెలియుటకు అందరికి ఉపయోగపడేటట్లు చిన్న ఉపాయమును తెలుపుచున్నాము.

ఆరుశాస్త్రములలో మొదటిది గణితశాస్త్రము, రెండవది ఖగోళ శాస్త్రము. ఈ రెండు ఒక దానితో ఒకటి అనుసంధానమైనవి. కావున రెండిటిని ఒక జతగా చెప్పుకోవచ్చును. అలాగే మూడవది రసాయన శాస్త్రము, నాల్గవది భౌతికశాస్త్రము. ఈ రెండు శాస్త్రములు కూడ ఒకదాని కొకటి అనుసంధానముగా ఉన్నవి. కావున ఈ రెండు శాస్త్రములను ఒక జతగా చెప్పుకోవచ్చును. ఇక మిగిలిన ఐదవ జ్యోతిష్యశాస్త్రము, ఆరవ బ్రహ్మ విద్యాశాస్త్రము కలవు. ఈ రెండు కూడా కర్మ విధానములో ఒకదానికొకటి అనుసంధానమైయుండి ఒక జతగా ఉన్నవి. మొత్తము మూడు జతల శాస్త్రములు ఆరుగా ఉన్నవి. ఈ ఆరు శాస్త్రముల పేర్లలో కేవలము మొదటి అక్షరములను మాత్రము తీసుకొని వ్రాసుకొంటే **"గఖ, రభౌ, జ్యోబ్ర"** అని విడివిడిగా పలుకవచ్చును. గఖ రభౌ జ్యోబ్ర అను అక్షరములు ఒక మంత్రములాగ ఉన్నవి. ఆరు శాస్త్రములకు ప్రతినిధులుగా నున్న ఆరు అక్షరములను ఆరు బీజాక్షరములుగా లెక్కించుకొనవచ్చును. ఈ ఆరు అక్షరములను కంఠస్తము చేసుకొంటే, ఎప్పుడైనా ఆరుశాస్త్రములు జ్ఞప్తికి రాగలవు. దైవజ్ఞానములో గానీ, ప్రపంచ జ్ఞానములోగానీ సంశయము వచ్చినపుడు వచ్చిన సంశయము ఏ శాస్త్రమునకు సంబంధించినదో ఆ శాస్త్రము ద్వార దాని యదార్థమును తెలియవచ్చును. గఖ రభౌ జ్యోబ్ర అను అక్షరములు ఆయా శాస్త్రములకు బీజాక్షరములని చెప్పాముగా! అలా ఎందుకు చెప్పాననగా! బీజము అనగా పుట్టుకకు కారణమైనదని అర్థము గలదు. ఇపుడు 'గ' అనగానే గణితము, 'ఖ' అనగానే ఖగోళము మన జ్ఞాపకములో పుట్టుకొస్తున్నవి. కావున వాటిని బీజాక్షరములు అనడములో తప్పులేదు.

విశ్వము యొక్క ఆయుస్సు 108 కోట్ల సంవత్సరములుగా దేవుడు శాస్త్రబద్ధముగా నిర్ణయించి పెట్టాడు. విశ్వమునకంతటికి ఆరు శాస్త్రములే

ప్రమాణములు. కావున శుచి శుభ్రత కలిగి, సృష్ఠిలో మొదటి దినము ఆదివారము, కావున ఆదివారముగానీ లేక సంపూర్ణ తిథులు అయిన అమావాస్య దినముగానీ, పౌర్ణమి దినముగానీ స్థిర ఆసనములో కదలకుండ కూర్చొని, గఖ రభౌ జ్యోత్ర్బ అను అక్షరముల సముదాయమును ఒక మంత్రముగా లెక్కించి, విశ్వ ఆయువు సంఖ్య అయిన 108 మార్లు జపించిన వానికి శాస్త్రసిద్ధి లభించును. అటువంటి వారు పురాణముల జోలికిగానీ, వేదముల జోలికిగానీ పోరు. కేవలము శాస్త్రములను గురించే మాట్లాడుదురు. విశ్వము శాస్త్రబద్ధమైనది, ప్రత్యక్షమైనది కావున శాస్త్రము యొక్క బీజాక్షరములను విశ్వము యొక్క ఆయుస్సు సంఖ్యతో జోడించి ఏకధాటిగ జపించుటవలన కొంత శక్తి ఏర్పడి, ఆ శక్తి వలన శాస్త్రముల యొక్క అవగాహన సులభముగా వచ్చును. అటువంటి వానిని శాస్త్రజ్ఞునిగా లెక్కించవచ్చును.

గఖ రభౌ జ్యోత్ర్బ ను గురించి తెలిసిన వానికి దేవుడు, భగవంతుడు యొక్క విషయము చివరిది, ఆరవది అయిన బ్రహ్మావిద్యాశాస్త్రమునకు సంబంధించినదని సులభముగా తెలియగలదు. ఆరుశాస్త్రములలో ఇపుడు మనకు అవసరమైనది బ్రహ్మావిద్యా శాస్త్రము. ఈ బ్రహ్మావిద్యా శాస్త్రము మిగత ఐదు శాస్త్రములకంటే గొప్పదని స్థూలముగా మరియు సూక్ష్మముగా తెలియుచున్నది. సూక్ష్మముగా బయటికి కనిపించక పోయినా ఈ శాస్త్రమును తెలుసుకొనుకొద్దీ దీని గొప్పతనము సూక్ష్మముగ తెలియును. స్థూలముగా అంటే బయటికి కనిపించునట్లు మిగత ఐదుశాస్త్రములకంటే గొప్పగా తెలియుచున్నది. అదెలా అనగా! మొదట ఐదుశాస్త్రముల బీజాక్షరములుగా నున్న గ, ఖ, ర, భౌ, జ్యో అను ఐదు అక్షరములు ఏకాక్షరములే. చివరిది ఆరవది అయిన బ్రహ్మావిద్యాశాస్త్రము యొక్క మొదట

అక్షరము అయిన “బ్ర” మాత్రము ద్వంద్వాక్షరములు కల్గియున్నది. ద్వంద్వాక్షరములు అనగా రెండు అక్షరములు కలిసి ఒక అక్షరముగా ఉన్నది. “బ్ర” అను శబ్దములో “బ” మరియు “ర” అను రెండు అక్షరములు కలిసి మిగత ఐదు శాస్త్రముల ఏకాక్షరములకంటే గొప్పగా కనిపించు చున్నది. ఈ విధముగా ద్వంద్వాక్షరముల శబ్దమును కల్గి తను అన్నిటికంటే పెద్ద అని చాటుకొన్నది. అంతేకాక “బ్రహ్మవిద్య” అను పేరులోని అర్థమును చూస్తే “బ్రహ్మ” అనగా పెద్ద అని అర్థము కలదు. విశ్వములోని అన్ని విద్యలకంటే పెద్దవిద్య అయిన దానివలన దీనిని బ్రహ్మవిద్య అని అనుచున్నాము. అన్నిటికంటే పెద్ద అయిన దేవుడు, భగవంతుడు అను మాటలకు అర్థము పెద్ద విద్యా శాస్త్రమైన బ్రహ్మవిద్యా శాస్త్రములోనే తెలియును. మిగత ఐదు శాస్త్రములు ప్రపంచమునకు సంబంధించినవి కాగా, ఒక్క బ్రహ్మవిద్యా శాస్త్రము మాత్రము ప్రపంచమునకు అతీతమైన దేవునికి సంబంధించినది.

ఇక్కడొక ప్రశ్నను కొందరు ఇలా అడుగవచ్చును. గణిత, ఖగోళ, రసాయన, భౌతిక, జ్యోతిష్యశాస్త్రముల యొక్క విద్యలు బయటి విద్యాలయము లలో గలవు. వాటిని బోధించు బోధకులు కూడ గలరు. అయితే ఫలానిది బ్రహ్మవిద్యయని గానీ, ఫలానా గ్రంథము బ్రహ్మవిద్యా శాస్త్రమునకు సంబంధించినదనిగానీ, ఫలానా వాడు బ్రహ్మవిద్యను బోధించు బోధకుడని గానీ, ఎవరికీ తెలియనపుడు ఎలా బ్రహ్మవిద్యను తెలియవలెను? అది ఎక్కడ కలదని వెదకవలెను? అని ప్రశ్నించవచ్చును. దానికి జవాబు ఏమనగా! అన్నిటికంటే ముందు పుట్టినది బ్రహ్మవిద్యాశాస్త్రము. ఈ శాస్త్రము సృష్టి ఆదిలోనే పుట్టినది. దీనిని మొట్టమొదట చెప్పినవాడు విశ్వమును సృష్టించిన దేవుడే. మొదట పుట్టినది, దేవుని చేత చెప్పబడినది

అయిన బ్రహ్మవిద్య భూమిమీద ఎప్పుడైన తెలియకుండాపోతే తిరిగి దేవుడే దానిని చెప్పవలసియుండును. బ్రహ్మవిద్యను మొదట చెప్పినవాడూ, తర్వాత అవసరమొచ్చినపుడు చెప్పువాడూ దేవుడే. దీనిని బట్టి బ్రహ్మవిద్య ఎంత గొప్పదో అర్థముకాగలదు. బ్రహ్మవిద్య అంతరించినపుడు తిరిగి దేవుడే దానిని పునరుద్ధరించును. కానీ ఏ మానవునకు ఆ పని సాధ్యముకాదు. మానవుడు, దేవుడు చెప్పిన విద్యను తాను తెలుసుకొని ఇతరులకు బోధించవచ్చును. కానీ లేని విద్యను చెప్పలేడు. మొదట చెప్పువాడు గురువు (దేవుడు), తర్వాత చెప్పువాడు బోధకుడు అను సూత్రము ప్రకారము **మనుషులు బోధకులు కావచ్చును. కానీ ఏ మనిషీ గురువు కాలేడు.**

సృష్ఠి ఆదిలో దేవునిచేత మొదట సూర్యునికి చెప్పబడిన బ్రహ్మవిద్య సూర్యుని ద్వారా ఇతరులకు చెప్పబడినది. దీనినిబట్టి ఆదిలో దేవుడే గురువుకాగ తర్వాత దానిని బోధించిన సూర్యుణ్ణి బోధకునిగా చెప్పవచ్చును. సృష్ఠినుండి కాలము జరుగుతూరాగ, బ్రహ్మవిద్య అడుగంటిపోయి అధర్మములు అభివృద్ధి అయినపుడు, దేవుడు దానిని తిరిగి బోధించాడు. అలా బోధించినదే నేడు మనము చూడగల్గుచున్న భగవద్గీత. భగవద్గీతలో ఉన్నది సృష్ఠి ఆదిలో చెప్పిన విద్యయే. కావున భగవద్గీతను ముమ్మాటికీ బ్రహ్మవిద్యాశాస్త్రమని చెప్పవచ్చును. మిగత ఐదు శాస్త్రములతో పోల్చి చూచితే, విషయ విస్తీర్ణములో అన్నిటికంటే చాలా చిన్నది బ్రహ్మవిద్య. మనిషి మిగత ఐదు శాస్త్రములలో ఒక్కదానిని చదువుటకు ప్రాథమిక పాఠశాల (ఎలిమెంటరి స్కూల్), ఉన్నత పాఠశాల (హైస్కూల్), కళాశాల (కాలేజ్), విశ్వ విద్యాలయము (యూనివర్శిటి) అను నాలుగు రకముల విద్యాలయములలో దాదాపు ఫాతిక (25) సంవత్సరములు చదువవలసి యుండును. (అంత చదివినా ఇంతవరకు తెలియబడినది పది శాతము

మాత్రమే. 90 శాతము ఇంకా కనిపెట్టవలసి వున్నది.) చెప్పే బోధకులు టీచర్లు, లెక్చరర్లు, ప్రొఫెసర్లు మొదలగు వారు అవసరము. బ్రహ్మవిద్యను నేర్చుకోవాలంటే ఒక్క సంవత్సరములో ఒక్క బోధకుని చేత నేర్చుకోవచ్చును. **అన్నిటికంటే పెద్ద విద్యగా పేరుగాంచిన బ్రహ్మవిద్య, శ్రద్ధయున్న మనిషికి చాలా చిన్నదిగా కనిపించును.** అందువలన శ్రద్ధయున్నవాడు ఒక సంవత్సరములోనే సంపూర్ణముగ తెలియవచ్చును. శ్రద్ధలేనివాడు ఒకవేళ తెలుసుకోవాలనినా వందసంవత్సరములకు కూడ కొద్దిగా అయినా తెలియలేడు అందువలన బ్రహ్మవిద్య విచిత్రమైన విద్య.

బ్రహ్మవిద్యను సృష్ఠి ఆదిలో దేవుడే స్వయముగ చెప్పాడు. దేవుడు బ్రహ్మవిద్యను నిబంధన ప్రకారము చెప్పాడు. నిబంధన ప్రకారము అనగా ధర్మబద్ధముగ అనియు, సిద్ధాంతబద్ధముగ అనియు, శాస్త్రబద్ధముగ అనియు చెప్పవచ్చును. అందువలన బ్రహ్మవిద్య శాస్త్రము అయినది. దీనినిబట్టి బ్రహ్మవిద్యను పురాణము అనిగానీ, వేదము అనిగానీ అనకూడదు. పూర్వకాలము చెప్పబడినదని ఇతిహాసము అని కూడ అనకూడదు. ఇతిహాసము అనగా జరిగిన చరిత్ర. త్రేతాయుగములో జరిగిన రామాయణము చరిత్ర, అలాగే ద్వాపరయుగములో జరిగిన మహాభారతము చరిత్ర. అందువలన రామాయణ, మహాభారతములను ఇతిహాసములని అనవచ్చును. కానీ భారతములో చెప్పిన విద్యను చరిత్ర అనకూడదు. చరిత్ర ఒకేమారు జరుగుతుంది. చరిత్రకు ధర్మమంటూ ఉండదు. అందువలన రామాయణము రంకు, భారతము బొంకు అని కొందరన్నారు. సృష్ఠి ప్రారంభములో పుట్టిన బ్రహ్మవిద్య మాయప్రభావము వలన మనుషులలో లేకుండ పోవడము, తిరిగి దానిని దేవుడు మానవులకు జ్ఞప్తి చేసి చెప్పడము జరుగుచున్నది. ఇది బ్రహ్మవిద్య యొక్క విషయముకాగ, మిగత ఐదు

శాస్త్రముల విషయానికి వస్తే వీటిని దేవుడు స్వయముగా చెప్పలేదు. మనుషుల చేత చెప్పించాడు. మిగత శాస్త్రములకు కూడ దేవుడే కర్త అయినా, ఆ విషయము ఎవరికీ తెలియకుండునట్లు మనుషుల చేత చెప్పించి పైకి మనుషులనే కర్తలని అందరిని నమ్మించాడు.

బ్రహ్మవిద్యా శాస్త్రము సృష్ఠి ఆదిలోనే దేవుని చేత సంపూర్ణముగా చెప్పబడినది. అందులో అసంపూర్ణత ఆనాడుగానీ, ఈనాడుగానీ ఎప్పటికీ లేదు. బ్రహ్మవిద్య మధ్యకాలములో తెలియకుండ పోవచ్చును, అలాంటపుడు దేవుని చేతనే తిరిగి చెప్పబడును. అంతేగానీ ఆ రోజు కొంత చెప్పబడి, తర్వాత కాలములలో మరికొంత చెప్పబడునది కాదు. బ్రహ్మవిద్యలోని సూత్రములు (ధర్మములు) అన్నియు మొదటనే చెప్పబడినవి. కావున అది ఆదినుండి సంపూర్ణ శాస్త్రమే, ఒకవేళ మనిషికి తెలియకుండ పోయినపుడు చెప్పిన సూత్రములనే వివరించి విశదముగా చెప్పడము జరుగుచున్నది. అందువలన సృష్ఠి ఆదిలో చెప్పబడిన విద్యయే తిరిగి ద్వాపర యుగమున కొంత విశధీకరించి చెప్పబడినది. అట్లే తర్వాత యుగములలో కూడ ఉన్న ధర్మమును వివరించి చెప్పడము జరుగుతుంది. కానీ లేని క్రొత్త ధర్మమును చెప్పడము జరుగదు. ఎందుకనగా బ్రహ్మవిద్య ఆదినుండియే సంపూర్ణ శాస్త్రము. బ్రహ్మవిద్య ఎప్పటికీ సంపూర్ణమే. క్రొత్తగా చేర్చునది ఏదీలేదు. అందువలన ఒక మతములోని గురువు ఇలా అన్నాడు. "నేను చెప్పినది ఇప్పుడు మీకు సరిగా అర్థము కాలేదు. తర్వాత కాలములో నేను చెప్పిన విషయములే నా తర్వాత వచ్చు గురువు మీకు వివరించి చెప్పును" అన్నాడు. ఇక్కడ నేను చెప్పిన విషయములనే వివరించు చెప్పును అన్నాడు. కానీ మరికొన్ని క్రొత్త విషయములని చెప్పలేదు. అందువలన బ్రహ్మవిద్య మొదటనే సంపూర్ణముగా చెప్పబడినదని, అందులోనికి చేర్చునది ఏమీ లేదని తెలియుచున్నది.

మిగత ఐదు శాస్త్రములైన గణిత, ఖగోళ, రసాయన, భౌతిక, జ్యోతిష్య శాస్త్రములు మనుషుల చేత చెప్పబడినవి. ఈ ఐదు శాస్త్రములు బ్రహ్మవిద్యా శాస్త్రము పుట్టిన తర్వాత కొంత కాలమునుండి పుట్టడము ప్రారంభమైనవి. వివరముగా చెప్పుకొంటే ఐదు శాస్త్రములు ఒక్కమారుగ పుట్టలేదు. కాలము జరుగుకొలది మానవుల అవసరములను బట్టి అప్పుడొకటి, అప్పుడొకటి పుట్టుటకు ప్రారంభించినవి. అప్పటినుండి ఇప్పటి వరకు ఐదు శాస్త్రములలో ఏ శాస్త్రమూ సంపూర్ణముగా పుట్టలేదు. ఈ ఐదు శాస్త్రములను గురించి చెప్పుకోవడము మనకు ఇప్పుడు అసందర్భమే అగును. కావున వాటిని వదలివేసి అసలు విషయానికి వస్తాము.

బ్రహ్మవిద్యా శాస్త్రమును చెప్పినది దేవుడే. దాని ధర్మములకు ముప్పు ఏర్పడి తెలియకుండ పోయినపుడు తిరిగి చెప్పువాడూ దేవుడే. బ్రహ్మవిద్యా శాస్త్రములో ఉన్నవన్నీ దేవుని ధర్మములే. దేవుని ధర్మములు దేవునికే తెలుసు, మానవులలో ఎవరికీ తెలియదు. అందువలన మొదట చెప్పినది దేవుడే! తర్వాత చెప్పునదీ దేవుడే! బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము దేవుడు అనగా రూప, నామ, క్రియలు లేనివాడని అర్థము. దీనినిబట్టి దేవునికి ఏ ఆకారములేదు, పేరు లేదు, అలాగే ఆయన చేయు పనియు ఏమాత్రము లేదు. శాస్త్రము ప్రకారము దేవుడు ఇటువంటివాడు అని మేము అంటే ఈ మాటను వినేవారికి అనేక ప్రశ్నలు రాగలవు. దేవునికి పేరు లేనపుడు దేవుడు, భగవంతుడని ఎందుకు అనుచున్నారు? దేవునికి ఆకారము లేనపుడు అర్జునునకు విశ్వరూపము చూపినట్లు బ్రహ్మవిద్య అనబడు గీతయందే చెప్పియున్నారు కదా! అది ఒక ఆకారమేకదా! గీతలో చెప్పిన దానిని మీరు కాదంటారా? సృష్ఠి, స్థితి, లయకర్త దేవుడే అని మీరే చెప్పుచున్నారే అలాంటపుడు పుట్టించడము, సాకడము (పోషించడము)

చంపడము పనులు కావా! ఆ పనులు దేవుడు చేయుచున్నపుడు ఆయనకు పనియే లేదనడము శాస్త్రవిరుద్ధము కాదా? అని ఎన్నో రకముల ఎన్నో ప్రశ్నలను అడుగవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! శాస్త్రము శాసనములతో కూడుకొని ఉండును. కావున శాస్త్రము ఎప్పటికీ అబద్ధము కాదు, ఎవరి చేత ఖండించబడదు.

దేవునికి వాస్తవముగ పేరు లేదు. దేవుడు అని చెప్పబడు శబ్దము పేరు కానేకాదు. దేవుడు అను శబ్దము కేవలము అర్థమును తెలియజేయు పదము మాత్రమే. దేవుడు అను పదములో 'దేవు' అను రెండక్షరములలో అసలైన భావము ఇమిడివున్నది. దేవు అను శబ్దమునకు "డు"ను తగిలించితే దేవుడు అగును. దేవు అను శబ్దమునకు "ఆడుట" అను పదము జోడించితే దేవులాడుట అగును. అలాగే "ట"ను జోడించితే దేవుట అగును. ఈ విధముగ చూస్తే దేవుట, దేవులాడుట, దేవుడు పదములలో **దేవు** అను శబ్దము ముఖ్యమైనదని తెలియుచున్నది. దేవుట అను పదములోని భావమును గమనిస్తే వెదకుట అని అర్థమగుచున్నది. దేవులాడుట అనగా వెదకులాడుట అని అర్థము. అలాగే దేవుడు అనగా వెతకబడువాడు అని అర్థము. ఉన్న వాస్తవమును తెలియజేయునది పేరుగాదు. దేవులాడుట, దేవుట లో ఉన్న అర్థము వెతకడము అను పనిని సూచిస్తున్నది. యోగి అను శబ్దములో ఒక వ్యక్తి చేసిన యోగమను కార్యమును సూచిస్తున్నది. అలాగే త్యాగి అను పదము యొక్క అర్థము అతడు చేసిన త్యాగమును సూచిస్తున్నది. యోగికి గానీ, త్యాగికిగానీ ప్రత్యేకమైన నామధేయము లేక పేరు ఒకటి ఉంటుంది. యోగి అనునది పేరుగాదు అతని గొప్పతనము. నాపేరు ప్రబోధానంద, నా హెూదా యోగి. అందువలన నన్ను ప్రబోధానంద యోగి అనవచ్చును. అట్లే నారాయణ త్యాగి అని ఒకరిని పిలిచినపుడు,

వానిపేరు నారాయణ, వాడు చేసినది త్యాగము అని అర్థమగుచున్నది. త్యాగి, యోగి అను పదములు మనిషి సాధించిన హోదాను తెలుపునవే, కానీ అవి పేర్లు కాదు.

మననము కలవాడు మనిషి. మననము అనగా జ్ఞప్తి అని అర్థము. మనిషి అనగా అన్ని జీవరాసులకంటే ఎక్కువ జ్ఞప్తి (మననము) కలవాడని అర్థము. అంతేకానీ మనిషి అనునది పేరుకాదు. మనుషులు అనేక మంది ఉన్నారు, కనుక ఒక్కొక్క మనిషిని వేరువేరుగా గుర్తించుటకు వేరు వేరు పేర్లు ఉన్నాయి. వెతకబడే దేవుడు ఒక్కడే కావున దేవునికి పేరు అవసరములేదు. దేవున్ని అనేక శబ్దములతో పిలిచినా అవి ఆయన పేర్లు కావు అవి అన్నియు ఆయన హోదాను తెలియజేయు గుర్తులే. మనిషి చదువుకొన్న దానినిబట్టి వానికి M.A., B.A., I.P.S., I.R.S., I.A.S. అని వాని యోగ్యతను సూచించు శబ్దములున్నట్లు దేవునికి కూడ ఆయన హోదాను సూచించు పదములు గలవు. ఉదాహరణకు పరమాత్మ, పురుషోత్తమ మొదలగునవి కలవు. ఆత్మకంటే పరముగా (వేరుగా) ఉన్నవాడు, కావున దేవున్ని పరమాత్మ అని అనుచున్నాము. అలాగే క్షర పురుషునికంటే, అక్షర పురుషునికంటే ఉత్తమముగా దేవుడున్నాడు. కావున ఆయనను పురుషోత్తమ అన్నారు. ఇటువంటి పదములన్ని మనిషికున్న డిగ్రీలలాంటివే. ఒక మనిషికి వాడు చదివిన దానినిబట్టి ఎన్ని డిగ్రీలైన ఉండవచ్చును. అలాగే దేవుడు ఉన్నదానిని బట్టి ఆయనకు ఎన్ని హోదా పదములైన ఉండవచ్చును. ఇపుడు మనకు అవసరమైన పదము దేవుడు. దేవుడు అనగా వెతకబడే వాడేగానీ దొరికేవాడు కాదు. అందువలన మేము అనేక సందర్భములలో ఏ మనిషీ దేవున్ని చూడలేదు అని చెప్పుచూ వచ్చాము. ఎవరైన నేను దేవున్ని చూచాను అంటే అది పూర్తి అసత్యము.

ఎవరిచేత దేవుడు దేవులాడ (వెతుకులాడ) బడును? అని ప్రశ్నించుకొని చూస్తే, అటువంటి అవసరము మనిషికే ఉన్నది. అందువలన మనిషి వెదికేవాడు, దేవుడు వెతకబడేవాడు అని చెప్పవచ్చును. సృష్టి ఆదినుండి అందరూ దేవున్ని వెదకుచున్నారు, దేవుడు వెదకబడుచూనే ఉన్నాడు. ఈ విషయమునే భగవద్గీత విశ్వరూప సందర్శన యోగమున **"నన్ను ఇంతవరకు ఎవరూ చూడలేదు"** అని కృష్ణుడు అర్జునునితో చెప్పాడు. ఇపుడు కొందరు ఒక ప్రశ్నను అడుగవచ్చును. అది ఏమనగా! ఇంతవరకు దేవునికి మనుషులవలె, పేరు లేదు, ఆయనను ఉచ్ఛరించు పదములన్నియు ఆయన గొప్పతనమును సూచించు శబ్దములే అన్నారు కదా! అటువంటపుడు ఆకారమున్న ఒక మనిషి అయిన కృష్ణుని పేరు చెప్పి కృష్ణుడు చెప్పిన మాటను దేవుడు చెప్పినటల్లి మీరు చెప్పారు కదా! పేరున్నవాడు దేవుడు కాడని, దేవుడు మనిషికాదని చెప్పిన మీరు దేవునికి కృష్ణుడు అను పేరు పెట్టడము సమంజసమా? అని అడుగవచ్చును. దానికి జవాబు ఏమనగా! కృష్ణున్ని దేవుడని నేను ఇంతవరకు చెప్పలేదు కదా! అందువలన ఇప్పుడు ఈ ప్రశ్న అవసరములేదు. భూమిమీద ఏ మనిషి అయినా దేవుడు కాడు. దేవున్ని అన్వేషించువాడు మనిషి అన్న వాక్యమును ముఖ్యముగ గుర్తుంచు కోవాలి. అపుడు మీరు వెంటనే మరొక ప్రశ్న అడుగవచ్చును. ఇంతకు ముందు **"దేవుని ధర్మములు దేవుడే చెప్పాలి, ఏ మనుషులు దేవుని ధర్మములను చెప్పలేరు"** అని మీరే వ్రాశారు. ఇప్పుడేమో ఒక మనిషి అయిన కృష్ణుడు అంతరించి పోయిన ధర్మములను తిరిగి గీతలో తెలిపాడు అన్నారు. దీనినిబట్టి దేవుడు మనిషా? అని ప్రశ్న వచ్చుచున్నది. కృష్ణున్ని దేవుడని చెప్పలేదు కదా? అని మీరు ఒక ప్రక్క అంటున్నారు మరొక ప్రక్క దేవుడు మనిషి అయిన కృష్ణునిగా చెప్పుచున్నారు. మీది ద్వంద్వవైఖరి కాదా అని అడుగవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! నేను ఇంతవరకు

కృష్ణున్ని మనిషి అని చెప్పలేదు కదా! అని అడుగుచున్నాను. ఈ నా జవాబును చూచి కృష్ణున్ని దేవుడు కాదంటారు, అలాగే కృష్ణున్ని మనిషి కాదంటారు మీరు చెప్పే మాటలు మాకు ఏమీ అర్థము కాలేదు అని కొందరనవచ్చును. కానీ నేను చెప్పునది పూర్తి సత్యము. ఈ గ్రంథము వ్రాయు ఉద్దేశము గ్రంథము పేరులోనే గలదు. **"కృష్ణుడు దేవుడా? భగవంతుడా?"** అని ఉన్నపుడు దేవుడా, భగవంతుడా, మనిషా అని తేల్చి చెప్పుకోవలసి ఉన్నది. నేను వ్రాయవలసినది ఎంతో ఉండగానే, నేను ఏమీ చెప్పకనే నాది ద్వంద్వవైఖరి అని అర్థము చేసుకోకూడదు.

ఇంతవరకు దేవునికి పేరు లేదు అని తెలుసుకొన్నాము. ఇక రూపము ఉందో లేదో తెలుసుకొందాము. రూప, నామ, క్రియలు లేనివాడు అని మనము చెప్పుకొన్నపుడు, ఆయనకు ఆకారము లేదనేగా అర్థము. దీనినిబట్టి రూపమున్న వాడు ఎవడూ దేవుడు కాడు. ఈ లెక్క ప్రకారము రూపమున్న కృష్ణుడు కూడ దేవుడు ఏమాత్రము కాడని గట్టిగ చెప్పవచ్చును. కృష్ణుడే కాదు, ఆకారమున్న రాముడు గానీ, విష్ణువు గానీ, శివుడు గానీ దేవుడు కారు. ఎవరు దేవుడు అని అడిగితే మేము మాత్రము విష్ణువుతో మొదలుకొని ముప్పయి మూడుకోట్ల మంది దేవతలలో ఎవ్వరూ దేవుడు కారని చెప్పుచున్నాము. నీవు ఎవరు? అని గీతలో అర్జునుడు విశ్వరూప సందర్శన యోగమున దేవున్ని ప్రశ్నించినపుడు, దానికి దేవుడు "నేను కాలమును" అన్నాడు. కాలమునకు ఆకారమున్నదని ఎవరైనా చెప్పగలరా? కాలము ఎవరికైనా కనిపిస్తుందా? ఎవరూ ఆయనను చూడలేదు, ఎవరికీ ఆయన కనిపించ లేదు. కావున దేవునికి ఆకారము లేదని చెప్పవచ్చును. రూప, నామములు అవినాభావ సంబంధము కలవి. పేరు ఉంటే రూపము ఉంటుంది, ఒకవేళ రూపమున్నా పేరుంటుంది. దేవునికి పేరు లేదు

కావున రూపములేదు. అట్లే ఆయనకు రూపము లేదు కావున పేరు కూడ లేదు. మరియొక ముఖ్య సూత్రము ఏమనగా! ఆకారము, పేరు ఉన్నవాడు ఎవడైనా ఒక్క క్షణము కూడ ఊరక ఉండకుండ ఇటు మానసికముగా గానీ, అటు శారీరకముగా గానీ పనిచేయును అని గీతయందు కర్మయోగమున 5వ శ్లోకములో "**నహికశ్చిత్ క్షణమపి జాతుతిష్ఠత్య కర్మకృత్, కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతి జైర్గుణైః ఏ కర్మను అనుభవించకుండ ఒక్క క్షణము కూడ ఎవడూ ఊరక ఉండలేడు. ప్రకృతి గుణములచేత వశులై పనులు చేయుచుందురు**" అని కృష్ణుడు చెప్పాడు. ఆకారము పేరున్న ప్రతి మనిషి తప్పక పని చేయవలసి ఉండును. ఆకారమున్న ప్రతి మనిషికి గుణములుండును. గుణములున్న మనిషి కర్మ ప్రకారము గుణములకు వశమైపోయి గుణముల ప్రకారము పనులు చేయును. దేవుడు గుణాతీతుడు, ఆకారరహితుడు కావున దేవునికి కార్యములులేవు. **సృష్ఠిలో దేవుడు ఎప్పుడూ పని చేయడు, సృష్ఠిలో మనిషి ఎప్పుడూ ఊరక ఉండడు** అను సూత్రమును ఎల్లప్పుడు మన జ్ఞప్తిలో పెట్టుకోవలెను.

ఇంతవరకు దేవుడు రూప, నామ, క్రియా రహితుడు అను విషయము అర్థమైనది. ఇక మనకు అర్థము కావలసినది దేవుడు సృష్ఠికర్త అను మాట నిజమా, అబద్ధమా అను విషయము. దేవుడు సృష్ఠికర్త అయితే, సృష్ఠిని తయారు చేసిన వాడనియేగా అర్థము. సృష్ఠిని తయారు చేయడము పెద్ద పని అగును కదా! అప్పుడు దేవుడు కూడ పని చేసినట్లే అవును కదా! అని పెద్ద సంశయము వచ్చుచున్నది. దానికి జవాబును వెదికితే ఈ విధముగా కలదు. సృష్ఠి తయారైన తర్వాత ఆదిలో మొట్టమొదట బ్రహ్మవిద్యా శాస్త్రము పుట్టినది. బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము దేవుడు రూప, నామ,

క్రియా రహితుడు. దానికి శాస్త్రబద్ధముగా పైన వివరమును కూడ చెప్పుకొన్నాము. ఇపుడు మనకు కావలసినది దేవుడు బ్రహ్మవిద్యా శాస్త్రమునకు విరుద్ధముగా సృష్ఠిని తయారు చేయు పనిని చేశాడు కదా అని. దానికి సమాధానము దేవుడు బ్రహ్మవిద్యా శాస్త్రమును చెప్పిన తర్వాత, అనగా సృష్ఠి తయారైన తర్వాత, ఎప్పుడైనాగానీ శాస్త్రబద్ధము కాకుండ దేవుడు ఏ కార్యమును చేయలేదు. సృష్ఠి తర్వాత, శాస్త్రము తయారైన తర్వాత, దేవుడు క్రియా రహితుడుగానే ఉన్నాడు. క్రియారహితుడు అను మాటకు విరుద్ధముగా దేవుడు ఏ క్రియను చేయలేదు. సృష్ఠి తయారు కాకముందు, బ్రహ్మవిద్యా శాస్త్రము తయారు కాకముందు, విశ్వముగానీ, నీవుగానీ, ఎవరుగానీ, ఏ శాస్త్రముగానీ లేకముందు దేవుడు చేసినది శాస్త్రవిరుద్ధముకాదు. శాస్త్రమే లేనపుడు శాస్త్రవిరుద్ధమని చెప్పుటకు వీలులేదు. సృష్ఠికర్త అను మాట ఏ విధముగా చూచినా సత్యమైనదే. సృష్ఠి లేకముందు చేసినది శాస్త్రపరిధిలోనికి రాదు. కావున దేవుడు ఎప్పుడు చేశాడు? ఎప్పుడు చేయలేదు? అని చూడవలసినది మరిచిపోయి, దేవుని కార్యమును శాస్త్రబద్దతకాదు అనడము పొరపాటు అగును. దీనినంతటిని గమనించితే సృష్ఠి తర్వాత దేవుడు ఏ పనినీ చేయలేదని, దేవుడు బ్రహ్మవిద్యా శాస్త్రములో తాను చెప్పిన ధర్మములను అతిక్రమించలేదనీ, ధర్మముల ప్రకారమే ఉన్నాడనీ తెలియుచున్నది.

దేవుడు రూప, నామ, క్రియారహితుడు అను శాస్త్ర ధర్మము సృష్ఠి తర్వాత విషయమనీ, దేవుడు సృష్ఠికార్యమును చేయడము సృష్ఠికంటే ముందు విషయమని తెలిసిపోయినది. సృష్ఠి తర్వాతనే శాస్త్రమును చూడవలెనని, సృష్ఠికంటే ముందు శాస్త్రమే లేదు కనుక అప్పటి విషయములు శాస్త్ర పరిధిలోనికి రావని కూడ తెలిసిపోయినది. ఇక్కడ శాస్త్రపరిధిలోనికి వచ్చు

మరియొక ప్రశ్న కూడ కలదు. దానిని కూడ తెలుసుకొంటే దేవుని జ్ఞానములో సంశయము లేకుండ పోవును. ఆ ప్రశ్న ఏదనగా! దేవుడు విశ్వమునంతటిని సృష్ఠించిన తర్వాత ఆయన ఏ కార్యమును చేయలేదు అని మీరు చెప్పారు. దేవుడు పని చేస్తే శాస్త్రవిరుద్ధమౌతుందని తన మాటను తానే అతిక్రమించినట్లవుతుందని కూడ చెప్పారు. అంతేకాక సృష్ఠి ఆదిలోనే మొట్టమొదట దేవుడు సూర్యునికి జ్ఞానమును చెప్పినట్లు కూడా తెలిపారు. సూర్యునికి ఫలానా ఆకారముతో చెప్పినట్లుగానీ, ఫలానా పేరుతో చెప్పినట్లుగానీ ఎక్కడా ఆధారములు లేవు. రూపము, పేరు లేకున్నా సూర్యునికి జ్ఞానమును చెప్పానని గీతలో చెప్పడము వలన, బోధించడము అను ఒక పనిని సృష్ట్యాదిలో దేవుడు చేసినట్లు తెలియుచున్నది. సూర్యునికి బోధించడము సృష్ఠి జరిగిన తర్వాత జరిగిన పని. కావున ఇక్కడ దేవుని ఆకారము, పేరు వ్యక్తము కాకుండినా చేసిన పని వ్యక్తమవుచున్నది. దీనిని బట్టి సృష్ఠి తర్వాత కూడ దేవుడు పని చేసినట్లు తెలియుచున్నది కదా! అని ఎవరైన అడుగుటకు అవకాశము కలదు. దీనికి సమాధానము మీవద్ద ఉన్నదా... అని మమ్ములను ఎవరైనా అడిగితే, మేము ఈ విధముగా సమాధానము చెప్పగలము.

సృష్ఠి జరిగిన తర్వాత గురువు శిష్యుడు అను రెండు శబ్దములను మనము అక్కడక్కడ వినుచున్నాము. గురువు శిష్యుడు అను పదములు పేర్లు కావు. ఒక పేరున్న వ్యక్తి బోధించు కార్యమును చేయుట వలన అతనిని గురువు అంటాము. అలాగే ఒక పేరున్న వ్యక్తి బోధను తెలుసుకొను పనిని చేయడము వలన అతనిని శిష్యుడు అనుచున్నాము. భూమిమీద రెండు రకముల జ్ఞానములు కలవు. ఒకటి పరమాత్మ జ్ఞానము, రెండవది ప్రకృతి జ్ఞానము. ఇక్కడ ప్రకృతి (ప్రపంచ) జ్ఞానమును మాత్రము తీసుకొని

చూస్తే, ప్రకృతిలోని అనేక విద్యలను నేర్చుకొను వానిని శిష్యుడు అని అంటాము. అలాగే ప్రకృతిలోని విద్యలను బోధించు వానిని గురువు అంటాము. ప్రకృతి విద్యలో కనిపించే గురువు, కనిపించే శిష్యుడు ఇద్దరు ఉంటారు. దీనిప్రకారము ప్రపంచములో అనేక విద్యలను బోధించు అనేకమంది గురువులు, అనేక విద్యలను అభ్యసించు అనేకమంది శిష్యులు కలరు. ఇక బ్రహ్మవిద్య అనబడు దైవజ్ఞాన విషయములోనికి వచ్చి చూస్తే ప్రపంచ విద్యలో మాదిరి గురువు కనిపించడు, శిష్యుడు కనిపించడు. ఒకవేళ గురువు భూమిమీద ఉండినా అతనికి శిష్యులు ఉండరు. బ్రహ్మవిద్యను నేర్చుకోవాలని ఎవరైనా అనుకొని గురువు కొరకు అన్వేషించినా అతనికి గురువు దొరకడు. అందువలన బ్రహ్మవిద్యలో గురు శిష్యులు ఒక కాలములోగానీ, ఒక చోటగానీ కనిపించరు. ప్రస్తుత కాలములో బ్రహ్మవిద్యను నేర్చుకొను శిష్యులు, బోధించు గురువులు ఉండినా బోధించువారు కేవలము బోధకుడేగానీ, గురువు కాదు. బోధకులకు శిష్యులు ఎందరైనా ఉండవచ్చును. గురువు కొన్ని వేల సంవత్సరములకో, లక్షల సంవత్సరములకో భూమిమీదకు వచ్చును. అప్పుడు ఆయనను ఎవరూ గుర్తించలేరు. అందువలన గురువుకు శిష్యులు ఏర్పడరు.

భూమిమీద ఒక విద్య విస్తరించాలి అంటే ఒక గురువు, ఒక శిష్యుడు తప్పక ఉండి తీరాల్సిందే. ఒకరు విద్యావేత్త, ఒకరు విద్యార్థి ఉన్నపుడే విద్యకు ప్రాణము వచ్చి పది కాలములపాటు బ్రతుకును. మొదట విద్యను తెలిసిన విద్యావేత్త (గురువు) వలన విద్యను అర్థించు విద్యార్థి (శిష్యుడు) విద్యను సంపాదించుకొని, తర్వాత ఆ శిష్యుడు ఇతరులకు బోధకుడై విద్యను ఎంతో మందికి తెలియునట్లు చేయును. అందువలన

ఏ విద్యకైనా గురు శిష్య సంబంధము ఉండి తీరాల్సిందే. దీని ప్రకారము బ్రహ్మవిద్యకు కూడ గురుశిష్య సంబంధము తప్పక ఉండవలెను. అయితే బ్రహ్మవిద్యలో గురువును ఎవరూ గుర్తించలేరని, అందువలన గురువుకు శిష్యులుండరని కూడ చెప్పుకొన్నాము. వాస్తవానికి బ్రహ్మవిద్యలో గురువును ఏ శిష్యుడూ గుర్తించలేడు. ఇక్కడ ఏ విద్యకైనా మొదట గురువు శిష్యుడు ఉండితీరవలెనని మీరే చెప్పి, బ్రహ్మవిద్యలో గురువుకు శిష్యులుండరని మీరే చెప్పుట వలన మీరు ద్వంద్వ వైఖరిని ప్రదర్శించుచున్నారని ఎవరైనా మమ్ములను ప్రశ్నించవచ్చును. అంతేకాక సృష్టి తర్వాత పని చేయని దేవుడు తన ధర్మములకు ముప్పు ఏర్పడి, అధర్మములు చెలరేగినపుడు మాత్రమే వచ్చి తన ధర్మములను తిరిగి తెలియజేసి పోవునని భగవద్గీతలో చెప్పియున్నాడు. సృష్టి ఆదిలో ప్రజలకు ధర్మముల విషయమే తెలియనపుడు, భూమిమీద ధర్మములే లేనపుడు, ధర్మములకు ముప్పు కలుగడము అను సమస్యే ఉండదు. ధర్మములు ఉంటే ధర్మములు అధర్మములుగా మారవచ్చును. మొత్తానికి ధర్మములే లేనపుడు ధర్మములు అధర్మములుగా మారునను విషయమే ఉండదు. ధర్మములు అధర్మములుగా మారినపుడు దేవుడు వస్తాడని బ్రహ్మవిద్యా శాస్త్రమైన భగవద్గీతలో, జ్ఞానయోగము అను అధ్యాయమున ఏడవ శ్లోకమున చెప్పియున్నాడు. ధర్మములు సృష్ట్యాదిలో లేనపుడు అవి అధర్మములుగా మారనప్పుడు దేవుడు వచ్చి చెప్పడు. అలా వచ్చి చెప్పాడు అంటే బ్రహ్మవిద్యాశాస్త్రములోని ధర్మములకు ముప్పు కల్గినపుడు వస్తానని చెప్పిన శాసనము తప్పగును. శాస్త్రము ఎప్పటికి శాసనముగానే ఉంటుంది, ఎప్పుడు అసత్యము కాకూడదు.

భగవద్గీతలో అదే జ్ఞానయోగమను అధ్యాయమున మొట్టమొదటి శ్లోకములో, ఈ రహస్యమైన జ్ఞానమును నేను సృష్ట్యాదిలోనే సూర్యునికి

చెప్పియుంటిని, అతని వలన అందరికి తెలియబడినదని చెప్పియున్నారు. ఈ వాక్యము ప్రకారము సృష్టి తర్వాత దేవుడు సూర్యునికి బోధించడము అను పనిని చేసినట్లు తెలియుచున్నది. అట్లు చెప్పియుంటే దేవుడు రూప, నామ, క్రియారహితుడు అను మాటకు ముప్పు ఏర్పడి, ఆ మాట అసత్యమై సృష్టి తర్వాత కూడ దేవుడు పని చేసినట్లగుచున్నది. అంతేకాక జ్ఞానయోగములోని ఒకటవ శ్లోకమునకు ధర్మములకు ముప్పుకల్గి ధర్మములు అధర్మములుగా మారినపుడు వస్తానను ఏడవ శ్లోకము యొక్క మాట అసత్యమగును. ఏడవ శ్లోకము ప్రకారము చూస్తే ధర్మములే లేనపుడు, ధర్మములు అధర్మములుగా మారనపుడు వచ్చి సూర్యునికి ధర్మములను తెలియజేస్తానని చెప్పిన ఒకటవ శ్లోకము యొక్క మాట అసత్యమగును. భగవద్గీత రూపములోనున్న బ్రహ్మవిద్యా శాస్త్రములో రెండు శ్లోకములుగా నున్న రెండు శాసనములు ఒకదానికొకటి విరుద్ధముగా ఉన్నవని అర్థమగు చున్నవి. ఈ రెండు మాటలలో ఏదో ఒకమాట అసత్యము అని అనుకొనుటకు, శాస్త్రము ఎప్పటికి అసత్యముకాదు అను శాసనము కూడ కలదు. ఏ కోవనుండి చూచినా దీనికి జవాబు అగమ్యగోచరముగా ఉన్నది.

ప్రపంచమునకు సంబంధించిన ఐదు శాస్త్రములను చూచినా, అవి ఏమాత్రము ఖండించబడలేదు. అటువంటపుడు బ్రహ్మవిద్యా శాస్త్రము ఖండించబడునని ఎవరూ చెప్పలేరు. అది ఎప్పటికి ఖండించబడదు. ఖండించబడేది శాస్త్రమే కాదు. అష్టాదశ (18) పురాణములలో ఎన్నో విషయములను ఖండించవచ్చును. కానీ శాస్త్రములు శాసనములై, శాపములై ఉండుట వలన ఖండించబడవు. పై సమస్య శాస్త్రమునకు సంబంధించినది, కావున శాస్త్రముతోనే పరిష్కారమగును. శాస్త్రము ప్రకారము గురువునకు

శిష్యులు ఉండరు, శిష్యులకు బోధకులుండవచ్చునని ముందే చెప్పి యున్నాము. భూమిమీద తెలియని దైవధర్మములను మొదట దైవమే తెలియజేయును. దేవుని ధర్మములు దేవునికే తెలియును, కనుక మొదట దేవుడే చెప్పాలి. మొదట ఎవడు చెప్పునో వాడే గురువు. గురువుకు శిష్యులుండరు అనుమాట శాసనము. అదే శాసనము ప్రకారము ప్రశ్న ఉన్నపుడే దానికి జవాబు ఉంటుంది. విద్యను అర్థించు శిష్యుడున్నపుడే విద్యను తెలియజేయు విద్యావేత్త అయిన గురువు ఉంటాడు. ఇక్కడ గమనిస్తే గురువుకు శిష్యులుండరు అనుమాట శాస్త్రమే, అట్లే ప్రశ్న ఉన్నపుడే జవాబుండునట్లు, శిష్యుడున్నపుడే గురువు ఉండునను మాట కూడ శాస్త్రమే. ఈ రెండు మాటలు ఒకదానికొకటి పరస్పర విరుద్ధముగా ఉన్నట్లు కనిపించినా, అది మన దృష్టి దోషమేగానీ, ఆ రెండు మాటలలో ఏ వైరుధ్యములేదు, రెండు మాటలు సత్యమే. ఇక్కడ రెండు మాటలు ఎలా సత్యమగును అను సంశయము రాక తప్పదు. దానికి జవాబుగా ముందు గురువుకు శిష్యులుండరు అను మాటను వివరించుకొందాము.

భూమిమీదున్న గాలి ఎవరికీ కనిపించదు. కానీ గాలి ఉన్నట్లు దాని స్పర్శ ద్వారా తెలియుచున్నది. అలాగే దేవుడు ఎవరికి కనిపించడు. కానీ దేవుడున్నట్లు దేవుని శక్తి ద్వారా తెలియుచున్నది. గాలి కనిపించకున్నా దాని పీడనశక్తి బయటికి తెలియుచున్నది. అలాగే దేవుడు కనిపించ కుండినా దేవుని శక్తి అయస్కాంత శక్తిగా (గురుత్వాకర్షణ శక్తిగా) బయటికి తెలియుచున్నది. ప్రకృతిలోని భాగమైన ఒకగాలికి మనము అంచనా వేయలేనంతశక్తి ఉన్నది. ప్రకృతికి ఆధారమైన పరమాత్మ అయస్కాంతశక్తిగా ఉంటూ విశ్వములోని సూర్య నక్షత్రాది గోళములను, పంచభూతములను తన అయస్కాంతశక్తి (Gravity Power) చేత ఖగోళములో నిలిపి ఉన్నది.

విశ్వములోని అయస్కాంత శక్తి దేవుడున్నాడనుటకు ఆధారము మాత్రమే. అది దేవుని యొక్క అణుమాత్రము శక్తియేగానీ దేవుడుకాదు. దేవుడు తనచేత నిర్మింపబడిన విశ్వమునకు ధర్మములను ఏర్పరచి, వాటిని ఐదు శాస్త్రములుగా విభజించి పెట్టాడు. విశ్వమును సృష్ఠించిన తన ఉనికిని తెలియబరుచుటకు కూడా ధర్మములను ఏర్పరచి వాటిని ఒక శాస్త్రముగా నిర్మించాడు. ప్రపంచమునకు సంబంధించినవి గణిత, ఖగోళ, రసాయన, భౌతిక, జ్యోతిష్య శాస్త్రములుకాగా, దేవునికి సంబంధించినది బ్రహ్మవిద్యా శాస్త్రము. పరమాత్మ ఒక్కడు, ఆయన చేత సృష్ఠింపబడిన విశ్వము ఐదు భాగములు. అందువలన శాస్త్రములు ఆరు తయారైనవి. ఐదు భాగముల ప్రకృతికి పరమాత్మ ఒక్కడే ఆధారమైనట్లు, ప్రకృతికి సంబంధించిన ఐదు శాస్త్రములకు బ్రహ్మవిద్యా శాస్త్రము ఆధారమై ఉన్నది. అన్నిటికంటే గొప్పదైన బ్రహ్మవిద్యాశాస్త్రమును సృష్ట్యాదిలోనే దేవుడు సూర్యునకు తెలియజేశాడు. దేవునికి సంబంధించిన ధర్మములు దేవునికే తెలియును, కావున దానిని దేవుడే సంపూర్ణముగ తెలియజేశాడు. దీనినిబట్టి షట్‌శాస్త్రములలో మొట్టమొదట తెలియబడిన శాస్త్రము బ్రహ్మవిద్యాశాస్త్రము. ఇంతవరకు సంపూర్ణముగా తెలియబడిన శాస్త్రము కూడ బ్రహ్మవిద్యాశాస్త్రమే. మిగత ఐదు శాస్త్రములు మానవునికి సంపూర్ణముగా ఇంతవరకు తెలియబడలేదని చెప్పవచ్చును.

ప్రపంచమునకు సంబంధించిన ఐదుశాస్త్రములు ఇంతవరకు పది హేనుశాతము మాత్రమే తెలియబడినవి. ఐదు శాస్త్రములలో తెలియ వలసిన సూత్రములు (సిద్ధాంతములు) 85 శాతము గలవు. అందువలన ప్రపంచ విషయములలో అనేక ప్రశ్నలకు జవాబులు లేవు. కానీ బ్రహ్మ విద్యా శాస్త్రము దేవుని చేత ఆదిలోనే సంపూర్ణముగా తెలియబడినది. కావున

ఏ ప్రశ్నకైన జవాబు దొరికితీరుతుంది. ఇపుడు గురువుకు శిష్యులుండరు అను విషయమును బ్రహ్మవిద్యాశాస్త్రము ద్వారానే తెలుసుకొందాము. దేవుడు తన జ్ఞానమును భూమిమీదున్న మనుషులకు తెలియజేయలేదు. ఖగోళము లోనున్న సూర్యునికి బ్రహ్మవిద్యాశాస్త్రమును సంపూర్ణముగా తెలియజేశాడు. అలా తెలియబడిన ధర్మములు సూర్యుని ద్వారా భూమిమీద ప్రజలకు తెలిసిపోయినవి. అలా ఒకమారు తెలిపిపోయిన ధర్మములు కొన్ని యుగములకు (దాదాపు పది యుగములకు) అధర్మములుగా మారిపోవును. అప్పుడు ముందు చెప్పిన వాటిని తిరిగి చెప్పుటకు వచ్చు దేవుని అంశను గురువు అంటున్నాము. గురువు భూమిమీదకు వచ్చి ముందు చెప్పిన ధర్మములనే తిరిగి పునరుద్ధరించి (తిరిగి తెలియబరచి) పోవును. అప్పుడు వచ్చిన గురువుకు శిష్యులు అవసరములేదు. ఎందుకనగా! గురువు ఒక్కమారే ఒక్క శిష్యునికే తన ధర్మములను సంపూర్ణముగా తెలియజేయును. సృష్ట్యాదిలోనే దేవుడే గురువుగావుండి సూర్యున్ని శిష్యునిగా చేసుకొని ధర్మములను తెలియజేశాడు. కావున మాటిమాటికి ఆయన వచ్చినప్పుడెల్లా ఆయనకు శిష్యులు అవసరములేదు. ప్రశ్నించే శిష్యుడున్నపుడే జవాబు చెప్పే గురువుండాలి. విద్యను అర్థించే విద్యార్థి ఉన్నపుడే, విద్యను తెలియ జేయు విద్యావేత్తయిన గురువు అవసరము. గురువులేనిది శిష్యుడుండడు అను సూత్రము ప్రకారము, మొదట సూర్యుడు శిష్యుడుకాగా దేవుడు గురువైనాడు. సూత్రము ప్రకారము దేవుడు గురువైనాడు అప్పుడు శిష్యుడు కూడ ఉన్నాడు. తర్వాత గురువుకు శిష్యులు అవసరములేదు. కావున ధర్మములు అధర్మములుగా మారినపుడు పాతధర్మములనే తెలియజెప్పుటకు వచ్చును. అప్పుడు చెప్పుటకు క్రొత్త ధర్మములు ఏవీలేవు. క్రొత్త ధర్మములు ఉంటే శిష్యుడు అవసరము. మిగిలిన క్రొత్త ధర్మములు ఏమిలేవు, కావున పునరుద్ధరణకు వచ్చినపుడు శిష్యులు అవసరములేదు. కొన్ని లక్షల

సంవత్సరములకు ఒకమారు ధర్మములకు గ్లాని కలిగి అధర్మములు అభివృద్ధియైనపుడు వచ్చిన గురువు ఎవనికో ఒకనికి తెలియచెప్పిపోవును. ధర్మముల మీద శ్రద్ధలేని అనామకునికి చెప్పిన జ్ఞానము వినినప్పటికి వానికి అది ఉపయోగపడదు. కానీ తర్వాత వానిద్వారా తెలుసుకొన్నవారికి పనికి వచ్చును. సాంబారు పాత్రలోనికి గరిటెను పెట్టినా, గరిటకు సాంబారు రుచి అవసరములేదు. కానీ గరిటెతో సాంబారును పోయించుకొని తినేవానికి సాంబారు రుచి తెలిసినట్లు, దేవుడు తన ధర్మములను పునరుద్ధరించు కార్యక్రమములో ధర్మములు తెలియ వలసిన మనుషులకు తనకు మధ్యలో గరిటెలాంటి వ్యక్తిని పెట్టుకొని, వానికి ధర్మములను తెలియజేయును. అదే విధముగ కృష్ణుడు ధర్మముల మీద ఆసక్తిలేని అర్జునున్ని అడ్డము పెట్టుకొని ధర్మములను తెలియజేప్పి పోయాడు. అంతేగానీ ఆయన ఏ శిష్యులను తయారు చేసుకోలేదు. కృష్ణుడు జగత్‌కంతటికి గురువైన జగత్‌గురువని ఎవరూ ఆయనను గుర్తించలేదు. ఇక్కడ గురువుకు శిష్యులుండరు అనుమాట శాస్త్రబద్ధముగా నెరవేరినదని చెప్పవచ్చును. ఒక కృష్ణునిగా వచ్చినపుడేకాక, ఎప్పుడైనా ధర్మములను పునరుద్ధరించుటకు వచ్చిన గురువు (దైవము) ఏ వ్యక్తిగా ఉండినా, అప్పుడు ఆయన శిష్యులను తయారుచేసుకోడు. ఆయన ఎవరికీ గురూపదేశమును ఇవ్వడు. ఆయనను ఎవరు గురువుగా గుర్తించరు. ఆయన గురువుగా కనిపించడు. ఇదంతా శాస్త్రబద్ధమే. అందువలన గురువుకు శిష్యులుండ రను మాట నూటికి నూరుపాళ్ళు సత్యము మరియు శాసనము అని గ్రహించవలెను.

శిష్యుడుంటేనే గురువుంటాడు అను మొదటి మాట మరియు గురువుకు శిష్యులుండరు అను రెండవ మాట, రెండు పరస్పర విరుద్ధముగా

కనిపించినా రెండు శాస్త్రబద్ధమైన మాటలని చెప్పుకొన్నాము. అందులో గురువుకు శిష్యులుండరను మాట సత్యమని శాస్త్రబద్ధమని తెలిసిపోయినది. ఇక శిష్యుడుంటేనే గురువుంటాడు అనుమాట ఎలా సత్యమో, ఎలా శాస్త్రబద్ధమో వివరించుకొని చూద్దాము. విశ్వమును సృష్ఠించినపుడు అందులోని మానవులకు దేవుని ధర్మములు అంటే ఏమిటో తెలియవు. దేవుడు అంటే ఎవడో కూడ తెలియదు. అటువంటి పరిస్థితిలో దేవుడే తన ధర్మములను మొట్టమొదట తెలియబరచవలసి ఉన్నది. మొదట చెప్పబడు జ్ఞానమును (ధర్మములను) తెలుసుకొనుటకు శిష్యుడు తప్పనిసరిగ ఉండవలెను. శిష్యుడుంటే గురువున్నట్లే లెక్కించబడును. దేవుడు కనిపించే మనిషిగా కృష్ణుని మాదిరి వచ్చి చెప్పితే అది ధర్మవిరుద్ధము, శాస్త్రవిరుద్ధము అగును. ఎందుకనగా ముందే ఉన్న ధర్మములు లేకుండ పోయినపుడు మాత్రమే దేవుడు (దేవుని అంశ) మనిషిగా వచ్చి తిరిగి చెప్పినవాటినే చెప్పి పోవును. పాత ధర్మములకు శిష్యుడు అవసరములేదు. క్రొత్త ధర్మములకు గురువు శిష్యుడు ఇద్దరు అవసరమే. గురుశిష్య సంబంధము ఉండి తీరవలసిందే. ఇక్కడ ముందే చెప్పబడిన పాతధర్మములు అను మాటను మరియు మొట్ట మొదట చెప్పబడు క్రొత్త ధర్మములు అను మాటను జ్ఞప్తిలో ఉంచుకోవలెను. పాతధర్మములను బోధించునపుడు శిష్యులుండరు. క్రొత్త ధర్మములను బోధించునపుడు తప్పనిసరిగ శిష్యుడు అవసరము. క్రొత్త ధర్మమును బోధించునపుడు ఎదురుగా శిష్యున్ని పెట్టుకొని తాను మనిషిగావుండి బోధించినా దేవుడు బోధించినట్లే అగును. తర్వాత బోధించే గురువు శిష్యునికి కనిపించి బోధించినట్లగును. క్రొత్త ధర్మములను బోధించునపుడు గురు శిష్యులుండినా, శిష్యునకు గురువు కనిపించకూడదు. కనిపించి బోధిస్తే దేవుడు పని చేసినట్లగును. దేవుడు పని చేసినట్లు

కాకుండ క్రొత్త ధర్మములు శిష్యునికి తెలియపరచవలెను. శిష్యునికి దేవుడు (గురువు) జ్ఞానమును (ధర్మములు) తెలుపుచుండినా, శిష్యుడు గురువునుండి జ్ఞానమును అడిగి తెలుసుకొనుచుండినా ఆ దృశ్యమునుగానీ, ఆ విషయము గానీ ఇతరులకు ఎవరికి తెలియకూడదు. తెలిస్తే దేవుడు పని చేసినట్లు ఆరోపణవచ్చును. కావున క్రొత్త ధర్మములను మొదట ఒక శిష్యునికి దేవుడే తెలుపవలసియున్నా, శిష్యుడు దేవుని ద్వారానే తెలుసుకొనినా దేవుడు ఎలా బోధించినది, శిష్యుడు దేవుని ద్వారా ఎలా తెలుసుకొన్నది బయట ప్రపంచములోని ఎవరికీ తెలియకూడదు.

బయట ప్రపంచములో ఎవరికి తెలియకుండ దేవుడు రహస్యముగా బోధించినా వాస్తవానికి దేవుడు పని చేసినట్లే కదా! అని కూడ కొందరడుగ వచ్చును. దానికి మేము కూడ అవుననే సమాధానము చెప్పవలసి వస్తుంది. కానీ కనిపించకుండా కూడ దేవుడు పనిని చేశాడని చెప్పుటకు వీలు లేకుండ దేవుడు చేశాడు. అదెలా అనగా! విశ్వవ్యాపి అయిన దేవుని అంశ ఒకటి భూమిమీద పుట్టి, ఆకారమును ధరించి ధర్మములను తెలియజేయడము ధర్మములను పునరుద్ధరించినట్లగును. ఆ విధముగ కృష్ణావతారములో జరిగినది. అప్పుడు గురువుకు శిష్యులుండరని కూడ చెప్పాము. ఇప్పుడు అసలు విషయానికి వస్తే సర్వవ్యాపి అయిన దేవుడు అందరి శరీరము లందున్నాడు. కావున జ్ఞానము తెలుసుకొను స్థోమత కల్గిన వానిని మరియు తెలిసిన ధర్మములను ఒక భూమండలములోనే కాక జీవరాసులున్న ఇతర గోళముల మీద కూడ తెలియజేయు స్థోమత కలిగిన వానిని, నేను మీకు దైవజ్ఞానమును తెలిపాను అను సాక్ష్యముగా చిరకాలముండువానిని, నేను దేవుని జ్ఞానమును తెలిపి దానివలన ఎవరు నన్ను ఏమి చేయలేరని తెలియ బరుచువానిని, శరీరములోనే దేవుడు గుర్తించి వానిని శిష్యునిగా

ఎన్నుకొనును. అలా అన్ని స్థోమతలున్నవాడు విశ్వములో సూర్యుడొక్కడే గలడు. **"మత్ స్థాని సర్వభూతాని"** అన్నట్లు దేవుడు అందరియందు గలడు, అందరు దేవునియందుకలరు, అను సూత్రము ప్రకారము సూర్యుని శరీరములో కూడ దేవుని అంశకలదు. దేవుని అంశయే సూర్యుని స్థోమతను గుర్తించి సూర్యున్ని శిష్యునిగా చేసుకొన్నది. సూర్యుని శరీరములోనే ఉన్న దేవుని అంశ సూర్యునికి గురువుగా ఉంటూ, తన ధర్మములను సూర్యునికి శరీరము లోపలనే బోధించను మొదలుపెట్టింది. గోళమునే శరీరముగానున్న సూర్యుడు తన శరీరములోనే తెలియబడు అనేక దైవధర్మములను తెలుసు కొన్నాడు. అప్పుడప్పుడు సూర్యునికి కొన్ని ప్రశ్నలు పుట్టుచుండగా ఆ ప్రశ్నలకు లోపలనున్న దైవశక్తియే జవాబును ఇస్తూ పోయింది. ఈ విధముగ ఒక సంవత్సర కాలము వరకు సూర్యుని శరీరములోని దేవుడు గురువుగా ఉంటూ, శరీరములోని సూర్యున్ని శిష్యునిగా చేసుకొని, సంపూర్ణముగా ధర్మములను తెలియజేశాడు. ప్రశ్న శరీరములోనే, జవాబు ఆ శరీరములోనే ఉత్పన్నముకాగా, ఒకే శరీరములో గురువు శిష్యుడు ఒకే కాలములో ఉంటూ, గురుశిష్యసంబంధముతో శిష్యునికి ధర్మములను గురువు తెలిపాడు. ఒక శరీరములోని దైవము యొక్క అంశ, అదే శరీరములోనే జీవునికి ధర్మములను తెలిపిన విషయము ఎవరికీ తెలియని రహస్యము. అందువలన సృష్టి తర్వాత దేవుడు పని చేసినట్లు కాకుండ పోయినది. ప్రత్యేకించి ఒక శరీరమును ధరించిన దేవుని అంశ, ముందు తాను చెప్పిన ధర్మములనే తిరిగి చెప్పును. అప్పుడు శిష్యుడు అవసరములేదు. ఒక శరీరములో అందరియందున్నట్లు సర్వసాధారణముగ నున్న దేవుని అంశ, అదే శరీరమును వేదిక చేసుకొని అందులోని జీవున్ని శిష్యునిగా చేసుకొని క్రొత్త ధర్మములను తెలియజేయును. అది సృష్టి

తర్వాత ఒకమారే జరుగును. అలా చెప్పడము జరిగినప్పటికీ అది సృష్ఠి తర్వాత దేవుడు చేసిన పనికాదు. దేవుని అంశ చేసిన పని అయినందున దానిని సంపూర్ణ దేవుని పనిగా లెక్కించలేము.

శాస్త్రబద్ధతకు ఏమాత్రము లోపము లేకుండ సృష్ట్యాదిలో దేవుని అంశ ధర్మములను బోధించింది. అయితే ముఖ్యముగా గమనించవలసిన విషయమేమనగా! మొట్టమొదట ధర్మములు బోధించబడినపుడు గురువు శిష్యుడు ఇద్దరు ఉండినా, వారు బాహ్యముగా కనిపించరు. ఒకే శరీరములో ఇద్దరు ఉండుటవలన శిష్యునికి వచ్చిన ప్రశ్నగానీ, గురువు చెప్పిన జవాబు గానీ, బయటి ప్రజలకు ఎవరికి తెలియదు. శరీరమును వేదిక చేసుకొని దేవుని అంశ జీవాత్మకు బోధించగా, ఆ జీవాత్మ బయటి ప్రజలకు మొట్ట మొదట బోధించినవాడగును. అందువలన మొదట భూమిమీద ప్రజలకు ధర్మములను తెలియజేసిన ఘనత సూర్యునికి దక్కినది. సూర్యునికి ఎవరు బోధించినది ప్రజలకు తెలియదుగానీ, ప్రజలకు మొదట బోధించినది సూర్యుడని అందరికి తెలుసు. మొదట భూమండలములో ప్రజలకు దైవ ధర్మములను తెలియజేసిన వాడు సూర్యుడు. అందువలన సూర్యున్ని కొందరు ఆది గురువు అంటున్నారు. వాస్తవానికి ఆది గురువు దైవమే అయినా, అది ఎవరికి తెలియని రహస్యము అగుట వలన, ఆది గురువుగా సూర్యున్నే చెప్పవచ్చును. మనకు ఆదిలోని దైవ రహస్యము కొంత తెలిసింది కావున సూర్యున్ని ఆది గురువు అనడమేకాక, అదే సూర్యున్ని ఆది శిష్యుడని కూడ చెప్పుచున్నాము. అలా ఒకే వ్యక్తిని ఆదిగురువుగా మరియు ఆది శిష్యునిగా చెప్పడము వలన, అలా ఎందుకు చెప్పుచున్నారని ఎవరికైన ప్రశ్నరావచ్చును. ప్రశ్నవచ్చుట వలన వారు జవాబుకొరకు వెదకుటకు అవకాశము కలదు. అలా అన్వేషించువారికి ఎప్పటికైన జవాబు దొరక

గలదు. అప్పుడు వారికి కూడ ఆదిలో ధర్మములు ఎలా తెలియబడ్డాయో తెలిసిపోగలదు.

దేవుని అంశ కనిపించే గురువుగా శరీరముతో వచ్చినా, గురువుగా ఆయనను ఎవరూ గుర్తు పట్టలేరు. కావున గురువుకు శిష్యులుండరని చెప్పాము. కొందరు తమకు గురువు కావాలని అన్వేషించినా గురువు వారికి దొరకడు. ఒకవేళ గురువు దొరకినా, ఈయన మాకు గురువుకాదని శిష్యులు తేల్చి చెప్పుదురు. అప్పుడు వారికి గురువు దొరికి ప్రయోజనము లేదు. వారి లెక్కలో వారికి గురువు దొరకనట్లే. కనిపించే శరీరముతో ప్రత్యేకముగా జన్మించి రాకపోయినా అందరి శరీరములో వ్యాపించియున్న పరమాత్మ, అదే శరీరములోని జీవునికి జ్ఞానమును తెలియజేయడము వలన, ఒకే శరీరములోనే బయట ప్రజలకు కనిపించకుండ గురువు శిష్యులున్నారని చెప్పుకొన్నాము. అంతేకాక సృష్టి కల్పమునకు అంతటికి అలా ఒకమారే జరుగునని చెప్పుచున్నాము. 1000 యుగములలో దేవుడు శరీరము ధరించి ముందు తెలిపిన ధర్మములనే తిరిగి తెల్పుటకు, వందమార్లుగానీ అంతకంటే ఎక్కువగానీ రావచ్చును. కానీ శరీరము ధరించకుండ శిష్యుడున్న శరీరములోనే ఒకే ఒక్కమారు తన జ్ఞానమును బోధించును. దీనినిబట్టి దేవుడు శరీరమును ధరించకుండ ఒక్కమారు చెప్పినా, శరీరమును ధరించి వందమార్లు చెప్పినా ఒకే జ్ఞానమును చెప్పుననీ, దానిలో ఎటువంటి మార్పు చేర్పు ఉండదని తెలియుచున్నది. మనకు తెలిసినంతవరకు కృష్ణుడు శరీరమును ధరించి వచ్చియున్న దైవశక్తి అని అర్థమైనది. కృష్ణుడు అర్జునున్ని అడ్డము పెట్టుకొని జ్ఞానము చెప్పాడని, నిజానికి శిష్యుని లక్షణాలు అర్జునునిలో లేవని, అందువలన అర్జునుడు శిష్యుడుకాదని, గతములో కూడ చెప్పుకొన్నాము. అయితే చెప్పువానిని గురువుగ వినేవానిని శిష్యునిగ

లెక్కించవచ్చును కదా! దానిప్రకారము అర్జునుడు శిష్యుడే అగును కదా! అని కొందరడుగవచ్చును. భగవద్గీత సాంఖ్యాయోగములో ఏడవ శ్లోకమందు నన్ను శిష్యునిగ లెక్కించి, ఎట్లు చేయుట ధర్మమో తెలుపుమని అర్జునుడు కృష్ణున్ని అడిగాడు. అక్కడ గమనిస్తే అర్జునుడు అడిగింది యుద్ధము చేయాలా? వద్దా? అను ప్రపంచ విషయమును అడిగాడు తప్ప పరమాత్మ విషయమును అడుగలేదు. ప్రపంచ విషయములో ఎవరు ఎవరికైనా గురువుకావచ్చును. కానీ పరమాత్మ విషయములో ఎవడు ఎవనికి గురువుకాడు. యుద్ధరంగములో ఆ సమయానికి ఏమి చేయాలో తెలియని స్థితిలో ఉండి, కృష్ణున్ని గురువుగా మొక్కి తనను శిష్యునిగా లెక్కించుకొని అడిగినా, అడిగిన సమస్య ఆధ్యాత్మికము కాదు, కావున అర్జునున్ని శిష్యునిగా లెక్కించకూడదు. తర్వాత యుద్ధానంతరమూ అర్జునుడు కృష్ణున్ని తనకు ఆధ్యాత్మిక గురువుగా గుర్తించినట్లు ఎక్కడా చెప్పుకోలేదు. ఇక్కడ కొందరు ఒక ప్రశ్న అడుగవచ్చును. దైవజ్ఞానము మీద ధ్యాసలేని అర్జునునికి ధర్మములను కృష్ణుడు ఎందుకు తెలియజేయాలి? ధర్మముల మీద ఆసక్తివున్న వానికి ఎవనికైన చెప్పవచ్చును కదా! అని ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! భూమిమీదికి శరీరమును ధరించి గురువుగా వచ్చిన గురువు (కృష్ణుడు) ఎదురుగా కనిపించు వ్యక్తికి (అర్జునునికి) దైవధర్మములను చెప్పినా అవి నేరుగా ఎదుటి శరీరములోని ఆత్మను చేరును. అందువలన గురువుగా వచ్చినపుడు తెలిపిన జ్ఞానము వినే జీవునికి కాదని, అదే శరీరములోని జీవుని ప్రక్కనున్న ఆత్మకని తెలియవలెను. ఇంకొక రహస్యమేమనగా! శరీరమును ధరించకుండ శరీరములోనే పరమాత్మ అంశ తెలుపు జ్ఞానము అదే శరీరములోని జీవునికి చేరుచున్నది. అందువలన అక్కడ జీవుడు (శిష్యుడు) అగుచున్నాడు. కృష్ణునిగా వచ్చి చెప్పినపుడు

అర్జునుని ఆత్మకు జ్ఞానము చేరడము వలన అర్జునుడు శిష్యుడు కాలేకపోయాడు.

ఇప్పటికి దాదాపుగా దేవుని వివరము, ధర్మము తెలిసిపోయినట్లే. తెలిసిన దాని ప్రకారము దేవుడు ఈ సృష్టి అంతయు లేనప్పుడు కూడ ఉన్నాడు. కానీ అప్పుడు ఎట్లు ఉన్నాడో ఏ శాస్త్రములు ఆయనను గురించి తెలుపలేవు. సృష్టి పూర్వము దేవున్ని ఏ ప్రమాణముతోను చెప్పుటకు వీలులేదు. భగవద్గీతలో అక్షర పరబ్రహ్మ యోగమున 20వ శ్లోకమున "భావోన్యో" అను పదమునుపయోగించి సృష్టి పూర్వమున్న దైవమును గూర్చి చెప్పడము జరిగినది. "భావోన్యో" అనగా మనము భావించుకొను భావములకు అన్యముగా ఉన్నాడని తెలియుచున్నది. మనము ఏ విధముగా యోచించి భావించినా, ఆ భావముకంటే వేరుగా ఉన్నాడని అర్థము. వాస్తవముగా చెప్పాలంటే ఏ ప్రమాణమునకు దైవము అందనిదని అర్థము. సృష్టి తర్వాత పరమాత్మ అనీ, పురుషోత్తముడనీ శాస్త్రప్రమాణముగా చెప్పగలుగుచున్నాము. విశ్వము పుట్టిన తర్వాత శాస్త్రము పుట్టింది. కావున బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము దేవుడు సర్వాంతర్యామి, విశ్వవ్యాపి, సర్వధారి, పరమాత్మ, పురుషోత్తముడు అని చెప్పవచ్చును. ఇవే మాటలను సృష్టి పూర్వము ఎవరూ లేనపుడు సర్వాంతర్యామి అనుటకు వీలులేదు. విశ్వమే లేనపుడు విశ్వవ్యాపి అనుటకు వీలులేదు. ఏదీ లేనపుడు సర్వధారి అనుటకు కుదరదు. ఆత్మే లేనపుడు పరమాత్మ అనుటకు వీలులేదు. అలాగే క్షర పురుషుడుగానీ, అక్షర పురుషుడుగానీ లేనపుడు పురుషోత్తమ అనుటకు అవకాశమే లేదు. దీనినంతటిని బట్టి చూస్తే సృష్టి లేనపుడు దేవుని గురించి ఏమీ చెప్పలేము. సృష్టి ఉన్నపుడు మాత్రమే దేవున్ని గురించి శాస్త్రబద్ధముగా చెప్పగలము.

సృష్ఠి లేని కాలము, సృష్ఠి ఉన్న కాలములు రెండు ఉన్నాయని తెలిసినది కదా! సృష్ఠి ఉన్న కాలములో మనము ఉన్నాము. సృష్ఠి మొదలైన కాలమును ఖచ్చితముగా చెప్పలేము. కానీ సృష్ఠి మొదటి నుండి ఎంత కాలముండునో చెప్పగలము. బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము ప్రపంచము యొక్క ఆయుస్సు 108 కోట్ల సంవత్సరములని తెలియుచున్నది. సృష్ఠి వెయ్యి యుగముల కాలముండునని శాస్త్రమే చెప్పుచున్నది. 1) కృత యుగము 2) త్రేతాయుగము 3) ద్వాపరయుగము 4) కలియుగము అను నాలుగు యుగములు 250 మార్లు జరుగవలెనని తెలియుచున్నది. సృష్ఠి మొదలైనది కృతయుగముతోనని, అంత్యమగునది కలియుగముతోనని తెలియుచున్నది. అంతేకాక కలియుగము యొక్క పరిమాణము 4,32,000 సంవత్సరములని, దానికంటే రెండింతలు 8,64,000 సంవత్సరములు ద్వాపరయుగమని, కలియుగమునకు మూడింతలు 12,96,000 సంవత్సరములు త్రేతాయుగమని, అలాగే కలియుగమునకు నాలుగంతలు, 17,28,000 సంవత్సరములు కృతయుగమని తెలియుచున్నది. నాలుగు యుగములు గడచుటకు 43,20,000 సంవత్సరముల కాలము పట్టుచున్నది.

| | |
|---|---|
| కలియుగము | 4,32,000 సం॥ |
| ద్వాపరయుగము | 8,64,000 సం॥ |
| త్రేతాయుగము | 12,96,000 సం॥ |
| కృతయుగము | 17,28,000 సం॥ |
| **నాలుగు యుగములు మొత్తము** | **43,20,000 సం॥** |

కలియుగము పరిమాణమునకు పదింతలుగా నాలుగు యుగముల పరిమాణమున్నదని తెలియుచున్నది.

నాలుగు యుగములు 250 మార్లు జరిగితే వెయ్యియుగములగును. ఒక నాలుగు యుగములు గడుచుటకు 43,20,000 సంవత్సరముల కాలము పట్టినపుడు, నాలుగు యుగములు 250 మార్లు గడుచుటకు 108 కోట్ల సంవత్సరములు పట్టును.

**43,20,000 × 250 = 108,00,00,000.**

ఈ విధముగా ప్రపంచము యొక్క ఆయుస్సును 108 కోట్ల సంవత్సరములుగా బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారమే చెప్పవచ్చును. ప్రపంచము యొక్క ఆయుస్సును ఎవరూ మరిచిపోకుండ ఉండుటకు జప మాలలో 108 పూసలనే ఉంచడము జరిగినది. ప్రపంచము 108 కోట్ల సంవత్సరములు జీవులతో నిండి జనన మరణములు జరుగుచుండును. 108 కోట్ల సంవత్సరములను ఒక కల్పము అనుచున్నాము. కల్పము అయిపోయిన వెంటనే ప్రళయము వచ్చును. కల్పము అనగా సృష్ఠించ బడినది లేక కల్పించబడినదని అర్థము. పంచభూతములచేత సృష్ఠించబడిన ప్రపంచము ప్రళయములో లేకుండ పోవును. అలా ప్రపంచము లేని స్థితిని దేవునికి రాత్రి కాలముగ, ప్రపంచమున్న స్థితిని దేవునికి పగలు కాలముగ బ్రహ్మవిద్యా శాస్త్రములో దేవుడే చెప్పాడు. దేవుని పగలు 108 కోట్ల సంవత్సరములైనపుడు దేవుని రాత్రి కూడ 108 కోట్ల సంవత్సరములే ఉండును. మనిషికి పగలు పండ్రెండు గంటలు, రాత్రి పండ్రెండు గంటల కాలమున్నట్లు, దేవునికి కూడ పగలు 108 కోట్లు, రాత్రి 108 కోట్ల సంవత్సరములుండును. కాలచక్రములో మనిషికి ఒక రాత్రి పగలు గడుచుటకు 24 గంటలు పట్టినట్లు దేవునికి ఒకరాత్రి ఒక పగలు గడుచుటకు 216 కోట్ల సంవత్సరములు పట్టును. ఈ లెక్క ప్రకారము చూస్తే మనిషి లెక్కలో 25,000 సంవత్సరములు గడిస్తే దేవుని లెక్కలో

ఒక్క సెకండు గడచినట్లు, మనిషి లెక్కలో 15,00,000 సంవత్సరములు గడిస్తే దేవుని లెక్కలో ఒక్క నిమిషము గడచినట్లగును. మనిషి లెక్కలో 9 కోట్ల సంవత్సరములు గడిస్తే దేవుని లెక్కలో ఒక్క గంట గడచినట్లగునని తెలియుచున్నది.

సృష్ట్యాది నుండి మనము అందరము ఉన్నాము. కానీ ఇప్పుడున్నది మాత్రము మనకు తెలియుచున్నది. గతములో ఎన్నోమార్లు జన్మించి, కొంత కాలము బ్రతికి, ఎన్నోమార్లు చనిపోయాము. ఈ విధముగ ప్రళయము వరకు మనము చావుపుట్టుకల చక్రములో చిక్కుకొని ప్రతి జీవితములోను ఎన్నో పాపములను బాధలరూపముగా అనుభవిస్తున్నాము. ఇటువంటి చావుపుట్టుకలనుండి తప్పించుకోవాలంటే, పాపఫలితములను పొందకుండ ఉండాలంటే, మనిషికి ముక్తి రావాలంటే జగతిలో ఎవరికైనా సృష్ట్యాదిలో దేవుడు చెప్పిన జ్ఞానమే ఆధారము. దేవుడు చెప్పిన జ్ఞానము వలననే మనిషి కర్మబంధముల నుండి బయట పడగలడు, మోక్షమును పొందగలడు. అయితే సృష్ఠి మొదటిలో దేవుడు చెప్పిన జ్ఞానము ఏనాడో మనుషులకు తెలియకుండ పోయింది. అందువలన దైవజ్ఞానము కావాలను కొన్న మనిషి, ఏది దైవజ్ఞానమో తెలియక ఎందరో గురువులమను వారు చెప్పినదే జ్ఞానమని నమ్మి దానినే అనుసరించుచున్నాడు. సృష్ట్యాదిలో దేవుడు చెప్పిన జ్ఞానము తెలియకుండ పోయి, దాని స్థానములో అనేకమంది చెప్పిన, అనేక జ్ఞానములు వచ్చి చేరినవి. ఉదాహరణకు భూమిమీద పది రకముల గురువులు పది రకములుగా తమ తమ జ్ఞానమును చెప్పగా, మనుషులు కూడ పది రకములుగా చీలిపోయి, ఒక్కొక్క గురువును ఆశ్రయించిన వారందరు ఒక్కొక్క రక జ్ఞానమును తెలుసుకొని, ఎవరికి వారు మేమే గొప్ప జ్ఞానులమనుకొనుచున్నారు. విశేషమేమంటే పది రకముల

గురువుల జ్ఞానములలో ఒక్కరిది కూడ దేవుడు చెప్పిన జ్ఞానము కాకుండ పోయినది. కాలక్రమేపి దేవుడు చెప్పిన ధర్మములు పోయి, మనుషులు, దైవజ్ఞానమను పేరుతో సృష్ఠించిన జ్ఞానము వచ్చి, ఏది మనుషులు చెప్పిన ధర్మమో, ఏది దేవుడు చెప్పిన ధర్మమో తెలియకుండ పోయినది. అటువంట పుడు దేవుడు చెప్పిన ధర్మములకు ముప్పు ఏర్పడి దేవుని ధర్మముల స్థానములో మనుషుల అధర్మములు చోటు చేసుకొన్నవి. దేవుని ధర్మములు దేవునికే తెలుసు, కావున తిరిగి వాటిని చెప్పవలసినవాడు దేవుడే అని ముందు పేజీలలో వ్రాసుకొన్నాము. ఇంటిగుట్టు పెరుమాళ్ళకెరుక అన్నట్లు, ఒళ్ళు (ఒంటి) గుట్టు దేవునికెరుక. ఒళ్ళు లేక ఒంటి అనగా సజీవ శరీరమని అర్థము. జన్మించిన శరీరముతో ఉన్నవాడు శరీరము అను ఇల్లునుండి బయట పడుటకు ఒక విధానము కలదు. ఆ విధానమే జ్ఞానము అను గుట్టు లేక రహస్యము. జ్ఞానము అనే గుట్టు శరీరమను ఇల్లును తయారు చేసిన వానికే తెలుసు. శరీరము అను ఇల్లును తయారు చేసినవాడు దేవుడే, కనుక ఇంటి గుట్టు పెరుమాళ్ళకెరుక, ఒంటి గుట్టు దేవునికెరుక అన్నారు. ఇంటి గుట్టు అనినా, ఒంటి గుట్టు అనినా రెండూ ఒకటే. అలాగే పెరుమాళ్ళు అనినా, దేవుడు అనినా రెండు ఒకటే అని అర్థము. గుట్టు అనగా రహస్యమైన జ్ఞానము అని గుర్తుంచుకోవాలి.

ఎలా చెప్పుకొనినా మనిషి కర్మలనుండి, జన్మలనుండి ముక్తి పొందుటకు దేవుని జ్ఞానము ఒక్కటే అవసరము. ఆ ఒక్క జ్ఞానమును తెలుపువాడు ఒక్క దేవుడు మాత్రమే. దేవునికి తప్ప ఎవరికీ కర్మములను జయించు జ్ఞానము తెలియదు, ఏ మనిషికీ దైవధర్మములు తెలియవు. అందులన మనుషులు చెప్పినది దేవుని ధర్మములు కావు. ఇపుడు ఒక పెద్ద చిక్కు వచ్చి పడింది. అది ఏమనగా! దేవుడా, కనిపించడు మరియు

మాట్లాడు పనిని కూడ చేయడు. ఒకవేళ సైగలతోనైనా తెలుపగలడా అని చూస్తే అది కూడ పనియే అవుతుంది కదా! నేను ఏ పనిని చేయని క్రియారహితుడనని అంటాడు. సైగలు చేయుటకైనా ఆయన కనిపించాలి కదా! ఇటు కనిపించడు, అటు వినిపించడు అటువంటపుడు తన ధర్మములను దేవుడు తిరిగి తెలియజేస్తాడనడము ఒప్పుకోవలసిన మాటేనా అని మనకు ప్రశ్న రాకతప్పదు. కనిపించనివాడు, వినిపించనివాడు తన జ్ఞానమును ఎలా తెలియజేస్తాడని ఎవరైనా అడగవచ్చును. దానికి సమాధానము ఏమనగా! మనకు చెవి ద్వార శబ్దము వినిపిస్తుంది. జ్ఞానము శబ్దము ద్వారానే మనిషికి తెలియాలి. మనిషి తనకు అర్థమయ్యే శబ్దమును విన్నపుడే ఆ శబ్దములోని సారాంశమును గ్రహించును. అందువలన తాను మాట్లాడే భాషలోనే మనిషి జ్ఞానమును వినాలి. అటువంటపుడు దేవుడు మనిషికి అర్థమయ్యే భాషలోనే చెప్పాలి. మనిషికి అర్థమయ్యే భాషలోనే చెప్పాలి అంటే ఎదుట ఇంకొకరుండి చెప్పాలి. ఎదురుగా ఉన్న వాడు తనలాగున్నపుడే, తనలాగ మాట్లాడునపుడే అతనిని చూచి గౌరవించి, అతని మీద ఉన్న గౌరవముతో, అతడు చెప్పు మాటలను మనిషి వినును. అనగా వినే మనిషికి చెప్పే వాడు చిరపరిచితుడై ఉండాలి మరియు అతను తనతో మాట్లాడువాడై ఉండాలి. ఇదంతటిని చూస్తే జ్ఞానము తెలియని మనిషికి జ్ఞానము తెలిసిన మరొక మనిషి, జ్ఞానమును తెలుపుచున్నాడనియేగా అర్థము. దేవుడు తెలుపునదే అసలైన జ్ఞానమని, ఏ మనిషీ అసలైన జ్ఞానమును తెలుపలేడనీ ఇంతవరకు మీరే చెప్పారు. ఇప్పుడేమో ఒక మనిషికి జ్ఞానము తెలియాలంటే అతనిలాగ ఉన్న మనిషే జ్ఞానమును చెప్పాలి. అలా చెప్పినపుడే వినేవానికి జ్ఞానము తెలియునని అన్నారు. దేవుడు కనిపించడు, వినిపించడు. అలాంటపుడు కనిపించి చెప్పేవాడు దేవుడు కాదని మీరే అంటారు. ఈ పద్ధతిలో దేవుడు తన జ్ఞానమును మనుషులకు ఎలా

తెలియజేస్తాడని నన్ను అడిగితే! దేవుడు మనిషికి అన్ని విధాల అర్థమయ్యేలాగునే మనకు కనిపించి వినిపించేలాగున తెలియజేయుటకు తగిన ఏర్పాట్లు చేసిపెట్టాడని చెప్పవచ్చును. దేవుడు కనిపించడు, వినిపించడు అను మాట వాస్తవమే. కావున దేవుడు స్వయముగ చెప్పకుండ కనిపించే వానితో మరియు వినిపించే వానితో చెప్పించును. అలాగని చెప్పేవాడు మనిషికాదు. దేవుని జ్ఞానము దేవునికే తెలియును. ఏ మనిషి చెప్పలేడు అన్నాము కదా! అలాగని దేవుని జ్ఞానమును సంపూర్ణముగ తెలియజేయు వాడు ఇటు దేవుడూ కాదు, అటు మనిషీకాడు. అయితే దైవధర్మములను తిరిగి తెలుపువానిని ఏమనాలి? అని ప్రశ్నించవచ్చును. చెప్పబడునవి దైవ ధర్మములైనపుడు, చెప్పువాడు కనిపించినా, వాడు మనిషికాడు. ఇంకొక విధముగ చూస్తే చెప్పబడునవి దైవధర్మములైనపుడు కనిపించువాడు దేవుడూ కాదు. రూప, నామ, క్రియలు లేనివాడు దేవుడు అన్న సూత్రము ప్రకారము కనిపించి చెప్పేవాడు దేవుడు కాడు. దేవుని జ్ఞానమును దేవుడు తప్ప మనిషి తెలియజేయలేడను సూత్రము ప్రకారము చెప్పువాడు మనిషి కాడు. ఇటు మనిషికాక, అటు దేవుడుకాకుండ ఉన్నవాడు మాత్రమే తెలియజేయాలి. వివరముగా చెప్పితే దేవుడు కాకుండ మనిషి లక్షణములుండి, మనిషి కాకుండ దేవుని లక్షణములున్న వాడు మాత్రమే తెలియజేయును. ఇటు దేవుడు, అటు మనిషి కానివాడు ఒక్కడే ఒకడు గలడు అతడే భగవంతుడు. దేవుడు భగవంతుడా? అంటే కాదు, భగవంతుడు దేవుడా? అంటే అట్లు కూడ కాదు. ఇంకొక విధముగా మనిషి భగవంతుడా? అంటే కాదు. భగవంతుడు మనిషా? అంటే అట్లు కూడ కాదు. ఇదేంటి తికమక వ్యవహారము అని కొందరనుకోవచ్చును. చెప్పేవాడు ఎవరో తెలియకపోతే చెప్పబడునది అసలైన జ్ఞానమని ఎలా తెలియగలదు? అని కూడ కొందరడుగవచ్చును.

ఇక్కడొక ముఖ్యసూత్రము గలదు. అదేమనగా! చెప్పేవానిని బట్టి విన్న జ్ఞానము ఫలానా జ్ఞానమని చెప్పలేము. కానీ విన్న జ్ఞానమును బట్టి చెప్పినవాడు ఫలానావాడని చెప్పవచ్చును. అందువలన చెప్పినవాడు భగవంతుడా, లేక సాధారణ మనిషా అని చూడవలసిన పనిలేదు. చూడవలసినదంతా మనము విన్నది అసలైన దైవజ్ఞానమా? కాదా? అని చూడవలెను. ఇక్కడ అడుగవలసినది ఏమంటే! మనకు జ్ఞానమేదో తెలియనపుడు, ఎందరో జ్ఞానమును చెప్పుచున్నపుడు, ఇదియే నిజమైన దైవజ్ఞానమని ఎలా తెలుస్తుంది? మనము జ్ఞానమును ఫలానా అని గుర్తించ లేనపుడు, చెప్పువాడు మనిషా? భగవంతుడా? అని ఎలా తెలియనగును? అని కొందరనుకోవచ్చును. దానికి సమాధానముగా ఒక చిన్న ఉదాహరణను చెప్పుకొందాము. బజారులో ఇరవైమంది వ్యాపారస్థులు బియ్యము అమ్మే వారున్నారు. వారు ఒక్కొక్కరు ఒక్కొక్క రకము బియ్యమును అమ్ముచున్నారను కొనుము. మార్కెట్‌లో ఎవడైతే అన్నిటికంటే మంచి నాణ్యతగల బియ్యమును అమ్మువాడో, వాడు మంచి వ్యాపారస్థుడు అని తెలిసినపుడు, మంచి వ్యాపారస్థుడు ఎవడని తెలియాలంటే, మొదట మంచి బియ్యమును ఎవరు అమ్ముచున్నారో చూడాలి. బియ్యమును చూచేదానికి అన్నీ బాగానే కనిపిస్తున్నాయి. బియ్యము రకములలో ఏ బియ్యము మంచివో కొనేవానికి ఏమాత్రము తెలియదు. అటువంటపుడు ఒక్కొక్క దినము ఒక్కొక్క వ్యాపారస్థుని వద్ద, ఆ దినమునకు తగినన్ని బియ్యమును కొని వండి తిని చూడవలెను. అలా ఇరవై దినములు ఇరవై రకముల బియ్యమును తిని రుచి చూచిన తర్వాత అన్ని రకములలో అన్నము మృధువుగా, ఒక మెతుకుకు మరొక మెతుకు అతుక్కోకుండ విడిగా, తేమలేకుండ పొడిగా, రుచిగా, 24 గంటలుండినా చెడిపోకుండ, తొందరగా ఉడికి పోవునవిగా, వండిన తర్వాత రంగుమారకుండ ఉండునవి, తిన్న తర్వాత సులభముగా

జీర్ణమగునవి ఏవైతే ఉన్నాయో, ఆ బియ్యమును అన్నిటికంటే మంచి నాణ్యతగల బియ్యమని చెప్పవచ్చును. మంచి నాణ్యతగల బియ్యమును అమ్మువానిని మంచి వ్యాపారస్థునిగా గుర్తించవచ్చును.

బజారులో బియ్యమును అమ్ము వ్యాపారస్థులవలె భూమిమీద చాలామంది జ్ఞానమును చెప్పు గురువులు కలరు. మంచి నాణ్యతగల బియ్యమును అమ్మువానిని మంచి వ్యాపారస్థుడని గుర్తించవచ్చునని చెప్పినట్లు, మంచి జ్ఞానమును చెప్పు గురువును అసలైన గురువుగా గుర్తించ వచ్చును. బియ్యము యొక్క నాణ్యత మనకు తెలియనట్లు ఏది అసలైన జ్ఞానమో కూడ మనకు తెలియదు. అన్ని దుకాణములలోని బియ్యమును వాడిచూచి, ఏవి మంచి బియ్యమో గ్రహించినట్లు, గురువులందరు చెప్పు జ్ఞానమును విని, ఏది మంచి జ్ఞానమో తెలుసుకోవచ్చును. మంచి బియ్యమును అమ్మిన వానినే నిజాయితీగల మంచి వ్యాపారిగా గుర్తించినట్లు, మంచి ధర్మముల జ్ఞానమును చెప్పిన గురువునే నిజమైన గురువుగా గుర్తించ వచ్చును. అన్ని రకముల బియ్యము యొక్క అన్నమును చూచినపుడేగా ఏవి మంచి బియ్యమో తెలిసేది. అలాగే అందరి జ్ఞానములను చూచినప్పుడు కదా! ఏది అన్నిటికంటే మించిన జ్ఞానమో తెలిసేది. బియ్యమును బట్టి బియ్యము అమ్ము వ్యాపారి ఎటువంటివాడో తెలుసుకొన్నట్లు, మనము విన్న జ్ఞానమును బట్టి జ్ఞానమును చెప్పిన గురువు ఎటువంటివాడో తెలియును. మొదట బియ్యమును గురించి తెలియని వానికి, అన్ని రకముల బియ్యమును చూచిన తర్వాత మంచి బియ్యమును తెలుసుకొన్నట్లు, మొదట జ్ఞానము యొక్క భేదములను తెలియని మనిషి, అన్ని రకముల జ్ఞానములను చూచిన తర్వాత ఏది ఉత్తమ జ్ఞానమో తెలుసుకొనును. ఏది ఉత్తమ జ్ఞానమో తెలిసినపుడు దానినిబట్టి ఎవరు ఉత్తమ గురువో తెలియును.

ఈ విధముగా అయితే అసలైన జ్ఞానమును చెప్పువాడు అసలైన భగవంతుడని గుర్తించవచ్చును.

కొన్ని రకముల రాళ్ళను పరిశీలించినపుడు అన్నిటికంటే వెలుగైనది, ఉత్తమమైనది వజ్రమని గుర్తించవచ్చును. అలాగే భూమిమీద ఎందరో చెప్పు అన్ని రకముల జ్ఞానములను వింటేనే, అన్నిటికంటే గొప్ప ధర్మములను తెలుపు ఉత్తమమైన జ్ఞానమును గుర్తించవచ్చును. కావున మేము అందరి జ్ఞానమును చూడండి అని చెప్పుచుండగా, కొందరేమో మేము చెప్పు బోధను తప్ప ఇతరులు చెప్పుదానిని వినవద్దండి అనీ, మేము వ్రాసిన పుస్తకములు తప్ప ఇతరులు వ్రాసిన పుస్తకములను చదవద్దండని వారివారి శిష్యులకు చెప్పుచుందురు. అట్లు ఎందుకు చెప్పుచున్నారనగా! తాము చెప్పు జ్ఞానముకంటే గొప్ప జ్ఞానము ఎక్కడైనా తెలిస్తే, తమను వదలి వారి వద్దకు పోవుదురను ఉద్దేశముతో లేక భయముతో అలా చెప్పుచుందురు. తాము చెప్పు జ్ఞానములో ధర్మములు లేవని, తమ జ్ఞానముకంటే ఉత్తమమైన జ్ఞానముకలదని, అది తెలిస్తే తమవద్దకు శిష్యులు రారని తలచి, తమ పెద్దరికమును కాపాడుకొనేదానికి, నేడు చాలామంది బోధకులైన గురువులు, తమ శిష్యులను ఇతరుల పుస్తకములను చదవద్దండి అని చెప్పుచున్నారు. ఒకవేళ ఏ మనుషులైనా అటువంటి గురువులు కానటువంటి గురువుల మాటలను వింటే వారు మోసపోయినట్లగును. ఒకడు నాది అసలైన బంగారం, నీవు కొనినా ఎవరికి చూపవద్దండి అంటాడు. అయితే మనము వాని మాట వింటామా? ఇతరులవద్ద పరీక్షించుకొని అది అసలైనదో కాదో నిర్ధారించు కొంటాము. అదే విధముగా బంగారుకంటే ఎంతో ఎక్కువ విలువైన జ్ఞానమువద్ద మనము మోసపోకూడదు. జ్ఞానము జీవిత సాఫల్యము నకు చెందినది. కావున చాలా జాగ్రత్తగా ఆచి తూచి గ్రహించవలెను.

భూమిమీద దైవము తన జ్ఞానమును నెలకొల్పితే, దైవమునకు ప్రతి పక్షము అయిన మాయ కూడ తన జ్ఞానమును ఏర్పరచి పెట్టినది. ఇక్కడ విశేషమేమంటే దేవుని జ్ఞానము మాదిరి మాయజ్ఞానము ఉండుటవలన ఏది దేవుని జ్ఞానమో, ఏది మాయ జ్ఞానమో ఎవరికీ అర్థముకానట్లు ఉంటుంది. అందువలన ఎవరైన మాయ జ్ఞానమును దైవజ్ఞానము అనుకొనుటకు అవకాశము గలదు. దైవజ్ఞానమువలెనున్న మాయ జ్ఞానము భూమిమీద 99 పాళ్ళు విస్తరించియున్నది. ముఖ్యమైన మత గ్రంథములలో కూడ దైవజ్ఞానమువలె మాయ జ్ఞానము చోటు చేసుకొని ఎవరూ గుర్తించని రీతిలో ఉన్నది. అంతేకాక మాయ భూమిమీద గురువులుగా ఎంతోమందిని తయారు చేసి, వారిచేత తన జ్ఞానమును దైవ జ్ఞానమువలె బోధింప చేయుచున్నది.

ఇంతకుముందు బియ్యము యొక్క రకముల ఉదాహరణను చెప్పుకొన్నాము కదా! అందులో ఇరవై రకముల బియ్యములలో శ్రేష్ఠమైనది ఒక్కటి మాత్రమే ఉండునట్లు, భూమిమీద గల ఎన్నో రకముల జ్ఞానములలో చివరకు ఒక్క జ్ఞానమే నిజమైన దైవజ్ఞానమని తెలిసినపుడు, మిగత రకముల జ్ఞానములన్నిటిని మాయ జ్ఞానములనియే చెప్పవచ్చును. దైవజ్ఞానము ఏది, మాయ జ్ఞానము ఏది అని పరిశీలించని వారందరు, దైవజ్ఞానమును గుర్తించలేక, మాయ జ్ఞానమువైపే ఆకర్షితులగుదురు. దానినే గొప్పగ చెప్పుకొనుచుందురు. అందువలన మాయజ్ఞానము నూటికి తొంభైతొమ్మిది పాళ్ళుగ ఉన్నదని చెప్పవచ్చును. ఈ మాట నిజమా అబద్ధమా అనుటకు చిన్న ఉదాహరణను చూస్తాము. ప్రస్తుత కాలములో యజ్ఞములు చేయడము గొప్ప కార్యమని చాలామంది తలచుచుందురు. ఏ దేవాలయములోగానీ, ఏ ఆరాధన కార్యములోగానీ యజ్ఞములను జ్ఞానము కల్గినవారే

చేయుచుందురు. యజ్ఞములను చేయడము ఉన్నతమైన ఆరాధనగా ఎందరో భావించుచున్నారు. వర్షాలు రావాలని వరుణయజ్ఞము, మృత్యువు రాకూడదని మృత్యుంజయ యజ్ఞము, శాంతికొరకు విశ్వశాంతి యజ్ఞము, ఇలా ఎన్నో పేర్లు కల్గిన యజ్ఞములు అనేకము గలవు. దైవమార్గములో యజ్ఞములు సరియైనవా? కావా? ధర్మములా? అధర్మములా? అని ప్రశ్నిస్తే వెయ్యిమందిని అడిగినా సరియైనవేనని, ధర్మములేనని చెప్పుచుందురు. కొన్ని లక్షలమందిని అడిగితే ఎవడైనా అరుదుగా సరియైనవి కావు అధర్మములని చెప్పునేమో! ఒక్క యజ్ఞవిషయములోనే కొన్ని లక్షలమందికి ఒక్కడు కూడ యజ్ఞములు చేయుట అధర్మమని చెప్పలేదు. వాస్తవానికి దైవజ్ఞానము ప్రకారము యజ్ఞములు అధర్మములే. మాయజ్ఞానములో యజ్ఞములు చేయుట మంచిపనియని బోధింపబడుచున్నది. యజ్ఞములు ధర్మమా, అధర్మమా అని అడిగితే కొన్ని లక్షలమంది ధర్మమన్నపుడు, భూమిమీద మాయజ్ఞానము ఎన్ని పాళ్ళు ఉందో, దైవజ్ఞానము ఎన్ని పాళ్ళు ఉందో మీరే యోచించండి. ఇది మాయజ్ఞానము, ఇది దైవజ్ఞానము అని తెలియకపోవడము వలన భూమిమీద దైవజ్ఞాన సాంద్రతకంటే మాయా జ్ఞాన సాంద్రత ఎక్కువైపోయినది.

పుట్టినప్పటినుండి తిండికోసము, పెరిగినప్పటినుండి బ్రతుకు తెరువుకోసము ప్రాకులాడు మనుషులకు జీవితములో ముఖ్యమైనది దైవ జ్ఞానమని తెలియకుండా పోయినది. ఒకవేళ కొన్ని వేలమందిలో అరుదుగా ఎవనికైనా దైవజ్ఞానము మీద ఆసక్తి కల్గినా, వానికి దైవజ్ఞాన రూపములో మాయజ్ఞానము తెలియుచున్నది. అలా మాయజ్ఞానము అంటుకొన్న కొన్ని లక్షలమందిలో, ఎవడైనా అరుదుగా దైవజ్ఞానము ప్రత్యక్షముగా ఉన్నదని, ఇంతవరకు తనకు తెలిసినది దైవజ్ఞానముకాదని తెలియగలడు. ఈ

విధముగా లెక్కించితే ప్రస్తుతకాలములో దైవజ్ఞానము యొక్క స్థితి ఏమిటో అర్థమగుచున్నది. నిజమైన దైవధర్మములను తెలుపు జ్ఞానమును తెలిసినపుడే ఇది దేవుడు చెప్పిన జ్ఞానమని తెలియగలదు. మాయ జ్ఞానమైనా, దైవజ్ఞానమైనా దానిని మనిషి చెప్పినదనియే చెప్పవచ్చును. మాయ జ్ఞానమును అందరూ చెప్పుచుండగా దైవజ్ఞానమును మాత్రము ఒక్కడే చెప్పును. జ్ఞానమును చెప్పు అందరిలో దైవజ్ఞానమును చెప్పువాడు కూడ మనిషే అయినా వానిని ప్రత్యేకమైన వానిగా చెప్పవచ్చును. ఆ ప్రత్యేకత కల్గియున్నవాడే భగవంతుడని చెప్పవచ్చును. భగవంతుడు కూడ ఒక మనిషే. అతని జీవితములో గానీ, ఆకారములో గానీ అన్ని విధముల మనిషినే పోలియుండును. అందువలన భగవంతున్ని ఒక్క జ్ఞానము ద్వారా తప్ప ఏ విధముగా కూడ గుర్తించలేము, గుర్తించుటకు వీలుపడదు.

భూమిమీద దైవధర్మములను తెలుపు ఒక్క మనిషిని మాత్రము భగవంతుడు అనుచున్నాము. కాబట్టి మిగత మనుషులెవరు భగవంతులు కారని తెలియుచున్నది. భూమిమీదికి భగవంతుడు కొన్ని వేల సంవత్సరము లకో లేక కొన్ని లక్షల సంవత్సరములకో వచ్చును. అలా వచ్చిన వాడు మనిషిగా కనిపించినా అతను మనిషికాదు. భగవంతుడు ఎప్పటికి మనిషి కాదు. అలాగే మనిషి ఎప్పటికి భగవంతుడు కాడు. భగవంతుడు పుట్టినపుడు భగవంతుడు తన జీవితములో మనిషిగా మారుటకు వీలులేదు. అలాగే మనిషి పుట్టిన తర్వాత తన జీవితములో భగవంతునిగా మారుటకు వీలులేదు. దీనినిబట్టి **"భూమిమీద భగవంతుడు మనిషిగా, మనిషి భగవంతునిగా మారడు"** అన్నది సూత్రము అని తెలియాలి. దేవుడు భగవంతునిగా మారవచ్చును గానీ, మనిషి భగవంతునిగా మారలేడు. ఈ సూత్రము ప్రకారము దేవుడు, భగవంతుడు, మనిషి అని ముగ్గురిని చెప్పుకోవచ్చును.

దేవుడు తన జ్ఞానమును భూమిమీద మనిషికి చెప్పుటకు భగవంతుని పాత్రను ఉపయోగించుకొంటున్నాడు. దేవుడు ప్రత్యక్షముగా మనిషికి తన జ్ఞానమును తెలుపడు. కావున భగవంతుని పాత్రను ఉపయోగించు కొంటున్నాడు. భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తియోగమున 16,17 శ్లోకములలో క్షర, అక్షర, పురుషోత్తములని త్రైతమును తెలియజేసినట్లు బయట కూడ మనిషి, భగవంతుడు, దేవుడు అను త్రైతముతోనే తన జ్ఞానమును ప్రసరింపజేయుచున్నాడు.

దేవుని ధర్మములను దేవుడే తెల్పాలి, మనిషి చెప్పలేడు అను సూత్రము ప్రకారము మనిషి కానటువంటి భగవంతుడు దేవుని ధర్మములను తెలియ జేయుచున్నాడు. దేవుడు కనిపించడు, వినిపించడు, భగవంతుడు కనిపిస్తాడు, వినిపిస్తాడు. కనీ, వినే మనిషికి కనిపించి, వినిపించే వాడే జ్ఞానమును తెలియజేయాలి. కావున దేవుడు భూమిమీదకు భగవంతునిగా తన అంశను పంపును. దేవునికి లెక్కలేనన్ని కోట్ల అంశలు గలవు. భగవద్గీత విభూతియోగము 42వ శ్లోకములో **"ఏకాంశేన స్థితో జగత్"** అన్నట్లు ఈ జగత్తు అంతయు దేవుని ఒక్క అంశ చేతనే కలిగియున్నది. మొత్తము జగత్తు అంతయు ఒకే ఒక్క అంశచేత కలిగియుండగా, దేవుని యొక్క మరియొక అంశ చేత భగవంతుడు సృష్టింపబడి ఉన్నాడు. దేవునికి గల లెక్కలేనన్ని కోట్ల అంశలలో ఒక అంశ జగతికాగ, ఒక అంశ భగవంతునిగా వచ్చుచున్నది. అందువలన జగతితో సమానమైనవాడు భగవంతుడు, అయితే జగతి ఎవరికీ అర్థముకాదు, అలాగే భగవంతుడు కూడ ఎవరికీ అర్థముకాడు. "జగతి" ని విభజించి చూచితే జ+గతి = జగతి అగును. 'జ' అనగా జన్మించుట అనియు, 'గతి' అనగా గతించుట లేక మరణించుట అనియు చెప్పవచ్చును. అందువలన పుట్టి చనిపోవు దానిని జగతి అంటున్నాము.

జీవునికి జననము, మరణము లేకున్నా జీవుడు ధరించు శరీరమునకు జనన మరణములు గలవు. అందువలన సజీవ శరీరములన్నిటిని జగతి అంటున్నాము. దేవుని అంశ భగవంతునిగా శరీరమును ధరించి వచ్చుచున్నది. కావున జగతిలో భగవంతున్ని కూడ ఒక మనిషిగా ప్రజలు చూచుచున్నారు. అజ్ఞాన ప్రజలు భగవంతున్ని సాధారణ మనిషిగా లెక్కించి భగవంతున్ని కూడ అవమానిస్తున్నారు.

ఇదే విషయమును భగవద్గీత రాజవిద్యా రాజగుహ్య యోగములో 11వ శ్లోకమున ఈ విధముగా అంటున్నాడు.

శ్లో॥ అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ।
పరం భావ మజానన్తో మమ భూత మహేశ్వరమ్ ॥

**భావము :-** నేను సర్వ జీవరాసులకు మహేశ్వరుడనైనప్పటికి, మనిషి శరీరము ధరించిన నన్ను చూచి, నా శ్రేష్ఠత్వమును తెలియని నరులు మూఢులగుచు నన్ను అవమానించుచున్నారు.

వివరముగా చెప్పుకొంటే దేవుడు సర్వప్రపంచమును సృష్ఠించిన సృష్ఠికర్త. అటువంటి దేవుని ఏకాంశే భగవంతుడు. ఆ దేవుని మరియొక అంశయే జీవరాసుల జగత్తు. దీనినిబట్టి చూస్తే జగత్తులోని జీవులందరికి అధిపతి భగవంతుడు అని చెప్పవచ్చును. అయితే కొందరు ఇక్కడొక ప్రశ్న లేవదీయవచ్చును. అదేమనగా! దేవుని ఒక అంశ జగత్తు అయినపుడు మరియు దేవుని మరియొక అంశ భగవంతుడైనపుడు జగత్తు భగవంతుడు రెండు సమానమే అగును కదా! అటువంటపుడు జగత్తుకు భగవంతుడు ఎలా అధిపతి అగును? అని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! ప్రభుత్వము నిరుద్యోగ సమస్య తీర్చుటకు పదిమందిని ఉద్యోగములోనికి తీసుకొని, ఒకరోజుకు వందరూపాయల ప్రకారము నెలకు

మూడువేల రూపాయలు జీతమిచ్చునట్లు చేసినది. ఒక్కనెలకు పదిమందికి వచ్చు జీతము ముప్పైవేల రూపాయలగును. ఈ పదిమంది చేత సరిగ పనిచేయించుటకు పదిమందికి అధిపతిగ ఒక ఆఫీసర్‌ను నియమించింది. అలా నియమించిన ఆఫీసర్‌కు ఒక నెలకు జీతము 30 వేల రూపాయలుగ నిర్ణయించింది. ప్రభుత్వ నిర్ణయము ప్రకారము పదిమందికి 30వేలు జీతముకాగ, ఆఫీసర్ ఒక్కనికే 30వేలు జీతముండగా నెల జీతములో ఇద్దరూ సమానమే అయినా, పదిమందికి ఆఫీసర్ అధిపతియేనని చెప్పుచున్నాము. ఒక్క ఆఫీసర్ చెప్పినట్లు పదిమంది వినవలసిందే. పది మంది ఉద్యోగస్థులు మనుషులే, అలాగే ఒక ఆఫీసర్ కూడ మనిషియే. అయినప్పటికీ పదిమందికి ఆఫీసర్‌ను పెద్ద అనినట్లు భగవంతున్ని జగత్తుకు అధిపతి అంటున్నాము. వివరించి చెప్పితే 30 వేల రూపాయలు పదిమందికి నెల జీతము మరియు 30 వేల రూపాయలే ఆఫీసర్ జీతము. అలాగే ఒక అంశయే జీవరాసులన్నీ మరియు ఒక అంశయే భగవంతుడు. పదిమంది జీతము, ఆఫీసర్ జీతము సమానమైనంత మాత్రమున పనివారు ఆఫీసర్ ఇద్దరూ ఎట్లు సమానము కారో అలాగే జగత్తు అంశ, భగవంతుని అంశ సమానమైనంతమాత్రమున జగత్తు భగవంతుడు సమానము కారు. పదిమంది జీతము ఒక ఆఫీసర్ జీతముతో సమానమైనప్పటికి, పదిమంది కలిసి ఆఫీసర్ మాటను వినుట వలన, అతను పదిమందికి అధిపతి అని చెప్పవచ్చును. అదే విధముగా ఒక అంశతో జగత్తుండినా, ఒక అంశతోనే భగవంతుడుండినా, జగత్తులోని మనుషులు భగవంతుడు చెప్పిన ధర్మములనే వినవలసివచ్చును. భగవంతుడు చెప్పిన ధర్మములను విననంత వరకు వారికి ముక్తిలేదు. అందువలన మానవులందరికి భగవంతుడు అధిపతియేనని చెప్పవచ్చును. ఇటు పదిమంది ఉద్యోగస్థులకు అటు ఆఫీసర్‌కు ప్రభుత్వము ఎట్లు పెద్దగా ఉన్నదో, అట్లే ఇటు జగతికి అటు భగవంతునికి దేవుడు పెద్దగా ఉన్నాడు.

పదిమంది ఉద్యోగస్థులు ఆఫీసర్ మాట వినకుండ, ఆఫీసర్‌ను గౌరవించకుండ ఆఫీసర్‌ను ఏ విధముగా అవమానించినా పైన ప్రభుత్వము తప్పక ఉద్యోగస్థులను శిక్షించును. పైన ఉన్నది గ్రుడ్డి ప్రభుత్వములే మనకు వచ్చే జీతము వస్తుందిలే అని చేయవలసిన పనిని సరిగ చేయక పోయినా, మన మధ్యలోనికి వచ్చిన అధికారిని అధికారిగా గుర్తించక అవమానపరచినా, పైన ప్రభుత్వము ఉద్యోగస్థుల మీద కఠినచర్యలు తీసుకొనును. అలాగే జగతిలోని మనుషులు దేవున్ని గ్రుడ్డివానిగ లెక్కించి తమ ఇష్టమొచ్చినట్లు పాపము చేసినా, తమ మధ్యలోనికి గానీ, వద్దకుగానీ వచ్చిన భగవంతున్ని గుర్తించక ఆయనను అవమానపరచినా, దేవుడు నిర్మించిన భూతముల, గ్రహముల పరిపాలనలో పూర్తి శిక్షార్హులగుదురు. అయినప్పటికి దేవుని పరిపాలన ఏమిటో తెలియక మనుషులు అజ్ఞాన అంధకారములో కన్నులు గ్రుడ్డివైపోయి, జగత్తుకంతటికి అధిపతియైన భగవంతున్ని గుర్తించక, మానవ శరీరమును ధరించిన భగవంతుని గొప్ప తనము తెలియక, సాధారణ మనిషిగ లెక్కించి అవమానముపాలు చేయుచున్నారు. అందువలన పై శ్లోకమున **"అవజానన్తి మాం మూఢా మానుషీమ్ తనుమాశ్రితమ్"** మనిషి శరీరమును ధరించిన నన్ను చూచి మూఢులు అవమానిస్తున్నారని అన్నాడు. అంతేకాక **"పరం భావ మజానన్తో మమ భూత మహేశ్వరమ్"** 'నేనే సర్వ జీవరాసులకు అధిపతినని, నా గొప్పతనమును తెలియరు' అని కూడ అన్నాడు.

దేవుడు తాను నిర్మించిన సృష్టిలోనికి తన ధర్మములను కాపాడుటకు ఎప్పుడో ఒకప్పుడు భగవంతున్ని పంపుచున్నాడు. వచ్చిన భగవంతుడు ఎవరో, పంపిన దేవునికి తెలుసు. కానీ భూమిమీదున్న మనుషులకు తెలియదు. దేవుని చేత పంపబడిన అంశను అనగా భగవంతున్ని మొదట

ప్రజలు గుర్తించ లేకపోయినా, తర్వాత గుర్తించుటకు అనేక అవకాశములను దేవుడు కల్గించాడు. వచ్చిన భగవంతుడు ఎప్పటికీ నేను భగవంతుడినని చెప్పక పోయినా, ఆయన చెప్పు బోధలనుబట్టి సులభముగా భగవంతున్ని తెలియవచ్చును. ఆయన బోధలనే విననివాడు, ఆయనను సాధారణ మనిషిగానే లెక్కించడము జరుగుచున్నది. ఆయన చెప్పు అనేక దైవ ధర్మములనుబట్టి భగవంతున్ని గుర్తించుటకు అనేక అవకాశములున్నప్పటికి దైవధర్మముల మీద ఆసక్తి లేనివాడు, భగవంతుడు ఏమి చెప్పుచున్నాడని ఏమాత్రము చూడడు. అందువలన అటువంటివారు భగవంతున్ని ఏమాత్రము తెలియలేరు. దేవునిమీద విశ్వాసము లేనివాడు దేవుని ధర్మముల మీద ఆసక్తిని కనబరచడు. దైవజ్ఞానము మీద ఆసక్తిలేనివారికి ప్రపంచ కార్యముల మీద, ప్రపంచ విషయముల మీద ఆసక్తి ఎక్కువగా ఉండును. కావున భగవంతుడు తెలుపు ధర్మముల మీద అజ్ఞానులు ఆసక్తిని కనబరచక, భూమిమీద భగవంతున్ని మనిషిగా తలచి, అతను చేయు ప్రపంచకార్యములనే లెక్కించి, భగవంతున్ని మనుషులకంటే హీనముగా మాట్లాడుచున్నారు. అంతేకాక సాధారణ మనిషికి ఇచ్చే గౌరవమును కూడ ఇవ్వక హీనముగా అవమానపరచుచున్నారు. అవమాన పరచడమేకాక భగవంతుడు భూమిమీద చేయు ధర్మకార్యములకు ఆటంకములను కలుగజేయుచున్నారు. ఈ విధముగా అజ్ఞాన ప్రజలు చేసినప్పటికీ భూమి మీద ప్రజలందరికి భగవంతుడు అధిపతి అయినా, తాను సాధారణ మనిషిగానే కనిపిస్తూ, తాను ఏ పని నిమిత్తము వచ్చాడో ఆ పనిని మాత్రము చేసుకుంటూ పోవుచుండును.

దేవుని అంశ అయిన భగవంతున్ని అవమానపరిస్తే, భగవంతుని కార్యములను ప్రోత్సహించక, సహకరించక ఆటంకపరిస్తే, అటువంటి వానిని

దేవుడు ఏమి చేయడా? అని కొందరు ప్రశ్నించవచ్చును. దానికి జవాబు ఏమనగా! దేవుడు ఏ పనిని చేయనివాడని ముందే చెప్పుకొన్నాము కదా! అందువలన అటువంటి అజ్ఞానులను దేవుడు ఏమీ చేయడు. కానీ దేవుని పరిపాలనలోని వారు అజ్ఞానులు చేసిన పనిని లెక్కించి, పాపమును అంటగట్టి, ఆ పాపమును అనుభవింప చేతురు. ఈ నామాట అసత్యము కాదు. ఇదే మాటనే భగవంతుడు ఒక సందర్భముగా చెప్పుచూ ఇలా "నేను ప్రజలకు దైవధర్మములను బోధించుటకు వచ్చాను. దైవ ధర్మముల మీద ఆసక్తి కలవారందరు నావద్దకు వచ్చి జ్ఞాన సమూహముగా జ్ఞానసంఘముగా తయారగుచుందురు. నేను చేయు పనులలో నాకు సహకరించని వాడు, నాకు ప్రతిపక్షముగా ఉండి వ్యతిరేఖ కార్యములను చేయుచుండును. అటువంటి వాడు నాకు విరోధిగా లెక్కించబడును. నా పనులకు వ్యతిరేఖి అయినవాడు నావద్దకు వచ్చు ప్రజలను రానివ్వక, ఉన్నవారిని కూడ చెదరగొట్టు వాడుగా ఉన్నాడు" అన్నాడు. అటువంటి వారిని గూర్చి నేను ముఖ్యముగా చెప్పునదేమనగా! మనుషులు చేయు ప్రపంచ సంబంధమైన ప్రతి పాపమును దైవజ్ఞానము చేత క్షమింప చేసుకొని అనుభవించకుండ తప్పించుకోవచ్చును. కానీ దైవసంబంధమైన పాపమునకు దైవజ్ఞానము చేత కూడ క్షమాపణ లేదు. మనుషుల వలన పుట్టిన మనిషికి విరోధముగా మాటలాడినా, విరుద్ధమైన పనులు చేసినా వచ్చు పాపమునకు క్షమాపణ కలదు. కానీ దేవుని వలన పుట్టిన భగవంతునికి విరోధముగా మాటలాడువానికి వచ్చు పాపము దైవజ్ఞానము అను అగ్ని చేత కూడ కాలదు. అనగా ఆ పాపమును ఇటు భగవంతుడుగానీ, అటు దేవుడుగానీ క్షమించడు. దేవుని చేత దేవుని అంశగా వచ్చిన భగవంతునికి విరుద్ధముగా చేసిన పాపము భయంకరమైనది. సాధారణ మనుషులకు విరుద్ధముగా చేసిన పాపము ఒక జన్మలో అనుభవిస్తే పోతుంది. లేకపోతే దేవున్ని

ఆరాధించి దేవుని జ్ఞానము ప్రకారము నడిస్తే వచ్చు జ్ఞానాగ్ని వలన కాలిపోతుంది. కానీ భగవంతునికి విరుద్ధముగా చేసిన పాపము ఒక జన్మలో అనుభవించినా అయిపోదు, దైవ జ్ఞానమువలన కూడ కాలిపోదు. ఆ పాపము చాలా భయంకరమైనది ఎందుకనగా! అది ఒక జన్మలో అయిపోక, జరుగుచున్న ఈ యుగములో ఎన్నో జన్మలలో అనుభవించవలసి ఉండును. ఈ యుగములోనేకాక రాబోవు యుగములో కూడ అనుభవించ వలసివుండును. భగవంతునికి వ్యతిరేఖమై సంపాదించుకొన్న పాపము రెండు యుగముల పర్యంతము అనుభవించవలసి ఉండును.

చూచారా! మనుషుల పట్ల చేయు పాపముకంటే భగవంతుని పట్ల చేయు పాపము ఎంత భయంకరమైనదో! ఎంత పెద్దదో!! ఇక్కడ కొందరు ఒక ప్రశ్నను అడుగవచ్చును. అదేమనగా! మనిషి వీర్యము వలన పుట్టిన మనిషి అయినా, దేవుని అంశ వలన పుట్టిన భగవంతుడైనా ఇద్దరు మనుషులే కదా! అటువంటపుడు సాధారణ మనిషి వలన వచ్చు పాపము ఎంతో, భగవంతుని వలన వచ్చు పాపము కూడ అంతే పాపము రావలెను కదా! అట్లుకాక ఎందుకు ఎక్కువ పాపము వచ్చుచున్నది? ఈ ప్రశ్నకు మా జవాబు ఏమనగా! మనిషినుండి వచ్చిన మనిషిగానీ, దేవుని నుండి వచ్చిన భగవంతుడుగానీ ఇద్దరు మానవరూపమునే కల్గియున్నా, సాధారణ మనిషి దేవుని జ్ఞానమును తెలుసుకోవచ్చును గానీ, దేవుని జ్ఞానమును తెలుపలేడు. అట్లని జ్ఞానము చెప్పువారందరు భగవంతులు కాదు. ఎవరికీ తెలియకుండ అణగారిపోయిన ధర్మములను నూతనముగా (క్రొత్తగా) తెలుపువాడు భగవంతుడు. మనిషి కర్మను సంపాదించుకొను చుండును. భగవంతుడు ఏ కర్మను తగిలించుకోకుండ పని చేయుచుండును. మనిషి కర్మ అనుభవించు నిమిత్తము పుట్టాడు. భగవంతుడు దైవధర్మము

లను తెలుపుటకు పుట్టాడు. అంతేకాక "మమభూత మహేశ్వరమ్" అన్నట్లు ఆయన అందరికీ అధిపతి. అంత గొప్పవానిని, ఎంతో గొప్ప జ్ఞానము తెలుపు భగవంతుని వలన వచ్చు పాపము ఎంతో పెద్దదిగానే ఉండును. భగవంతుడు "మానుషీమ్ తనుమాశ్రితమ్" అన్నట్లు మనిషి శరీరము ధరించి ఉన్నప్పటికి ఆయన ఏ విధముగ చూచిన మనిషితో సమానము కాదు. కనుక మనిషికి చెడు చేస్తే వచ్చే పాపముకంటే భగవంతునికి చెడుచేస్తే వచ్చే పాపము గొప్పదని తెలియుచున్నది.

ఇక్కడ మరియొక ప్రశ్నను అడుగుటకు అవకాశము కలదు. "సాధారణ మనిషి కర్మను అనుభవించు నిమిత్తము పుట్టాడు అన్నారు. పుట్టిన తర్వాత కర్మను సంపాదించుకొనుచుండును అని కూడ అన్నారు. భగవంతుడినేమో కర్మ అంటకుండ కార్యములను చేయునని చెప్పారు. మీరు చెప్పు ధర్మ సూత్రముల ప్రకారము కనిపించు ఏ మనిషి అయినా, ఏ కార్యమును చేయుచుండినా, ఆ కార్యమునకు కనిపించని కర్మ కారణమై ఉన్నదని చెప్పారు. అటువంటపుడు భగవంతుడు కూడ కనిపించు మనిషియే కదా! ఆయన కూడ ఎన్నో కార్యములను చేయుచుండును కదా! ఆయన చేయు పనులకు కూడ ప్రారబ్ధకర్మ కారణమై ఉండును కదా! ఆయన కర్మ అంటకుండ పనిచేయువాడైనప్పుడు, ఆయనకు ప్రారబ్ధకర్మనే ఉండదు కదా! అలా కర్మలేనపుడు ఆయన కార్యములనెలా చేయుచున్నాడు. ఆయన చేయు కార్యమునకు కారణము కర్మ కాదా!" అని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! దేవుడు చెప్పిన సూత్రము ప్రకారము భూమి మీద ఆకారమున్న ఏ మనిషిగానీ కదలి పనిచేయాలంటే దానికి కారణమైన ప్రారబ్ధకర్మ ఉండి తీరాలి. ఈ సూత్రము ఆకారమున్న భగవంతునికి కూడ వర్తించును. కర్మలేకుండ ఎవరూ శరీరము ధరించి పుట్టుటకు

వీలులేదు. అందువలన శరీరమున్న ప్రతి మనిషి కర్మతోనే పుట్టవలసి వచ్చును. దేవుని అంశ అయిన భగవంతుడు కూడ భూమిమీద శరీరముతో ఉన్నాడు. కాబట్టి ఆయన కూడ ప్రారబ్ధకర్మతోనే వచ్చియుండును. సాధారణ మనిషి అయినా, భగవంతుడైనా ఎవరైనా ప్రారబ్ధకర్మననుసరించి కార్యములను చేయవలసిందే. ఇంకొక ముఖ్య విషయమేమనగా! దైవ సంబంధము కాకుండ, ప్రపంచ సంబంధమైన ఏ కార్యమునకుగానీ కర్మ కారణముండి తీరును. దైవజ్ఞానము కర్మను నాశనము చేయునది, కావున దైవకార్యములకు గానీ, దైవజ్ఞానమునకు గానీ ప్రారబ్ధకర్మ కారణముగా ఉండదు. దైవజ్ఞానము కర్మకు అతీతమైనది. అందువలన దైవమునకు సంబంధించిన ఏ కార్యమునకు కర్మ ఉండదు. అదే ప్రపంచ సంబంధమైన అతిచిన్న పనికి కూడ కర్మ కారణమై ఉంటుంది. దేవుని అంశ భూమి మీద భగవంతునిగా వచ్చినపుడు భగవంతుడు సమయమును, సందర్భమును చూచి దైవధర్మములను తెలియజేయు పనులను చేయును. మిగతా జీవిత కాలములో అందరివలె ప్రపంచ కార్యములనే చేయుచుండును. ప్రపంచ కార్యములకు కర్మ ఉండి తీరాలి. కావున భగవంతునికి కూడ కర్మ ఉందని చెప్పవచ్చును. ఆ కర్మప్రకారమే ఆయన కూడ ప్రపంచ కార్యములను చేయుచున్నాడు. భగవంతుడు దేవుని ధర్మములను తెలియజేయు నిమిత్తము వచ్చినప్పటికీ జీవితకాలములో ఎక్కువ అందరివలె ప్రపంచ కార్యములే చేయవలసి ఉండును. దైవజ్ఞానమును సందర్భము వచ్చినపుడు మాత్రమే చెప్పును. ఉదాహరణకు శ్రీకృష్ణున్ని తీసుకొందాము. కృష్ణుడు సాధారణ వ్యక్తిగానే జీవించాడు. జీవితములో ఒక్కమారు 90 సంవత్సరముల వయస్సులో అదియు యుద్ధ ప్రారంభ సమయములో జ్ఞానమును చెప్పాడు. ఆ ఒక్క సమయము మాత్రము కర్మకు అతీతమైనది. మిగతా జీవిత

కాలమంతయు కర్మానుసారము జరిగినదనియే చెప్పవచ్చును. ఈ జన్మలో కర్మ సంపాదించుకోని వాడు అదే సూత్రము ప్రకారము వెనకటి జన్మలో కూడ కర్మ సంపాదించుకొని ఉండడని చెప్పవచ్చును. వెనుకటి జన్మలో కర్మలేని వానికి ఈ జన్మలో అనుభవించుటకు కర్మ ఉండదు. ఎందుకనగా వెనుకటి జన్మ కర్మయే ఈ జన్మ పనులు చేయుటకు కారణమైన ప్రారబ్ధకర్మ అగును. వెనుక జన్మలో కర్మ సంపాదనలేని వానికి ఈ జన్మలో కర్మ అనుభవము కూడ ఉండదు.

అటువంటపుడు కృష్ణుడు భూమిమీద అనేక కార్యములను చేయుటకు కారణము అయిన కర్మ లేనపుడు, ఆ పనులను ఎలా చేశాడు? అను ప్రశ్న రాగలదు. పని జరగాలంటే కర్మ ఉండాలి. కానీ కృష్ణునికి వెనుకటి కర్మలేదు. అయితే ఆయన భూమిమీద పనులు చేయుటకు కారణమైన కర్మ ఎక్కడిది? అను ప్రశ్నకు జవాబు ఒక్కటే గలదు! కర్మలేని కృష్ణుడు, కర్మ ఉన్న కృష్ణునిగా వచ్చాడు. ఆయన పుట్టినపుడే ఆ జన్మకు కావలసిన కర్మను ఆయనే స్వయముగా రచించుకొని వచ్చాడు. అందువలన కృష్ణుడు చేసిన కార్యములు ఆయన చేసుకొన్న కర్మవలన జరిగినవి కావు. ఆ కార్యములన్నీ ఆయన వ్రాసుకొన్న కర్మలని తెలియుచున్నది. ఈ విషయమై భగవద్గీతయందు జ్ఞానయోగమున 6వ శ్లోకములో ఈ విధముగా ఉన్నది.

శ్లో॥ అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరో ఽపిసన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సమ్భవా మ్యాత్మ మాయయా ॥

**భావము :** పుట్టుకగానీ, నాశనముగానీ లేనివాడను మరియు సర్వ జీవరాసులకు ఈశ్వరుడను అయిన నేను, నా ప్రకృతిని అధిష్ఠించి గుణములను ఏర్పరుచుకొని కర్మను కల్పించుకొని జీవునివలె పుట్టుచున్నాను.

వివరముగా చెప్పుకొంటే పై శ్లోకమున సర్వజీవరాసులకు ఈశ్వరుడను, దేవుడనైన నేను ప్రకృతి వలన పంచభూత శరీరమును తయారు చేసుకొని, మాయ వలన గుణ కర్మములను ఏర్పరుచుకొని పుట్టుచున్నానని చెప్పాడు. ఈ శ్లోకములో **"ప్రకృతిం స్వామధిష్ఠాయ"** అన్నపుడు పంచభూత శరీరమును అధిష్ఠించి అని తెలియవలెను. అలాగే **"సమ్భవామి ఆత్మ మాయయా"** అన్నపుడు 'మాయ' అనబడు గుణములు వాటివలన కలుగు కర్మను నియమించుకొని అని తెలియవలెను.

దేవుడైన పరమాత్మ సర్వజీవులకు అధిపతిగా ఉండి, చావుపుట్టుకలు లేనివాడుగా ఉండి, తన ప్రకృతితో ప్రత్యేకమైన శరీరమును తయారు చేసుకొని, తన మాయతో గుణములను వాటికి అనుబంధమైన కర్మను తయారు చేసుకొని, మనిషివలె పుట్టి, మనుషులలో ప్రత్యేక మనిషియై భగవంతునిగా ధర్మములను పునరుద్ధరించి, తిరిగి ఎక్కడినుండి వచ్చాడో అక్కడికే పోవుచున్నాడు. **దీనినిబట్టి దేవుడు భగవంతునిగా పుట్టి, మనిషిగా జీవించాడని చెప్పవచ్చును. అందువలన దేవుడు మనిషికాడు. అలాగే భగవంతుడు మనిషిగా మరణించి, దేవునిగా మారిపోయాడని చెప్పవచ్చును. అందువలన భగవంతుడు మనిషి కాడు. ఒక్కమాటలో చెప్పాలంటే దేవుడు భగవంతునిగా వచ్చి, భగవంతుడు దేవునిగా మారిపోయినా, మనకు కనిపించునది మనిషి పుట్టి కొంతకాలముండి చనిపోయినట్లే ఉండును.** అందువలన భూమిమీద భగవంతున్ని ఎవరూ సాధారణముగా గుర్తించలేరు. దేవుడు భగవంతునిగా పుట్టి, మనిషివలె పనులు చేయుచు జీవించాడని చెప్పుచున్నాము. ఇప్పుడు దేవుడు, భగవంతుడు, మనిషి అను ముగ్గురిలో దేవుడు కనిపించడు, భగవంతుడు, మనిషి ఇరువురు కనిపిస్తారు. కానీ మనుషులలో భగవంతుడు ఎవరో తెలియదు, కావున భగవంతుడు

కనిపించినా కనిపించనట్లే. మనిషి మాత్రము ఎల్లప్పుడు కనిపిస్తాడు. కనిపించే **మనిషికి మననము గలవాడు మనిషి అను నిర్వచనము గలదు.** అలాగే **దేవునికి దేవులాడబడేవాడు దేవుడు అను నిర్వచనము గలదు.** ఇక భగవంతునికి ఏమి నిర్వచనము కలదని కొందరడుగ వచ్చును. దానికి జవాబుగా దేవునికి, మనిషికి నిర్వచనమున్నట్లే భగవంతునికి కూడ నిర్వచనము కలదని చెప్పవచ్చును. అదేమనగా! **భగమునుండి పుట్టినవాడు భగవంతుడు అనునదే నిర్వచనము.** ఈ మా మాటను వినిన తెలుగు భాషా పండితుడు భగవంతుడు అనగా భగమునుండి పుట్టినవాడు అను అర్థము తప్పు అన్నాడు. ఎట్లు తప్పు అని వివరమడుగగా! "బలవంతుడు అన్నపుడు బలము కలవాడని అర్థము కదా! అలాగే భగవంతుడు అన్నపుడు భగముకలవాడని అర్థము" అన్నాడు దానికి వెంటనే మేము ఈ విధముగా అడిగాము. హిందీ భాషలో "దవాఖానా" అను పదములో 'దవా' అనగా మందు అనీ 'ఖానా' అనగా తినడము అని అర్థము. దాని పూర్తి అర్థమును తీసుకొని చూస్తే దవాఖానా అనగా మందులు తినుపించు వైద్యశాల (ఆసుపత్రి) అని అర్థము. దాని ప్రకారము "పాయఖానా" అను పదమును చూస్తే పాయ అనగా మలము అని ఖానా అనగా తినడమని, మలమును తినిపించునది పాయఖానా లేక మరుగుదొడ్డి అని అనాలి. కానీ అలా అనుటకు వీలులేదు. దవాఖానా, పాయఖానా అను రెండు పదములు ఒకే విధముగా ఉండినా వాటి భావము వేరు, వాటి అర్థములు వేరు. దవాఖానా అంటే ఆసుపత్రి, పాయఖానా అనగా మరుగుదొడ్డి అని వేరు వేరు భావముల అర్థములున్నట్లు భగవంతుడు, బలవంతుడు అను రెండు పదములు ఒకే విధముగా ఉండినా వాటి భావములు వేరువేరుగా ఉన్నవి. అట్లు కాకుండ భగవంతుడు అంటే భగము కల్గినవాడు అంటే పూర్తి తప్పు అగును. పురుషులకు భగము (గర్భము) ఉండదు. అందువలన

సందర్భానుసారము పాయఖానా, ధవాఖానా వేరువేరు భావములైనట్లు, బలవంతుడు, భగవంతుడు వేరువేరు భావములు కల్గియున్నవి.

భగవంతుడు అనగా భగమునుండి పుట్టినవాడని అర్థము కదా! అటువంటపుడు మనమందరము తల్లి భగమునుండియే పుట్టాము కదా! దానివలన మనలనందరిని భగవంతులనియే అనాలి కదా! అని ఎవరైనా ప్రశ్నించవచ్చును. ఇక్కడ ముఖ్యముగా గమనించవలసినది ఏమనగా! దేవుడు తనను తాను సృష్టించుకొని మానవశరీరముతో తల్లిగర్భము నుండి పుట్టుచున్నాడు. కానీ **ప్రపంచములో ఏ జీవరాసిగానీ, ఏ మనిషిగానీ తల్లి గర్భమునుండి పుట్టలేదు.** ఇదేమిటి ఇంత విరుద్ధముగా, ఇంత గ్రుడ్డిగా చెప్పుచున్నారే అని మీరనుకోవచ్చును. ఎవరేమనుకొనినా నేను చెప్పునది నూటికి నూరుపాళ్ళు వాస్తవము. ఒక్క భగవంతుడు తప్ప మిగతా వారందరు గర్భము బయట శరీరమును ధరించుచున్నారు. మనిషి శరీరము తల్లి గర్భములో తయారగుచున్నది. తల్లిగర్భములో తయారైన శరీరము గర్భము నుండి బయటికి వచ్చిన తర్వాత ఆ శరీరములోనికి జీవుడు చేరుచున్నాడు. గర్భమునుండి బయటపడిన శరీరములోనికి జీవుడు చేరుచున్నాడు. అందువలన ఎవరూ భగమునుండి పుట్టలేదు. కావున ఎవరూ భగవంతులు కారు.

సర్వవ్యాపి అయినవాడు దేవుడు, ఒక్కచోట మాత్రముండువాడు మనిషి. మనిషి మరణములో ఒకచోటునుండి, జన్మించవలసిన మరొక చోటికి పోయి గర్భము నుండి బయటకు వచ్చిన శిశుశరీరములో చేరు చున్నాడు. అలా జీవుడు వచ్చిచేరిన దానిని జన్మ అంటున్నాము. ఎక్కడి నుండో వచ్చి శిశుశరీరములో ప్రవేశించు మనిషికి జన్మకలదు, జాతకము గలదు. కానీ అంతటా వ్యాపించియుండి ఎక్కడినుండో వచ్చాడనుటకు

వీలులేనివాడు దేవుడు. అటువంటి దేవుడు లేక దేవుని అంశ భగవంతునిగా మారినపుడు తల్లిగర్భమునుండి సజీవముగా బయటికి వచ్చును. అలా దైవాంశ భగమునుండి సజీవముగా వచ్చుచున్నది. కావున దానిని జన్మ అనలేము, దానికి జాతకము లేదు. జన్మించిన మనిషికి జాతకముండ వచ్చును. కానీ జన్మలేని భగవంతునికి జాతకముండదు. భగవంతుడు తన కర్మను తానే సృష్ఠించుకొని వచ్చును. కావున ఆయన కర్మను ఏ జ్యోతిష్యమూ చెప్పలేదు. మనిషికి అతను చేసుకొన్న కర్మ ప్రకారము శరీరము లభించును. భగవంతునికి అతను వ్రాసుకొన్న కర్మ ప్రకారము గర్భములోనే శరీరమును ధరించి వచ్చును. **గర్భములోనే జీవముతోనున్న వాడు ఒకే ఒక భగవంతుడు.** ఇప్పటి కాలములో విజ్ఞానము అను పేరుతో జ్ఞానము కాని దానిని కొందరు తెలుసుకొని, భౌతికశాస్త్రము యొక్క పూర్తి సారాంశమును తెలియక, తమకు తెలిసినదే గొప్ప అనుకొని ప్రతి గర్భములోని శిశువుకు ప్రాణమున్నదని అంటున్నారు. గర్భస్థ శిశువుకు ప్రాణమున్నదను మాటను డాక్టర్లందరు చెప్పుచున్నారు. గర్భస్థ శిశువుకు ప్రాణము లేదను మాట వైద్యరంగములో పూర్తి వ్యతిరేఖమని మాకు తెలిసినా వారికి తెలిసినది అసత్యము, మాకు తెలిసినది సత్యము కావున గర్భములోని ఏ శిశువుకు ప్రాణములేదని ధైర్యముగా చెప్పుచున్నాము. అలాగే దైవాంశ జన్మించునపుడు మాత్రమే గర్భములోని శిశువుకు జీవముంటుందని చెప్పుచున్నాము. అలా జీవముతో పుట్టిన శిశువునే భగవంతుడు అని అనవచ్చును.

జగతిలో ధర్మములకు ముప్పు ఏర్పడి అధర్మములు వ్యాపించి పోయినపుడు, తెలియని ధర్మములను తెలియ చెప్పుటకు దైవాంశ భగవంతునిగా కొన్ని వేలసంవత్సరములకో, లేక కొన్ని లక్షల సంవత్సరము

లకో భూమిమీదకు వచ్చును. అలా వచ్చిన దేవుని అంశయే శ్రీకృష్ణుడు. కృష్ణుడు సాధారణ మనిషి అయినప్పటికీ ఆయన జన్మలో భగవంతుడు. కృష్ణుడు గర్భములోనే జీవము కల్గియున్నాడనుటకు ఆధారమేమి అని భవిష్యత్తులో ఎవరూ ప్రశ్నించకుండ కృష్ణుడు తల్లి గర్భమునుండి ఎదురు కాళ్ళతో పుట్టాడు. అలా కాళ్ళు బయటికి వస్తూనే, శరీరమంత గర్భములో ఉన్నపుడే ఆయన గర్భములో సజీవముగా ఉన్నాడనుటకు నిదర్శనముగా కాళ్ళను కదిలించాడు. ఆ దినము ఆయన ఎదురు కాళ్ళతో పుట్టి కాళ్ళు అల్లాడించడము వలన ఆయన భగవంతుడని చెప్పుటకు పూర్తి ఆధారము ఏర్పడినది. సాధారణ మనిషికి గర్భము బయట జన్మకలుగుచున్నదను పూర్తి వివరమును మేము 1980వ సంవత్సరములో రచించిన **"జనన మరణ సిద్ధాంతము"** అను గ్రంథములో గలదు.

కృష్ణుడు తల్లిగర్భమునుండి బయటికి వచ్చునపుడు ఒక కాలు రెండుమార్లు, ఒకకాలు ఒకమారు అల్లాడించాడని మేము కృష్ణాష్టమి సందర్భమున ఉపన్యాసములో కూడ చెప్పాము. అంతేకాక ఆయన పుట్టినపుడు మీరు చూచారా? అని ఎవరైనా ప్రశ్నించినా దానికి జవాబును కూడా అక్కడ చెప్పాము. ఇలా అన్ని ఆధారములతో కృష్ణుడు భగవంతుడని చెప్పుచున్నాము. అంతేకాక ఇంతవరకు ఎవరికీ తెలియని రహస్యమును కూడ ఇపుడు చెప్పుకొందాము. కృష్ణుడు పుట్టినపుడు కాళ్ళతో పుట్టాడని భారతములో వ్రాశారు. అయితే కాళ్ళు అల్లాడించాడని ఎవరూ చెప్పలేదు. కానీ కాళ్ళు అల్లాడించినది వాస్తవమే, అయినా ఆ మాట నేడు గొప్ప రహస్యము. అలాంటిదే భారతములో కూడ చెప్పని రహస్యము ఒకటి గలదు. అదేమనగా! కృష్ణుడు కాళ్ళతో పుట్టాడు కదా! ఆయన రెండు కాళ్ళకు రెండు చారలుండేవి. ఆ విధముగా కాళ్ళకు చారలుండువారు

భూమిమీద చాలా అరుదుగా ఉందురు. బహుశా కోటికొకరు కూడ ఉండరనుకుంటాము. అలా చారలుండు శరీరము చాలా ప్రత్యేకమైనది. ఆ ప్రత్యేకత ఏమనగా! కాళ్ళకు చారలున్న మనిషితో శత్రుత్వము చేసినా, అతనికి వ్యతిరేఖముగా ప్రవర్తించినా అటువంటివాడు ఆ జన్మలోనే క్షీణించి పోవును. అలాంటివాడు ఎవడూ బ్రతికి బట్టగట్టలేడు. అలా అయితే ఆ దోషము ఆ జన్మలోనే అయిపోవును. ఆ జన్మలో ఏమి కాకుండ ఎవడైనా తప్పించుకోగలిగితే తర్వాత కొన్ని జన్మలవరకు పాపమును అనుభవించ వలసివచ్చును. ఇదంత మీరే సృష్టించి చెప్పుచున్నారే అని అనుకోవద్దండి. కృష్ణుని శరీరమున కాళ్ళకు చారలున్న మాట నిజమే. ఆయనకు వ్యతిరేఖమైనవారు ఎవరూ మిగలకుండ నాశనమై పోయిన మాట నిజమే. ఇదంత మీకు క్రొత్తగా కనిపించినా కృష్ణుని జన్మలో జరిగిన సత్యమే.

ప్రత్యేకమైన శరీరముతో తల్లిగర్భమునుండి జీవముతో పుట్టిన వాడు కృష్ణుడు. అందువలన ఆయన భగవంతుడు. కృష్ణుడు భగవంతుడైనప్పటికీ ఆ విషయము ఎవరికీ తెలియదు. కృష్ణుడు భగవంతుడని గుర్తించుటకు ఆధారమైన దైవజ్ఞానమును, తనకు 90 సంవత్సరముల వయస్సు వచ్చు వరకు కృష్ణుడు ఎవరికీ చెప్పలేదు. కృష్ణునికి 90 సంవత్సరముల వయస్సులో భారతయుద్ధము జరిగినది. అప్పుడే ఆయన భగవద్గీతా జ్ఞానమును చెప్పాడు. అప్పుడు చెప్పిన "గీత" యొక్క ఆధారముతో కృష్ణుడు భగవంతుడని కొందరు గుర్తించుటకు వీలుకల్గినది. ఇక్కడ ఎవరికీ తెలియని మరియొక విచిత్రము గలదు. అదేమనగా! కృష్ణుడు పుట్టుకతో కాళ్ళు అల్లాడించినది, ఆయన కాళ్ళకు చారలున్నది, కృష్ణుడు పుట్టుకతోనే భగవంతుడన్నదీ ఒకే ఒక భీష్మునికి మాత్రము తెలుసు. ఆ కాలములో భీష్మున్ని అందరూ గౌరవించినా భీష్ముడు మాత్రము కృష్ణున్ని భగవంతునిగా లెక్కించి గౌరవించెడి వాడు.

భీష్ముడు కృష్ణున్ని భగవంతునిగా గుర్తించాడు, కావున భీష్ముడు తన అవసానదశలో కృష్ణున్ని అడిగి మోక్షమును పొందాడు. ఈ విధముగా ఆ కాలములోగానీ, ఈ కాలములోగానీ మనకు తెలిసినా, తెలియకపోయినా కృష్ణుడు భగవంతుడే. కృష్ణుడు భగవంతుడేగానీ దేవుడు కాడు. కృష్ణుడు భగవద్గీతను చెప్పిన తర్వాత 36 సంవత్సరములు బ్రతికాడు. తనకు 126 సంవత్సరముల వయస్సులో కృష్ణుడు మరణించాడు. పుట్టకముందు కృష్ణుడు దేవుడు, పుట్టిన తర్వాత భగవంతుడు. 126 సంవత్సరములు జీవించి మరణించిన తర్వాత తిరిగి దేవునిగా మారిపోయాడు. ఈ విధముగా కృష్ణుడు బ్రతికియున్నపుడు భగవంతుడు, చనిపోయిన తర్వాత దేవుడు. బ్రతికియున్న భగవంతున్ని దేవుడు అని అనకూడదు. అలాగే చనిపోయిన తర్వాత భగవంతుడు అనకూడదు. ఈ వివరమునంతటిని చూస్తే కృష్ణుడు భగవంతుడని, భగవంతుడైన కృష్ణుడు తిరిగి దేవునిగా మారిపోయాడని తెలియుచున్నది. అందువలన దేవునికి భగవంతునికి ఎంతో వ్యత్యాస ముందని తెలియుచున్నది. తేడా తెలియకుండ ఎవరైనా మాట్లాడితే SP ని SI అన్నట్లు, SI ని SP అని అన్నట్లుండును.



## కృష్ణుడు అందగాడా ?

కృష్ణ జన్మ తండ్రి వీర్యకణము వలన కలిగినది కాదు. ప్రతి మనిషి పుట్టుకకు అతని భౌతిక తండ్రి యొక్క వీర్యకణము అవసరము కాగా, భగవంతుని పుట్టుకకు భౌతిక తండ్రి అవసరమే లేదు. సాధారణ మనిషి పుట్టుకలో తండ్రి వీర్యకణము తల్లి రజోకణముతో చేరి రజో కణము, వీర్యకణము మార్పు చెందుచూ గర్భములో శిశుశరీరము తయారగుచున్నది.

వీర్య, రజోకణ కలయిక చేత తయారైన శరీరము భౌతిక తల్లి, తండ్రి పోలికలు కల్గియుండును. అయితే భగవంతుని శరీరము దేవుని అంశ చేత పుట్టినది కావున ఆ శరీరమునకు తండ్రి పోలికలుంటాయను నమ్మకము లేదు. కొంత మేరకు తల్లి పోలికలుండవచ్చును. కృష్ణుని విషయానికి వస్తే ఆయన భౌతిక తల్లిదండ్రులైన దేవకి, వసుదేవుల పోలికలు కృష్ణునికి ఏమాత్రము లేవు. అంతేకాక దేవకి, వసుదేవులు ఇద్దరు మంచి తెల్లని శరీర ఛాయ కల్గియుండగా, కృష్ణుడు నల్లని ఛాయతో పుట్టాడు. ఉత్తర భారతదేశములో నల్లగ పుట్టువారు చాలా అరుదుగా ఉందురు. కానీ ఉత్తరప్రదేశ్ రాష్ట్రములోనున్న మధుర పట్టణములో పుట్టిన కృష్ణుడు నల్లగా పుట్టడము ఒక వింతేనని చెప్పవచ్చును. తల్లి తండ్రులు తెల్లగా ఉండగా వారి బిడ్డ అయిన కృష్ణుడు నల్లగా పుట్టడము వింతేకదా! కృష్ణుని శరీరముగానీ, ఆ శరీరమునకు కారణమైన కర్మగానీ, దేవుని అంశచేత తయారైనవేనని చెప్పినా, అందులో కూడ ఒక రహస్యము గలదు. అదేమనగా! తల్లి అయిన దేవకీదేవి గర్భములో కృష్ణుని యొక్క శరీరము తయారగుటకు మొదలైనపుడు ఆ శరీరములో ఆ సమయమునుండే కృష్ణుడు ఉన్నాడు. అప్పటినుండే శరీరములోనున్న కృష్ణుడు తన శరీరము ఎలా ఉండాలో, ఆ శరీరముతో ఏయే కర్మలను ఆచరించాలో, వాటిని తానే స్వయముగా నిర్ణయించుకొని అలాగే శరీరమును తయారు చేసుకొన్నాడు. ఆ శరీరములోని కర్మచక్రములోని కర్మలను, గుణచక్రములోని గుణములను, కాలచక్రములోని కాలమును నిర్ణయించుకొని పెట్టాడు. ఇక్కడ ముఖ్యముగా గమనించవలసినది ఏమి అనగా! పుట్టునది దేవుని అంశయే అయినా కృష్ణుని జీవితమును గురించిగానీ, కృష్ణుని శరీరమును గురించిగానీ దేవుడు ఏమీ నిర్ణయించడు, దేవునికి కృష్ణుని జన్మ విషయములో ఏమీ సంబంధము

లేదు. భూమిమీద అధర్మములు చెలరేగినపుడు, అధర్మములు ఒక స్థాయికి పెరిగినపుడు దేవుని అంశ తనకు తానుగా తల్లిగర్భములో శిశువుగా తయారగుటకు మొదలు పెట్టును. బాగా గమనించవలసినది ఏమనగా! దేవుడు తాను భూమిమీద ఈ సమయములో, ఈ స్థలములో, ఈ గర్భములో పుట్టి ఈ విధముగా ప్రవర్తించి, ఈ విధముగా ధర్మములను నెలకొల్పాలని అనుకోడు. దేవునికి తాను భగవంతునిగా పుట్టాలను సంకల్పము కూడ లేదు. అధర్మములు తారాస్థాయికి చేరినపుడు తనకు తానుగా పుట్టుటకు సృష్ఠి లేకముందే దేవుడు నిర్ణయించాడు. కావున అధర్మములు తారాస్థాయికి చేరినపుడు దేవుని సంకల్పము లేకుండానే, దేవుని అంశ భూమిమీదకు వచ్చును. ఈ విషయము బాగా అర్థమగుటకు ఒక చిన్న ఉదాహరణను వివరిస్తాము చూడండి.

ఈ కాలములో పెద్ద షాప్‌లలోగానీ, పెద్ద హాస్పిటల్స్‌లలోగానీ సెన్సార్ డోర్‌లు అమర్చిపెట్టారు. ఆ డోర్‌లు ఎప్పుడూ మూసుకొని ఉంటాయి. మనము లోపలికి పోవాలనినా, బయటికి రావాలనినా వాటిని మనము తెరవవలసిన పనిలేకుండా వాటంతటవే తెరుచుకొంటాయి. ఆ తలుపులకు నాలుగు అడుగుల దూరములోనికి మనిషి వస్తూనే ఆటోమేటిక్‌గా తలుపులు తెరుచుకొనునట్లు వాటికి సెన్సార్ అను పరికరము అమర్చబడి ఉండును. అందువలన నాలుగు అడుగుల దూరములోనికి తలుపుల వైపు మనిషి వస్తూనే, సెన్సార్ గ్రాహితశక్తి వలన తలుపులు వాటంతటవే ఓపన్‌కాగలవు. అలాగే మనిషి నాలుగడుగులు దూరము పోగానే మూసుకోగలవు. ముందే సెన్సార్‌లో నిర్ణయించిన ప్రకారము మనిషి నాలుగడుగులలోనికి వస్తే తలుపులు వాటంతటవే తెరచుకొన్నట్లు భూమిమీద ధర్మములు క్షీణించి పోయి, అధర్మములు 90 పాళ్ళు పెరిగి

ధర్మములు కేవలము 10 పాళ్ళు మిగిలినపుడు, దైవాంశ దానంతటదే భగవంతుని రూపముతో భూమిమీదకు వస్తున్నది. నాలుగడుగుల లోపలికి మనిషి ఒక్క అడుగు పెట్టిన వెంటనే ముందే నిర్ణయించిన సెన్సార్ తనకు తానుగా తలుపులు తెరిచినట్లు, భూమిమీద అధర్మములు 89 పాళ్ళు దాటి 90 శాతములోనికి అడుగు పెట్టిన వెంటనే సృష్టి పూర్వమే నిర్ణయించిన ప్రకారము దైవాంశ తనకు తానుగా భగవంతుని అవతారమెత్తుచున్నది. భూమిమీద ధర్మముల సాంద్రత తగ్గి, అధర్మముల సాంద్రత 90 శాతమునకు వస్తూనే ఎవరి ప్రమేయము లేకుండ, చివరికి దేవుని ప్రమేయము కూడ లేకుండ భగవంతుని రాక తనకు తానుగ జరిగిపోవుచున్నది.

ఇక్కడ కొందరికి కొన్ని ప్రశ్నలడుగుటకు అవకాశము గలదు. అడిగితే ఆ ప్రశ్నలు ఇలా ఉంటాయి. కృష్ణుని రెండు కాళ్ళకు చారలున్నాయని ఇది భారతములో కూడ చెప్పని రహస్యమన్నారు. కృష్ణుడున్న ఆ కాలములో మీరు లేరు కదా! కృష్ణుని కాళ్ళ చారల రహస్యము మీరెలా చెప్పగలుగుచున్నారు? రెండవ ప్రశ్న కృష్ణుడు భగవంతుడను విషయము ఎవరికీ తెలియని రహస్యమన్నారు. కానీ ఆ రహస్యము భీష్మునికొక్కనికే తెలుసునన్నారు. కృష్ణుడు 90 సంవత్సరముల వయస్సులో గీతను చెప్పితే దానికంటే ముందు భీష్మునికి కృష్ణుడు భగవంతుడని తెలిసిన విషయము మీకెలా తెలుసు? అని అడుగవచ్చును. మూడవ ప్రశ్న భగవంతుడు తండ్రి వీర్యకణము వలన పుట్టడు దేవుని అంశచేత పుట్టునన్నారు. ఆ మాటను మీరు ఎలా చెప్పగలుగుచున్నారు? ఇక నాల్గవ ప్రశ్న ధర్మములకు ముప్పు ఏర్పడి అధర్మములు 90 శాతము పెరిగిన వెంటనే దైవాంశ భగవంతునిగా తనకు తానుగా పుట్టుచున్నాడని, అప్పుడు దేవుని సంకల్పము గానీ, దేవుని ప్రమేయముగానీ ఏమీలేదని చెప్పుచున్నారు. ఎవరికీ తెలియని

ఈ రహస్యము మీకెలా తెలుసు? అని అడుగవచ్చును. ఈ ప్రశ్నలన్నీ సమంజసమైనవే, కానీ నేను ఒక్కమాట చెప్పగలను. **నేను మీకు ఎలా తెలియనో, నాకు అవి అలా తెలుసునని** చెప్పగలను. ఈ ప్రశ్నలకు నేను జవాబులు చెప్పకూడదు, కానీ మీరు స్వయముగా జవాబులను తెలుసుకో వచ్చును, ముందు తెలియగలవు.

శ్రీకృష్ణుడు పుట్టిన తేదీ 19, జూలై నెల, క్రీ॥పూర్వము 3228 సంవత్సరము 19-07-3228 B.C దినమున వృషభలగ్నములో బహుళ అష్టమిలో కృష్ణుడు పుట్టాడు. ఆయన వయస్సు 30 సంవత్సరములు జరుగుచుండగా జరాసంధుని చేతిలో ఓడిపోయి మధురను వదలి ద్వారకకు పోయాడు. క్రీస్తు పూర్వము 3138వ సంవత్సరము కురుక్షేత్రమున భారత యుద్ధములో అనగా 90యేళ్ళ వయస్సులో "గీత" ను బోధించాడు. తర్వాత 36 సంవత్సరములు బ్రతికి క్రీస్తుపూర్వము 3102 సంవత్సరములో మరణించాడు. మొత్తము 126 సంవత్సరములు బ్రతుకగలిగాడు. భీష్ముడు కృష్ణునికంటే దాదాపు 260 సం॥ పెద్ద వయస్సుకలవాడు. భీష్ముడు దాదాపు 350 సంవత్సరముల వయస్సుపైనే చనిపోయి ఉంటాడు. కృష్ణున్ని సాక్షాత్తు దేవునిగా గుర్తించిన ఏకైక వ్యక్తి ఒక్క భీష్ముడే, కృష్ణుడు కాళ్ళతో పుట్టాడని తెలిసిన భీష్ముడు కృష్ణుని కాళ్ళవైపే ఎక్కువగా చూచెడి వాడు. కృష్ణుని కాళ్ళకు చారలను గ్రహించిన భీష్ముడు తన సంస్కార బలముచేత కృష్ణున్ని దైవాంశ అయిన భగవంతునిగా గుర్తించగలిగాడు. ఈ విషయమునే భగవద్గీత విజ్ఞాన యోగమున 19వ శ్లోకములో ఈ విధముగా శ్రీకృష్ణుడే చెప్పాడు.

శ్లో॥ బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే ।
వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥

ఈ శ్లోకము భీష్మునికిగానీ, భీష్మునిలాంటి వారికిగానీ బాగా సరిపోతుంది. ఎన్నో జన్మలు జ్ఞానిగా పుట్టిన వ్యక్తి జన్మజన్మకు జ్ఞానమును అభివృద్ధిచేసుకొని, దేవుడొక్కడేనను జ్ఞానము చేత పరమాత్మను తప్ప ఇతరులను ఆరాధించడు. వానిని మహాత్ముడని చెప్పవచ్చును. అటువంటి వాడు వేల సంవత్సరములకో, లక్షల సంవత్సరములకో బహు అరుదుగా భూమిమీదకు వచ్చు భగవంతున్ని తన జ్ఞాన సంస్కార బలముచేత గుర్తించ గలడు. వాసుదేవుడే అనగా కృష్ణుడే సర్వజీవులకు అధిపతి అయిన భగవంతుడని గుర్తించగలడు. ఆ విధముగా భూమిమీద భగవంతున్ని గుర్తించగలుగువాడు చాలా అరుదుగా ఉండును. మనిషిలాంటి భగవంతున్ని ఎవరైనా మనిషిగానే గుర్తించగలరు. కానీ మనిషిని భగవంతునిగా గుర్తించుటకు కోట్ల అనుమానముల అడ్డంకులు వచ్చును. కృష్ణుడు భగవంతుడు కాదు అని వచ్చు కోట్ల మాయ ప్రశ్నలకు కోట్ల జ్ఞాన సమాధానములు చెప్పవలసియుండును. మాయ వలన వచ్చు ప్రశ్నలకు జవాబులు చెప్పుటకు మనిషికి ఎంతో జ్ఞానముండవలెను. అటువంటి జ్ఞానము లేనపుడు భగవంతుడు మన ముందరే ఉన్నా గుర్తించలేము. అధర్మములు చెలరేగిన కాలములో కృష్ణుడు పుట్టాడు. కృష్ణుడు భగవంతుడని ఎవరికీ తెలియని రహస్యమును ఒకే ఒక భీష్ముడు ఛేదించగలిగాడు. తన జీవితములో ఎన్నోమార్లు కృష్ణుడు గొప్పవాడని కౌరవులకు కూడ చెప్పాడు. అయినా ఆయన మాటను ఎవరూ వినలేదు. భీష్ముడు కనీస జ్ఞాని అనికూడ ఎవరి చేతా గుర్తింపు పొందలేదు. అయినా వాస్తవానికి ఆ కాలములో అత్యున్నత జ్ఞాని అని మనము నేడు చెప్పగలుగుచున్నాము. భీష్ముడు ఉన్నతమైన జ్ఞాని అనుటకు ఆయన కృష్ణున్ని భగవంతునిగా గుర్తించడమే నిదర్శనము.

కృష్ణుడు మధురలో కారాగారము (జైలు)లో జన్మించాడు. జ్ఞానము నకు అజ్ఞానము నిత్యము శత్రుత్వము కల్గియున్నదనుటకు నిదర్శనముగా జ్ఞాన నిధిగా పుట్టిన కృష్ణునికి పుట్టుకతోనే అజ్ఞానులైన వారిచే ప్రాణహాని ఉండెడిది. అందువలన కృష్ణుడు శిశువుగా పుట్టిన గంటకే మధుర ప్రక్కనేనున్న "గోకుల్" అను చిన్న గ్రామములోనికి చేర్చబడి అక్కడ యశోద సంరక్షణలో మూడు సంవత్సరముల నాలుగు నెలలు ఉన్నాడు. తర్వాత ప్రక్కనే "నందగావ్"లో ఆరు సంవత్సరముల ఎనిమిది నెలలు ఉన్నాడు. అలా పది సంవత్సరములు పెరిగిన తర్వాత పదకొండవ సంవత్సరము తన జన్మస్థలమైన మధురకు కృష్ణుడు రావడము జరిగినది. తన పదకొండవ ఏట మేనమామ అయిన కంసున్ని చంపాడు. అప్పటి నుండి దాదాపు ముప్పైసంవత్సరముల వయస్సు వరకు మధురలోనే నివాసమున్నాడు. ఆ సమయములో 15 సం॥ నుండి 30 సంవత్సరముల వరకు మధురకు ప్రక్కనేనున్న బృందావనములో గోపికలతో గడిపాడు. తర్వాత జరాసంధుని చేతిలో ఓడిపోయి మధురను విడచి, గుజరాత్ రాష్ట్రములో సముద్రము ఒడ్డున ద్వారకాపట్టణమును నిర్మించుకొని చివరి వరకు అక్కడే కాలము గడిపి మరణించడము జరిగినది. తర్వాత ద్వారక సముద్రములోనికి కలిసిపోయినది. ఈ విధముగ సాగిన కృష్ణుని జీవితమును చూచి ఎవరూ ఆయనను భగవంతుడని అనలేరు.

కృష్ణుని బాల్యములో పూతన, శకటాసురుడు మొదలగు వారిచేత గండము ఏర్పడినా అవి ఆయనను ఏమీ చేయలేకపోయాయి. పదకొండు సంవత్సరములకే మేనమామను హత్యచేసిన కృష్ణుడు మధుర రాజ్యభారమును అన్న అయిన బలరామునికి అప్ప చెప్పి, తన పదిహేనవ సం॥ల నుండి దాదాపు ముప్పై సం॥లు వయస్సు వచ్చు వరకు ప్రక్కనే ఉన్న బృందావనము

లో గోపికలతో కాలము గడిపాడు. కృష్ణుడు నల్లని శరీరఛాయ కల్గి ఆరు అడుగుల ఎత్తుగలవాడు. ఎక్కడైనా కృష్ణుని చిత్రపటము కనిపిస్తే అది బృందావనములోనిదై ఉంటుంది. ఆయన చిత్రపటములన్నీ ఇటు గోపికలతోగానీ, అటు రాధతోగానీ ఉన్నవిగా ఉంటాయి. అవి కాకపోతే చిన్న వయస్సులో నందగావ్‌లో తోటి స్నేహితులతో కలిసి వెన్న, పాలు దొంగిలించిన పటములు ఉండును. నందగావ్‌లోనివి, బృందావనములోని చిత్రపటములు అనేక రకములుగా ఉండినా అవన్నియు కృష్ణుని యుక్తవయస్సులోనివే. 30 సంవత్సరముల వయస్సు వరకు ఉన్న చిత్రపటములు తప్ప తర్వాత 90 సం॥ వయస్సు వరకు ఏ ఫోటోలు లేవు. ఆయనకు తొంభై సంవత్సరముల వయస్సులో కురుక్షేత్ర యుద్ధములోని చిత్రములు రెండే ఉన్నవి. అందులో ఒకటి కృష్ణుడు అర్జునుని రథసారథిగా ఉండి గీతను బోధించునది, రెండవది యుద్ధము మధ్యలో భీష్మని మీదికి కోపముతో చక్రధారియై రథము దిగి పోవుచుండగా అర్జునుడు వారించు చున్నది. విశేషమేమంటే ఈ రెండు చిత్రపటములలో కృష్ణున్ని 90సం॥ వృద్ధ వయస్సులో ఉన్నట్లు చూపక, ముప్పై సంవత్సరముల యుక్తవయస్సులో ఉన్నట్లే చూపారు. యుద్ధరంగములో కృష్ణుని వయస్సు పెద్దదైనా చిన్న వయస్సుగా చిత్రకారులు చిత్రించడము వలన అందరికీ కృష్ణుని యుక్త వయస్సే కనిపిస్తుంది. కృష్ణుని మధ్యవయస్సుగానీ, వృద్ధ వయస్సుగానీ ఎవరికీ తెలియకుండ పోయినది.

ఎక్కువగా బృందావనములో గోపికలతోను, ఏకకాంత రాధతోను గడిపిన చిత్రపటములు కనిపించుట వలన కృష్ణుని పేరు వింటూనే ఆయన యుక్తవయస్సులో అల్లరిగా తిరిగినవాడని ప్రజలు అనుకోవడము జరుగుచున్నది. కొన్ని లక్షల సంవత్సరముల తర్వాత భూమిమీదికి

దిగివచ్చిన దేవుని అంశ అయిన భగవంతుడే కృష్ణుడని ఎవరూ అనుకోవడము లేదు. కృష్ణున్ని అలా అనుకోవడము ఈనాటి ప్రజల దౌర్భాగ్యము, అజ్ఞానము అని చెప్పవచ్చును. కృష్ణుడు మధురానగరమును విడిచిపోయిన తర్వాత తిరిగి బృందావనమునకు వచ్చిన సమాచారము లేదు. ఆయన ద్వారకకు పోయిన తర్వాత ఎనిమిది మంది భార్యలను చేసుకొన్నాడు. కృష్ణునికి అష్ట భార్యలను మాటవినినా, ఆయన విధానము తెలియని ప్రజలు కృష్ణున్ని తక్కువగా భావించుకొనుచున్నారు. కొందరైతే పదహారు వందలమంది స్త్రీలతో సహవాసము చేసినాడని కొందరను చుండగా, పదహారు వేల మంది స్త్రీలతో ఉన్నాడని అనువారు కొందరున్నారు. ఈ విధముగా భగవంతుడైన కృష్ణున్ని తక్కువ భావముతో మాట్లాడువారే భూమిమీద ఎక్కువగా ఉన్నారు. ఇంతమంది స్త్రీల మనస్సులను దోచాడు అంటే కృష్ణుడు అంత అందగాడా? అను ప్రశ్న రాగలదు. అందరికీ తెలిసినట్లు ఆయన నల్లనివాడు. ఉత్తరదేశములో పురుషులందరు తెల్లగానే ఉంటారు. నల్లగ ఉండువానిని ఎవరూ ఇష్టపడరు. అలాగే స్త్రీలు కూడ తెల్లని పురుషున్ని కోరుకుంటారు, కానీ నల్లనివానిని కోరుకోరు. పైగా కృష్ణుడు నల్లనివాడైనా అందగాడా అంటే అంత అందగాడు కూడా కాదు. కొనతేలిన ముక్కుగలవాడా అంటే అట్లు కూడా లేకుండ మొద్దు ముక్కు కలవాడు. వాస్తవానికి పెద్ద అందగాడేమీ కాదు. కృష్ణునికి తెల్లని శరీర ఛాయ లేకపోయినా, నల్లనివాడైనా, మొద్దు ముక్కున్నవాడైనా, చెప్పుకొను అందము లేకపోయినా ఆయనను ఒకమారు చూస్తే రెండవమారు చూడాలనునట్లు ముఖములో ఆకర్షణ కళ ఉండెడిదని చెప్పవచ్చును. ఆయన కళే ఆయనకు ప్రత్యేకమైన అందమును చేకూర్చినది. ముఖములో కళలేని మనుషులకంటే కృష్ణుడు అందమైన వర్చస్సు కలవాడని చెప్పవచ్చును.

# బృందావనము - శృంగారవనమా?

కృష్ణుని జీవితములో 15 నుండి 30 సంవత్సరముల వయస్సు వరకు బృందావన జీవితము ఒక అందమైన అనుభూతియే కాక, చందమైన అవగాహన కూడ అని చెప్పవచ్చును. ఆనాడు బృందావనములో కృష్ణుని సన్నిధియందు అందము చందము రెండూ ఉండెడివి. మాయ గుణములతో కూడుకొన్న మనుషులకు బృందావనములో గోపికల అందము, కృష్ణుని శృంగారము కనిపించింది. అంతతప్ప ఇటు గోపికలుగానీ, అటు కృష్ణుడు గానీ ప్రజలకు అర్థము కాలేదనియే చెప్పవచ్చును. నేడు ప్రజలలోనున్న అజ్ఞానము తొలగిపోయి కృష్ణుడు భగవంతుడుగా తెలియాలనినా లేక గొప్ప వాడని తెలియాలనినా కృష్ణుని బృందావన జీవితము యొక్క విశేషమేమి అని విశ్లేషించి చూడవలసిందే. ఆ విశ్లేషణలో కృష్ణుని వద్దకు వచ్చిన గోపికలెంత మంది? వచ్చినవారు ఆయనకంటే వయస్సులో చిన్నవారేనా? రాధాదేవి కృష్ణునికంటే చిన్నదా, పెద్దదా? రాధయొక్క ప్రణయమేమిటి? కృష్ణునివద్దకు వచ్చిన స్త్రీలంతా గొల్లవారేనా? బృందావనములో కృష్ణుని వద్ద మనుషులుగానీ, జంతువులుగానీ, పక్షులుగానీ అన్ని స్త్రీజాతివే ఎందుకున్నాయి? కృష్ణుడు శృంగార ప్రియుడా? ఇన్ని ప్రశ్నలకు సరియైన సమాధానము దొరికినపుడు కృష్ణుని బృందావన జీవితము మనకు అర్థము కాగలదు. కృష్ణునికి అష్ట భార్యలుండినా ఆయన ప్రక్కలో ఏ భార్య కనిపించక కేవలము రాధమాత్రమే కనిపిస్తూవుంది. ఎక్కడైనా రాధాకృష్ణుడు అను పేరుగలదు, కానీ సత్యభామ కృష్ణ అనిగానీ, రుక్మిణి కృష్ణ అనిగానీ ఎవరూ పిలువరు. కృష్ణుని ఏ చిత్రపటములోగానీ కృష్ణుని భార్యలలో ఒక్కరు కూడ కనిపించరు. ఎన్ని చిత్రములలోనైనా రాధాకృష్ణులే ఉందురు. రాధ, కృష్ణుని జీవితములో మరపురాని ఘట్టమైనదని చెప్పవచ్చును.

బృందావనములో రాధకు కృష్ణునితో పరిచయము ఏర్పడినది. అప్పటికి కృష్ణుని వయస్సు 15 సంవత్సరముల 9 నెలల 7 దినములు కాగా, రాధ వయస్సు 14 సం॥ల 2 నెలల 15 దినములు. దీనినిబట్టి రాధాదేవి కృష్ణునికంటే 1సం॥ 6 నెలల 22 రోజులు చిన్నదని చెప్పవచ్చును. బృందావనములో మొదట రాధతో పరిచయమేర్పడిన తర్వాత కాలము గడచుకొలది, ఒక్కొక్కరు కృష్ణునివద్దకు ఆయనతో బృందావనములో కొంతసేపు కాలము గడిపి పోయెడివారు. కృష్ణుడు ప్రతి దినముగానీ, దినము మార్చి దినముగానీ, ఒక్కొక్కప్పుడు మూడు దినములకు ఒకమారుగానీ బృందావనమునకు పోయి ఒకరోజు లేక రెండు రోజులు ఉండి తిరిగి మధురకు వచ్చెడివాడు. మధురలోవున్నంత కాలము కృష్ణుడు పెళ్ళి చేసుకోలేదు. కృష్ణుడు ద్వారకకు పోయిన తర్వాత ముందు రుక్మిణీదేవిని వివాహమాడారు. తర్వాత మిగత ఏడుమందిని భార్యలుగా చేసుకొన్నాడు. ఇక్కడ ముఖ్యముగ గమనించవలసినది ఏమనగా! ఆయనకు దగ్గరగా కాలము గడిపిన వారిలో రాధ అందరికీ తెలుసు, అలాగే ఎనిమిది మంది భార్యలు అందరికీ తెలిసినవారే. ఇకపోతే గోపికలు ఎంతమంది అన్నది తెలియని సంఖ్య. కానీ కొందరు 16 వందల మంది గోపికలతో కృష్ణుడు బృందావనములో తిరిగాడనగా, కొందరేమో 16 వేల మంది గోపికలతో తిరిగాడని అంటున్నారు. చరిత్రకారులు వ్రాసినది తప్పా? ఒప్పా? అని చూడవలసిన అవసరమున్నది. అలా చూస్తే 16 వందలమంది అనుమాట గానీ, 16 వేలమంది అనుటగానీ పూర్తిగా అవాస్తవమని తెలియుచున్నది.

బృందావనములో మొదట రాధ భగవంతుడైన కృష్ణునివద్దకు రాగా తర్వాత ఒకరి తర్వాత ఒకరు గోపికలు రావడము జరిగినది. అలా వస్తూ 15 సంవత్సరముల బృందావన కాలములో మొత్తము 99 మంది

గోపికలు వచ్చారు. మొదట ఒక రాధ తర్వాత 99 గోపికలు మొత్తము 100మంది బృందావన జీవితములో కృష్ణునితో కాలము గడిపారు. అలా వచ్చిన వారిలో కృష్ణునికంటే పెద్దవయస్సువారు కూడ కొందరున్నారు. మొదటి రాధకానీ తర్వాత వచ్చినవారుగానీ కృష్ణునివద్దకు శృంగారము కొరకు వచ్చారనుటకు కూడ వీలులేదు. ఎందుకనగా కృష్ణుడు నల్లనివాడు మరియు చెప్పుకోతగ్గ అందగాడూ కాడు. అందువలన శృంగారము కొరకు ఎవరూ రాలేదు. అట్లయితే దేనికి వచ్చారని అడిగితే దానికి బలమైన కారణము కలదు. అదేమనగా! భూమిమీద ధర్మములు ఒక్కమారుగా నశించిపోవు. ఎన్నో వందల, వేల సంవత్సరముల నుండి ధర్మముల స్థానములో అధర్మములు చేరుతూ వచ్చుచుండును. అట్లు జరుగుచూ వచ్చి అధర్మములు 90 శాతము పెరుగుతూనే భగవంతుడైన కృష్ణుడు భూమిమీదకు వచ్చాడు. కృష్ణుని జన్మకంటే కొన్ని వేల, లక్షల సంవత్సరముల నుండి అధర్మములు పెరుగుచున్నప్పటికీ, అధర్మములకులోను కాకుండ ధర్మములనే ఆశ్రయించి, పూర్తి శ్రద్ధతో జ్ఞానమును తెలుసుకొంటూ, దైవమును దర్శించాలని ఆయనలో కలిసిపోవాలని తహ తహలాడువారు కొందరుండవచ్చును. అలా జన్మ జన్మకు దైవము మీద ఇష్టతను పెంచుకొన్నవారై దైవసన్నిధికి చేరాలని, దైవమును దర్శించాలని ఆరాటపడువారు మొత్తము 108 మంది ఉండెడి వారు. ఆ నూట ఎనిమిది మందిలోని శ్రద్ధయొక్క మరియు విశ్వాసము యొక్క తీవ్రతను బట్టి వారిని మూడు భాగములుగ విభజించడము జరిగినది. మూడు భాగముల శ్రద్ధలో మొట్టమొదటి శ్రద్ధనుబట్టి రాధ ఒక్కతే. తర్వాత శ్రద్ధనుబట్టి 99మంది ఉన్నారు. ఆ తర్వాత శ్రద్ధనుబట్టి మూడవ గుంపుగా ఎనిమిదిమంది ఉన్నారు. ఈ నూట ఎనిమిది మంది 1+99+8 = 108. అధర్మములు

అభివృద్ధి అయ్యే కాలములోనే ధర్మములను వదలకుండ, దైవమును చేరాలని దైవ దర్శనము కావాలను గట్టి పట్టుదలతో ఉండుట వలన వారి ఉద్దేశము కొంత వరకు నెరవేరుటకు అవకాశమొచ్చినది.

ఇక్కడ కొంత వివరముగా అర్థము చేసుకోవలసిన పని ఉన్నది. అదేమనగా. భక్తిగల్గిన వారు వారి విశ్వాసము కొద్ది దైవమును చేరాలని, దైవమును దర్శించుకోవాలని అనుకోవడము సహజమే. అయితే దేవుడు కనిపించడు కదా! అలాగే దైవమువద్దకు చేరుటకు దైవము ఒకచోట ఉండునది కాదుకదా! అందువలన ఆ రెండు కోర్కెలు మంచివే అయినా నెరవేరుటకు వీలులేదు. అధర్మములు అభివృద్ధి అయ్యే కాలములోనే దేవుని మీద విశ్వాసముతో మాయవైపు పోకుండ, దైవమువైపు రావాలని గట్టి ఉద్దేశముతో కొన్ని జన్మలనుండి వచ్చుట వలన, వారి భావము ధర్మయుక్తమే అయిన దానివలన, వారి ఉద్దేశము నెరవేరుటకు దైవచట్టము సహకరించి నది. అందువలన దేవుని అంశ భగవంతునిగా భూమిమీదకు వచ్చిన కాలములోనే ఆ నూట ఎనిమిదిమందిని భగవంతుని వద్దకు చేర్చినది, భగవంతుని దర్శనము లభించునట్లు చేసినది. **(ముఖ్యగమనిక) :- ఇక్కడ దైవచట్టము అను క్రొత్త పదము ఉపయోగించబడినది. దానిని తెలియాలంటే *"దయ్యాల, భూతాల యదార్థసంఘటనలు"* అను గ్రంథమును చదువవలసి యుండును. ప్రస్తుతానికి దైవచట్టము అను మాటను ప్రకృతి లేక దైవపరిపాలన అని అర్థము చేసుకోండి.** ఎన్నో జన్మలనుండి దైవమును ఆరాధిస్తూ, అనేక జన్మల సంస్కారముకలవారిగా ఉండుట వలన, వారిలోని సంస్కార బలమును అనుసరించి మూడు గుంపులుగా వారికి వారి ఉద్దేశము నెరవేరినది. ఇక్కడ ఒక ముఖ్యమైన ప్రశ్నను కొందరు జ్ఞానులు అడుగుటకు అవకాశము గలదు. అదేమనగా! భీష్ముడు కూడ అనేక

జన్మల సంస్కారము తోనే పుట్టాడని, అందువలన ఆ జన్మలోనే దైవమునందు ఐక్యమైపోయి ముక్తి చెందాడని చెప్పారు కదా! పూర్వజన్మలనుండి భీష్మడు కూడ దైవమును చేరాలను ఉద్దేశముతోనే వచ్చాడు కదా! అటువంటపుడు ఈయనతో కలుపుకొని చెప్పితే 109 మంది సంఖ్య అగును కదా! 108 మంది ఆడవారిగా పుట్టి కృష్ణునివద్దకు చేరినపుడు, భీష్మడు మాత్రము పురుషునిగా పుట్టి కృష్ణునికి దూరముగానే ఉంటూ చివరిలో మోక్షము పొంది దైవములో చేరిపోయాడని చెప్పారు కదా! ఇక్కడ భీష్మనికి మిగత 108 మందికి తేడాగలదా! అని అడుగవచ్చును. దానికి జవాబు ఈ విధముగా కలదు.

కృష్ణుడు పుట్టిన కాలములోనే గతజన్మల సంస్కారముల వలన పుట్టినవారు మొత్తము 109 అను మాట సత్యమే, అయితే వారిలోని ఉద్దేశములో కొంత తేడా ఉండుట వలన భీష్మన్ని మాత్రము 108 మందిలో కలపకుండ విభజింపవలసివచ్చినది. ఆ విభజనలోనే భీష్మనికి పురుష శరీరమురాగా మిగత 108 మందికి స్త్రీ శరీరములు లభించినవి. భీష్మడు దేవునిలోనికి ఐక్యము కావాలని అనుకొన్నాడు. మిగత 108 మంది దేవునివద్దకు చేరాలని, దేవున్ని దర్శించుకోవాలని అనుకొన్నారు. వారి ఉద్దేశములలో తేడా ఉండుట వలన వారికి అలాగే నెరవేర్చబడినవి. **భీష్మడు మోక్షమును చేరిన వారికి జ్ఞానగుర్తుగా మిగిలాడు. మిగత 108 మంది మోక్షమును చేరవలసిన వారికి జ్ఞానగుర్తుగా మిగిలారు.** మనము కూడ ప్రయత్నము చేసి చివరకు మోక్షము చేరవలసిన వారమే, కావున ముఖ్యముగ 108 మందిని చూచి నేర్చుకోవలసిన జ్ఞానము ఎంతో ఉంది. 108 మందిలో గత జన్మలయందు 100 మంది పురుషులుగా 8 మంది స్త్రీలుగా పుట్టారు. కృష్ణుడు భూమిమీదకు వచ్చినపుడు మొత్తము 108

మంది స్త్రీలుగా పుట్టడములో ఒక విశేషమైన అర్థముగలదు. ఆ అర్థము మనకు ఎంతో ముఖ్యమైన జ్ఞానము అగును. అందువలన 108 మంది మోక్షమును చేరవలసిన వారికి జ్ఞాన గుర్తు అని అన్నాము. గత జన్మలలో జ్ఞానులైన 108 మంది స్త్రీలుగా పుట్టడము, వారు మూడు గుంపులుగా విభజింపబడడము జరిగినదని చెప్పుకొన్నాము. మొదటి గుంపులో ఒక్కరే మిగిలారు. ఆమే రాధాదేవి. రెండవ గుంపులో 99 మంది మిగిలారు, వారే బృందావనములోని గోపికలు. మూడవ గుంపులో 8 మంది ఉన్నారు, వారే కృష్ణునికి భార్యలుగా ఉన్నారు. ఇలా మూడు భాగములుగా చేయుటకు కూడ కొంత కారణమున్నది. వారిలో ఉన్న ఉద్దేశము ఒక్కటే అయినా వారిలోగల శ్రద్ధలో చిన్న తేడాను బట్టి ఆ విధముగా విభజించవలసి వచ్చినది. మొదటి శ్రేణిలోనున్న రాధ గత జన్మలలో పురుష శరీరమునే ధరించి ఉన్నప్పటికీ, దైవము మీద ఉన్నతమైన విశ్వాసము కల్గియుండినా, ఆ జీవుని మనస్సులో ఒక గాఢమైన కోర్కె ఉండెడిది. అదేమనగా! దేవుని పేరు ఎక్కడుండిన ఆయన సేవకురాలిగా నాపేరు అక్కడుండాలి అనునది ఆమె వాంఛ. దైవము మీద అమితమైన విశ్వాసము, బలమైన శ్రద్ధ ఉండుట వలన ఆమె కోర్కె దేవుని పరిపాలనలో ఆమోదయోగ్యమైనది. అయితే దేవునికి పేరుండదు, దేవుని అంశ అయిన భగవంతునికి పేరుంటుంది. కావున ఆమె కోర్కె ప్రకారము భగవంతుని పేరు ప్రక్కన ఆమె నిలబడినట్లు జరిగినది. రాధ దైవదర్శనము కావాలని కూడ కోరుకొన్నది. అలాగే దైవమువద్ద కొంతకాలమైనా ఉండాలనుకొన్నది. గత జన్మలలో రాధ పురుష శరీరములో ఉండుట వలన భౌతికమైన ఏ వాంఛలను కోరలేదు. అందువలన రాధ భగవంతుని సన్నిధానములోనికి చేరినది. కానీ రాధకు కృష్ణునితో మానసిక సంబంధము తప్ప శరీర సంబంధము ఏమి లేదు. రాధ కోర్కెలన్ని దైవపాలనకు ఆమోధయోగ్య

మగుట వలన ఆమె కోర్కెలన్నీ దైవాంశ భూమిమీదికి వచ్చినపుడు నెరవేరినవి. భగవంతుడు దైవమునకు వేరుకాడు కావున భగవంతుడు కృష్ణుని రూపములో ఉండినపుడు తన పదిహేనవ ఏటనే ఆయనవద్దకు చేరగలిగింది. ఆయనకు సేవ చేయగలి గింది. కృష్ణునికి దగ్గరగా ఉండిన భాగ్యము రాధకు దక్కినది. రాధతో పాటు కృష్ణుని వద్ద ఎందరు గోపికలున్నా వారిపేరు కృష్ణుని ప్రక్కన నిలబడలేదు. రాధాకృష్ణ అను పేరు స్థిరస్థాయిగా ఈనాటికీ నిలిచిపోయినది, భవిష్యత్తులో కూడ ఉంటుంది.

రాధాదేవి మొట్టమొదట బృందావనములో కృష్ణునివద్దకు రాగా తర్వాత గోపికలందరు ఒక్కొక్కరుగా వచ్చారు. రాధాదేవి మొదలుకొని గోపికలందరు కృష్ణునివద్దకు దాదాపు నాలుగైదు సంవత్సరముల కాలములో వచ్చారు. దీనినిబట్టి అందరూ ఒక్కమారుగా రాలేదని తెలియుచున్నది. ఏ గోపిక ఆయన వద్దకు వచ్చినా, ఏ గోపిక ఆయనను మొదటిసారిగ చూచినా, వారికి తెలియకుండానే వారి కన్నులలో నీళ్ళు వచ్చేవి. వారికి తెలియకుండానే వారిలో ఏదో బాధ ఉప్పొంగినట్లు ఏడ్చేవారు. వారిని మౌనముగా కృష్ణుడు చూచేవాడు, ఏమాత్రము నివారించేవాడు కాదు. ఆ విధముగా ఆయనవద్దకు వచ్చిన వందమందికి రాధతో సహా అందరికీ జరిగినది. ఎవరైనా బాధతో ఏడ్వవచ్చును లేక సంతోషముతో అయినా ఏడ్వవచ్చును. కానీ ఆనాటి గోపికలకు సంతోషముగానీ, దుఃఖముగానీ లేకుండానే ఏడ్చేసేవారు. అలా ఏడ్వడములోని అనుభూతి సుఖదుఃఖములకు అతీతమైనదిగా ఉండెడిది. అలా మొదటి దర్శనములో అందరికీ జరిగినది. తర్వాత ఎప్పుడైనా కృష్ణుని జ్ఞాపకము వారి మనస్సులో వచ్చినపుడు వారి గుండెల స్థానమునుండి పులకింత మొదలై శరీరమంతా ప్రాకెడిది. కృష్ణుని దర్శనము అందరికీ అన్ని దినములు దొరికెడిదికాదు. గోపికలందరు

కలిసి బృందావనములోనికి రావడము జరిగెడిది కాదు. ఎవరి అనుకూలముకొద్ది వారు బృందావనములోనికి కృష్ణుని దర్శనము కొరకు వచ్చెడివారు. ప్రతి దినము వచ్చినవారున్నారు, దినము మార్చి దినము వచ్చినవారున్నారు. అలాగే మూడురోజులకొకమారు, నాలుగు రోజులకొక మారు వచ్చిన వారున్నారు. ఒక్కొక్కప్పుడు ఎంత అనుకూలము లేకుండాపోయినా ఏదో ఒక విధముగా వీలు కల్పించుకొని కనీసము పదిరోజులకొకమారైన వచ్చిన వారున్నారు. అలా వచ్చినప్పటికి వారికి కృష్ణుడు కనిపించవచ్చును లేక కనిపించకపోవచ్చును. ఎందుకనగా! కృష్ణుడు ప్రతి దినము బృందావనమునకు వచ్చెడివాడు కాదు. రెండు మూడు రోజులలో బృందావనమునకు వచ్చినా విశాలమైన బృందావనములో కృష్ణుడు ఎక్కడుండెడి వాడో కొందరికి తెలియదు. కొన్ని దినములకు ఒక్కొక్కరికి మాత్రమే ఆయన దర్శనము దొరికెడిది. కొన్ని దినములలో ఐదారుమంది గోపికలతో కలిసి ఉండెడివాడు. కొన్ని దినములలో రాధతోమాత్రము కలిసి ఉండగా, కొన్ని దినములలో రాధకు కూడ కనిపించెడివాడు కాడు. బృందావనములో కృష్ణుడు ఎక్కడున్నాడోనని కొందరు గోపికలు కలిసి వెదికేవారు. కృష్ణుడు ఎక్కడో ఒక చోట కూర్చొని మురళిని మ్రోగించుచుండగా ఆ శబ్దమును బట్టి ఆయనను కనుగొనేవారు. కొందరు గోపికలైతే కృష్ణున్ని బృందావనమునకు ఎప్పుడు వస్తావని, వస్తే ఎక్కడుంటావని అడిగెడివారు. కృష్ణుడు పలానాప్పుడు వస్తానని, ఫలానా చోటే ఉంటానని చెప్పెడివాడు. కానీ కృష్ణుడు అలా వచ్చెడివాడు కాడు, ఒకవేళ వచ్చినా చెప్పిన చోట ఉండేవాడు కాడు. ఈ విధంగా వారిని ఆట ఆడించేవాడు. అలా ఆయన కనిపించక పోవడముతో వారు విసిగిపోయే వారు. ఆయన దొరికితే గట్టిగా అడగాలనుకొనెడివారు. ఆయన

దొరికినపుడు, ఆయన దర్శనమైనపుడు తమను తాము మరచి పోయెడివారు. కొందరు కృష్ణునితో ఫలానా సమయములో ఫలానా చోట నేను ఇక్కడే ఉంటానని ప్రమాణము చేయించుకొనెడివారు. అయినా కృష్ణుని మాటలు అబద్ధాలే, కృష్ణుని ప్రమాణములు అబద్ధాలే. వారికి చెప్పినట్లు ఏ దినము దొరికెడివాడు కాదు. ఒక్కొక్క మారు కృష్ణుని మీద కోపము వచ్చి ఏడ్చిన గోపికలు ఎందరో ఉన్నారు. అలా వారిని అదే పనిగా ఏడ్పించెడివాడు. కృష్ణుడు అలా చేసేకొద్దీ ఆయన దర్శనము కొరకు గోపికలు ఎక్కువ ఆరాటపడెడివారు.

ఈనాడు చాలామంది కృష్ణుడు శృంగారపురుషుడని అనుకోవడము జరుగుచున్నది. ఎందరో ఆయనను ఎన్నో రకముల తక్కువగా అనుకోవడము జరుగుచున్నది. కానీ వాస్తవానికి కృష్ణునికి రాధతోగానీ, 99 మంది గోపిక లతో గానీ శరీర సంబంధము ఏమాత్రము లేదు. ఆనాటి గోపికలలో వివాహమైనవారు కూడ కొందరున్నారు. వారందరు కృష్ణుని సన్నిధానములో పొందిన సుఖము వర్ణనాతీతమైనది. దానిముందర శరీర సంబంధ సుఖము చాలా చిన్నది. పెళ్ళైన గోపికలు తమ భర్తలవద్ద పొందిన శరీర సుఖముకంటే ఎన్నో వేలరెట్లు అధిక మానసిక సుఖమును కృష్ణునివద్ద పొందారు. కృష్ణుని వద్ద పొందిన మానసిక సుఖమును, శరీర సుఖముతో పోల్చి చూచితే భగవంతునివద్ద అనుభవించిన ఆనందము పర్వతముతో సమానమైతే, తమ భర్తలవద్ద అనుభవించిన శరీరసుఖము చిన్న రాయిలాంటిది. కృష్ణుడు గోపికను తాకితే అతని చేతి స్పర్శతో శరీరములో హృదయమునందు ఒక విధమైన అలలాంటి పులకింత మొదలై శరీమంతా వ్యాపించెడిది. ఆ హృదయ స్పందన వారు ఆ జన్మలోగానీ, ఏ జన్మలోగానీ అనుభవించి ఉండలేదు. అంత పెద్ద ఆనందము ఆయనను వీరు తాకినా,

ఆయన వారిని తాకినా పొందెడివారు. గతజన్మలలో వారు దేవున్ని ఆరాధించిన ఆరాధన ఫలితము దేవుని అంశ అయిన భగవంతునివద్ద నెరవేరినది. అదియు కొలత కొలిచినట్లు ఎవరికి ఎంత లభించాలో అంతే లభించింది. వారి ఆరాధన ఫలితముగానే కొంతమందికి ఎక్కువమార్లు, కొంతమందికి తక్కువమార్లు ఆయన దర్శనము దొరికినది. వందమందిలో అందరికంటే ఎక్కువ దర్శనము, ఆనందము పొందినది ఒక్క రాధాదేవి మాత్రమే. అంతేకాక ఆమె భాగ్యముకంటే భక్తి భావము మించినదై, స్థిరస్థాయిగా కృష్ణుని పేరు ముందు రాధపేరు నిలిచి పోయినది. రాధాకృష్ణ అను పేరు భక్తులందరి దగ్గర నిలిచిపోయినది. నేడు బృందావనములో రాధాకృష్ణ అను వాక్యము అందరినోట నిత్యము భజింపబడుచున్నది. బృందావనము గోడలమీద వారిపేరు ఎక్కడ చూచిన వ్రాయబడి ఉన్నది. కృష్ణుని చిత్రపటము ఎక్కడున్నా అందులో రాధ ఆకారము చోటు చేసుకొన్నది. రాధాదేవి భాగ్యము సౌభాగ్యము కాదు. ఆమె భాగ్యము భక్తిభాగ్యము అని తలచవలెను. శరీరభర్త దగ్గర పొందునది సౌభాగ్యము. సౌభాగ్యము అనగా! భర్తనుండి పొందు శరీరసుఖము, భక్తి భాగ్యము అనగా! శరీరములన్నిటికి అధిపతియైన భగవంతునివద్ద పొందు మానసిక సుఖము అని అర్థము చేసుకోవాలి. సజీవ శరీరములన్నిటికీ అనగా జగతికి అంతటికీ అధిపతియైన భగవంతుడు భూమిమీదకు వచ్చునది అరుదుగా జరుగును. ఆ సమయము భగవంతుని సన్నిధానమునకు భక్తితో చేరిన వారి భాగ్యము గొప్పదే కదా!

వారి భాగ్యము సౌభాగ్యము కాదు, వారి భాగ్యము భక్తి భాగ్యము. కావున వారిని ఆ దినములలో గోపికలు అన్నాము. బృందావనములో కృష్ణుని వద్దకు చేరినవారు అన్ని కులములకు చెందిన వారున్నారు. కానీ

ఈనాడు కొందరు గోపికలనందరిని గొల్లవారిగా అనుకోవడము జరుగు చున్నది. వారు అనుకొన్నట్లు గోపికలందరు గొల్లవారు కాదు. ఇపుడు మనము అనుకొను గొల్లకులము వాస్తవానికి దేశమంతా 'యాదవ కులము' అను పేరుతో ఉన్నది. ఇపుడు గొల్ల, యాదవ అను పేర్లు విడిచి కులమునకు సంబంధములేనిది 'గోపిక' అను పదము అని తెలియవలెను. ఏ కులములో నైనా గోపికలుండవచ్చును. ఇంతకుముందు గోవింద అను పదమును పలుకు విధానమును గురించి, గోవింద అను పదములోని అర్థమును గురించి చెప్పుకొన్నాము. గోవిందలోని సారాంశము చివరిదైన దైవము అని తెలుసు కొన్నాము. ఆ దైవమును కోరువారు స్త్రీ అయితే గోపిక అను శబ్దముతోనే పిలువబడుదురు. పురుషుడైతే గోపి అని పిలువబడుదురు. గోపికకానీ, గోపికానీ ఇరువురు ఒకటే ఉద్దేశముకలవారై ఉందురు. కృష్ణుడు భగవంతునిగా ఉన్నపుడు స్త్రీలైన గోపికలేకాక, పురుషులైన గోపీలు కూడ ఎందరో ఉన్నట్లు చెప్పవచ్చును. ఆ లెక్క ప్రకారము ఆనాటి విదురున్ని గోపి అని చెప్పవచ్చును. భగవంతుడు భూమిమీద లేనపుడుగానీ దైవము మీద ఇష్టమును పెంచుకొన్న వారందరు గోపి, గోపికలేనని చెప్పవచ్చును. కృష్ణుని కాలములో సాక్షాత్తు భగవంతునిరూపములో దైవదర్శనమును పొందిన గోపికలు నేటి గోపికలకంటే ఎంతో అదృష్టవంతులు, ఎంతో గొప్పవారు. మనకు భగవంతుని దర్శనము దొరకాలంటే భూమిమీదకు దేవుని అంశ భగవంతునిగా వచ్చువరకు ఆ కోర్కె నెరవేరదు.

దేవున్ని చేరాలను ఉద్దేశముతో దైవమును కోరు గోపి, గోపికలు ఉన్నపుడు ద్వాపరయుగమున కృష్ణునివద్ద ఒక్క పురుషగోపి కూడ కనిపించ కుండ, అందరూ ఆడ గోపికలే ఎందుకు కనిపించారని కొందరు అడుగ వచ్చును. గోవిందుడైన కృష్ణుడు పురుషునిగా ఉండి స్త్రీలైన గోపికలనే

తనవద్ద కనిపించునట్లు చేయడము కూడ పెద్ద జ్ఞానసందేశమేనని అర్థమగు చున్నది.

దీనికంటే ముందు కృష్ణునికి ఎనిమిది మంది భార్యలెందుకు ఉన్నారో తెలుసుకొందాము. బృందావనములో కృష్ణునికి రాధాదేవితో సహా మొత్తము 100 మంది గోపికలున్నారు. ఈ నూరు మంది పూర్వజన్మలలో పురుషులుగా ఉన్నవారని చెప్పుకొన్నాము. దేవుని సన్నిధానములోనికి చేరాలను వారి కోర్కె దేవుని అంశ అయిన భగవంతునివద్ద నెరవేరినది. గతజన్మలలో పురుషులైన వందమంది భగవంతునివద్దకు స్త్రీలగానే వచ్చారు. ఈ విషయమిట్లుండగా గతజన్మలలో స్త్రీలుగా పుట్టిన ఎనిమిది మంది దేవుడే తమ భర్తగా ఉండాలని కోరుకొన్నారు. వారికున్న భక్తితో వారు కోరుకొన్న కోర్కె నెరవేరాలంటే అది భగవంతునివద్ద మాత్రమే నెరవేరాలి. భగవంతునికి భార్యలైతే దేవునికి భార్యలైనట్లే, అట్లు తప్ప వేరు విధానము లేదు. కృష్ణునికి ముందు రాధాదేవి పరిచయము కాగా తర్వాత ఒక్కొక్కరు గోపికలు పరిచయమయ్యారు. మొత్తము నూరుమంది బృందావనములో కలిసిన తర్వాత, కృష్ణుడు బృందావనము వదలి ద్వారక చేరిన తర్వాత, ఆయనకు భార్యలుగా ఎనిమిది మంది వచ్చారు. మొదట కృష్ణునివద్దకు భక్తులుగా రావాలనువారి కోరిక నెరవేరినది, తర్వాత భార్యలుగా రావాలను వారి కోర్కె నెరవేరినది. ఎనిమిదిమంది భార్యలలోను ఎక్కువ భక్తి భావమున్న రుక్మిణీదేవి మిగతా వారికంటే ముందు భార్యగా రావడము జరిగినది. ఈ విధముగా కృష్ణునివద్దకు వచ్చిన వారిసంఖ్య మొత్తము 108కి చేరినది. సృష్టిలో దేవుని పరిపాలన జరుగు కాలము 108 కోట్ల సంవత్సరములు. కనిపించని దేవుని పాలన 108 కోట్ల సంవత్సరములకు గుర్తుగా, కనిపించే భగవంతుడు 108 మంది స్త్రీలతో కాలము గడిపాడని తెలియుచున్నది.

108 కోట్ల సంవత్సరములు కనిపించే ప్రకృతి ఉంటుంది. కనిపించని దేవుడు ఆ ప్రకృతికంతటికి అధిపతి అని సూక్ష్మజ్ఞానము తెలియుటకు, 108 కోట్ల సంవత్సరముల ప్రకృతిని 108 స్త్రీలుగా చేసి, వారందరికి పతి, అధిపతి పురుషున్ని నేనేనని స్థూలజ్ఞానము తెలియునట్లు, దేవుడు కనిపించే భగవంతుడుగా కృష్ణుని పేరుతో వచ్చాడని తెలియుచున్నది. దీనినిబట్టి కనిపించని దేవుడు 108 కోట్ల సంవత్సరముల ఆయుస్సుగా గల ప్రకృతిని పాలించగా! అదే పద్ధతిని బయటికి తెలియునట్లు 108 కోట్ల సంవత్సరముల ప్రకృతిని 108 మంది ప్రకృతి స్వరూపమైన స్త్రీలుగా కనిపించునట్లు చేసి, కనిపించని పురుషోత్తముడు పురుషత్త్వముగల కనిపించే భగవంతునిగా వచ్చాడని తెలియుచున్నది. **కనిపించని దేవుని ప్రకృతిపాలన కనిపించే భగవంతుని స్త్రీల ఆలన తెలిసినవాడు సంపూర్ణ జ్ఞాని అగును.**

ప్రకృతి స్త్రీతత్త్వము గలదని, దైవము పురుషతత్త్వముగల పురుషోత్తముడని, భగవద్గీతలో చెప్పబడి ఉన్నది. ప్రకృతికంతటికి పెద్ద మరియు భర్త దేవుడేనని, ప్రకృతియంతా చివరకు తనలోనికే కలిసిపోతుందని కూడ చెప్పడమైనది. ప్రకృతిలో పుట్టిన జీవరాసులన్నీ చివరకు తనను ఆశ్రయించి, తనలోనికి ఐక్యము కావలసిందేనని దేవుడు తెలియజేశాడు. సృష్ఠిలోని స్త్రీతత్త్వమునకంతటికి తానే గతి మరియు పతి అని తెలియ జేయుటకు గుర్తుగా భగవంతునిగా వచ్చినపుడు తనచుట్టు స్త్రీతత్త్వమున్నట్లు, తననే స్త్రీతత్త్వము ఆశ్రయించినట్లు, అందరికీ తానే గతి అని తెలియునట్లు, కృష్ణుని చుట్టూ కొందరు మనుషులైన స్త్రీలు, జంతుజాతిలో స్త్రీ అయిన ఆవు, పక్షి జాతిలో స్త్రీ నెమలి ఉన్నటువంటి చిత్రపటములు ఎన్నో కనిపించు చుండును. ఆనాటి బృందావనము యొక్క చిత్రపటములలోనేకాక ద్వాపర యుగములోని ఆనాడుగానీ, కలియుగములోని ఈనాడుగానీ కృష్ణుడు

పురుషుల మనస్సులకంటే, ఎక్కువ స్త్రీల మనస్సులలోనే స్థానమును సంపాదించుకొన్నాడు. ఇప్పుడు కృష్ణుడు లేకున్నా పురుషులలో లేని భక్తి భావము స్త్రీలలో ఎక్కువగా ఉన్నదని చెప్పవచ్చును. స్త్రీలలోనే ఎక్కువ భక్తి భావమున్నదని మీరు ఏ ఆధారముతో చెప్పుచున్నారని కొందరడుగవచ్చును. దానికి జవాబు ఏమనగా! ప్రకృతి, పరమాత్మ జ్ఞానము తెలిసినవారెవరైనా ఈ ప్రశ్నకు సులభముగా జవాబును చెప్పవచ్చును. నేను పురుషున్ని అను భావము మగవారిలో ఉన్నది. నేను స్త్రీనను భావము ఆడవారిలో ఉన్నది. నేను స్త్రీనను భావము ఒక్కటే పురుషులలోకెల్ల ఉత్తమ పురుషుడైన పురుషోత్తమునివైపు మనస్సును మళ్ళించుచున్నది. అందువలన పురుషుల కంటే స్త్రీలలోనే దైవభక్తి ఎక్కువగా ఉండును. అటువంటి దైవభక్తికలవారిలో కృష్ణుని మీద భక్తికలవారు ఎక్కువగా ఉందురు.

కృష్ణుని మీద భక్తికలవారిలో కొందరు పురుషులు కూడా ఉన్నారు. అయినప్పటికీ పురుషులకంటే స్త్రీల సంఖ్య ఎక్కువని చెప్పుచున్నాము. నేను పురుషుడనే అయినప్పటికీ, నాకంటే ఉత్తమ పురుషుడు కృష్ణుడని తలచిన మగవారిలో కృష్ణభక్తి గలదు. నేను స్త్రీనను భావముగల ఆడవారిలోను కృష్ణభక్తి కలదు. వాస్తవానికి ఈ కాలములో భూమిమీద కృష్ణభక్తి ఇతర దేవతల మీద భక్తికంటే చాలా తక్కువగా ఉన్నదని చెప్పవచ్చును. దానికి కారణము కృష్ణుని యొక్క గొప్పతనము తెలియకపోవడము, కృష్ణుని బృందావన జీవితమును తప్పుగా అర్థము చేసుకోవడము, మూడవది దైవ జ్ఞానము తెలియకపోవడము. దైవజ్ఞానము ప్రకారము సకల జీవరాసులకు, మానవులకు తల్లి ప్రకృతి, తండ్రి పరమాత్మ. ప్రకృతి పరమాత్మలకు పుట్టినవాడు మనిషి. ఒక మనిషి పుట్టుకతో వానియందు తల్లితండ్రుల లక్షణములు ఇమిడి ఉండును. అనగా స్త్రీ (తల్లి), పురుష (తండ్రి) రెండు

లక్షణములు కల్గియుండుట వలన అటువంటి వానిని నపుంసకుడు అంటారు. నపుంసకుడు అనగా మగతనము లేక పురుషత్వము లేనివాడని అర్థము. పురుషత్వము లేనివాడు స్త్రీక్రిందికే లెక్కించబడును. శరీరము మగదిగానీ, ఆడదిగానీ వానిలోని జీవుడు స్త్రీగానే లెక్కించబడుచున్నాడు. ఈ విధానము భూమిమీద తెలియుటకే పరమాత్మకు గుర్తుగా పురుష శరీరమును, ప్రకృతికి గుర్తుగా స్త్రీ శరీరమును, జీవునికి గుర్తుగా నపుంసక శరీరమును దేవుడు సృష్ఠించాడు. దీని భావము తెలియగలిగితే పుట్టిన శరీరము ఏదైనా, ఆడైనా, మగైనా అందులోని జీవుడు పురుషుడుకాదని నపుంసకుడని తెలియును. లెక్కప్రకారము నేను పురుష శరీరములో పుట్టిన జీవున్ని, కావున నేను కూడ స్త్రీలింగము గలవాడిననే చెప్పుచున్నాను. నీవు నమ్ము నమ్మకపో సృష్ఠి అంతటికి దేవుడు ఒక్కడే పురుషుడు, అందువలన దైవాంశ అయిన కృష్ణున్ని ఒక్కన్నే పురుషునిగా చిత్రించి, ఆయన ప్రక్కనున్న వారందరిని పక్షి, పశువు, మనిషిని స్త్రీలుగానే చూపారు. కృష్ణుని చుట్టూ స్త్రీలు చేరియున్న చిత్రమును చూచి అందులోని దైవజ్ఞానమును తెలుసుకోలేక భగవంతున్ని అపార్థము చేసుకొని, అల్లరివాడు చిల్లరివాడు అనడము ఎంత అజ్ఞానమో ఇప్పటికైనా అర్థమైందా!

ద్వాపరయుగములోని కృష్ణున్ని ఆనాటి ఎందరో అజ్ఞానులు హేళన చేసి అవమానించిన సంఘటనలు కూడ కలవు. ఆ విషయమునే భగవద్గీతలో రాజవిద్యా రాజగుహ్యయోగమందు 11వ శ్లోకమున ఈ విధముగా అన్నాడు.

శ్లో॥ అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ।
పరం భావ మజానన్తో మమ భూత మహేశ్వరమ్ ॥

**భావము :** నేను సర్వ జీవరాసులకు అధిపతినని, నేను పుట్టేవాడిని మరణించే వాడిని కాదని, నాయొక్క పరంభావమును తెలియని మూఢులు, మానవ శరీరము ధరించి మనిషివలె కనిపించు నన్ను అవమానించుచున్నారు.

ద్వాపరయుగములో దేవుని భాగమైన భగవంతున్నే ఒక మనిషిగా లెక్కించి అవమానము చేసినవారున్నారు. ఏ యుగములోనైనా అజ్ఞానులు అజ్ఞానులే. వారికి పాపపుణ్య తారతమ్యములు తెలియవు. అవి ఎలా వస్తాయని కూడ తెలియదు. కనిపించనివి లేనేలేవు అంటారు. అలాంటి అజ్ఞానులు ఈ యుగములో కూడ చాలామంది ఉన్నారు. ఉండడమేకాక వారి సాంద్రత పెరుగుచు, జ్ఞానుల సాంద్రత తగ్గుచూ పోవుచున్నది. ఈ కలియుగములో కొంతమంది జ్ఞానులుగా పేరుపొందిన వ్యక్తులు కూడ వారికి తెలియకుండ అజ్ఞానములోనే ఉంటున్నారు. కృష్ణుని విషయములో తక్కువ భావముతోనే ఉన్నారు. మేము పురుషులముకాదని, భగవంతుడే పురుషుడని ఏనాటికైనా భగవంతున్నే ఆశ్రయించవలసిన అవసరమున్నదని తెలియకున్నారు. బృందావనములోని కృష్ణున్ని తప్పుడు అంచనా వేసుకొన్నారు. దాదాపు ఐదువందల సంవత్సరముల క్రితమే రాజస్థాన్‌లోని నాగూర్ జిల్లాలో క్రీ॥శ॥1498 లో పుట్టిన మీరాబాయి కృష్ణుని మీద భక్తితో ఆయన తిరిగిన బృందావనమునకు పోవాలను ఉద్దేశముతో పోయింది. బృందావనములో కృష్ణసమాజ్ అను ఆశ్రమమును సందర్శించి అక్కడి స్వామీజీని దర్శించుకోవాలని అక్కడున్న శిష్యులను వారి గురువుగారి దర్శనార్థము అడిగింది. అప్పుడు అక్కడి శిష్యులు "మా గురువుగారు స్త్రీలకు దర్శనమివ్వరు. మా గురువుగారు పురుషుడైన దానివలన పురుషులకే ఆయన దర్శనము స్త్రీలకు లేదు" అని చెప్పారు. ఆ మాట వింటూనే మీరాబాయి ఫక్కున నవ్వింది. ఆమె తన నవ్వును ఆపుకోలేక పోయింది.

ఆమె అలా నవ్వడము చూచి అక్కడి శిష్యులు ఆశ్చర్యపోయారు. ఎందుకు నవ్వావు? అని అడిగారు. దానికి ఆమె **"ఈ సృష్టి అంతటికి కృష్ణుడు ఒక్కడే పురుషుడని అనుకొనివుంటిని. ఇపుడు మీ గురువుగారు కూడ పురుషుడని మీరంటే ఆశ్చర్యమేసి నవ్వుచున్నాను"** అన్నది. మీరాబాయి అన్న ఆ మాటలను లోపలనున్న గురువుగారు విన్నారు. వెంటనే తానే బయటికి వచ్చి మీరాబాయికి నమస్కరించి "మీ వలన నాలోనున్న అజ్ఞానము పోయింది. నేను పురుషుడనను నా భావము తొలగిపోయింది. నేను శరీరమునుబట్టి బయటి దృష్టితో పురుషుడనని భ్రమించివుంటిని. ఇపుడు మీవలన నేను పురుషుడనుకాదని, నేను కూడ పురుషున్ని ఆశ్రయించ వలసిందేనని తెలుసుకొన్నాను" అన్నాడు. అపుడు బృందావనములో వారి ఆశ్రమమునందే ఆమెకు ఆశ్రయము కల్పించారు. మీరాబాయి చిన్న వయస్సులోనే భర్త వదలివేయడముతో బృందావనము చేరినది. 49 సంవత్సరములు జీవించి ద్వారకలో చనిపోయింది. ఆనాడు బృందా వనములో కృష్ణసమాజమును ఏర్పాటు చేసుకొన్న 70 సంవత్సరముల స్వామీజీకే 20 సంవత్సరముల వయస్సులోనున్న మీరాబాయి మనమంతా స్త్రీలమేనను జ్ఞానమును కల్గించినది. శ్రీకృష్ణుని గురించి, ఆయన బృందావన జీవితమును గురించి 13వేల భక్తిపాటలను కూర్చి భజనగా పాడినది. మీరాబాయి మనస్సులో కృష్ణుడు తప్ప అందరూ స్త్రీలేనను భావముండెడిది. ఈ మాటవినేదానికి విడ్డూరముగా ఉన్ననూ నూటికి నూరుపాళ్ళు సత్యము.

కృష్ణుడు సాధారణ మనిషికాదు భగవంతుడని తెలుసుకొన్నాము. కృష్ణుడు భగవద్గీతను చెప్పకముందు 90 సంవత్సరముల కాలము సాధారణముగా జీవిస్తూ ఎవరికీ దైవజ్ఞానమును గురించి చెప్పలేదు. అందువలన ఆయన భగవంతుడని గుర్తించుటకు జ్ఞానులకు కూడ

వీలుపడలేదు. కానీ ఆయన జ్ఞానమును చెప్పకున్ననూ ఆయన జీవితము ఎంతో జ్ఞానమయమై ఉన్నది. ఆయన అష్టమి రోజు పుట్టడమే ఒక పెద్ద జ్ఞానసందేశము. అలాగే 30 సంవత్సరముల వరకు గడపిన బృందావన జీవితము కూడ మనము చెప్పుకొన్నట్లు గొప్ప జ్ఞానసందేశమే. అట్లే ఆయన 30 సంవత్సరముల వయస్సు తర్వాత ద్వారకా నగరమునకు పోయి ఎనిమిది మందిని వివాహమాడాడు. గోపికలున్నంత కాలము పెళ్ళి చేసుకోలేదు. పెళ్ళి చేసుకొన్న తర్వాత బృందావనము వద్దకుగానీ, గోపికలవద్దకుగానీ రాలేదు. బృందావనమున్నంత వరకు ద్వారకలేదు, ద్వారకున్నంత వరకు బృందావనములేదు. ఆయన ధరించిన నెమలిపింఛము గానీ, మ్రోగించిన మురళిగానీ ఎంతో జ్ఞాన విషయములను తెలుపినవే. గీతను చెప్పిన తర్వాత అందులోని జ్ఞానమును బట్టి కృష్ణుడు ఫలానా జ్ఞానముగలవాడనీ, భగవంతుడనీ గుర్తించుటకు వీలున్నది. కానీ ఆయన జ్ఞానమును చెప్పకనే ఆయన పనులనుబట్టిగానీ, ప్రవర్తననుబట్టిగానీ అందులోని జ్ఞానమును ఎవరూ తెలుసుకొన్నట్లు లేదు. ఆయన ఎందుకు ఎవరూ పెట్టని నెమలి పింఛమును తలమీద పెట్టుకొన్నాడని గానీ, అంతమంది గోపికలతో ఎందుకున్నాడనిగానీ, అంతవరకు ఎవరూ పెట్టుకోని "కృష్ణ" అను పేరును ఎందుకు పెట్టుకొన్నాడనిగానీ ఎవరూ యోచించలేదు. జీవితములో కృష్ణున్ని జారునిగా, చోరునిగా చూచిన మనుషులు, వ్యభిచారి, దొంగ అయినవాడు గీతను ఎలా బోధించగలిగాడు అని కొద్దిమాత్రము కూడ యోచించలేదు. ఈ విధముగా చూస్తే కృష్ణుడు గీతను చెప్పిన తర్వాత బ్రతికిన 36 సంవత్సరముల జీవితముగానీ, గీతను చెప్పకముందు బ్రతికిన 90 సంవత్సరముల జీవితముగానీ, అంతా దైవజ్ఞానముతో కూడుకొన్నదేనని అర్థమగుచున్నది.

# శ్రీకృష్ణ జన్మాష్టమి

శ్రీకృష్ణుడు పుట్టినది క్రీస్తు పూర్వము 3228 సం॥ జూలై నెల 19వ తేదిన బహుళ అష్టమి దినమున వృషభలగ్నములో పుట్టాడు. దీనినిబట్టి ఇప్పటికి 5238 సంవత్సరముల పూర్వము కృష్ణుడు భూమిమీద పుట్టాడని తెలియుచున్నది. అర్థము చేసుకొంటే ఆయన జీవితమే గొప్ప జ్ఞాన సందేశమని చెప్పుకొన్నాము కదా! దానిప్రకారము ఆయన జన్మలో కూడ గొప్ప జ్ఞానము ఇమిడి ఉన్నదని చెప్పవచ్చును. కృష్ణుడు ఎదురు కాళ్ళతో పుట్టడమే ఒక విశేషమైతే, ఆయన పుట్టిన అష్టమి దినము కూడ విశేషతను సంపాదించుకొన్నది. కృష్ణుని జన్మాష్టమి యొక్క విశేషమేమిటని చూచిన ఈ విధముగా అర్థము కాగలదు. సర్వసాధారణముగ ఏమీ జ్ఞానము తెలియని ప్రజలు కూడ "అష్టమి కష్టము, నవమి నష్టము" అని అంటూ అష్టమి, నవమి దినములలో కొన్ని పనులను చేయరు. కొన్ని పనులు ప్రారంభించే ముందు ఈ రెండు తిథులను లేకుండ చూచుకొంటారు. నవమి నష్టము, అష్టమి కష్టము అనడములో మీ భావమేమి అని కొందరినడిగితే వారు ఇలా చెప్పుచున్నారు. "అష్టమి రోజు పని ప్రారంభించితే ఆ పని కష్టముతో కూడుకొన్నదగును. అలాగే నవమి రోజు ప్రారంభించితే ఆ పని నష్టములతో కూడుకొన్నదగును" ఇలా వారు అన్న మాటలను బట్టి చూస్తే ఇది జ్యోతిష్యశాస్త్రము ప్రకారము జరుగునది కాదు. జ్యోతిష్యశాస్త్రములో అటువంటి సూత్రము ఏది లేదు. అయినప్పటికి పూర్వకాలము ఈ మాట చాలా ప్రచారములో ఉండెడిది. దాదాపు యాభై సంవత్సరముల క్రిందటి వరకు అష్టమి, నవమి అను మాటలు అక్కడక్కడ వినిపించెడివి. ప్రస్థుత నవీన కాలములో ఆ మాట కరువై పోయినది. ఇప్పటి చదువులలో పడిన పిల్లలకు తిథులంటే కూడ ఏమిటో తెలియకుండ పోయినది. ఇప్పటికి కూడ ఎక్కడైన పల్లెప్రాంతములలో ఈ రోజు అష్టమి,

అష్టమి రోజు ప్రయాణమా అనుటగానీ, ఇంతకాలముండి ఇప్పుడు అష్టమి దినమునా ప్రారంభించేది అనిగానీ అనుట గలదు. దీనిని బట్టి అష్టమి, నవమి అను రెండు తిథులలో ఒక తిథి నవమి గాలికి పోయింది. అష్టమి మాత్రము మిగిలివుంది అని అర్థమగుచున్నది. పల్లె ప్రాంతములలో ఎక్కడో ఒకచోట ఇంతవరకు మిగిలిన అష్టమి కూడ పది సంవత్సరముల కాలమునకు లేకుండ పోతుందని తెలియుచున్నది. అష్టమి కష్టము, నవమి నష్టము అని ఉండెడిదని చెప్పు మా మాటలకు కొంత ఆధారముగా ఇప్పటికీ అష్టమి మిగిలి ఉన్నది. కాలగమనములో ఎన్నో కనుమరుగై పోయాయి. అయినప్పటికీ జ్ఞానమునకు విలువను చేకూర్చే మాటలు కనుమరుగు కాకూడదని మా అభిలాష. అందువలన అష్టమి కష్టము, నవమి నష్టము అను మాటను పెద్దలు ఎందుకు అమలులోనికి తెచ్చారు? ఎప్పటినుండి అమలులోనికి వచ్చింది? అను ప్రశ్నలకు జవాబులు వెదుకుకొందాము.

అష్టమి కష్టము, నవమి నష్టము అనుమాట శ్రీకృష్ణుడు పుట్టక ముందు లేదు. కృష్ణుడు పుట్టిన తర్వాత 90 సంవత్సరములకు భగవద్గీతను చెప్పాడు. భగవద్గీతను చెప్పిన తర్వాత కృష్ణుడు గొప్పవాడను విషయము కొందరికి అర్థమైనది. అప్పటినుండి కృష్ణుడు పుట్టిన దినమును గోకులము లోను, మధురలోను పండుగగ చేసుకోవడము జరుగుచున్నది. భగవద్గీత యుద్ధరంగములో చెప్పబడినది. భారతయుద్ధము క్రీస్తు పూర్వము 3138వ సంవత్సరము జరిగినది. దీనినిబట్టి ఇప్పటికి భగవద్గీత పుట్టి 5148 సంవత్సరములు అయినది. భగవద్గీత పుట్టిన తర్వాత కృష్ణుడు సామాణ్య మనిషి కాదని కొందరు జ్ఞానులు గ్రహించగలిగారు. అప్పటి నుండి శ్రీకృష్ణ జయంతిని చేయుటకు పూనుకొన్నారు. అలా ఏర్పడినదే శ్రీకృష్ణ జన్మాష్టమి. అప్పటినుండి శ్రావణమాస బహుళ అష్టమి రోజు శ్రీకృష్ణుని జన్మదినమును

పెద్ద పండుగగా చేసుకొనెడివారు. ఆ విధముగా దైవజ్ఞానము తెలిసినవారు ప్రారంభించిన శ్రీకృష్ణాష్టమి కొంత కాలమునకు దేశవ్యాప్తముగా అందరు చేయుట మొదలుపెట్టారు. భగవద్గీతను చెప్పిన తర్వాత కృష్ణుడు 36 సంవత్సరములకు చనిపోయాడు. కృష్ణుడు సజీవముగా ఉన్నప్పుడే కృష్ణ జయంతిని కృష్ణాష్టమిగా చేయుట జరిగినది. ద్వాపరయుగములోనే కృష్ణాష్టమి పండుగ తయారైనది.

కృష్ణుడు చనిపోయిన రెండు సంవత్సరములకే కలియుగము ప్రారంభమైనది. కలియుగ ప్రారంభములో దేశమంతా ముఖ్యమైన పండుగగా శ్రీకృష్ణాష్టమి జరిగెడిది. కలియుగములో కృష్ణాష్టమి దేశ వ్యాప్తముగా ఐదు ఆరువందల సంవత్సరముల వరకు ఉత్సవముగా జరిగినది. అప్పటినుండి మాయా ప్రభావముచేత క్రమేపి కృష్ణాష్టమి పండుగ చేయడము ఒక్కొక్కరు మానివేస్తూ వచ్చారు. ఆ విధముగా నాలుగు లేక ఐదువందల సంవత్సరములకు కృష్ణాష్టమిని చేయడము 90 శాతము మంది మానివేశారు. చివరకు కొంతకాలమునకు కేవలము ఐదుశాతము మంది మాత్రమే అదియు మధుర, గోకులమైన నందగావ్ పరిసరప్రాంతములలో మాత్రము చేయడము, గొల్లవారు మాత్రము చేయడము ఆనవాయితీగా ఉన్నది. గొల్లవాడలయందు కృష్ణుడు చిన్నతనములో చేసిన వెన్న దొంగ తనమును గుర్తు చేయుటకు ఉట్టిని పగుల గొట్టడము మొదలగు కార్యములను పండుగ వాతావరణములో ఇప్పటికీ చేయుచున్నారు. కలియుగ ప్రారంభములో ఎంతో పెద్ద ఎత్తున జరుపబడు కృష్ణాష్టమి పండుగ నేడు గుర్తుకు మాత్రము మిగిలియున్నది. ఇటువంటి పరిస్థితి రాకూడదని ఆనాటి పెద్దలు ఒక ప్రయోగము చేశారు. ఆ ప్రయోగమే అష్టమి కష్టము, నవమి నష్టము అనుమాట. ఈ పద ప్రయోగమేమిటని కొందరికి అర్థము

కాకపోవచ్చును. ఆనాటి పెద్దలు ఏ ఉద్దేశముతో ఈ పదములను వాడారో గమనిద్దాము.

పూర్వము కృష్ణుడు మధురానగరములో అష్టమి దినమున పుట్టాడు. మరుసటి దినము నందగావ్‌లో కనిపించాడు. పుట్టిన రాత్రే వసుదేవుడు రహస్యముగా కృష్ణున్ని మధురానగరమునుండి ప్రక్కనేనున్న నందగావ్ లోనికి చేర్చాడు. అందువలన రెండవ దినమున అనగా తెల్లవారిన తర్వాత కృష్ణుడు యశోదకు పుట్టాడని ఆ గ్రామమంతా తెలిసిపోయింది. కృష్ణుడు పుట్టిన అష్టమిరోజు రాత్రిపూట, తెల్లవారిన తర్వాత తిథి నవమి వచ్చినది. గొల్లవాడలలో తెలిసినది నవమిరోజు. నందాగావ్‌లో కృష్ణుడు నవమి రోజు తెలిసాడు. మధురలో కృష్ణుడు అష్టమిరోజు పుట్టాడు. కృష్ణుని యొక్క పుట్టుక అష్టమి రోజు, కావున ఆత్మజ్ఞానము తెలిసిన వారందరు శ్రావణ బహుళఅష్టమి రోజును **'కృష్ణాష్టమి'** అను పేరుతో చేసెడివారు. నందగావ్ లోని గొల్లవారందరు కృష్ణుడు తమ గ్రామములో కనిపించిన నవమి రోజున **'గోకులాష్టమి'** అను పేరుతో నవమిరోజు ఉత్సవము చేసెడివారు. వారు కులాభిమానము తో తమ పేరు ఉండునట్లు 'గోకుల అష్టమి' అని చేయడము జరుగుచున్నది. ఇప్పటికీ కూడా శ్రీకృష్ణాష్టమి, గోకులాష్టమి రెండు పేర్లతో అష్టమి, నవమి రెండు రోజులు పండుగలు చేయడం జరుగుచున్నది. అష్టమి రోజు జ్ఞానులు చేయునది కృష్ణాష్టమి, నవమి రోజు గోకులవంశము వారైన నేడు యాదవులనబడు గొల్ల కులము వారు ప్రత్యేకముగా చేయునది గోకులాష్టమి అని తెలియవలెను. కృష్ణుని పుట్టుక అష్టమి రోజే అయినా కృష్ణాష్టమి, గోకులాష్టమి అను రెండు పేర్లతో అష్టమి రోజు, నవమి రోజు పండుగ చేయడము జరుగుచున్నది.

కృష్ణ జయంతిని నవమిరోజున చేసినా దానిపేరు గోకులాష్టమి అని అష్టమినే చూపిస్తున్నది. కావున శ్రీకృష్ణుని జన్మ ఉత్సవము అష్టమి, నవమి రెండు రోజులు జరగడము ఆనందదాయకమైన పనిగా తలచ వచ్చును. కలియుగము మొదటిలో దేశవ్యాప్తముగా కృష్ణాష్టమి, గోకులాష్టమి రెండు రోజులు జరిగెడివి. ఆ రెండు దినములలో అందరూ తమతమ పనులను మానుకొని ఉత్సవము చేసెడివారు. ఆ దినములలో ఎవరినీ పనిలోనికి పంపెడివారు కాదు. పనులుంటే కృష్ణుని ఉత్సవములో పాల్గొనరని అన్ని పనులకు స్వస్తి చెప్పెడివారు. ఆ దినములలో ఎవరికైన, ఏ పనికైనా మంచి ముహూర్తముండినా దానిని చేయక మానుకొనునట్లు, ఎవరు ఏ పని జోలికి పోకుండ పెద్దలు ఒక భయము పెట్టారు. అష్టమి రోజున ఏ పనిని ప్రారంభించినా అందులో కష్టము ఏర్పడుతుందని, ఆ పని సక్రమముగా సాగదని చెప్పారు. అలాగే నవమి రోజున పనిని ప్రారంభిస్తే దానివలన ఎక్కువ నష్టము వస్తుందని చెప్పారు. కృష్ణాష్టమి, గోకులాష్టమి సక్రమముగా జరుగుటకు, అందరు పాల్గొనుటకు అవకాశము ఉండునట్లు ఆ విధముగా చెప్పి భయమును ఏర్పరచి, ఆ రెండు దినములు పనిని మాన్పించారు. ఆ భయము అందరికీ తెలియునట్లు అష్టమి కష్టము, నవమి నష్టము అను మాటను ప్రయోగముగా వాడి మనుషులలో అందరికీ తెలియునట్లు చేశారు. ఆనాడు వారు చేసినది మంచి ఉద్దేశమే అయినప్పటికి అష్టమి కష్టము, నవమి నష్టము అనుమాట నేటికి ఎవరికీ తెలియకుండా పోయినది. ఆ మాట తెలియకుండా పోవడమే కాక కృష్ణాష్టమిని చేయువారు 90 పాళ్ళు తగ్గి పోయారు.

మనము కృష్ణ జయంతిని పండుగగా చేసిన చేయకున్నా ఆయన అష్టమి తిథినాడే ఎందుకు పుట్టాడని యోచించితే ఎంతో జ్ఞాన అర్థమున్నదని

చెప్పుకొన్నాము కదా! దానిని గురించి వివరించుకొంటే ఈ విధముగా కలదు. అమావాస్య నుండి పౌర్ణమి వరకు 15 రోజులు, అట్లే పౌర్ణమి నుండి అమావాస్య వరకు 15 రోజులుండుట అందరికీ తెలిసిన విషయమే. శ్రీకృష్ణుడు పౌర్ణమి నుండి అమావాస్య వరకు గల 15 దినములందు మధ్యలో గల అష్టమి దినమునందు జన్మించాడు. 15 దినములలో పాఢ్యమి నుండి సప్తమి వరకు 7 దినములు, మధ్యలో అష్టమి, తర్వాత నవమి నుండి అమావాస్య వరకు 7 దినములు గలవు. 7+1+7=15 పదిహేను రెండు సమాన భాగములు చేయవలయునంటే 7 మరియు 7 దినములుగ విభజించగ ఒకటి శేషము మిగులును. ఆ ఒక్క దినము అష్టమిగ గుర్తించి అష్టమికి ముందు 7 దినములుగ, వెనుక 7 దినములుగ గుర్తించుకోవలయును. శ్రీకృష్ణుడు మధ్య దినమైన అష్టమియందే పుట్టుటకు విశేషమైన అర్థము గలదు. అదేమనగా!

భగవంతుడైన శ్రీకృష్ణుడు జ్ఞానమునకు, అజ్ఞానమునకు సంధిలాంటి వాడు. అజ్ఞానము నుండి జ్ఞానమునకు, జ్ఞానము నుండి అజ్ఞానమునకు పోవుటకు ఆయన కేంద్రములాంటివాడు. ఎందరో జ్ఞానులు సహితము ఆయన తన జీవితములో నడుచుకొన్న పద్ధతులనూ ఆచరణలనూ చూచి, ఆయన చెప్పిన గీత అంతా బాగుగానే ఉంది, కానీ ఆయన ఆచరణ మాకు నచ్చలేదు. ప్రవర్తన ముఖ్యము కదా! లోపల గుణములనుబట్టియే కదా ఎవరైనా ఆచరించేది, ఆయన ఎన్ని చెప్పినప్పటికీ శ్రీకృష్ణుడు చేసిన పనులను బట్టి చూస్తే, బోధలు చెప్పినంత గొప్పవాడుకాదని తెలుస్తుందని అంటున్నారు. అటువంటి వారు జ్ఞానమునుండి కృష్ణుని ద్వారా అజ్ఞానములోనికి పోయినట్లే, వారికున్న జ్ఞానము నిష్ప్రయోజనమన్నమాట. శ్రీకృష్ణుడేమి చెప్పాడో వారు అర్థము చేసుకోలేదన్నమాట. అటువంటపుడు శ్రీకృష్ణుడు చెప్పిన అసలైన

**కృష్ణుడు**




**అజ్ఞానము** **జ్ఞానము**

జ్ఞానము వేరు విధముగ అర్థమై ప్రవర్తనకు భిన్నముగ తోచినపుడు వారు శ్రీకృష్ణునికి భిన్నముగ పోగలరు. శ్రీకృష్ణుడు జ్ఞానకేంద్రమైనపుడు, ఆయనకు భిన్నముగ పోవువారు అజ్ఞానమువైపు పోవుచున్నారనే తెలియాలి. అట్లే శ్రీకృష్ణుని చూచి ఆయన **చెప్పినది, చేయునది, చేయించునది** అంతా ఒకటేనని తెలిసినవారు జ్ఞానమువైపు సాగిపోగలరు. ఆయనను చూచి ఉన్న చోటునుండి కొందరు జ్ఞానమువైపుకు, కొందరు అజ్ఞానమువైపుకు పోవుచున్నారు. కావున శ్రీకృష్ణుడు అటు జ్ఞానమునకు, ఇటు అజ్ఞానమునకు మధ్యగలవాడని తెలియునట్లు అష్టమిరోజునే ఎంచుకొని పుట్టాడు. శ్రీకృష్ణుడు బహుళపక్ష అష్టమి రోజే ఎందుకు పుట్టాలి? శుక్లపక్ష అష్టమియందు ఎందుకు పుట్టలేదు? దానికి కారణమేమై ఉండవచ్చునను సంశయము కొందరికి రావచ్చును. దానికి మా సమాధానమేమనగా!

జ్ఞానబోధలలో చంద్రున్ని జ్ఞానచిహ్నముగ చెప్పిన సందర్భములు గలవు. గీతయందు అక్షర పరబ్రహ్మయోగమున 25వ శ్లోకములో యోగులకు మరుజన్మ ఉంటే జ్ఞానవికాసముకల్గి పుట్టుదురని చెప్పుచూ

**"చాంద్రమసం జ్యోతిః"** చంద్రతేజస్సు కల్గిపుట్టుదురని జ్ఞానవికాసమును చంద్రుని వెన్నెలతో పోల్చి చెప్పారు. అందువలన వెలుగైన పౌర్ణమిని జ్ఞానముగ, చీకటిమయమైన అమావాస్యను అజ్ఞానముగ సులభముగ పోల్చుకోవచ్చును. పరమాత్మ జ్ఞానయుతుడైవుండి అజ్ఞానయుతమైన ప్రపంచములోనికి వచ్చి భగవంతునిగా పుట్టాడు. కావున జ్ఞాన చిహ్నమైన పౌర్ణమి నుండి చీకటిమయమై పోవుచూ చివరకు అమావాస్యగా మారు బహుళ పక్షమిలో పుట్టాడు. అట్లు పుట్టిన ఆయన అటు జ్ఞానియో, ఇటు అజ్ఞానియో ఎవరికి అర్థముకానట్లు, **జ్ఞానము అజ్ఞానము రెండు నాలోనే ఉన్నాయన్నట్లు మరియు జ్ఞానమునకు అజ్ఞానమునకు నేనే మార్గమును, నేనే ద్వారమును** అన్నట్లు మధ్యలో అష్టమి రోజున పుట్టాడు. పౌర్ణమి గడచిపోయిన తర్వాత వచ్చు అష్టమి రోజున పుట్టాడు. కావున పరమాత్మ జ్ఞానప్రకాశవంతమైన పరము నుండి అజ్ఞాన అంధకారమైన ప్రపంచము లోనికి వచ్చాడని తెలియాలి. ఈ విధముగా ఆయన పుట్టిన దినమునందు కూడ ఎంతో విశేషమైన అర్థమిమిడి ఉన్నది. కావున ఆయన పుట్టిన దినమును మహాపర్వదినముగ భావించి, ఆ దినమును శ్రీకృష్ణాష్టమి అని పేరు పెట్టి పూజించుకొంటున్నాము.

ఎవరైతే సకల సృష్ఠికి ఆధారమై ఉన్నాడో, సకల దేవతలు ఎవరినైతే దేవుడని మ్రొక్కారో, అణువణువున వ్యాపించి ఎవరికీ కనిపించని శక్తి ఏదైతే ఉన్నదో, క్షణ క్షణము జరుగుచున్న కాలమై, అందరికి ఆయువై ఆరోగ్యమై, మరణమై ఎవరైతే ఉన్నాడో, ఆ దేవుడే కృష్ణునిగా పుట్టి, మనిషి వలె కదలాడిన ఒక వ్యక్తి అని చెప్పితే ఎవరైనా నమ్మగలరా? నమ్మలేరు. అంతగొప్ప దేవుడే మనిషిగా పుట్టడమేమిటి? అను ప్రశ్నరాక తప్పదు. ఇక్కడ ఒక చిన్న ఉపమానమును చెప్పుకొందాము. సముద్రము సకల

భూఖండములను తాకి ఉంది. ఎంతో విశాలమైనది, దానియందు ఇన్ని అని చెప్పలేని అసంఖ్యాకములైన జీవరాసులున్నవి. సముద్రములేనిది భూమికి మనుగడయే లేదు అని చెప్పబడు సముద్రము నీ ఇంటిలో నీ ఒంటిలో ఉన్నది అంటే ఎవరైన నమ్మగలరా? దేవుడే కృష్ణుడు అంటే ఎట్లు నమ్మలేరో అట్లే సముద్రము ఇంటిలో ఉన్నదంటే నమ్మలేరు. అంత పెద్ద దేవుడు ఇంత చిన్న మనిషా! అని ఎట్లు నమ్మమో, అట్లే అంత పెద్ద సముద్రము ఇంత చిన్న ఇంటిలో ఉందా! అని నమ్మలేము. అయినా వివరించుకొని చూస్తే దేవుడు మనిషిలో ఉన్నది నిజమే, అలాగే సముద్రము ఇంటిలో ఉన్నది నిజమే. అసాధ్యమనుకొన్న దానిని సుసాధ్యము అనునట్లు చేయు వివరమేమిటి అని చూస్తే ఈ విధముగ వివరముగలదు.

నీరు సముద్రములో ఉన్నది. సముద్రమంతా నిండియున్న నీటికి కొన్ని ధర్మములు గలవు. అలాగే విశ్వములో దేవుడున్నాడు. విశ్వమంతా నిండియున్న దేవునికి కొన్ని ధర్మములు గలవు. ఎన్నో లెక్కలేని నీటి బిందువుల కలయిక సముద్రమంతా నిండివున్న నీరు. అలాగే ఎన్నో దైవ అంశముల కలయిక దేవుడు. సముద్రమంతా నిండియున్న నీటికి ఏ ధర్మముకలదో, అదే ధర్మము నీటి బిందువుకు కూడ కలదు. అట్లే విశ్వమంతా నిండియున్న దైవమునకు ఏ ధర్మముకలదో, అదే ధర్మము దైవ అంశకు కూడ కలదు. సముద్రములోని అఖండమైన నీటికి ఏ ధర్మమున్నదో, అదే ధర్మము ఖండమైన నీటి బిందువుకు కూడ కలదని ఎట్లు చెప్పుచున్నామో, అలాగే విశ్వములోని అఖండమైన దైవమునకు ఏ ధర్మముందో, అదే ధర్మము ఖండమైన దేవుని అంశకు కూడ ఉన్నది. గమనించవలసిన విషయమేమంటే అఖండముగా ఉన్న నీటిని సముద్రము అంటున్నాము. సముద్రమునుండి ఖండమై బయలుపడిన ఒక నీటిచుక్కను

నీటిబిందువు అంటున్నాము. అలాగే అఖండముగా అంతటా వ్యాపించి యున్న దైవశక్తిని దేవుడు అంటున్నాము. దైవమునుండి విడివడి ఖండముగానున్న ఒక దైవ అంశను భగవంతుడు అంటున్నాము. సముద్రమునకు నీటి బిందువుకు ఒకే ధర్మమున్నట్లు, దైవమునకు భగవంతునికి ఒకే ధర్మము గలదు. దేవుని ధర్మములు దేవునికే తెలుసును, దేవుడే మానవులకు తెలియబరచాలి అను ధర్మము భగవంతుని పట్ల కూడ కలదు. అందువలన దేవుని ధర్మములు భగవంతునికి కూడ తెలుసు. అలాగే దేవుడే మానవునికి తెలియబరచాలి అన్నట్లు భగవంతుడే మనుషులకు తెలియబరచును. ఈ ఉపమానమును బట్టి దేవుడు, భగవంతుడు అను ఒక మనిషిగా వచ్చుననుటను ఎవరైనా విశ్వసించగలరు. దేవుడు భగవంతుడు ఇద్దరూ ఒకటే అయినా ఉన్న స్థితినిబట్టి **అపరిమితముగా ఉన్నపుడు దేవుడు, పరిమితముగా ఉన్నపుడు భగవంతుడని** అనుచున్నాము.

పరిమితి లేని దేవుడు పరిమితమైన శరీరములోనికి, ఆకారములేని దేవుడు ఆకారమున్న శరీరములోనికి, పేరులేని దేవుడు పేరున్న శరీరము లోనికి, ఏ కార్యము చేయని దేవుడు పని చేయు శరీరములోనికి వచ్చినపుడు ఆ శరీరమును భగవంతుడు అంటున్నాము. దేవుని అంశ శరీరధారియై వచ్చినదే శ్రీకృష్ణుడు. ఆయనే భగవాన్ శ్రీకృష్ణ. అంత పెద్ద దేవుడు మానవాకారముతో వచ్చిన పుట్టుక సమయము చాలా పవిత్రమైనదని, గొప్పదని భగవంతుని జన్మదినమును పండుగగాజేసుకొనుచున్నాము. అదియే కొందరికి కృష్ణాష్టమి, కొందరికి గోకులాష్టమి. కలియుగ ఆరంభములో అందరు చేయు కృష్ణజయంతి నేడు కనుమరుగై పోవుచున్నది. దేవునికి వ్యతిరేకమైనది మాయ. మాయ మానవునియందుండి దైవమువైపు

పోకుండ చేయుచున్నది. అట్లు చేయుటకు కావలసిన ప్రత్యమ్నాయ ఏర్పాట్లన్నిటిని చేసి పెట్టుచున్నది. మాయ చేయు ఆ కార్యక్రమములలో కృష్ణాష్టమిని లేకుండ చేయడము కూడ ఒక పని. అందులన పూర్వము పెద్దలు పెట్టిన నానుడి మాట అయిన అష్టమి కష్టము, నవమి నష్టము ఈ కాలములో ఎవరికీ తెలియకుండా చేసినది. ఆ మాట తెలియకుండ పోవుట వలన కృష్ణజయంతి యొక్క జ్ఞాపకము చాలామందికి లేకుండా పోయినది. మాయా ప్రభావము చేత మనుషులు భగవంతున్ని ఏమాత్రము గుర్తించలేక పోయారు. ఆయనను సాధారణ మనుషులకంటే తక్కువగా పోల్చుకొన్నారు. మాయ మనిషియందు గుణముల రూపములో ఉంటూ, దైవమార్గములోనికి మనిషిని పోకుండ చేయుచున్నది. అట్లు చేయాలంటే మనిషిని దేవునివైపు పోతున్నట్లు నమ్మించి ప్రక్కదారి పట్టించాలి అన్నది మాయ యొక్క పథకము. ఆ పథకములో భాగముగ కృష్ణాష్టమికి బదులుగా దాని స్థానములో మరొక పండుగను తెచ్చిపెట్టి, అందరి దృష్ఠి దానివైపు సారించునట్లు చేసినది. దేవుడు చెప్పినట్లు మాయకు బలమెక్కువ అందువలన కృష్ణాష్టమిని లేకుండ చేసి, మాయ తన పండుగను తెచ్చిపెట్టి చిన్నలను పెద్దలను దానియందు పాల్గొనునట్లు చేసినది.

పూర్వము కృష్ణాష్టమిని పదకొండు రోజుల పండుగగా చేసెడివారు. కృష్ణాష్టమి ఇంటిలోపల చేయు పండుగకాదు. పూర్వమందరు వీధులలోనే చేసెడివారు. వీధులలోనే ఉట్ల ఆట ఆడెడివారు. వీధులలోనే మగవారు గోపికలవలె ఆడవేషము వేసుకొని వెన్న దొంగలుగా వస్తే వారిని ఆడవారు చేటలతో, కట్టెలతో కొట్టెడివారు. ఆడవేషములో ఉన్న మగవారిని ఆడవారు కొట్టడము కూడ ఉత్సవములో ఒక భాగముగా ఉండెడిది. వీధులలోనే పందిరికట్టి, ఆ పందిరిలో కృష్ణుని ప్రతిమను పెట్టి, పదకొండు రోజులు

పూజించెడివారు. వీధిలోని పందిరి ముందే కృష్ణలీలలను ప్రదర్శించుచు ఉట్ల ఆట, వెన్నదొంగ ఆట మొదలగునవి ఆడుచు సంతోషముతో పదకొండు రోజులు ఉత్సవము చేసి, చివరి పదకొండవరోజు అనగా చవితి రోజు పందిరిలోని కృష్ణప్రతిమను ఊరేగించి, ఆ ప్రతిమను ఇంటిలో పెట్టుకొని ఉత్సవమును ముగించెడివారు. దేశములో మొట్టమొదటి వీధి ఉత్సవము కృష్ణాష్టమియేనని తెలియవలెను. కృష్ణాష్టమికంటే ముందు ఏ వీధి ఉత్సవములు లేవు. తర్వాత మాయ ప్రభావముతో ఒక్కొక్కటిగా తయారైనవి. అందులో వినాయకచవితి ఒకటి, తర్వాత దుర్గాష్టమి రెండవది. విశేషమే మంటే కృష్ణుని పండుగ అష్టమి తిథి పేరుతో ఉండగా దానికి ప్రత్యమ్నాయముగా తిథుల పేర్లతోనే వినాయక చవితి, దుర్గాష్టమి వీధి పండుగలు తయారైనవని గ్రహించవలెను.

కృష్ణాష్టమికి బదులుగా మొదట తయారైన పండుగ వినాయక చవితికాగా, తర్వాత ఈ మధ్యకాలములో దుర్గాదేవి పండుగ కూడ వీధి పండుగగా తయారైనది. దుర్గాదేవి పండుగ పూర్వకాలమునుండి భక్తితో గృహములయందే తొమ్మిది దినములు చేసుకొనెడివారు. దుర్గాదేవిని ఒక్కొక్క రోజు ఒక్కొక్క అలంకారముతో పూజించడము సాంప్రదాయముతో కూడు కొన్నదని చెప్పవచ్చును. ఇప్పటికీ కూడ దుర్గాదేవి పండుగ అయిన దశరా సాంప్రదాయముతో కూడుకొన్న పండుగయని చెప్పవచ్చును. కానీ వినాయక చవితి మాత్రము ఏ సాంప్రదాయములేని పండుగయని చెప్పవచ్చును. మన సాంప్రదాయము కాని పండుగ మన మధ్యలోనికి ఎలా వచ్చింది? అని యోచిస్తే దానికి కొంత వివరముగలదు. అష్టమిగానీ, చవితిగానీ తిథులని చెప్పాము కదా! పూర్వము ఇందూధర్మములను తెలిసిన పెద్దలు జ్యోతిష్య శాస్త్రములోని తిథులను తీసుకొని, ఒక్కొక్క తిథికి ఒక్కొక్క విషయ

ప్రాబల్యమును సమకూర్చి, ఆ తిథి రోజు ఆ విషయమునకు ఎక్కువ ప్రాధాన్యత నిచ్చునట్లు తెలిపారు. దానిప్రకారము చవితి రోజు సమాజము నకు సంబంధించిన విషయమునకు ప్రాధాన్యతనిచ్చారు. అట్లే సప్తమి యోగమునకు, అష్టమి మోక్షమునకు, దశమి ఏకాదశి రెండు తిథులు భక్తి, జ్ఞానమునకు, అమావాస్య పౌర్ణమి రెండు పరమాత్మ విషయమునకు ప్రాధాన్యత నిచ్చునవి నిర్ణయించారు. అందువలన చవితి రోజు పండుగ లైన నాగులచవితి, వినాయకచవితి రెండు సమాజము యొక్క శ్రేయస్సు విషయమును తెల్పునవిగా ఏర్పాటు చేశారు. ముందుగా నాగులచవితిని గురించి చెప్పుకొంటే, అదే విధానము ప్రకారము వినాయక చవితి కూడ అర్థము కాగలదు. అప్పుడు జ్ఞానమునకు, మాయకు తేడా తెలియాలంటే వినాయక చవితిని గురించి వివరించుకోవాలి. వినాయక చవితిని గురించి సత్యమును చెప్పినప్పటికి మాయ ప్రభావము చేత మనుషులు అపార్థము చేసుకొను అవకాశమున్నది. కావున అది సమాజశ్రేయస్సుకు ఎలా సంబంధించినదో అర్థము కావాలంటే, ముందు నాగులచవితిని చెప్పు కోవలసివుంటుంది. నాగుల చవితిని పెద్దలు ఎందుకు మనుషుల మధ్యలో ఏర్పాటు చేశారో వివరించుకొని చూద్దాము. ఈ వివరములను చెప్పేముందు మరొక మాటను ముందే చెప్పవలసివుంది. అదేమనగా! నాగులచవితి ప్రజల శ్రేయస్సుకు ఏర్పరచినా, పెద్దల పని వృథా అయిపోయి ఆ శ్రేయస్సు ప్రజలకు అందడము లేదు. అలాగే వినాయకచవితిని కూడ పెద్దలు యోచించి చేసి చూపించినా, మనుషులు ఆ ఫలితము యొక్క శ్రేయస్సును అందుకోక పోవడమేకాక పెడత్రోవపట్టి పోయారని చెప్పుచున్నాము. ఈ రెండు చవితులను చెప్పితేకానీ కృష్ణాష్టమి యొక్క విలువ తెలియదు. అందువలన ఇక్కడ నాగులచవితిని, వినాయకచవితిని గురించి చెప్పవలసి వచ్చినది.

ముందు నాగులచవితిని గురించి చెప్పుచున్నాము చూడండి. ఇది సమాజశ్రేయస్సుకని చెప్పాము కదా! అందువలన దీనిని చదివే నీకు కూడ పనికి వచ్చునదే. కావున శ్రద్ధగా గమనించండి. నాగులు అనగా పాములు అని అర్థము, చవితి అనగా నాలుగు అని అర్థము. నాగులచవితి అనగా పాముల నుండి పూర్తి రక్షణ పొందడమని అర్థము. అపాయము నుండి బయటపడునట్లు జరగడమే శ్రేయస్సు అని చెప్పవచ్చును. పాముల కాటునుండి రక్షణ పొందితే ఎవరికైనా అపాయమునుండి బయట పడినట్లే అవును కదా! అట్లు బయట పడు విధానమున్నది. కావున నాగులచవితి సమాజశ్రేయస్సును తెలుపునదని చెప్పుచున్నాము. భూమిమీద 80 జాతుల పాములున్నాయి. అన్ని జాతులకు విషముండదు. 15 జాతులకు మాత్రము విషముండును. వాటిలో నాగుపాము జాతి ఒకటి కలదు.

విషమున్న మిగత జాతుల పాములకంటే నాగుపాము జాతికే మనిషిని తొందరగ చంపు విష ప్రభావమున్నది. అందువలన పూర్వపు వైద్యపండితులు నాగుపాము విషమునకు విరుగుడు వైద్యమును చెప్పితే అన్ని జాతుల పాము వైద్యము చెప్పినట్లేనని తలచారు. పూర్వము ఎక్కువగా ప్రకృతి సిద్ధమైన మూలికావైద్యముండెడిది. పాము విషమునకు విరుగుడైన మూలికలను ప్రతి ఊరులోను పెంచవలెనని వారు నిర్ణయించుకొన్నారు. ఆ పథకములోని భాగముగానే ప్రతి ఊరులోను మొదట వేపచెట్టును, దానిప్రక్కననే రావిచెట్టును నాటారు. వాటి ముందర నాగుపాముల ప్రతిమలను ఉంచారు. పూర్వము ప్రతి ఊరులోను వేప, రావిచెట్లు ఒకచోట ఉండడమూ, అక్కడ చాలామంది విశ్రాంతి తీసుకొనునట్లు విశాలమైన అరుగునుంచడమూ, ఆ అరుగు మీద చెట్ల మొదటిలోనే ముందర నాగ ప్రతిమలుంచడము జరిగెడిది. ఆ విధముగా నిర్మింపబడిన దానిని

నాగులకట్ట అనెడివారు. ఇప్పటికీ కొన్ని ఊర్లలో రావి, వేపచెట్లున్న నాగులకట్టలు కనిపించును. ఈ మధ్యకాలములో తయారైన కొన్ని ఊర్లలో నాగులకట్టలు లేవు. నాగులకట్టలు కొన్ని ఊర్లలో ఎందుకు లేవో తర్వాత తెలుసుకొందాము.

పాము కరిచి విషము ఎక్కితే అనగా తలకు ఎక్కితే మొదట నాలుకకు రుచి తెలియకుండ పోవును. నాలుక తెలుసుకొను ఆరు రుచులలో మొదట చేదు తెలియకుండ పోవును. అటువంటి పరిస్థితిని తెలుసుకొనుటకు చేదు రుచిగల వేపచెట్టును నాగులకట్టలో ఉంచారు. విషము తలకెక్కిన తర్వాత దానిని సులభముగా తీసివేయుటకు సాధ్యమగును. అందువలన పాముకరచిన వ్యక్తికి, విషము తలకు ఎక్కిందా లేదా అని చూచుటకు వేప ఆకును నమిలించెదరు. విషము ఎక్కినపుడు చేదు తెలియకుండ పోవుట వలన అపుడు తలనుండి విషమును తీసివేయుటకు ప్రయత్నించవచ్చును. వేప ఆకుల ద్వార విషమును తెలుసుకొన్నవారు, దానిని తీసివేయుటకు రావి ఆకులను వాడుకొందురు. రావి ఆకుల కాడలను విషమున్నవానికి చెవులలో పెట్టితే, రావిఆకులు తమ కాడల ద్వారా తలలోని విషమును ఆకులలోనికి లాగుకొనును. ఆ విధముగ రెండు లేక మూడు జతల ఆకులతో పూర్తి విషమును తీసివేయవచ్చును. తర్వాత వేప ఆకును నమిలిస్తే అది చేదుగా ఉండుట వలన విషము దిగిపోయినదని తెలుసుకోవచ్చును. విషమును లాగుకొను రావిఆకు పాము పడగవలె ఉండడము, క్రింద ఆకుకొన పాముతోకలా ఉండడమును గమనించవచ్చును. దీనినిబట్టి ప్రతి ఆకు ఒక పాముతో సమానమనీ, పాము విషము పామే లాగుకొన్నట్లు, రావి ఆకు విషమును లాగుకొనుచున్నదని తెలియుచున్నది. ఈ వైద్య విధానము అందరికీ తెలియునట్లు, పూర్వము ప్రతి ఊరిలోను రావి,

వేపచెట్లను పెంచి కట్టకట్టియుంచారు. అదే చెట్లక్రింద నాగుపాము ప్రతిమలను కూడ పెట్టుటకు కారణమేమనగా! ఈ పాములు కరిస్తే ఈ చెట్ల ఆకులే వైద్యమన్నట్లు చెట్లక్రింద ముందరే పాము బొమ్మలనుంచారు. **"ప్రతి ఆకు ఔషధమని"** నానుడి గలదు. రావి, వేపఆకు దేనికి ఔషధమని ప్రశ్న వస్తే వెంటనే పాములకు అని తెలియునట్లు ఆ చెట్ల క్రింద పాముల ప్రతిమలనుంచారు. ప్రతి ఊరులోను ఆ విధముగా ఉంటే, అందరికీ ఆ వైద్యము తెలిసి, అందరూ పాముకాటునుండి బయటపడగలరని ఆనాటి పెద్దలు తలచారు.

ప్రస్తుతకాలములో ఆనాటి పెద్దల ఉద్దేశము తెలియకుండ పోయినది. ఇప్పటికీ కొన్ని ఊర్లలో నాగులకట్టలు, రావి, వేపచెట్ల సమేతముగా ఉండినప్పటికీ అవి వైద్య విధానముగా పెట్టినవనీ రావి, వేప చెట్లు పాము విషమునకు మంచి ఔషధములని ఎవరికీ తెలియదు. విషమునకు ప్రతీకగా పాము బొమ్మలనూ, ఔషధమునకు ప్రతీకగా రావి, వేపచెట్లనుంచితే ఆ భావము కాలగర్భములో కలిసిపోయినది. పాము ప్రతిమలు నాగదేవతలుగా, వేప,రావిచెట్లను లక్ష్మీనారాయణులుగా భావించి ప్రజలు పూజలు చేయుచున్నారు. ఈ విధముగా వైద్యము భక్తిగా మారిపోయినది. పాము ప్రతిమలకు రావి, వేపచెట్లు నీడ నిమిత్తమే ఉన్నాయనుకొన్న ప్రజలు, ప్రతిమలను చెట్లక్రింద లేకుండ గుడులలో ప్రతిష్ఠించను మొదలుపెట్టారు. అందువలన నాగప్రతిమలు ఇప్పటి కాలములో గుడులలో కనిపిస్తున్నవి. గ్రామాల్లో రావి, వేపచెట్లు జతగా ఉండడము కనిపించకుండ పోవుచున్నవి. ఇవి ప్రాణము తీసే పాములని పాము ప్రతిమలను, ఇవి ప్రాణము పోసే చెట్లని రావి, వేపచెట్లను అందరికీ తెలియునట్లు పూర్వము ఎంతో పథకముగా వైద్యపండితులుంచితే, ప్రాణము

తీసే పాములు దేవతల స్థానములో ఉన్నాయి. ప్రాణము పోసే ఔషధచెట్లు అదృశ్యస్థానములో ఉన్నాయి. పాములను గురించి, ఔషధవృక్షములను గురించి చర్చావేదికలు నాగులకట్టల మీదనే పెట్టి ప్రజలకు తెలియ జేయుటకు నాగులచవితి అను పేరుతో శ్రావణమాస శుక్లపక్ష చవితిని పూర్వము నిర్ణయించారు. మొదట వైద్యపండితులు పెట్టిన ఉద్దేశము కాలక్రమమున మారిపోయి, చివరకు నాగులచవితి ఒక భక్తి పండుగగ మారిపోయినది. మన పెద్దలు మన శ్రేయస్సును కోరి ఒక అమోఘమైన ఔషధాన్నిస్తే దానిని అందుకోలేక కాలగర్భములో వారి ఉద్దేశమును సమాధి చేశాము. పెద్దలు అందించిన ఫలితాన్ని మేము చెప్పిన తర్వాత ఇప్పటికీ కూడ అర్థము చేసుకోలేక అడ్డముగా మాట్లాడు వారున్నారు. పూర్వము సమాజశ్రేయస్సుకు మనవారు అందించిన విధానమునకు మనము ఎంతో కృతజ్ఞులమై ఉండాలి. అట్లుకాక వారు అందించిన విధానమును గాలికి వదలివేశాము. ఎప్పుడో తెలియకుండ పోయిన విధానము ఈ రోజు తెలిసినా, ఇది మన శ్రేయస్సుకు సంబంధించినదని కూడ తలచడములేదు. ఈనాడు తెలియకుండ పోయిన దానిని తెలిపినవారు గానీ, ఆనాడు ఎంతో పరిశోధన చేసి తెలిపినవారుగానీ ఏ ఫలితాన్ని ఆశించి తెలుపలేదు కదా! అని కొంతైనా యోచించక, మూఢముగా నాగదేవతల పూజను మాన్పించుటే వీరి ఉద్దేశమని, వీరు హిందువులుకాదని అనడము సరియైన పద్ధతేనా అని మీరే యోచించండి. మంచి ఏదో చెడు ఏదో తెలియకుండ, నిస్వార్థముగా సమాజ శ్రేయస్సుకోరువారిని తప్పుగా మాట్లాడువారు కూడ నేడు కలరు. అందువలన ఇప్పుడు చదువుచున్న మీరైనా సత్యమును తెలుసుకొమ్మని కోరుచున్నాము.

ఇంతవరకు నాగులచవితిని గురించి చెప్పాము, ఇప్పుడు వినాయక చవితి గురించి చెప్పుచున్నాము. ఈ విషయమును కూడ అపార్థము చేసుకొనుటకు అనేక అవకాశములు గలవు. అందువలన చదువుచున్న ప్రతి పాయింటును జాగ్రత్తగా గమనించమని కోరుచున్నాము. ఒక మనిషి సక్రమమార్గములో నడవాలంటే మనిషికి ఆధ్యాత్మిక వికాసము, వ్యక్తిత్వ వికాసము, సామాజిక వికాసము అవసరమని తెలిసిన పెద్దలు ఆ మూడు విధానములను పండుగల రూపములో తెల్పుచు, అన్నింటియందు ఆధ్యాత్మికమునకే అతి ముఖ్యమైన ప్రాధాన్యతనిచ్చారు. ఇప్పుడు మనము చెప్పుకొన్న మరియు చెప్పుకొనబోవు పండుగలన్నీ హిందూ(ఇందూ) మతములోనే గలవు. పూర్వము హిందూసంస్కృతి చాలా గొప్పగ ఉండెడిది. ప్రస్తుత కాలములో హిందూసంస్కృతినే పరాయి సంస్కృతిగా, పరాయి సంస్కృతినే హిందూసంస్కృతిగ భావించుకొను హిందువులు తయారైనారు. ఈ మామాటను మీరు నమ్మలేకపోతే, మేము చెప్పు ప్రత్యక్ష ప్రమాణమును చూచిన తర్వాత అయినా మా మాట నిజమని నమ్మగలరు. క్రీస్తుశకము 2008, 8వ నెల, 8వ తేదిన, 8 గంటల, 8 నిమిషాలకు మంచి ముహూర్తమున్నదనీ, ఆ విధముగ సంవత్సరము మొదలుకొని నెల, దినమూ అన్నీ 8 సంఖ్యకావడము విశేషమనీ, అనేక దేశాలు దీనిని శుభదినముగా పాటిస్తున్నవనీ, ప్రపంచము మొత్తము మీద చాలా వివాహములు జరుగుచున్నవీ, చైనాలో ఒలంపిక్స్ వేడుకలు కూడా ఈ దినవే ప్రారంభిస్తున్నారనీ, టీవీ9 వారు చర్చావేదిక పెట్టి అందులో జ్యోతిష్య శాస్త్రపండితులను, సంఖ్యాశాస్త్రపండితులను కలిపి వారి చర్చను ఆగష్టు 8వ తేదీన ఉదయము 8 గంటలకు ప్రసారము చేశారు. ఆ చర్చలో ఒక సందర్భమున కలియుగము 4,32,000 సంవత్సరముల పరిమితితో ఉన్నది. ఆ సంఖ్యలో ఇపుడు గడచినది కేవలము 2000 సంవత్సరములు

మాత్రమే, ఇంకా గడువవలసినది ఎంతో ఉన్నదని స్వయాన పండితులే అన్నారు. ఆ విషయమును ప్రక్కనేయున్న మరియొక జ్యోతిష్య పండితుడు ఏమాత్రము ఖండించకపోగా టీవీ9 వారు కూడ తటస్థముగా ఉన్నారు. అక్కడ కూర్చొన్న ఇద్దరు జ్యోతిష్యపండితులూ, టీవీ9 వారు అందరూ హిందువులే! అయినప్పటికీ ఎవరూ పెదవి విప్పలేదు. అక్కడ కలియుగము యొక్క పరిమాణము 4,32,000 అయినపుడు, ద్వాపర యుగము 8,64,000 సంవత్సరములు గడిచిపోయి, కలియుగము ప్రారంభమై 5108 సంవత్సరములు కూడ గడిచిపోయి, 5109 వ సంవత్సరము జరుగుచున్నది. ఇశ్రాయిల్‌దేశములో పుట్టిన ఏసుప్రభువు చనిపోయి క్రీస్తుశకము ప్రారంభమై 2007 సంవత్సరములు గడచి, 2008 సంవత్సరములో 7 నెలలు కూడ అయిపోయి 8వ నెల జరుగుచున్నది. అటువంటపుడు హిందువుల ధర్మము ప్రకారము యుగముల పరిమాణ ముండగా, అందులో కలియుగ పరిమాణము 4,32,000 అన్నపుడు గడచినది 5108 సంవత్సరముల నాలుగు నెలలే అయినపుడు, క్రైస్తవ మతస్థుల క్రీస్తుశకము యొక్క సంవత్సరములను చెప్పుకోవడము తప్పుకాదా! బ్రాహ్మణున్ని ప్రస్తావించి అతని పేరు డేవిడ్‌బ్రస్ అని చెప్పినట్లు, కలియుగ ఆయుఃప్రమాణమును ప్రస్తావించి, క్రీస్తుశక భుక్తిని (గడచిన దానిని) చెప్పితే హిందూసంస్కృతిని వదలి క్రైస్తవ సంస్కృతిని చెప్పినట్లు కాదా! అక్కడున్న ముగ్గురికీ అందులో క్రైస్తవ సంస్కృతి కనిపించలేదా! వారు మాట్లాడినది హిందూసంస్కృతియేనా?

ఇటువంటిదే మరొక ప్రత్యక్ష సత్యమును చెప్పెదను చూడండి. త్రైతశకము-30, కలియుగము 5109వ సంవత్సరము, సర్వధారి నామ సంవత్సరము నెం-22, చైత్రమాసము నెల 1, వసంతఋతువు అని హిందూ సంస్కృతి ప్రకారము యుగాది నుండి ప్రారంభమైన క్యాలెండరును మేము

తయారు చేసి జనవరి నెలతో ప్రారంభమైన క్యాలెండరు వద్దు, అది మన దేశ సంస్కృతికాదని, యుగాది నుండి ప్రారంభమైన మా క్యాలెండరును ఉచితముగా పంచితే, మహానందిలో పరమత ప్రచారమని క్యాలెండరును టీవీలో దగ్గరగా చూపి, వరుసగా మూడు రోజులు ప్రసారము చేసిన టీవీ9 వారికి మేమూ మా క్యాలెండరూ క్రైస్తవముగా కనిపిస్తే, తమ ఎదురుగా క్రైస్తవశకములోని 2000 సంవత్సరములను కలియుగములో గడచిన సంవత్సరములుగా చెప్పువారు హిందువులుగా కనిపించారా? హిందూ ధర్మమును చెప్పువారిని క్రైస్తవులుగా, క్రైస్తవమును చెప్పువారిని హిందువులుగా టీవీ9 వారు ప్రచారము చేయడము చూస్తే మీకేమనిపి స్తుందో యోచించండి. టీవీ9 వారు యుగాది నుండి ప్రారంభమైన మా క్యాలెండర్‌ను పరమత ప్రచారమని టీవీలో క్లోసప్‌లో చూపించగా, దానిలోని వాస్తవమెంత అని యోచించకుండానే కొందరు హిందువులు మా క్యాలెండర్లను అనంతపురము జిల్లా గుంతకల్లులో నిప్పుపెట్టి కాల్చేశారు. మెరుగైన సమాజము కొరకు టీవీ9 అనువారు అసత్యమును ప్రసారము చేయవచ్చునా? ఇదంతయు చూస్తే హిందువులు హిందూత్వమును గుర్తించలేని గ్రుడ్డివారుగా ఉన్నారో లేదో మీరే యోచించండి.

ఇంకొక విషయమును చెప్పెదను చూడండి. పంచాంగము, నవ గ్రహములు, జ్యోతిష్యము పూర్వము నుండి హిందువులు కనుగొన్నవి, హిందువులు లెక్కించునవి. హిందువులు కర్మ సిద్ధాంతముననుసరించి గ్రహచారముండునని ఆధ్యాత్మికములో కూడ చెప్పుకొన్నాము. అటువంటిది క్రీస్తుశకము 2008, 8వ నెల, తేదీ 8 ప్రకారము హిందువులకు మంచిదినమెలా అయినది. ఆ మూడు 8 లు ఒక్కమారు కలిసి రావడము క్రైస్తవులకు మంచిది కావచ్చునేమో కానీ, హిందువులకు ఆ దినమెలా

మంచిదైనది? జ్యోతిష్యశాస్త్రము ప్రకారము ఆ దినమునకు ఏ ప్రత్యేకత లేదు. అటువంటపుడు ఆ దినమును గూర్చి ప్రత్యేకముగా టీవీలో ప్రచారము చేసి మాట్లాడడము క్రైస్తవశకము 2008 ని గురించి పొగిడినట్లు కాదా? హిందువుల పంచాంగము ప్రకారము ఇది 8వ సంవత్సరమూ కాదు, 8వ నెలా కాదు, 8వ దినమూ కాదు. అటువంటపుడు క్రైస్తవుల మూడు ఎనిమిదులను గురించి మాట్లాడువారు హిందువులైతే, మేము భగవద్గీత ప్రకారము జ్ఞానమును చెప్పుచూ, యుగాది నుండి క్యాలెండరును తయారు చేసినవారము, పరమతస్థులమా? మా యుగాది క్యాలెండరును చించినవారు, కాల్చినవారు, క్రైస్తవులదని చూపించిన టీవీ9 వారు, వారి ఇళ్ళలో జనవరి నుండి ప్రారంభమైన క్యాలెండరును ఉంచుకోవడము సమంజసమా? జనవరి 1వ తేదీని క్రొత్త సంవత్సరమని సంతోషపడువారు, ఆ రాత్రికి టీవీలలో చూపువారు పరమతమును అనుసరించినట్లు కాదా? ఇట్లు అడుగుచూ, వివరిస్తూ పోతే హిందూమతములో దైవజ్ఞానము సన్నగిల్లిపోయి, హిందువులు తమ సంస్కృతిని, తమ జ్ఞానమును గుర్తించలేని స్థితిలో లేరని తెలియు చున్నది. అటువంటి స్థితినుండి హిందువులు బయటపడుటకు, హిందూ సంస్కృతికి అద్దముపట్టు పండుగలను వివరిస్తూ వచ్చాము. హిందువులకు ఆధ్యాత్మికమను అద్దములో పండుగల అర్థమును చూపిస్తూ వచ్చాము. సామాజిక స్పృహను కలుగజేయు నాగులచవితిలో కూడ భక్తిని పెంపొందించుకొమ్మని చెప్పాము. అదే కోవలో సామాజిక న్యాయమును, నీతిని చూపు వినాయకచవితిలో కూడ భక్తిని పెంచుకొమ్మని తెలుపు చున్నాము. నాగుల చవితి సమాజమునకు ఆరోగ్యమును అందించు సూత్రమును తెలియజేయగా, వినాయకచవితి సమ సమాజమును నెలకొల్పు అంశమును తెల్పునదై ఉన్నది. సమాజమునకు గొప్ప సందేశమునిచ్చు వినాయక చవితిని గురించి తెలుసుకొందాము.

మనము ప్రతి సంవత్సరము ఆగష్టు, సెప్టెంబరు మాసాలలో వచ్చు వినాయకుని పండుగను ఎంతో ఉత్సాహముతో జరుపుకుంటాము. ఈనాడు ఇందూ (హిందూ) ప్రజలలో ఎంతో గాఢముగా నిలిచిపోయిన ఈ పండుగను గురించి ఇతర మతస్థుల విమర్శలు కూడా ఎన్నో గలవు. అటువంటి విమర్శకులు మావద్దకు వచ్చి "మీరు ఎంతో ఖచ్చితముగా సత్యమైన విషయములు తెలుపుచున్నారు గదా! అటువంటపుడు మీరు మా ప్రశ్నలకు సమాధానమిస్తారా" అని అడిగారు. అందులకు సమాధానముగా మేము ఆధ్యాత్మికములో సత్యమైన జ్ఞానవిషయాలనే తెలుపుచు జీవితమును సాగించాలనుకొన్నాము. కావున మీ ప్రశ్నలకు జవాబులు నాకు తెలిసి ఉంటే తెలుపగలను, లేకపోతే నాకు తెలియదని చెప్పగలను అడగండి అని తెలిపాము. అపుడు వారు అడిగిన మాటలిలా ఉన్నవి.

1) **ఇ**ందూమతములో విఘ్నేశ్వర పండుగ అని చేస్తున్నారు కదా! విఘ్నేశ్వరుడు అంటే విఘ్నములకధిపతియని కదా అర్థము. విఘ్నములంటే అడ్డంకులు, ఆటంకములు అని కదా అర్థము, అటువంటి ఆటంకములకు అధిపతియై, ఆటంకములు కలుగజేయువానిని శత్రువుగ భావించి దూషించాలి, కానీ పూజించడమెందుకు? చెడ్డ చేయువాడు బలమైనవాడైతే వానిని ఎవరు వ్యతిరేఖించక పొగిడినట్లు, మీరు చేయు భక్తి కూడ విఘ్నేశ్వరుడు విఘ్నములు కలిగిస్తాడని భయపడి, భయముతో పూజ చేయు చున్నట్లున్నది. కానీ భక్తితో కాదని తెలియుచున్నది దీనికి మీరేమంటారు?

2) **ఎ**ంతో భక్తిగ, మరి ఎంతో ఖర్చుతో ఎంతో అందముగ తయారు చేసుకొన్న విఘ్నేశ్వరుని ప్రతిమలను మిగులభక్తిగ పూజించుకొని, ముందు రోజు చూపిన భక్తినంతటిని ఏటిలో కలిపి, విఘ్నేశ్వరున్ని నీటిలోనికి విసిరి

వేయడము మంచిదా? ఇక చాలు నీ సహవాసము అన్నట్లు వినాయకున్ని నీటిలోనికి త్రోసి చేతులు దులుపుకోవడము భక్తి అంటారా?

3) **ప**దిరూపాయలు పెట్టి దైవజ్ఞానము తెలుపు గ్రంథము కొనుక్కోవడానికి బాధపడు వారిని మీరెందరో చూచివుంటారు. అటువంటి వారు సహితము వేలు ఖర్చుపెట్టి వినాయక ప్రతిమలు చేసి వాటిని విరగగొట్టి వారి డబ్బును వృథా చేసుకొనుచున్నారు. కొందరు బలవంతముగా ప్రతిమల ఖర్చుకని ఇతరులనుండి డబ్బును వసూలు చేయుచున్నారు. ఇలా బలవంతముగ వసూలు చేయడము బలవంతపు భక్తి కాదా?

4) **ఒ**కే రకముగ, ఒకే పద్ధతిగ, ఒకే విధముగ అవయవములు కల్గి పుట్టిన మనము, ఒకే దేవుని బిడ్డలమని మరచి, మతద్వేషములను పెంపొందింపజేసుకొను అధ్యాయములో వినాయక పండుగను ఉపయోగించుకొనుచున్నాము. జ్ఞానమును పొందిన యోగులుగ మీరేమంటారు?

ఈ విధముగ అడిగిన వారికి వినాయక చవితి పండుగ రహస్యము మేము చెప్పవలసి వచ్చినది. వారి ప్రశ్నలకు సరైన జవాబులు అందివ్వకపోతే, వారి హృదయములో వినాయక పండుగ మీద ఉన్న భావము మార్చలేము. మనకు గొప్పదైనప్పటికి అడుగువారికి చిన్నదిగనే కన్పిస్తుంటుంది. కావున నిజార్థాన్ని చెప్పక తప్పదు కావున ఇలా చెప్పాను. ప్రపంచ పుట్టుక సమయములో మతములు అనునవి లేవు. దేవుళ్ళను వారూ లేరు, దేవుడొక్కడను విషయము అందరికి తెలుసు. కొంత కాలమునకు అటువంటి అవగాహన మనుష్యులలో క్షీణింప మొదలిడినది. ఆ సమయమున తత్త్వవేత్తలైన మహాత్ములు కొందరు యోచించి, అజ్ఞాన బీజమును తీసివేయుటకు, దైవత్వమును గూర్చి ప్రచారము చేయబూనినారు.

దేవునికి రూపములేదు, కావున ముక్కు ముఖములేని రాయిని (లింగమును) గుర్తుగా పెట్టి, దేవుడు ఇట్లుంటాడని రూపములేని వానిగా బోధించారు. ఆయనకు (దేవునికి) పేరులేదు, కావున ఈశ్వరుడని పిలిచారు. ఈశ్వరుడనగా అధిపతియని అర్థమేకాని పేరుకాదు. ఇట్లు సర్వమునకు అధిపతియైన వాడొకడున్నాడని రూపములేని గుండును చూపించి, తెలియకుండ పోయిన దైవత్వమును గురించి ఆనాటి పెద్దలు తెలియజేశారు.

ఇట్లు జ్ఞానరీత్యానే కాక, సంఘరీత్యా కూడ రెండు విధముల మానవున్ని నడిపించుటకు ఆనాటి పెద్దలు కృషి చేశారు. ఈనాడు మనము **'సామెత'** అను పదమును ఆనాడు **'సమత'** అనెడివారు. పెద్దలమాట మారనిదనీ, నిజమనీ, చెడని వాక్యమనీ చెప్పుటకు సమానముగా **"పెద్దలమాట పెరుగన్నము మూట"** అనుట నేటికీ కలదు. పెద్దలమాటకు సమతగా పెరుగన్నపు మూటను వాడినారు. సమత అంటే సమానమని అర్థము. అట్లే **"చింత లేనమ్మకు సంతలో నిద్రవచ్చె"** అనుట కూడ గలదు. చింత లేనమ్మకు సంతలో నిద్రకు సమానముగా (సమతగా) పోల్చి చెప్పడమన్న మాట. ఇటువంటి సమత అను పదము కొంతకాలమునకు పలుకడములో **'సామత'** గా మారినది. అట్లే మరి కొంతకాలమునకు సామత పోయి **'సామెత'** గా మారిపోయి నేడు మన ముందరున్నది. ఇటువంటి ముఖ్యమైన సామెతలను ఎన్నిటినో పూర్వము మానవుని సంఘములో సక్రమముగా నడుపుటకు పెద్దలుంచారు. ఆ విధానము ప్రకారమే సమాజములోని ఒక చెడును తీసివేయడానికి సమాన పోలికతో, సంఘములో బలహీనుని ఎలుకగా పోల్చి, బలవంతుని ఏనుగుగా పోల్చి చెప్పెడివారు. బలవంతుడు బలహీనునిపై పెత్తనము చెలాయించి పీడించడమును **"ఎలుకపై ఏనుగు స్వారీ చేసినట్లు"** అని సామెతను

అనెడివారు. ఇది సంఘవిద్రోహ చర్య కావున ఇది మంచిదికాదనీ అందరికి తెలియునట్లు, నోటితో చెప్పడమే కాకుండా దృశ్యరూపముగా కంటికి కనిపించెడి కార్యక్రమముగా చూపించెడి వారు. ఒక చిన్న ఎలుకను ఉంచి, దానిమీద పెద్ద ఏనుగును ఆసీనమైనట్లు చేసి, అది అందరికి తెలియునట్లు ఊరంతా ఊరేగించి, చివరకు ఈ పద్ధతి మంచిదికాదన్నట్లు ఆ దృశ్యమును నాశనము చేసెడివారు. వారు ఆ దినము మట్టితో చేసిన బొమ్మలను అగ్నిలోవేసి కాలిస్తే ఇంకా గట్టిపడి చెక్కు చెదరకుండావుంటా యని, నీటిలో అయితే పూర్తిగా కరిగిపోతాయని నీటిలో ముంచెడివారు. నీటిలోనికి వేసిన తర్వాత ఆ దృశ్యము తొందరగా నాశనమగుటకు నీటిలో వేయకముందే ఆ బొమ్మకు కాళ్ళు, చేతులు విరగగొట్టి పూర్తి నీటిలో కలిసిపోయేటట్లు చేసెడివారు. ఇది ఆనాటి సంఘ సంస్కరణ నిమిత్తమైన ఆచరణ. ఈ కార్యము ప్రతి సంవత్సరము ఒక ఆచరణగా చేయడము నేటికీ మిగిలివున్నది. కానీ అర్థము మాత్రము తెలియకుండా పోయినది. ఒకరు చేస్తూ ఉంటే ఇంకొకరు ఆ ఆచరణ చేయడమే నేడు తెలిసిన విధానము, అంతే తప్ప అర్థమును గూర్చి ఎవరూ ఆలోచించడము లేదు. ఒక మతస్థులు చేయుచున్న ఆచరణ పూర్వము గొప్ప భావముతో పెట్టినదని ఆ మతస్థులకే తెలియనపుడు, ఇతర మతస్థులు అపార్థము చేసుకోవడములో తప్పులేదు. కానీ నిజమైన అర్థమునూ, ఆచరణనూ తీసుకొన్నపుడు అందులో విమర్శించునది ఏమీలేదు. ఎవరూ విమర్శించలేరు, అసలైన అర్థము తెలిసినపుడు అన్ని మతస్థుల మద్ధతు లభిస్తుంది.

మేము ముందే చెప్పాముగా! పూర్వము మతమను పేరు లేని ప్రజలకు దేవుడొక్కడను భావముండేదనీ, దేవునికి రూపము, పేరులేదను గుర్తింపుకే రాతిలింగమును ఉంచినారనీ, అయినప్పటికీ కాలక్రమమున

ధర్మములు అధర్మములుగా మారునను గీతావాక్యానుసారము, కొంత కాలమునకు మానవులలో అజ్ఞానవశమున ఏకత్వము పోయి, మేము మీరు అను గుంపులుగ చీలిపోయిన వారికి కూడ పేర్లుండేవి. అట్లు కొంత కాలమునకు ఏర్పడిన గుంపులే వైష్ణవులు, శైవులు. పూర్వము వైష్ణవులు, శైవులు సాంప్రదాయములను ఏర్పరుచుకొని, ఇవి మా సాంప్రదాయములు అనుచు, వాటి భద్రత కొరకు కొన్ని పురాణములను వ్రాసి, అవి ప్రజలందరికీ తెలియునట్లు చేసి, వారి సాంప్రదాయములను భద్రము చేసుకొన్నారు. అటువంటి పురాణములలో శైవుల సంబంధమైన "శివపురాణము" పుట్టినది.

**ఇట్లు శైవమేర్పడు రెండువేల సంవత్సరములకు ముందే సమాజములో చెడును ఏనుగుగా, ఎలుకగా చూపించి నీటిలో ముంచివేయు ఆచరణ గలదు.** ఆ ఆచరణ చేస్తూ చేస్తూ పెద్దలు చనిపోతూరాగ, చిన్నలు వారిననుసరిస్తూ చేస్తూ, చివరకు ఎందుకు ఈ కార్యక్రమము చేస్తున్నామనునది ఎవరికీ తెలియకుండా పోయినది. అర్థము ఇది అని తెలియక ఎంతో మంది కలిసి ఆనందముగా ఎలుకను ఏనుగునూ ఊరేగిస్తున్నాము. ఇదేదో గొప్ప భక్తి కార్యమనుకొని ఆ ఏనుగాకారానికి మ్రొక్కను మొదలిడినారు. అట్లు శైవముద్భవించు దినములకే ఎలుక ఏనుగు బొమ్మలను మ్రొక్కువారు గలరు. కనుక శైవులు శివపురాణములో ఎలుకకు ఏనుగుకు విశిష్టత కల్పించి, ఏనుగు తల కల్గినవాడు వినాయకుడనీ, పార్వతి కుమారుడనీ ఉన్న భక్తిని ఇంకొంత ఎక్కువగునట్లు మంచిపనియే చేశారు. అప్పటినుండి ఏనుగు బొమ్మపోయి ఏనుగు తలమాత్రమున్న వినాయకుని బొమ్మవచ్చినది. ఉన్న భక్తిని ఎక్కువ చేయుటవలన వినాయకుని బొమ్మలు చేయువారు ఎక్కువైనారు. డబ్బు ఖర్చుపెట్టి పూజించువారు ఎక్కువైనారు, కానీ నీళ్ళలో వేసి త్రొక్కే పూర్వ ఆచరణను మాన్పించలేక పోయినారు. ఈ విధానమును

మాన్పించలేని పెద్దలు వినాయక నిమజ్జనమును నీటిలోనే చేయుచున్నా మన్నారు. నిమజ్జనమనగా స్నానమని అర్థము కానీ విరగగొట్టడము, పూజించిన దేవున్ని కాలదన్నడము కాదని తెలియాలి. మీరడగిన మొదటి ప్రశ్నలో విఘ్నము కలిగించు విఘ్నేశ్వరున్ని దూషించాలి, కానీ పూజించ కూడదన్నారు కదా! అసలుకు విఘ్నేశ్వరున్ని దూషించడానికి ఆయన మనకే విఘ్నముగానీ, ఏ చెడ్డగానీ చేయలేదు కదా! అందువలన ఆయనను దూషించ వలసినది లేదు. భక్తి కలిగి విఘ్నేశ్వరుని పూజించడములో తప్పులేదు, కానీ పూజించిన వానిని పూజించినట్లే ఉంచుకొని ఉంటే బాగుండేది. నీటిలో పారవేయడము మంచిది కాదు. ఒకమాటకొస్తే దానిని దూషించుటకు, పూజించుటకు కాక సంఘములోనున్న అన్యాయము ను బహిర్గతము చేయడానికి ఊరేగించు ఊరేగింపుయనీ, అట్లే దానిని లేకుండా చేయవలయునను ఉద్దేశమే ఆ బొమ్మను నీటిలోముంచి నాశనము చేయడమనీ అందరూ తెలియవలెను.

మీరడిగిన మరొక ప్రశ్న ప్రకారము బలవంతముగా డబ్బు వసూలు చేసి ఉత్సవము చేయడము పద్ధతికాదు. భక్తిలో కూడ అది బలవంతపు భక్తి అగును, కానీ మనస్ఫూర్తి భక్తికాదు. ఇష్టము లేకుండా ఇచ్చినవారు అడిగిన వారినేకాక, విఘ్నేశ్వరున్ని కూడ నిందించుటకు అవకాశము గలదు. అందువలన ఇంకొకరితో డబ్బు వసూలు చేయడము మంచిది కాదు.

పూర్వకాలములో సమత అను పదము సామతగా మారి చివరకు సామెతగా మారినట్లు, ఆ రోజు పెద్దలుంచిన సంఘసంస్కరణ పద్ధతియైన **ఎలుక ఏనుగు ఊరేగింపు** నేడు భక్తిరూపముగా మారిపోయినది. పురాణముల ప్రభావము వలన ఏనుగు రూపు కాస్త వినాయకుని రూపుగా మారినప్పటికీ ఆచరణ పూర్తి మారక పూర్వాచరణే చేయుటవలన ఇతర

మతస్థులైన కొందరిచేత విమర్శింపబడుచున్నది. ఆచరణను పూర్తి భక్తి భావముగా మార్చుకున్ననూ ఫరవాలేదు, లేక ముందుమాదిరే సంఘరీత్యా పెట్టుకొన్నా ఫరవాలేదు. కానీ అటు ఇటు కాక చేయుచున్న పనికి అర్థము తెలియకపోవడము వలన ఇతర మతములచేత, చూచువారిచేత విమర్శింప బడు కార్యమైనది. వినాయకుని నిమజ్జనము (స్నానము) అను పేరుతో చిన్న చిన్న బొమ్మలను నీటిలోనికి విసురుచుండుట చూస్తే, నిజముగా భక్తి అనిపించదు. సరదాగా చేయుచున్న పనిగా కన్పిస్తున్నది, కానీ పూర్తి భక్తిగా కనిపించుపనిగా తోచడము లేదు. ఊరేగింపులందామా? కొన్ని చోట్ల పీర్లపండుగ మాదిరి త్రాగి చిందులు వేయడము, కర్రసాములు చేస్తూ పోవడము చూస్తే అల్లరి సాంప్రదాయమేగానీ, అర్థసాంప్రదాయము కాదనిపిస్తుంది. ఆనాడు మనపెద్దలు సమాజములోని చెడును తీసివేసి సమ సమాజమును స్థాపించుటకు చేసి చూపిన దానిని అర్థము చేసుకోలేక, వారి అర్థమును తుంగలో త్రొక్కి, మన ఇష్టమొచ్చినట్లు మనము వినాయక చవితిని చేసుకొనుచున్నాము. ఇటు చదువుకొన్నవారు, అటు చదువులేని వారు మూఢముగా పెద్దల ఉద్దేశమును మట్టిలో కలిపివేసి అర్థరహితమైన వినాయకచవితిని చేస్తున్నారు.

ఇక్కడ ముఖ్యముగ చెప్పుకోవలసినదేమనగా! కృష్ణుడు భగవంతు డైనా, దేవుని అంశ కృష్ణునిగా భూమిమీదికి వచ్చి మన జీవితముల సారాంశమైన భగవద్గీతను చెప్పినా, భగవంతుడుగానీ, భగవద్గీతగానీ నేటి మానవులకు గొప్పగ కనిపించక, భగవంతుని పుట్టిన రోజు పండుగైన కృష్ణాష్టమిని చేయక, దాని స్థానములోనికి వినాయక చవితిని తెచ్చి పెట్టుకొన్నారు. కృష్ణాష్టమి పదకొండు రోజుల పండుగని ముందే చెప్పుకొన్నాము. అంతేకాక కలియుగ ప్రారంభములో పెద్ద ఎత్తున చేయు

వీధి పండుగ కృష్ణాష్టమి ఒక్కటేనని కూడ చెప్పాము. మాయా ప్రభావము చేత ఒక్కరోజు చేయు వినాయకచవితి పదకొండు రోజులైంది. పదకొండు రోజులు చేయు కృష్ణాష్టమి ఒక్కరోజుకు పరిమితమై పోయినది. అంతేకాక పూర్వము కృష్ణాష్టమి పండుగ ముగింపు దినము భాద్రపదమాస శుక్లపక్ష చవితిరోజు అగును. సరిగ ఆ దినమునే వినాయక చవితిగా లెక్కించడము వలన, కృష్ణాష్టమి ముగింపు పదకొండవ దినమునకు ఆటంకమేర్పడినది. ఈ విధముగా కృష్ణాష్టమికి ఆటంకముగా వినాయకచవితి రావడము వలన హిందూ (ఇందూ) సంస్కృతిలోని ముఖ్యమైన కృష్ణాష్టమి పోయి, ముఖ్యము కాని వినాయకచవితి వచ్చి చేరిపోయినది. కృష్ణాష్టమి ముగింపు దినమైన పదకొండవ దినమే వినాయకచవితి ప్రారంభమగుట వలన, కొందరు వినాయకచవితిని వదలలేక కృష్ణాష్టమిని ఒక్కరోజు పండుగగా కుదించి, శ్రావణ బహుళ అష్టమి రోజు మాత్రము కృష్ణాష్టమిని చేయుటకు మొదలు పెట్టారు. అలా చేయడము వలన మనము మన ముఖ్యమైన సాంప్రదాయము తెలియకనే వదలుకొన్నట్లయింది. ఆ విధముగా సంవత్సరములో ఒక్కరోజు పండుగగా కృష్ణాష్టమి మారిపోయి కొంతకాలము గడువగా, కాలక్రమమున ఆ ఒక్కరోజు పండుగను కూడ మరచిపోయి, కృష్ణాష్టమి అంటే ఏమిటో తెలియనిస్థితికి మనము వచ్చాము. ఇంకా విశేషమేమంటే కొన్ని ప్రాంతము లలో కృష్ణుడు పెరిగిన కులమైన యాదవులకు (గొల్లవారికి) కూడ కృష్ణాష్టమి గురించి తెలియకుండా పోయినది. సాక్షాత్తు దేవుడు అవతరించి భగవంతునిగా వచ్చిన మొదటి దినమైన కృష్ణాష్టమి, నేడు ఆదరణలేనిదై, అర్థములేనిదై, ఆచరణలేనిదై పోయివుంటే, దైవత్వముకాని ఒక సమాజ శ్రేయస్సు విషయము, మాయబలము వలన దైవస్థానమును ఆక్రమించి అందరిచేత ఆదరణ పొందుతూ, అందరిచేత ఆచరింపబడుచున్నది. ఈ

విధముగా సమాజములో వినాయకచవితి వీధిపండుగగా మారిపోవడము, అంతేకాక పదకొండు రోజుల పండుగగా మారిపోవడము, కృష్ణాష్టమి అన్ని విధములుగ ఆదరణలేకపోవడము మాకు చాలా బాధకల్గించిన విషయము. నాకే కాదు ప్రతి హిందువు (ఇందువు) బాధపడవలసిన విషయము. ప్రతి ఒక్కరు వెనుతిరిగి చూచుకోవలసిన విషయము.

ఇందూ (హిందూ) ధర్మములకు పూర్వవైభవము రావాలంటే, ఇందుత్వము అందరికి ఆమోదయోగ్యము కావాలంటే, ఈనాటి ఆచారములను మానుకొని, ఆనాటి ఆచారములను అమలు చేయాలి. ఇంత చెప్పినా కొందరు మొండిగ వాదిస్తూ, వినాయకచవితి కూడ హిందూ ధర్మములకు సంబంధించినదే కదా! పార్వతీదేవికి, శివునికి పుట్టినవాడే కదా! వినాయకుడు అని అడుగవచ్చును. నేను మొదటినుండి మనకు శాస్త్రమే ఆధారమని చెప్పుచునే ఉన్నాను. పార్వతి, వినాయకుడు భగవద్గీత కంటే ముందు వ్యాసునిచేత వ్రాయబడిన ఒక పురాణగాథ నుండి వచ్చినవారు. వినాయకుని పుట్టుకే అశాస్త్రీయము, ప్రకృతికి విరుద్ధము అవుతుంది. తండ్రికి తెలియకుండ కొడుకు పుట్టడమేమిటని ఎవరైనా ప్రశ్నించినా, తండ్రి సంబంధము లేకుండ తల్లి కొడుకును ఎలా పుట్టించుకొన్నదని ఎవరైనా అడిగినా, మనము సరియైన శాస్త్రబద్ధమైన సమాధానము చెప్పలేము. అలా పుట్టినవాడు తల్లి కొడుకే అగును, కానీ తండ్రి కొడుకు కాడు. తల, మొండెములు వేరువేరుగా ఉన్న నరసింహస్వామి, వినాయకుని కథలు పురాణములే అగును. కానీ శాస్త్రబద్ధమైన చరిత్రలు కావు. కవులు సృష్టించిన కథలను విడచి వాస్తవ చరిత్రగల విషయమునే స్వీకరించవలెను. నాగుల చవితికి శాస్త్రీయత కలదు. అలాగే వినాయకచవితికి శాస్త్రీయత గలదు. ఈ రెండూ సమాజ శ్రేయస్సుకు సంబంధించినవని తెలియుచుండినా,

శాస్త్రీయతను వదలి నాగులచవితికి, వినాయకచవితికి అశాస్త్రీయతను అంటగట్టకూడదు.

కొందరు హిందూ (ఇందూ) మతమును రక్షించుతామని, హిందూ ధర్మములను కాపాడుతామని చెప్పుచు, హిందూధర్మరక్షణ అను నినాదముతో కొన్ని పేర్లు గల సంఘములను స్థాపించుకొని, వారి ఆధిపత్యము కొరకు హిందూ ధర్మములను భక్షించుచున్నారు. అటువంటి వారికి హిందూ ధర్మములంటే ఏమిటో, అవి ఎట్లుంటాయో కూడ తెలియదు. అటువంటి వారా హిందూ ధర్మములను కాపాడేది? అటువంటి సంస్థలు ఇతర మతముల మీద దౌర్జన్యము చేస్తూ హిందుత్వము శాంతి స్వరూపమైనది కాదు అనునట్లు చేయుచున్నారు. అటువంటివారు తమ పేరు ప్రఖ్యాతుల కొరకు మాలాంటి వారిని కూడ అవమానిస్తున్నారు. అటువంటివారిని లెక్కచేయక, ఇందూ ధర్మముల ప్రకారమే జ్ఞానము తెలిసినవారు ప్రవర్తించాలి. భగవద్గీత తెలిసిన తర్వాత పురాణములను వ్రాసిన వ్యాసుడే తాను పురాణములను వ్రాసి తప్పు చేశానని బాధపడి పశ్చాత్తాపముతో కృంగిపోయాడు. వ్రాసిన వ్యాసుడే బాధపడితే, ఆ విషయము తెలియక మనము ఆ పురాణముల ఆధారముతోనే నాగులచవితి, వినాయకచవితి ఇష్టానుసారము చేస్తే మనము దైవద్రోహము చేసినట్లే. అసలైన హిందూ ధర్మములను కించపరిచినట్లే. అందువలన అధర్మములైన పద్ధతులను వదలి ధర్మములైన పద్ధతులనే ఆచరించాలి. ఆ ప్రయత్నములో వినాయక చవితిని వదిలివేసి కృష్ణాష్టమిని చేద్దాము. కృష్ణాష్టమిని పదకొండురోజులు జరిపితే వినాయకచవితిని చేసుకొను అవకాశము లేకుండ పోవును. పదకొండవ రోజు వినాయకచవితి అగును. ఆ దినమున కృష్ణుడు పందిరిలో ఉండుట వలన వినాయకునికి పందిరే ఉండదు. అందువలన భగవంతుని

పండుగ కోసము భగవంతుడుకాని వినాయకుని పండుగను వదలివేసినా తప్పులేదు.

భూమిమీద చాలామందికేకాక ఒక విధముగ అందరికి తెలియని రహస్యమొకటి కలదు. అదియే దేవుని పాలన. దేవుని పాలనలో మహా భూతములు, భూతములు, ఉపభూతములు పాత్రధారులుగా ఉండి భూమి మీద పాలన సాగించుచున్నవి. ఈ విషయము భగవద్గీతలో శాస్త్రబద్ధముగా కలదు. దేవుడు ఏమీ చేయడు, చేయునదంతా మూడు రకముల భూతములే. దేవునికి వ్యతిరేఖమైన పనులు చేయువారి మీద భూతముల దృష్టి ఉండునని కూడ ఒక గ్రంథమందు వివరముగా చెప్పడము జరిగినది. దేవతల దర్శనార్థము పోవునపుడు, వచ్చునపుడు పాల్గొన్నపుడు, పెళ్ళిళ్ళలకు పోవునపుడు, వచ్చునపుడు ఎక్కువగా ప్రమాదములు జరుగుటకు భూతములే కారణమని కూడ చెప్పాము. ప్రతి సంవత్సరము వినాయకచవితి పండుగలలో వినాయక నిమజ్జన సందర్భములో చాలా ప్రదేశములలో ఒకరు, ఇద్దరు లేక ముగ్గురు ప్రమాదవశాత్తు చనిపోవడము జరుగుచున్నది. ప్రతి సంవత్సరము అలా జరుగుచున్నా ఎందుకిలా జరుగుచున్నదని ఎవరికీ అర్థము కావడము లేదు. అది భూతముల పని అని ఎవరికీ తెలియడము లేదు. వినాయకచవితి సందర్భములో దేశము మొత్తము వేలాదిమంది చనిపోతున్నారు. భూతములనుండి వచ్చు అటువంటి ప్రమాదములు లేకుండ పోవాలంటే పంచభూతములకు ఇష్టములేని వినాయకచవితిని మానివేసి, భూతములకు ఇష్టమున్న దేవుని ఆరాధన అయిన భగవంతుని జన్మదినమును పండుగగా చేసుకోవడము మంచిది.

అన్నిటిని గమనించిన తర్వాత ఈ గ్రంథమును చదివిన ప్రతి ఒక్కరు, కృష్ణాష్టమిని చేయుటకు, అందరికంటే ముందుగా మొదలు పెట్టండి.

కృష్ణాష్టమిలో వినాయకచవితివలె ఖర్చు ఉండదు, ప్రమాదము ఉండదు. ప్రతి సంవత్సరము ప్రతిమలను కొను అవసరము లేదు. ఇంటిలోని ప్రతిమను వీధిలో పెట్టి, పదకొండురోజులు ఉత్సవములు చేసి ఆ ప్రతిమను తిరిగి ఇంటిలో పెట్టుకోవలెను. ఎట్టి పరిస్థితిలోను కృష్ణ ప్రతిమను నీటిలో నిమజ్జనము చేయడముగానీ, ఎక్కడైనా పారవేయడము గానీ జరుగకూడదు. చివరిరోజు ఊరేగింపు తర్వాత కృష్ణ ప్రతిమను ఇంటిలోనే పెట్టుకోవాలి. వినాయకచవితి సమయములో చందాల వసూళ్ళే ఎక్కువగా జరుగుచున్నవి. అందులో వినాయక భక్తికంటే డబ్బుల వసూళు ముఖ్యపాత్ర పోషిస్తున్నవి. ఇవ్వడానికి స్థోమతలేని వారివద్దకూడ బలవంతముగా డబ్బులు వసూలు చేయడము జరుగుచున్నది. కృష్ణాష్టమిలో అటువంటి విధానముండదు. వర్షానికి తడవని విధముగా పందిరిని ఏర్పాటు చేసి అందులో కృష్ణప్రతిమ పెట్టి, కొబ్బరి కాయకొట్టి ఆరాధిస్తే చాలు. కృష్ణుని ముందర వినాయకుని పందిరిలో పెట్టినట్లు సినిమా పాటలను పెట్టడముగానీ, కాలక్షేపమునకు జూదమాడడముగానీ మంచిది కాదు. కర్ణాటక ప్రాంతములో ప్రతి వినాయక పందిరిలోను జూదమాడడము అలవాటుగా ఉన్నది. అటువంటి పనులు కృష్ణప్రతిమ ముందర చేయకూడదు. కృష్ణపందిరిలో పదకొండురోజులు ప్రత్యేకముగా గీతా పఠనము జరుగునట్లు ఏర్పాటు చేయవలెను. అదియు గాయకులు గానము చేసిన భగవద్గీత రికార్డు పెట్టకూడదు. శుచిశుభ్రతలతో ఎవరైనా గీతను ఉదయము, సాయంకాలము పఠించవలెను. కృష్ణుని పందిరిలో వేదమంత్రములు నిషేధము. కృష్ణుని పూజలో వేదమంత్రము లను వాడకూడదు. మంత్రరహితమైన సాధారణ పూజ చేయడము మంచిది. మత్తు పానీయములు త్రాగినవారు కృష్ణప్రతిమవున్న పరిసర ప్రాంతములోనికి పోకూడదు. పోయినా అప్పుడు ఏమీకాదు, కానీ తర్వాత వాని ఆరోగ్యములో

ఎంతో తేడావచ్చును. నయముగాని రోగములు తగులు కొనును. రోగములు కూడ భూతములే కావున, భూతములు కృష్ణున్ని అనగా భగవంతున్ని కించపరచిన వానిని వదలవు. ఇప్పటికే భగవంతున్ని వదలి ఇతర దేవతలను ఆరాధించువారిని ప్రమాదములలో చిక్కుకొనునట్లు గానీ, ఆరోగ్యములో అనేక సమస్యలు వచ్చునట్లుగానీ భూతములు చేయుచున్నవి. అందువలన వారి కోపమునకు గురికాకుండ అన్యదేవతలను వదిలి కృష్ణాష్టమిని చేసిన వారికి దేవుని పాలనలో పాత్రధారులైన భూతములు సహకరించును. భగవంతుడు చెప్పిన జ్ఞానమును తెలుసుకొంటే, శరీరములో రోగములుగా వున్న భూతములు కూడ అటువంటి వారిని గౌరవించి తమ రోగములను వానికి లేకుండాచేయును. అంతేకాక నేడు జరుగు ప్రకృతి వైపరీత్యములు చిన్నదాని నుండి పెద్దదానివరకు అన్నియు దేవుని పాలకులైన భూతముల వలననే జరుగుచున్నవి. కృష్ణాష్టమిని భక్తితో చేయుట వలన ఆ ప్రాంతములో ప్రకృతి (భూతముల) వైపరీత్యములు తగ్గిపోవును. వర్షము కూడ భూతముల వలననే వచ్చుచున్నది. అందువలన భగవంతుని భక్తి కల్గియున్న ప్రాంతములో వర్షములు సక్రమముగా కురియును. ఇదంతయు కవిత్వము కాదు, నగ్నసత్యము. భూతములంటే ఏమిటో, దేవుని పాలన అంటే ఏమిటో, ఎవరికీ తెలియదన్నాము కదా! ఆ విషయములు తెలియాలంటే మేము రచించిన **"దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు"** అను గ్రంథము చదివితే దేవుని పాలన అంటే ఏమిటో, భూతములు అంటే ఏమిటో తెలియును.

మీరు తెలివితక్కువ వారు మాత్రము కాదు. కానీ హేతుబద్ధముగా ఆలోచించని దానివలన తెలివి తక్కువ వారు ప్రవర్తించినట్లు ప్రవర్తించు చున్నారు. అదెలా అనగా! కృష్ణునికి చరిత్రవుంది, కృష్ణుడు మనలాగే

పుట్టాడు, ఆయన పుట్టిన తేదీవుంది. ఆయన చనిపోయిన సంవత్సరమూ ఉంది. కానీ విఘ్నేశ్వరుడు పుట్టిందే లేదు, ఆయన చరిత్రే లేదు. కేవలము పురాణాలలో కల్పించబడ్డాడు. మాయచే కల్పించపబడి అసలైన భగవంతుని గా పూజింపబడుచున్నాడు. వాస్తవానికి వినాయకుడు ఉన్నాడా లేడా? అని ఎవరూ యోచించక గ్రుడ్డిగా ప్రవర్తించడము వలన, నాస్తికవాదులు హేతుబద్ధతలేని వినాయకున్ని లేడనడమేకాక, శాస్త్రములను తెలిపిన దేవున్నే లేడంటున్నారు. వ్యాసుడు అజ్ఞాన దశలోనున్న వయస్సులో పురాణములు వ్రాయడము, అందులో వినాయక పాత్రను వ్రాయడము జరిగినది. పురాణములన్నియు కాలక్షేపమునకు వ్రాయబడినవే తప్ప, కర్మక్షేపమునకు కాదు. వినాయకుని జీవితమును గురించి ఏమాత్రము తెలియని మనుషులు వినాయకుని ఉత్సవములు చేయడములో ముందున్నారు. కృష్ణుని జీవితము తెలిసినా, కృష్ణుడు మానవుల జీవితమునకు సంబంధించిన మరియు మనిషి కర్మలనుండి బయటపడు జ్ఞానమును చెప్పినా, కృష్ణాష్టమి చేయనివారు, వినాయకుని జీవితమేమిటో తెలియకున్నా మరియు వినాయకుడు మనిషికి అవసరమైన ఏ జ్ఞానమును చెప్పకున్నా, వినాయకచవితిని చేయుచున్నారు. నేను మిమ్ములను హిందూమతమును వదలి వేరే మతములోనికి రమ్మని చెప్పడము లేదు. హిందూ (ఇందూ) పథములోని ఔన్నత్యమును తెలుసుకొని, ఇందూధర్మములను తెలిపిన కృష్ణున్ని భగవంతునిగా గుర్తించి, ప్రతి సంవత్సరము కృష్ణాష్టమిని చేయమని, అట్లు చేయడము వలన మీ కర్మలు పోవునని తెలుపుచున్నాము.

కృష్ణున్ని భగవంతునిగా గుర్తించక పోయిన కారణము వలన ఆయనను అశ్రద్ధ చేశాము. అంతేకాక కృష్ణున్ని శృంగారపురుషునిగా కవులందరు వ్రాయడము వలన, కృష్ణున్ని చిల్లర మనిషిగా లెక్కించు

కొన్నాము. భాగవతపురాణములో కృష్ణుడు మధురకు పోయి కంసున్ని చంపకముందే గోపికలతో తిరిగే వాడని, వారితో శృంగారములో పాల్గొనెడి వాడని, స్వయాన పోతన కవియే తెలుగులో వ్రాశాడు. సంస్కృతములో వ్యాసుడు కొంత విడ్డూరముగా వ్రాస్తే, దానిని తెలుగులోనికి అనువదించిన పోతన ఇంకా కల్పితము చేసి మరీ విడ్డూరముగా వ్రాశాడు. కృష్ణుడు మధురకు పోయినది, కంసున్ని చంపినది ఆయనకు పదకొండు సంవత్సరముల వయస్సులో జరిగినది. పదకొండు సంవత్సరములకే ఏ మనిషైనా స్త్రీలతో సంయోగము చేస్తాడా? శృంగారములో పాల్గొంటాడా? ఈ మాటలు విడ్డూరము కాదా! ఆ విధముగా కృష్ణున్ని తప్పుగా వ్రాయడము వలన, దాని ఆధారముతో మనుషులలో మాయ గాఢంగా పనిచేసి, కృష్ణున్ని అల్లరి మనిషిగా లెక్కించుకొనునట్లు చేసింది. అందువలన కృష్ణుని విషయము చాలామంది ఆలోచించలేక పోయారు. 90 ఏళ్ళవయస్సులో కృష్ణుడు భగవద్గీతను చెప్పిన తర్వాత, పురాణములను వ్రాసిన వ్యాసుడు తన తప్పును తెలుసుకొని, పురాణములకు వ్యతిరేఖమైన భగవద్గీతను సంస్కృతములో శ్లోకముల రూపముగా వ్రాశాడు. అంతటి వ్యాసుడే తన తప్పును తాను తెలుసుకోగలిగి తన శ్లోకములలో కృష్ణుడు చెప్పిన ధర్మములను తెలియబరిచాడు. వేదపఠనము, తపస్సు, యజ్ఞములు ధర్మములుకావని అధర్మములని తాను వ్రాసిన శ్లోకములలోనే చెప్పాడు. అంతపెద్ద కార్యములే అధర్మములైనపుడు, మనము చేయు వినాయక చవితి కూడ అధర్మమే అగును. అందువలన ఇప్పటినుండి వాస్తవ విషయమును తెలుసుకొని, విశ్వవ్యాపి, సృష్ఠికర్త అయిన దేవుడు, భగవంతుడై కృష్ణునిగా వచ్చాడని, దేవుడే భగవంతునిగా గీతాజ్ఞానము చెప్పాడని, అదియే భగవద్గీతయని తెలిసి కృష్ణున్ని ఆరాధించి దేవునికి దగ్గరగుటకు ప్రయత్నిద్దాము. దేవుని దగ్గరకు చేరాలంటే ఆయన చిరునామ(అడ్రస్)

ఏమిటో మనకు తెలియదు.  ఆ చిరునామాను చెప్పువాడు ఎవడో వాడే భగవంతుడు, ఆ భగవంతుడే కృష్ణుడు. అందువలన కృష్ణుడు శరీరముతో మన మధ్యన ఉన్నపుడు ఆయన భగవంతుడైన దేవుడని, అట్లే ఆయన మన మధ్య శరీరముతో లేనపుడు దేవుడైన భగవంతుడని చెప్పవచ్చును. అర్థము కాలేదేమో మరొకమారు శ్రద్ధగా వినండి.  కృష్ణుడు భూమిమీద ఉన్న ద్వాపరయుగములో భగవంతుడైన దేవుడు అనియు, కృష్ణుడు భూమిమీద లేని కలియుగములో దేవుడైన భగవంతుడనియు చెప్పవచ్చును. ఇంతవరకు చాలామంది స్వామీజీలు, బోధకులు దేవునికి, భగవంతునికి వ్యత్యాసము లేకుండా చెప్పివున్నారు.  ఇప్పుడు అట్లు కాకుండ ఎవరు దేవుడో, ఎవరు భగవంతుడో గుర్తించి చెప్పుకోవలెను.

ఇంతవరకు కృష్ణుని మీద మనకున్న అపోహలన్ని తొలగించివేసి భగవంతుడైన కృష్ణున్ని తెలుసుకొందాము.  ఇంతవరకు భగవంతుడు చెప్పిన జ్ఞానమును తెలియని మనము  ఆయన తెలిపిన సారాంశమును గురించి తెలుసుకొందాము.  కృష్ణుని మీద భక్తిగల గోపి, గోపికలు ఆనాడే కాదు, ఈనాడు కూడ ఉన్నారని నిరూపిద్దాము.  కృష్ణుని మీద భక్తి భావమును పెంచుకొని అపార్థ భావమును లేకుండ చేసుకొందాము.  భూమిమీద కృష్ణుడు ఒక్కడే భగవంతుడని ఇతరులకు తెలియజేద్దాము. ఆ నేపథ్యములోనే వినాయక చవితిని వదలి, కృష్ణాష్టమిని చేద్దాము.  మనము చేయడమే కాక  అందరిచేత చెప్పి చేయిద్దాము.  హిందూత్వము మతముకాదు పథము (దారి) అని తెలియజేద్దాము.  భూమిమీద  ఏ మతమువాడైనా ఈ పథములోనికి రావలసిందేనని తెలియపరుస్తాము.  మీ మతములో ఏ దేవుడున్నాడో ఆ దేవుడే ఈ భగవంతుడని అర్థమగునట్లు చేస్తాము. ఇతరులను మార్చాలంటే ముందు మనము మారాలి.  మనము మారితే

మన దారినే ఇతరులు అనుసరిస్తారు. కావున మొదట మనము మారుటకు కృష్ణాష్టమితోనే మొదలు పెడదాము.



## కృష్ణుడు యాదవుడా, మాధవుడా?

కృష్ణుని తండ్రి వసుదేవుడు, తల్లి దేవకీదేవి. తండ్రి పేరులో రెండు పదములు తల్లి పేరులో రెండు పదములు గలవు. ఇద్దరి పేర్లలోను మొదటి పదములను చూస్తే తండ్రి పేరులో 'వసు' అను పదము, తల్లి పేరులో 'దేవకీ' అను పదములుగలవు. అలాగే చివరి పదములను చూస్తే తండ్రి పేరులో 'దేవుడు', తల్లి పేరులో 'దేవి' కలదు. దేవుడు అనగా ఆధ్యాత్మిక రీత్యా పరమాత్మ అనియు, దేవి అనగా ప్రకృతి అనియు అర్థము కలదు. దీనినిబట్టి చూస్తే కృష్ణునికి శరీరము యొక్క తల్లితండ్రులు కూడ ప్రకృతి పరమాత్మలను అర్థముగల పేర్లతోనే ఉన్నారని తెలియుచున్నది. ఇవి కృష్ణుని బాహ్య శరీరము యొక్క, బాహ్య తల్లితండ్రుల యొక్క ప్రత్యేకమైన పేర్లు. కృష్ణుని తండ్రి వసుదేవుడు యదువంశము వాడు. తల్లి దేవకీదేవి భోజ వంశములో పుట్టినది. వసుదేవుడు ఆనాడు గల సూర్య, చంద్ర వంశములను రెండు తెగలలో చంద్రవంశ తెగకు చెందిన క్షత్రియుడు. చంద్రవంశ క్షత్రియులలో వసుదేవునిది యదువంశము. వసుదేవునికి గల ఇద్దరు భార్యలలో పెద్ద భార్య పేరు రోహిణి, రెండవ భార్య పేరు దేవకీదేవి. పెద్ద భార్య రోహిణికి పుట్టినవాడు బలరాముడు. రెండవ భార్యకు పుట్టినవాడు కృష్ణుడు. కృష్ణుడు పుట్టిన తర్వాత గంటకే గోకులములోని నందగావ్‌యందు నందుని ఇంటిలోనికి వసుదేవుని ద్వారా పోయాడు. నందుడు ఆ ఊరిలో పెద్దమనిషి మరియు పాలెగాడు. కావున

ఆ ఊరికి నందగావ్ అను పేరు ఉండెడిది. ఒక రాజ్యమునకు అధిపతి అయిన వానిని చక్రవర్తి అని, అతని క్రింద కొంత ఏరియాలో జిల్లావారిగా పనిచేయు అధిపతులను సామంత రాజులని, ఒక ఊరికి మాత్రము పెద్దగ ఉండు అధిపతిని పాలెగాడని పూర్వము అనెడివారు. ఆ లెక్క ప్రకారము కంసుడనే రాజు క్రింద పాలెగాడుగా నందుడు ఉండెడి వాడు. నందుడు గొల్ల కులమునకు చెందినవాడు. వసుదేవుడు క్షత్రియుల కులమునకు చెందినవాడు. కంసుని చెల్లెలు దేవకీదేవి. కావున కంసుడు కృష్ణునికి మేనమామ అగును. వసుదేవుడు కన్నతండ్రికాగ, నందుడు కృష్ణున్ని పెంచిన తండ్రి అగును.

కృష్ణుడు పుట్టకముందు యాదవ్ అను పేరు ఎక్కడాలేదు. కృష్ణుడు మధురను విడచి ద్వారకకు చేరిన తర్వాత, మొట్టమొదట భీష్ముడు కృష్ణున్ని యాదవా అని పిలిచాడు. కృష్ణుడు రుక్మిణిని 32 సంవత్సరముల వయస్సులో పెళ్ళి చేసుకొన్నపుడు ఒక సందర్భములో కృష్ణుని గురించి భీష్ముడన్న మాట "కృష్ణుడు సామాన్యుడు కాదు, ఆయన యాదవుడు" అన్నాడు. కృష్ణుని జీవితములో కృష్ణున్ని బాగా అర్థము చేసుకొన్న వ్యక్తి భీష్ముడు ఒక్కడే. అందువలన భీష్ముడు మొదటినుండి కృష్ణున్ని ప్రత్యేకముగా చూచెడివాడు. కృష్ణుడు సాక్షాత్తు దేవుని అంశ అయిన భగవంతుడని, ఆ కాలములో భీష్ముడు తప్ప ఎవరూ గ్రహించలేదు. అలా తెలిసినవాడు భీష్ముడు, కావున ఆయన మరణములో తనకు మోక్షమును ఇమ్మని నేరుగా కృష్ణున్ని అడిగాడు. అలా అడుగుట వలన మోక్షమునకు అధిపతి దేవుడనీ, ఆ దేవుడే ఈ భగవంతుడని భీష్ముడు గుర్తించినట్లు మనకు అర్థమగుచున్నది. భీష్ముడు కృష్ణున్ని గుర్తించాడు. కనుక కృష్ణున్ని యాదవా అని సంబోధించాడు. ఆ విధముగా **"యాదవ"** అను పదము పుట్టినదని తెలియుచున్నది.

కృష్ణునితో యాదవ అను శబ్దము భూమిమీదకు వచ్చినది. కృష్ణుడు గొల్లవాడలలో తాను కూడ గొల్లకులస్థునిగా తిరిగిన దానివలన, కృష్ణుడు గొల్ల కులమునకు చెందినవాడేనని అందరూ అనుకోవడము జరిగినది. ఉత్తరదేశములోని గొల్లవారందరు తమ పేరు చివర 'యాదవ్' అను పదమును తగిలించుకొన్నారు. 30 లేక 40 సంవత్సరముల క్రిందట వరకు ఆంధ్రప్రదేశ్‌లోని గొల్లకులస్థులందరు తాము గొల్లవారమని తమ కులమును గురించి చెప్పుకొనెడివారు. ఈ మధ్య 30 సంవత్సరములనుండి మేము యాదవులమని, తమను గొల్లవారని అనకూడదని అంటున్నారు. ఇప్పటికీ మారుమూల పల్లెలలో యాదవ అను పేరు తెలియని గొల్లవారు తమ కులమును గురించి చెప్పునపుడు మేము గొల్లవారమని చెప్పుచున్నారు. కృష్ణుడు గొల్లవాడలలో చిన్న తనమున తిరిగాడని, గొల్లవారందరు ఆయనను గౌరవించెడివారనీ, గొల్ల వృద్ధులు కృష్ణుని గురించి గొప్పగ చెప్పుకొనెడి వారని భారతములోను, భాగవతములోను వ్రాశారు. దీనినంతటిని గమనిస్తే గొల్ల అనునది ఒక కులమని తెలియుచున్నది. నేడు గొల్ల కులస్థులను గొల్లవారు అంటే అదేదో తక్కువ చేసి మాట్లాడినట్లు వారు బాధపడు చున్నారు. మమ్ములను గొల్లవారని కించపరుస్తున్నారని, మేము గొల్ల వారము కాదు, యాదవులమని అంటున్నారు. వాస్తవానికి దేవుడు కులములను ఏర్పరచలేదు, మనుషులు పెట్టుకొన్నవే కులములు. భగవద్గీతా జ్ఞానము ప్రకారము మనుషులను నాలుగు రకములుగా విభజించవచ్చును 1) తామసులు 2) రాజసులు 3) సాత్త్వికులు 4) యోగులు అను నాలుగు రకములుగా చెప్పవచ్చును. దీనినిబట్టి కులములు దేవుని లెక్కలో లేవని, మనుషులు కొందరు "**చాతుర్వర్ణము**" అని భగవంతుడు గీతలో చెప్పిన వాక్యమును వక్రీకరించి తప్పు భావములో 1) బ్రాహ్మణులు 2) వైశ్యులు

3) క్షత్రియులు 4) శూద్రులు అని చెప్పారు. నాల్గవ రకము శూద్రులలో చిన్న చిన్న కులములన్నిటిని కలిపి వేశారు. చేయు పనినిబట్టి వారందరిని ఫలానా వర్గమువారని పని నిమిత్తము చెప్పిన పేరు తప్ప అది కులము అనుకోవడము పొరపాటు. ఇక్కడ కూడ గొర్లు, గోవులను కాపాడువారిని (కాయువారు) గొల్లవారనడము జరుగుచున్నది తప్ప వేరుకాదు. ఇక్కడ కులము అను పేరు ఒక వర్గమునకు వచ్చినది కావున దానిని గురించి తెలుసుకొందాము. ఒక పనిని చేయువారిని ఒక గుంపుగా లెక్కించి ఆ గుంపునకు గుర్తుగా ఒక పేరు పెట్టడము జరిగినది. పూర్వము అలా ఫలానా పని చేయువారు అని గుర్తింపుకు పెట్టుకొన్న పేరును కాలక్రమమున కులము అనుకొనుట జరుగుచున్నది. అంతేకానీ కుల వ్యవస్థను ఏ దేవుడూ సృష్ఠించలేదు.

ఇక్కడ ఒక వర్గము వారిని గొల్లవారనీ, గొల్లవారందరు యాదవులనీ అనడము నేడు జరుగుచున్నది. ఇపుడు గొల్ల, యాదవ అను పదములను విశధీకరించుకొని చూడవలెను. **కాపాడుట** అను పదమునుండి పుట్టినది **కాయుట** అను పదము. గొర్లను కాయువాడిని లేక గొర్లను కాపాడువానిని గొర్లకాపరి అంటాము. అటువంటి గొర్లకాపరినే "గొల్లవాడు" అని అనడము జరుగుచున్నది. ద్వాపరయుగములో సాక్షాత్తు భగవంతుడే గొల్లకులములో గొల్లవానిగా కనిపించాడు. సాక్షాత్తు భగవంతుడే ఎన్నుకొని వచ్చిన కులము మిగతా అన్ని కులములకంటే ఉత్తమమైనదిగానే చెప్పవచ్చును. అంతేకాక జ్ఞానవిధానములో ఏ కులమునకు లేని ప్రత్యేకత గొల్లకులమునకు ఉన్నది. ఆ ప్రత్యేకత గొల్లవారికి కూడ తెలియదు. అందువలన తమను గొల్లవారని అనవద్దండి. యాదవులని అనండి అని చెప్పుచున్నారు. సరే అట్లే యాదవులని అనినా యాదవులంటే వివరము ఏమిటి అని కూడ తెలియదు.

అటు గొల్లవారనుటకు గానీ, ఇటు యాదవులనుటకుగానీ అర్థము తెలియని యాదవులు లేక గొల్లవారు ఉన్నారని తెలియుచున్నది. వారి పేరుకు అర్థము వారికే తెలియక పోవడానికి కారణం ఒక్క దైవజ్ఞానము లేక పోవడమేనని తెలియుచున్నది. యాదవులే కాదు అన్ని కులముల వారికి దైవజ్ఞానము తెలియకపోవడము వలన కులవ్యవస్థలో ఒకరికొకరు చిన్నపెద్ద అను కొంటున్నారు. కానీ వాస్తవానికి దేవుడు కులముల వ్యవస్థను ఏర్పరచలేదు. మనుషులు ఏర్పరచుకొన్నవే కులములని చెప్పుకొనినా అందులో గొల్లకులము ఒకటి. ఇటువంటి కులములు భూమిమీద లెక్కలేనన్ని ఉన్నాయి. ఎన్నో కులములలో నాది గొల్ల కులము అని తల ఎత్తి చెప్పుకొను ప్రత్యేకత ఆ కులములో ఉండగా, మమ్ములను గొల్లవారనడము తక్కువచేసి మాట్లాడినట్లు అని ఆ కులస్థులు చెప్పు కోవడము చూస్తే, ఆ కులములో ఉండినా, ఆ కులము యొక్క ప్రత్యేకత వారికి తెలియకుండ పోయినదని అర్థమగుచున్నది. కావున గొల్ల కులమును గురించి కొంత వివరించు కొందాము.

అన్ని జంతువులవలె చాకచక్యము లేనివి గొర్రెలు, తర్వాత ఇది చేయాలని నిర్ణయించుకొను చురుకుతనము గొర్రెలకు లేదు. ముందు గొర్రె ఎటు పోతే వెనుకల గొర్రె దానిని చూచి అది పోయినట్లు పోవును. కానీ దానివెంట పోవచ్చునా, పోకూడదా అని యోచించుశక్తి దానికుండదు. బయటి ప్రపంచములో కూడ ఎవడైనా తెలివి తక్కువ వారుంటే, వానిని గొర్రెతో సమానముగా పోల్చి చెప్పుచుందురు. గొర్రెలకు స్వయముగా ఆలోచించు శక్తి ఉండదు. ముందున్న ఒక గొర్రె బావిలోనికి దూకితే దానివెనకున్న గొర్రెలన్ని బావిలోనికి దూకును. ముందు గొర్రె తెలియక దూకింది, అలా దూకితే ప్రమాదము అని వెనకున్నవి ఆలోచించవు.

అందువలన గొర్రెలకు తప్పనిసరిగా కాపరి అవసరము. గొర్రెలను సక్రమముగా నడిపించువానిని గొర్రెలకాపరి అంటారు. గొర్రెల కాపరి బాగా తెలివైనవాడని, వాటికి ప్రమాదము జరుగకుండ ఎలా కాపాడవలెనో బాగా తెలిసినవాడని అందరికి తెలియును. రాత్రిపూట నక్కలు, తోడేళ్ళ నుండి, పగటిపూట మిగతా ప్రమాదములనుండి కాపాడు వానిని గొర్రెల కాపరి అంటాము. గొర్రెల కాపరి పనిని చేయువారందరిని 'గొల్లవారు' అని అనెడివారు. కాలక్రమమున ఆ పదము 'గొల్లవారుగా' మారిపోయినది. ఈ గొల్లకులమునకు ఆధ్యాత్మిక జ్ఞానమునకు సంబంధమున్నట్లు దేశము లోని ఏ కులమునకు లేదు. అందువలన దేవదేవుడైన పరమాత్మ భగవంతునిగా భూమిమీదకు వచ్చినపుడు ప్రత్యేకించి గొల్లకులమునే ఎంచుకొని, ఆ కులములోనే పెరిగి తానుకూడ గొల్లవాడనిపించుకొన్నాడు. కృష్ణుడు పుట్టినది చంద్రవంశ క్షత్రియులైన యదువంశమునకు చెందిన వసుదేవునికి పుట్టినవాడైనప్పటికి, పుట్టిన తర్వాత గంటకే గోకుల వంశమునకు చెందిన నందునికి పుత్రునిగా నందగావ్‌కు వచ్చాడు. అక్కడి గొల్ల బాలురతో కలిసిమెలిసి తిరిగి, తానుకూడ గొల్ల కులమునకు చెందిన వానిగా కనిపించాడు. భగవంతుడైన కృష్ణుడు అలా గొల్లవానిగా కనిపించడ మెందుకు అని ఆలోచిస్తే, అలా ఆయన కనిపించుటకు ఆధ్యాత్మికమునకు కొంత సంబంధముందని తెలియుచున్నది. అదెలా అనగా!

జ్ఞానములో ప్రపంచ జ్ఞానము, పరమాత్మ జ్ఞానము అని రెండు రకముల జ్ఞానములుగలవని ఇంతకుముందే చాలామార్లు చెప్పాము. ప్రపంచ జ్ఞానములో చాలా తెలివి తక్కువవి, చాలా అవివేకముగా, అనాలోచితముగా ప్రవర్తించునవి గొర్రెలని, వాటిని తెలివి తక్కువకు గుర్తింపుగా లేక నమూనాగా చెప్పుకొన్నాము. అవి మూఢముగా ప్రవర్తించు

నని, వాటికి ఒక కాపరి అవసరము అని కూడ చెప్పుకొన్నాము. ప్రపంచ జ్ఞానములో పూర్తి మూఢముగా ప్రవర్తించునవి గొర్రెలుకాగ, పరమాత్మ జ్ఞానములో పూర్తి మూఢముగా, అజ్ఞానముగా, అనాలోచితముగా, అవివేకముగా ప్రవర్తించువాడు మానవుడు. ప్రపంచ జ్ఞానములో ఒక గొర్రె ఎటుపోతే అటు, యోచించకుండ అన్ని గొర్రెలు దానివెంట పోవునట్లు, మనిషి కూడ పరమాత్మ జ్ఞానములో ఏమాత్రము యోచించకుండ గొర్రెలవలె ప్రవర్తించుచున్నాడు. దేవుడు కోడి గ్రుడ్డుమాదిరి ఉన్నాడని ఒకరు చెప్పితే, దానిని విన్నవాడు ఏమాత్రము యోచించకుండ, వాడు కూడ దేవుడు గ్రుడ్డు మాదిరే ఉన్నాడని చెప్పుటకు మొదలుపెట్టును. తనకంటే ఆధ్యాత్మికములో ముందున్నవారు అంటే గురువులుగా, స్వాములుగా ఉన్నవారు ఎవరైనా తన ప్రత్యేకతను చాటుకొనే దానికి, తనకు తెలియకున్నా తెలిసినట్లు దేవుడు దోమమాదిరి ఉన్నడనినా, గొర్రెలవలె దానినే అనుసరించువారు గలరు. నేను ఏమి చెప్పినా నా మాటనే వినగలరని కొందరు వారి విధానమును చెప్పిగా వారి వెంట పోవువారు, దానినే గ్రుడ్డిగ నమ్మి ఒక సమాజముగ ఏర్పడి ప్రచారము చేయువారు గలరు. అందువలన నేడు ఆధ్యాత్మికము అను పేరుతో ఎన్నో సమాజములు ఏర్పడినవి. తమకంటే ముందున్న గొర్రెను అనుసరించి, అన్ని గొర్రెలు ప్రమాదములో చిక్కుకొన్నట్లు, తమకంటే తెలిసినవారని కొందరిని నమ్మి, వారిని అనుసరించి మనిషికూడ అజ్ఞాన గమ్యమునే చేరుచున్నాడు. తమకంటే ముందున్న వాటిని, వెనుకున్న వాటిని అన్నిటిని కాపాడుచు నడిపించు కాపరిని అనుసరించిన గొర్రెలు ఎట్లయితే ప్రమాదములో చిక్కుకోవో, అలాగే ప్రపంచములోని సామన్య మనిషికీ, వానికంటే కొంత ఎక్కువ తెలుసుననుకొను స్వామీజీలకు అందరికీ కాపరి అయిన భగవంతుడు ఒకడున్నాడనీ, ఆయన ఒక్కడే మనుషులందరికి

గురువనీ, ఆ గురువు సూచించినదే అసలైన మార్గమనీ, తెలిసి ప్రవర్తించు వారు జ్ఞానగమ్యమును చేరుచున్నారు. గొర్రెలకు కాపరి ఉన్నట్లు, మనుషులకు కాపరి భగవంతుడని, భగవంతుడొక్కడే గురువని తెలియక ఒకడు శ్వాసమీద ధ్యాస అని, మరొకడు ముక్కుకొన మీద (నాసికాగ్రము మీద) ధ్యాస అని, మరొకడు హృదయములోనని, ఇంకొకడు శిరస్సులో సహస్రారమున అని, ఒకడు బయట అని, ఒకడు లోపల అని చెప్పుచూ పోవుచుంటే ఇంతమందిలో ఏది సత్యమని యోచించని ప్రజలు, ఎవరికి నచ్చిన వారిని వారు అనుసరించుచు, నాది ఫలానా సమాజమని కొందరు చెప్పితే, నాది ఇంకొక సమాజమని చెప్పువారు కొందరున్నారు. నా సమాజములోని బోధ ఎంతమాత్రము సత్యమని, నాకు బోధించువాడు గురువేనా అని యోచించని వాడు చివరకు అజ్ఞాన జన్మలకే పోవుచున్నాడని తెలియవలెను.

ముందున్న గొర్రె వెనుకున్న గొర్రెలను ఎలా సక్రమముగా నడిపించ లేదో, అలాగే ఆధ్యాత్మిక దారిలో మనకంటే కొంత ముందున్నవాడు వెనుకున్న మనుషులను సక్రమముగా నడిపించలేడు. దారిలో ముందున్న గొర్రెను వెనకున్న గొర్రెలను అన్నిటిని కాపరి ఒక్కడే సక్రమముగా నడిపించునట్లు ఆధ్యాత్మిక దారిలో ముందున్న స్వామిని, వెనుకున్న అనుచరులను (వెంట పోవువారిని) అందరిని గురువు ఒక్కడే సక్రమముగా ఆధ్యాత్మిక దారిలో నడిపించును. గొర్రెలన్నిటికి ముందున్నవాటికి, వెనుకున్నవాటికి కాపరి ఎలా అవసరమో, అలాగే ప్రపంచములో కొంత తెలిసి ముందున్న వారికి, ఏమీ తెలియక వెనకున్న వారికి అందరికి గురువు అవసరము. గొర్రెలకు కాపరి అనగా గొల్లవాడు ఎట్లున్నాడో, అట్లే మనుషులకు గురువు ఉన్నాడు. బయటి ప్రపంచములో గొల్లవాడిని ఆధ్యాత్మికములో గురువుగా పోల్చి

చెప్పవచ్చును. అందువలన ఒక మతప్రవక్త ఇలా “నేను గొర్రెలకాపరిని, నా స్వరము విని, నా గొర్రెలు నన్ను గుర్తించి, నన్ను వెంబడించును” అని అన్నాడు. తనను ఒక గొల్లవానిగా పోల్చుకొన్నాడు కదా! ఒక మతానికే ప్రవక్తగా చెప్పబడు ఒక పెద్దగురువు ఆ మాటను చెప్పితే, గొల్లవాడు అను పేరు గొప్పదికాక తక్కువెట్లగును? ప్రపంచములోని మనుషులకందరికి గురువు ఒక్కడేనని, ఆయన కొన్ని వేల, లక్షల సంవత్సరములకు ఒకమారు భూమిమీదకు వచ్చునని, అలా వచ్చినవాడే భగవంతుడని, భగవంతుడొక్కడే అందరికి గురువని, మా రచనలలోని **“గురువు”** అను గ్రంథములో ముందే చెప్పియున్నాము. ఆ విధముగా వచ్చిన భగవంతుడే ద్వాపరయుగములోని కృష్ణుడు. ఆయన ఒక్కడే అందరికి గురువు. గొర్రెలకు దారి చూపించు వాడు కాపరి, మనుషులకు దారి చూపించువాడు గురువు. గొర్రెలకు దారిని చూపించు కాపరిని గొల్లవాడు అనుచున్నాము. మనుషులకు దారిని చూపించువాడు కూడ మనుషులకు కాపరియగును. నేను మీకు కాపరి అని తెలియునట్లు, భగవంతుడైన కృష్ణుడు గొల్లవారింట పెరిగి గొల్లవాడ నిపించుకొన్నాడు. ఈ లెక్క ప్రకారము గొల్లవాడనినా, గురువు (భగవంతుడు) అనినా రెండు ఒకే సూత్రమును తెలియజేయుచున్నవి. దీనినిబట్టి గొల్ల కులము అనునది అన్ని కులములకంటే విలువైనదని తెలియుచున్నది. ఇంతవరకు గొల్లకులము ఎంత ప్రాధాన్యత కల్గియున్నదో, దాని అర్థమేమిటో అంతరార్థమేమిటో తెలుసుకొన్నాము. ఇక యాదవ అను దానిని గురించి తెలుసుకొందాము.

యాదవ అను పేరు కృష్ణునికంటే ముందులేదు. కృష్ణుని వయస్సు ముప్పై సంవత్సరములకు పైగా ఉన్నపుడు మొదట భీష్ముడు కృష్ణున్ని “యాదవా” అని సంభోదించాడు. అప్పటినుండి యాదవ అను శబ్దము

అమలులోనికి వచ్చినది. కృష్ణుడు యాదవుడే కావున గొల్లకులములోని వారందరు తమపేరు చివర యాదవ్ అను పదమును చేర్చుకోవడము జరుగుచున్నది. అలా చేర్చడము వలన యాదవ్ అంటూనే వారు ఫలానా కులమువారని అర్థమగుచున్నది. దీనినిబట్టి గొల్లవారంటే యాదవులని, యాదవులంటే గొల్లవారని తెలియుచున్నది. దాదాపు ఐదు సంవత్సరముల క్రితము గొల్లకుల సమాజములోని గిరి యాదవ్ అను వ్యక్తితో యాదవ్ అంటే ఏమి అర్థము అని అడిగాము. అప్పుడు ఆయన "దాని విషయము ఏమాత్రము తెలియదని, అందరు పెట్టుకొన్నట్లు నేను యాదవ్ అని పెట్టుకోవడము జరిగినది. కానీ అర్థము ఏమిటో నాకు తెలియదు, నాకే కాదు బహుశ మా వారికి ఎవరికీ తెలియదనుకొంటాను" అన్నాడు. వాస్తవానికి ఆయన ఉన్నదున్నట్లు చెప్పాడు. ఇంకొక సందర్భములో అదే కులస్థున్ని యాదవ్ అని ఎందుకంటారని అడిగాము. అపుడు ఆయన "యదువంశములో పుట్టినవారము కావున మాకు యాదవులని పేరు వచ్చినది" అన్నాడు ఆ మాటను బట్టి మనము యోచిస్తే యదువంశములో పుట్టినవాడు కృష్ణుడు మాత్రమే అగును. ఆనాటి గొల్లవారిది యదువంశము కానేకాదు, యదువంశమునకు గొల్లవారికి సంబంధములేదు. కావున ఆయన చెప్పిన సమాధానము సరియైనది కాదని అర్థమైనది. వారికి తెలిసినా తెలియక పోయినా మనము మాత్రము ఇపుడు యాదవ్‌ని గురించి తెలుసుకొని తీరాలి. ఈ నేపథ్యములో భీష్మడు కృష్ణున్ని ఏ ఉద్దేశముతో "యాదవ" అన్నాడో ఆయన భావమేమిటో అక్కడికెళ్ళి చూస్తే ఈ విధముగా కలదు.

**'యాద్'** అను శబ్దము నుండి **'యాదవ'** అను పదము పుట్టినది. యాద్ అనగా జ్ఞప్తి (జ్ఞానము) అని అర్థము. జ్ఞాపకము లేదా అని అనుటకు

కొన్ని ప్రాంతములలో యాద్ లేదా అనుటకూడ కలదు. యాద్ అనునది సంస్కృత పదము, హిందీలో కూడ అదే పదము కలదు. యాద్ అనగా జ్ఞాపకము, జ్ఞానము అను రెండు అర్థములలో భీష్ముడు జ్ఞానము అను అర్థమును తీసుకొన్నాడు. కృష్ణుడు సంపూర్ణ జ్ఞానముకలవాడు అయిన దానివలన కృష్ణున్ని యాదవ అని భీష్ముడు అన్నాడు. భీష్ముని భావములో కృష్ణుని మించిన జ్ఞానిలేడు, కావున కృష్ణున్ని యాదవ అన్నాడు. ఈ విధముగా కృష్ణుడు సంపూర్ణ యాదవుడని మనము కూడ చెప్పవచ్చును. కృష్ణుడు ఇతరులకు ఎప్పుడు జ్ఞానము చెప్పకుండ కాలమును గడుపుట వలన, ఆయనను అందరు సాధారణ మనిషిగానే లెక్కించారు తప్ప భగవంతునిగా ఏనాడు చూడలేదు. అలా 90 సంవత్సరములు కృష్ణుని ఆయుస్సు గడచినపుడు, హస్తినలో (ఢిల్లీలో) పాండవులకు కౌరవులకు యుద్ధము వచ్చినపుడు, ఆ యుద్ధము కూడ కురుక్షేత్రములో (పంజాబ్‌లోని ఒక జిల్లా) జరిగినపుడు, తాను నివాసమున్న ద్వారకకు దాదాపు వేయి కిలోమీటర్ల దూరములో అర్జునునికి ఒక్కనికే గీతను చెప్పాడు. భగవంతుడు చెప్పినది కావున గీత పేరు "భగవద్గీత" అయినది. తన ఊరియందు, తన వారియందును కృష్ణుడు జ్ఞానమును చెప్పలేదు. ఎక్కడో వేయి కిలోమీటర్ల దూరములో చెప్పబడిన భగవద్గీత కొంతకాలమునకు ద్వారక లోని గొల్ల కులము వారికి కూడ తెలిసినది. వ్యాసుడు వ్రాసిన గీతను చూచిన తర్వాత ద్వారకలోని గొల్లకులములోని పెద్దలు గీతాజ్ఞానమును తెలుసుకొని కృష్ణుని యొక్క గొప్పతనము గుర్తించారు. అలా తెలిసిన వయో వృద్ధులందరు కృష్ణునివద్దకు పోయి వారి సంతోషమును వ్యక్త పరిచారు. వారిని చూచిన కృష్ణుడు ద్వారకలో నేను ఒక్కడినే యాదవుడను అనుకోవద్దండి మీరందరూ యాదవులే అన్నాడు. అప్పటి నుండి ఆ

జ్ఞానవృద్ధులనందరిని యాదవులని కృష్ణుడే పిలిచెడివాడు. ఆనాడు ద్వారకలో ఉన్నవారంతా గొల్లకులము వారే, కావున ఆ దినములలో యాదవులని పిలిపించుకొన్న వారందరు గొల్లవారే అయిన దానివలన, తర్వాత వచ్చినవారు యాదవ అనునది తమ కులమునకు సంబంధించిన దేమో అనుకొన్నారు. యాదవ అని అంటే జ్ఞాని అని తెలియనివారందరు, తమ పెద్దలు యాదవులైనపుడు తాము కూడ యాదవులమే కదా! అని అనుకొన్నారు. అప్పటినుండి ఉత్తర భారత దేశములో గొల్లవారు కొందరు యాదవ అను పదమును తమ పేరు చివర తగిలించుకొన్నారు. తర్వాత కొంతకాలము గడువగా మిగిలిన గొల్లవారు కూడ యాదవ అని పేరు తగిలించుకొనుచు వచ్చారు. ఇలా ఒకరిని చూచుకొని మరొకరు తమ పేరు చివర యాదవ పదమును తగిలించుకొన్నారు. చివరకు గొల్ల కులము యాదవ కులముగా మారిపోయినది. అలా మారిపోయిన యాదవ పదము ఈ మధ్యకాలములో దక్షిణదేశము లోనికి కూడ ప్రాకినది. ఇక్కడి గొల్లవారు కూడ మేము యాదవులమని చెప్పుకొనుచున్నారు. ఒక పల్లెటూరిలో ఒక గొల్లకులస్థుని కలిసి నిన్న మొన్నటి వరకు మీరు గొల్లవారిమని చెప్పుచుంటిరి కదా! ఉన్నట్లుండి ఇప్పుడు యాదవులము అని అంటున్నారే, ఏమి విషయము అని అడుగగా! "అప్పుడు గొల్లవారమే కాని ఇప్పుడు యాదవులము" అని అన్నాడు.

మొదట కృష్ణున్ని భీష్ముడు యాదవ అని పిలువగా, తర్వాత కృష్ణుడు జ్ఞానులుగా మారిన గొల్లవృద్ధులను యాదవులు అన్నాడు. యాదవ అను పదమునకు జ్ఞాని అని అర్థముగలదను ఉద్దేశముతో భీష్ముడు కృష్ణున్ని యాదవ అని ఉద్భోదించాడు. తర్వాత అదే ఉద్దేశముతో కృష్ణుడు కొంతమందిని యాదవులని అన్నాడు. ఆ విధముగా ఉద్భవించిన యాదవ

అను పదము నేడు కులముగా మారిపోయినది. యాదవ అను పదమునకు అర్థము జ్ఞాని అయినపుడు, ఆ పేరు పెట్టుకొన్నవారు ఆ పేరుకు సార్థకతను చేకూర్చుటకు, కొంతైనా దైవజ్ఞానమును తెలుసుకొంటే బాగుంటుంది. కృష్ణుడు చెప్పిన జ్ఞానమును తెలుసుకోవడము, యాదవ అను పేరు పెట్టు కొన్నవారు మొదట చేయవలసిన పని. నేడు గొల్లవారందరు యాదవులని చెప్పుకోవడము సంతోషమే, అయితే వారందరు కృష్ణుని గీతను తెలుసు కోవడము కూడ చేయాలి. అలా గీతాజ్ఞానమును తెలుసు కోలేనివారు కృష్ణునికి గౌరవమివ్వని వారవుతారు. అటువంటివారు యాదవులని చెప్పుకొనినా నిజమైన యాదవులు కాదని తెలియాలి. కృష్ణుని వారసులుగా గొల్లవారు నిజమైన యాదవులుగా మారాలంటే, కృష్ణుడు చెప్పిన జ్ఞానమును తెలియవలెను. అప్పుడే యాదవ పేరుకు సాఫల్యము ఏర్పడును. జ్ఞానము లేని గొల్లవారు యాదవులు కారు. జ్ఞానమున్న ఏ కులమువాడైనా అర్థము ప్రకారము యాదవుడే అగును. అందువలన కృష్ణుడు చెప్పిన జ్ఞానమును తెలుసుకొని, అందరము యాదవులుగా మారేదానికి ప్రయత్నిద్దాము. కృష్ణుడు యాదవుడు మరియు మాధవుడు అని కూడ చెప్పవచ్చును. మనము ప్రయత్నము చేసి భగవంతుడు చెప్పిన జ్ఞానమును తెలుసుకొని యాదవులుగా మారవచ్చును. కానీ ఈ జన్మలోగానీ మరి ఏ జన్మలోగానీ ప్రయత్నించినా కృష్ణునివలె మాధవునిగా మారలేము. కృష్ణుడు యాదవుడు, మాధవుడు అయినపుడు, మనము కూడ యాదవునిగా మారగల్గినపుడు, మాధవునిగా ఎందుకు మారలేము? అని ప్రశ్నరావచ్చును. దానికి సమాధానము దొరకాలంటే యాదవుడంటే అర్థమేమిటో తెలిసినట్లు మాధవుడు అంటే అర్థము ఏమిటో తెలియాలి. అందువలన ఇపుడు మాధవుడు అంటే ఎవరు? కృష్ణుడు మాధవుడు ఎలా అయ్యాడు? అను వివరమును తెలుసుకొందాము.

పరమాత్మ, ప్రకృతి అను రెండు శాశ్వతమైనవి. పరమాత్మ పురుషుడు, ప్రకృతి స్త్రీ అని ముందే చెప్పుకొన్నాము. భగవంతుడు పరమాత్మ అంశతో పుట్టినవాడు, కావున ఆయన పురుషుడే అగును. మిగతా జగతిలోని జీవులందరు ప్రకృతి పురుషుల చేత పుట్టినా, వాని తలయందు పురుషత్వము ఒక భాగము, స్త్రీ తత్త్వము మూడు భాగములుండుట వలన ప్రతి జీవరాసిని స్త్రీతత్త్వము గలదిగా చెప్పవచ్చును. ధరించిన శరీరము పురుషాకారముతో ఉండినా, లేక స్త్రీ ఆకారముతో ఉండినా, ఆ శరీరములోని జీవున్ని మాత్రము స్త్రీగా జమకట్టవలసిందేనని, ఆధ్యాత్మిక అర్థముతో చెప్పవచ్చును. ఆ లెక్క ప్రకారము భూమిమీద ఉన్న జీవరాసులన్ని స్త్రీలుకాగ, భగవంతుడొక్కడే పురుషుడని చెప్పవచ్చును. మీరాబాయి కూడ ఇదే సూత్రమును చెప్పినట్లు మనము చెప్పుకొన్నాము. ఆధ్యాత్మిక జ్ఞానము ప్రకారము మరియు మీరాబాయి చెప్పినట్లు, శరీరము ధరించిన వారిలో కృష్ణుడు ఒక్కడే పురుషుడు. అందువలన ఆయనను **"జగద్భర్త"** అన్నారు. అంతేకాక ఆయనను "జగత్ గురువు" అనికూడ అన్నారు. భూమిమీద భర్త ఒకడే ఉంటాడు, అలాగే గురువు ఒకడే ఉంటాడు. అందరికి గురువుగానీ, భర్తగానీ భగవంతుడు ఒక్కడే అని తెలియాలి. ఇపుడు కొందరికి ఒక ప్రశ్నను అడుగుటకు అవకాశము గలదు. అదేమనగా! "జ్ఞానమును తెలియజేయువాడు గురువు కదా! గురువు స్త్రీ శరీరములో పుట్టవచ్చునా? అంటే భగవంతుడు పురుష శరీరములోనే పుట్టకుండ భగవతిగా స్త్రీ శరీరములో రాకూడదా?" అని అడుగ వచ్చును. దానికి జవాబు ఏమనగా! పురుషుడైన భగవంతుడు స్త్రీ శరీరమును ధరించడు. స్త్రీ, పురుష శరీరములు ప్రకృతి పురుషులకు గుర్తుగా ఉన్నపుడు పురుషుడైన భగవంతుడు పురుషుని శరీరముతోనే పుట్టును. కానీ స్త్రీ శరీరములో పుట్టడు. జగద్భర్త అని పిలుపించుకొన్నవాడు స్త్రీ శరీరములో ఉండుట ధర్మవిరుద్ధమగును. గురువు

లేక భగవంతుడు ఎప్పటికైనా పురుష శరీరమునే ధరించి తాను పురుషుడినని తెలియపరుచును. జగత్ కంతటికి భర్త అయినవాడు, ప్రకృతికే పురుషుడైనవాడు, సూత్రము ప్రకారము పురుషశరీరమునే ధరించునని తెలియవలెను.

ఇపుడు అసలు విషయానికి వస్తాము. ధవుడు అనగా భర్త అని అర్థము. మాధవుడు అనగా మా అందరికి భర్త అని అర్థము. మా, మేము బహువచనమును సూచిస్తున్నది. బృందావనములో గోపికలు అందరు కృష్ణున్ని మాధవుడు అన్నారు. కానీ కృష్ణునికి పెళ్ళైన తర్వాత ఎనిమిది మంది భార్యలలో ఒక్క సత్యభామ మాత్రము కృష్ణున్ని నాధవుడు అన్నదట. అందరు మా భర్త అని అనగా ఒక్క సత్యభామ మాత్రము నాభర్త అని అన్నది. భగవంతుడు జగతిలోని అందరికి భర్త అని మీరాబాయి జగద్భర్త అని చెప్పింది. జగద్భర్త అయిన వారిని బహువచనములో మా భర్త అని అనడములో తప్పులేదు. అందువలన కృష్ణున్ని మాధవ అని అన్నారు. కృష్ణుడు యాదవుడేకాక మాధవుడు అని కూడ పేరుగాంచాడు. మాధవా అను పదము కృష్ణునికి మాత్రము సరిపోతుంది, కానీ బయట ప్రజలకు సరిపోదు. ఎందుకనగా మనుషులందరు ప్రకృతివైపు ఉన్నవారే అనగా స్త్రీతత్త్వముగలవారే. కావున పురుషుడు అయినప్పటికి ఎవనినీ భర్త అనుటకు వీలులేదు కదా! స్త్రీతత్త్వము గల ఎవ్వరూ ధవుడు (భర్త) కాలేరు. అయితే జ్ఞానమును తెలిసిన ఎవరైనా యాదవుడు కావచ్చును. దీనినిబట్టి తెలియునదేమనగా! కృష్ణుడు ఒక్కడే మాధవుడు మిగతా ఎవరూ కాదు, కాలేరని తెలియుచున్నది.



# రాముడు కృష్ణుడు ఒక్కరేనా?

శ్రీరాముడు త్రేతాయుగములో దశరథునికి పుట్టినవాడు. శ్రీకృష్ణుడు ద్వాపరయుగములో పుట్టినవాడు. త్రేతాయుగములో రాముని చరిత్ర గలదు. అలాగే ద్వాపరయుగములో కృష్ణుని చరిత్రయుగలదు. రెండు చరిత్రలను గమనించి చూచితే, వీరిద్దరు ఒకరికొకరు భిన్నమైన చరిత్ర గలవారు. రాముడు ఏకపత్నిగలవాడు, కృష్ణుడు ఎనిమిదిమంది భార్యలను గలవాడు. ఈ విధముగ ఇద్దరూ వేరువేరు భావములు గల వ్యక్తులని తెలియుచున్నది. ఏ ఒక్క ప్రపంచ విషయములో గానీ, వారి భావములను ఒక్కటిగా చూపలేము. ఇకపోతే దైవజ్ఞాన విషయములో కృష్ణుడు బ్రహ్మవిద్య అయిన గీతను బోధించాడు, రాముడు దైవజ్ఞానమును బోధించినట్లు ఎక్కడా కనిపించలేదు. కృష్ణుడు విలాసవంతమైన జీవితమును అనుభవించాడు. రాముడు తన జీవితములో ఎక్కువ మానసిక బాధలను అనుభవించడమే కాక, అరణ్యవాసము 14 సంవత్సరములు ఏ సౌఖ్యములు లేని జీవితమును అడవిలో గడిపాడు. ఎక్కువ జీవితమును భార్యా వియోగముతోనే గడిపాడు. ఇట్లు రాముని, కృష్ణుని జీవితములో ఎన్నో తేడాలు కనిపించినా, రాముడు కృష్ణుడు ఒక్కరేనా అనుటకు కేవలము ఆధ్యాత్మిక విషయములనే ఆధారము చేసుకొని చూడవలెను. ఇక్కడ ఒక్క ఆధ్యాత్మిక విషయములనే చూడవలసిన అవసరము ఏమనగా! కృష్ణున్ని భగవంతునిగా లెక్కించినపుడు, రామున్ని కూడ భగవంతునిగానే లెక్కించవలెనా అన్నదే ప్రశ్న. ఒక్క దైవ ధర్మములను బట్టి కృష్ణున్ని భగవంతుడు అన్నాము. కావున రామున్ని కూడ దైవధర్మముల ఆధారముతోనే చూడవలసిన అవసరమున్నది. కృష్ణున్ని భగవంతుడని ఏ సూత్రములతో చెప్పగలిగామో, ఆ సూత్రములతోనే రామున్ని కూడ లెక్కించి చూడవలెను.

నేటి కాలములో కొందరు ఆధ్యాత్మికవాదులు రాముడు, కృష్ణుడు ఇద్దరు ఒక్కరే అను భావమును వ్యక్తపరిచారు. అలా వ్యక్తపరిచిన వారిమీద ఉన్న అభిమానముతో, వారిని అనుసరించు కొందరు కూడ రామున్ని కృష్ణున్ని ఒక్కరే అనుకొన్నారు. ఈ విధముగ కొందరు అనుకోవడము చూచి మిగత ప్రజానీకము కూడ అలాగే అనుకొన్నారు. కొంతకాలము గడువగా కృష్ణభక్తిని ప్రదర్శించు ఒక సంస్థ రాముడు కృష్ణుడు ఒక్కరేనని ప్రచారము చేసి, రాముని భక్తులందరిని తమ సంస్థలో చేరునట్లు చేసినది. అంతేకాక "హరేక్రిష్ణ హరేక్రిష్ణ, క్రిష్ణ క్రిష్ణ హరే హరే, హరేరామ హరేరామ రామ రామ హరేహరే" అని ఒక మంత్రమును కూడ పాటగ తీర్చిదిద్దారు. అలా చేయడము వలన పండితులు, పామరులు అందరు రాముడు, కృష్ణుడు ఇద్దరు ఒక్కటేనను భావములోనికి వచ్చారు. అంతేకాక కొన్ని చలన చిత్రములు కూడ త్రేతాయుగములో పుట్టిన రాముడే ద్వాపర యుగములో పుట్టిన కృష్ణుడని చూపడము వలన, నేటికీ సర్వప్రజానీకము రాముడు కృష్ణుడు ఇద్దరూ ఒక్కరేనను భావములో ఉండిపోయారు. కొందరు రాముని భక్తులు రామున్ని గొప్పగ తెలుపుటకు త్రేతాయుగములో ఎప్పుడో చనిపోయిన ఆంజనేయున్ని చిరంజీవి అని వర్ణించి, ఆంజనేయుడు ద్వాపర యుగములోనున్న కృష్ణున్ని, రామునిగా గుర్తించాడని, త్రేతాయుగము నాటి రాముడే ద్వాపరయుగములోని కృష్ణుడని ఆంజనేయుడే తెలిసి కృష్ణునికి నమస్కరించాడని చెప్పడము వలన అంతవరకు నమ్మనివారు కూడ కృష్ణున్ని రాముడని, రామున్ని కృష్ణుడనీ తలవడము జరుగుచున్నది.

రాముడు, కృష్ణుడు ఒక్కటికాదు అను సంశయము ఎవరికీ రాక పోయినా, ఇపుడు ఆ విషయమును అనేక కోణములనుండి చూచి, చివరకు ఆధ్యాత్మిక కోణములో కూడ చూడవలసియున్నది. మొదట పుట్టుక

విషయములో చూస్తాము. దశరథుడు పుత్రకామేష్ఠి యాగము చేయుట వలన, యజ్ఞఫలము వలన రాముడు పుట్టాడు అని చెప్పుచుందురు. యజ్ఞఫలము వలన పిల్లలు పుట్టారు అనడము యజ్ఞములకు విలువ చేకూర్చే పనే, కానీ యజ్ఞముల వలన పిల్లలు పుట్టుదురనుట విడ్డూరము. యజ్ఞములు చేశామను మానసిక తృప్తితో ఉండగా, ఆ సంతోషమునకు వీర్యకణ చలనము ఎక్కువై సంతానము కలిగియుండవచ్చును. అలా వీర్యకణమునకు పుట్టిన వాడు రాముడు కాగా కృష్ణుడు అలా పుట్టలేదు. దశరథ, కౌసల్య దంపతులకు యజ్ఞసంతోషము సమయములో గర్భధారణ జరుగగా రాముడు పుట్టాడు. కానీ వసుదేవ, దేవకీ దంపతులకు కారాగారమున దుఃఖముతోనున్న కాలములో గర్భధారణ జరుగకుండా పుట్టినవాడు కృష్ణుడు. దశరథ పుత్రుడు రాముడు కానీ, వసుదేవ పుత్రుడు కృష్ణుడు కాడు. కృష్ణునికి ఏ మనిషీ తండ్రికాడు. దేవుని చేత ఉద్భవించినవాడని, కావున దేవుని కుమారుడని కృష్ణున్ని చెప్పవచ్చును. దేవుని అంశ లేక శక్తి భూమి మీద మనిషి ఆకారమును తీసుకొని పుట్టినపుడు దానిని భగవంతుని జన్మగా చెప్పవచ్చును. ఇక్కడ కృష్ణుని జన్మ దేవుని వలన పుట్టినది, కావున కృష్ణున్ని భగవంతుడు అనుచున్నాము. కానీ రాముడు దశరథుని వలన పుట్టినవాడు, కనుక రామున్ని మనిషిగా చెప్పవచ్చును, భగవంతునిగా చెప్పలేము.

దేవుని కుమారుడైన భగవంతుడు భూమిమీద అధర్మములు చెలరేగినపుడు పుట్టును. పుట్టిన భగవంతుడు అధర్మములను లేకుండ చేయుటకు ధర్మములను బోధించును. అంతేకాక అధర్మవరులకు శత్రువుగా, ధర్మవరులకు మిత్రునిగా మారిపోవును. కృష్ణుడు అధర్మములు తారాస్థాయికి చేరినపుడు పుట్టి, ధర్మముల రక్షణ నిమిత్తము పాటుపడినాడు. అధర్మవరులకు శత్రువైనాడు. రాముడు అలా కాకుండ అధర్మములను

కాపాడుటకు పుట్టాడు. ధర్మవరులకు శత్రువయ్యాడు. కృష్ణుడు తనబోధలో యజ్ఞములు, వేదాధ్యయనములు, తపస్సులు, అధర్మములని తెలుపగ, రాముడు యజ్ఞములను రక్షించుటకు, తపస్వికులను కాపాడుటకు కృషి చేశాడు. అధర్మములైన యజ్ఞములను నాశనము చేసి, అధర్మవరులైన తపస్వికులను శిక్షించు రావణబ్రహ్మకు శత్రువయ్యాడు. కృష్ణుడు యజ్ఞ యాగాదులు పెచ్చుగా పెరిగి పోయిన కాలములో, తపస్వికులు విరివిగా ఉన్న కాలములో, అధర్మములు పెరిగిపోయినవని తలచి, ధర్మ రక్షణ నిమిత్తము కృష్ణుడు అవతరించాడు. వ్యాసుడు పదునెనిమిది పురాణములు వ్రాసిన సమయములో భగవంతుడైన కృష్ణుడు పుట్టాడు. పురాణములను వ్రాసిన వ్యాసుడు అంతకుముందే వేదములను వ్రాసి అధర్మములను రేకెత్తించాడని, అపుడు ధర్మములకు పూర్తి ముప్పు కలిగిందని, భగవంతుడు కృష్ణునిగా పుట్టాడు. కృష్ణుడు చెప్పిన భగవద్గీతను అర్జునుని ద్వారా తెలుసుకొన్న వ్యాసుడు తాను వేదములను, పురాణములను వ్రాసి చేసిన తప్పును తెలుసుకొని పశ్చాత్తాప్పడి, తర్వాత గీతను శ్లోకముల రూపముతో వ్రాసాడు. గీతను వ్రాసిన తర్వాత వ్యాసుడు ధర్మవరుడైనాడు. గీతను కృష్ణుడు చెప్పిన తర్వాత మొట్టమొదట ధర్మవరుడుగా మారినది వ్యాసుడేనని తెలియవలెను.

కృష్ణుడు భగవంతునిగా పుట్టి అధర్మవరులను ధర్మవరులుగా మార్చగా, సాధారణ మనిషిగా పుట్టిన రాముడు ఒక్క అధర్మవరుని కూడ ధర్మవరునిగా మార్చలేదు. ఇక్కడ **ధర్మవరుడు, అధర్మవరుడు** అను రెండు క్రొత్త పదములను వాడాను. ఈ పదములను ధర్మపరుడు, అధర్మపరుడు అను పదమునకు బదులుగా వాడడము జరిగినది. ధర్మపరుడు అని ధర్మములను ఆచరించు వానిని అనడము అందరికి అలావాటైపోయినది.

అందువలన అందరికి అలవాటైనట్లే మేము కూడ ధర్మపరుడు, అధర్మపరుడని అనేక చోట్ల వ్రాయడము జరిగినది. వాస్తవానికి ఆ పదములను అలా వాడకూడదు. ఎందుకనగా! పర అనగా వేరుగా ఉన్నదని అర్థము. తన, పర అని అన్నపుడు తన అనగా స్వంతముది, పర అనగా తనకంటే వేరుగా ఉన్నదని అర్థము. పరమాత్మ అనగా ఆత్మకంటే వేరుగా ఉన్నదనీ, ఆత్మకాని వేరొకటి అని అర్థము. పరదేశి అనగా ఈ దేశము కానివాడు, ఇతర దేశస్థుడు అని అర్థము. ఇహము అనగా ఇక్కడ అని, పరము అనగా ఇక్కడ కానిదని అర్థము. ఈ విధముగ 'పర' అను పదము వేరుగానున్న దానిని సూచించు పదము అని తెలియుచున్నది. ధర్మము కాని దానిని అధర్మము అంటాము. భగవద్గీతలో స్వధర్మము, పరధర్మము అను పదములు కర్మయోగము 35వ శ్లోకమున వాడబడినవి. స్వధర్మము, పరధర్మము అను పదములలో స్వ, పర అను శబ్దములు వేరువేరుగా కనిపించుచున్నవి. ఇక్కడ స్వధర్మము అనగా తన ధర్మమని, పరధర్మమనగా తనది కాని ఇతర ధర్మమని తెలియుచున్నది. దీనిప్రకారము ధర్మపరుడు అని అంటే ధర్మములకంటే వేరుగా ఉన్నవాడని, ధర్మములను ఆచరించువాడు కాదని, అధర్మములను ఆచరించువాడని చెప్పవచ్చును. కానీ ధర్మపరుడు అను పదమును ధర్మములను ఆచరించువానిని గురించి వాడుచున్నాము. అట్లే అధర్మములను ఆచరించువానిని అధర్మపరుడు అంటున్నాము. వాస్తవానికి అలా అనడము పూర్తి తప్పు. అధర్మములను ఆచరించువానిని నిజముగా ధర్మపరుడు అనాలి. అట్లే ధర్మములను ఆచరించువానిని అధర్మపరుడు అనాలి.

పూర్వము ధర్మములను ఆచరించువానిని ధర్మవరుడు అనియు, అధర్మములను ఆచరించువానిని అధర్మవరుడు అనెడివారు. వరుడు అనగా

కోరినవాడు, వరించినవాడు అని అర్థము. ధర్మవరుడు అనగా ధర్మములను కోరినవాడని, ధర్మములను వరించినవాడని అర్థము. అలాగే అధర్మవరుడు అనగా అధర్మములను కోరి ఆచరించువాడని అర్థము. పూర్వకాలములో ధర్మములను కోరి ఆచరించువానిని ధర్మవరుడు అనెడివారు. అయితే కాలక్రమమున ధర్మవరుడు అను పదము ధర్మపరుడుగా మారిపోయినది. వరుడు అను పదములోని "వ" అను శబ్దము "ప" అను శబ్దముగా మారిపోయినది. అప్పటినుండి ధర్మవరున్ని ధర్మపరునిగా, అధర్మవరున్ని అధర్మపరునిగా పిలువడము జరుగుచున్నది. వివరము తెలిసిన తర్వాత ఇతరులకు అర్థమగునట్లు ఉచ్ఛరించుటకు చిత్తము ఒప్పదు. మనకు తెలిసినట్లు మన చిత్తము ఒప్పునట్లు పలికితే, ధర్మములను బోధించి ధర్మముల ప్రకారము నడచిన కృష్ణున్ని అధర్మపరుడు అనాలి. అధర్మములకు వేరుగా ఉన్నవాడను అర్థము కృష్ణునికి సరిపోతుంది. ధర్మవరుడైన కృష్ణున్ని ఇతరులు వాడు పదములో చెప్పితే అధర్మపరుడు అగును. అలాగే అధర్మ వరుడైన వానిని ధర్మపరుడు అనాలి.

వ్యాసుడు నాల్గువేదములను వ్రాసి, వేదవ్యాసుడు అను పేరుగాంచి ఉన్నాడు. అలాగే 18 పురాణములను వ్రాసి పురాణ పురుషుడనీ, పురాణకర్త అని పేరు తెచ్చుకొన్నాడు. కృష్ణుడు చెప్పిన బోధ ప్రకారము వేదములనగా మూడు గుణవిషయములు (**త్రైగుణ్య విషయావేదా**). ఆ మూడు గుణములే నాయొక్క మాయ (గుణమయీ మమ మాయా) అని అన్నాడు. వేదములలో మూడు గుణములే ఉన్నాయి. ఆ గుణములే నా మాయ. నా మాయను దాటుట దుస్సాధ్యము (**మమ మాయా దురత్యయా**) అన్నాడు. భగవంతుడు చెప్పిన మాటలను బట్టి చూస్తే ఎవరికి సాధ్యముకానీ మాయతో కూడుకొన్న వేదములను వ్యాసుడు వ్రాశాడు. దేవుడు ధర్మములతో కూడుకొన్నవాడు.

దేవునికి ప్రతి పక్షమైన మాయ అధర్మములతో కూడుకొని ఉన్నది. అధర్మయుక్తమైన వేదములను వ్యాసుడు వ్రాశాడు, కావున వ్యాసున్ని అధర్మములను బోధించిన వానిగా లెక్కించాలి. ఈ లెక్క ప్రకారము వ్యాసున్ని "ధర్మపరుడు" అని అనాలి. ధర్మములను బోధించిన కృష్ణున్ని "అధర్మపరుడు" అని అనాలి. వ్యాసుడు ధర్మపరుడు అయినపుడు "అధర్మ వరుడు" అగును. అట్లే కృష్ణుడు అధర్మపరుడు అయినపుడు "ధర్మవరుడు" అగును. ఇక్కడ వరుడు, పరుడు అను పదములకు వివరము తెలిసి చదువవలెను.

వేదములను చెప్పిన వేదవ్యాసుడు, పురాణములను వ్రాసిన వ్యాసుడు, కొందరిచేత "వ్యాసో నారాయణో హరి" అని పొగడబడిన వ్యాసుడు, మరికొందరిచేత వ్యాసభగవానుడు అని పిలిపించుకొన్న వ్యాసుడు, బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము, భగవంతుడు చెప్పిన భగవద్గీత ప్రకారము వ్యాసుడు అధర్మయుక్తుడు, అధర్మవరుడు, అధర్మములను బోధించిన ధర్మపరుడు. వ్యాసుని కాలములోనే వేదములు, పురాణములు మనుషుల లోనికి చేరి ధర్మములకు ముప్పు ఏర్పడగా, తప్పనిసరిగా భగవంతుడు భూమిమీదకు వచ్చి ధర్మములను తెలియ చెప్పవలసి వచ్చినది. ఈ మా మాటలు కొందరికి విడ్డూరముగా కనిపించినా, మా మాటలన్ని వాస్తవములే. మేము ఇప్పుడు చెప్పునదే కాదు. ఆనాడు వ్యాసుడే స్వయముగా తాను చేసినది తప్పని గ్రహించాడు. అప్పటికే అనగా భగవద్గీత తనకు తెలిసినప్పటికి 80 సంవత్సరముల ముందే వేదములు, పురాణములు తన ద్వారా వ్రాయబడి ప్రజలలోనికి వెళ్ళి పోయాయి. తన తప్పు ఎటువంటిదో గీత ద్వారా తెలుసుకొన్న వ్యాసుడు, తాను గీతను దాటి ప్రవర్తించానని తెలిసి పశ్చాత్తాపపడి పోయాడు. తాను చేసిన తప్పును సరిదిద్దుకోవడానికి, అర్జునుని ద్వారా విన్న దాదాపు ఆరు నిమిషముల

సమాచారమును 578 శ్లోకముల రూపములో వ్రాశాడు. అలా గీతను వ్రాసిన వ్యాసుడు అందులోని ధర్మములను జీర్ణింపచేసుకొని ఆచరించుతూ గీత ద్వారా మారిన మొట్ట మొదటి వాడైనాడు. ఆనాడు వ్యాసుడు వ్రాసిన గీత 578 శ్లోకములు కాగా, ఈనాడు కొంత కలుషితమై 700 శ్లోకాల రూపములో మన ముందున్నది. కలిపిత శ్లోకాలను మా రచన అయిన **"త్రైతసిద్ధాంత భగవద్గీత"**లో బయట పెట్టడము జరిగినది.

జగతిలో త్రేతాయుగమునందు ఆది కవి అయిన వాల్మీకి ఇతిహాస మైన రామాయణమును వ్రాయగా, ద్వాపరయుగమునందు వ్యాసుడు వేదములను, పురాణములను, ఇతిహాసమైన (చరిత్రయైన) భారతములోనే భగవద్గీతను కూడ యుద్ధకాండములో పొందుపరచి వ్రాశాడు. త్రేతా యుగములోని రామాయణమునందు వాల్మీకి వ్రాతలో, రాముడు ద్వాపర యుగములో కృష్ణునిగా పుట్టునని ఎక్కడా వ్రాయలేదు. అదే విధముగ ద్వాపరయుగములోని వ్యాసుడు శ్రీకృష్ణుడు ముందు జన్మలో రాముడనీ వ్రాయలేదు. అటు వాల్మీకిగానీ, ఇటు వ్యాసుడుగానీ వ్రాయని విషయమును మధ్యలోని కవులు రాముడు, కృష్ణుడు ఒకటని వ్రాశారు. ఇప్పటి కవులు వ్రాసిన ప్రకారము రాముడు దేవుడుగాదు, భగవంతుడుకాదు. అలాగే కృష్ణుడు దేవుడు కాదు, కానీ భగవంతుడని చెప్పవచ్చును. దేవునికి, భగవంతునికి, మనిషికి అర్థము తెలిసినపుడు రాముడు కృష్ణుడు ఏమవుతారో చెప్పవచ్చును. రామున్ని కృష్ణున్ని ఇద్దరిని దేవుడు కాదన్నాము. వీరే కాదు జగతిలో శరీరమును ధరించి ఆకారముతో ఎవరు పుట్టినా వారు దేవుడు కాదు. కృష్ణున్ని రామున్ని పరిశీలించి చూచితే రాముడు సాధారణ మనిషిగా లెక్కించబడతాడు. కృష్ణుడు మాత్రము భగవంతునిగా లెక్కించ బడతాడు. అలా లెక్కించుటకు ఆధారము బ్రహ్మవిద్యాశాస్త్రమే. దేవుడు,

భగవంతుడు, మనిషి అను ఈ త్రైతములో ఎవరు దేవుడు, ఎవరు భగవంతుడు, ఎవరు మనిషి అని తేల్చి చెప్పుటకు దైవధర్మములతో కూడుకొన్న బ్రహ్మవిద్యాశాస్త్రమే ఆధారము.

బ్రహ్మవిద్యాశాస్త్రములో దైవశాసనముల ప్రకారము భగవంతుడు మనిషి కుమారునిగా పుట్టాడు. భగవంతుడుగా పుట్టినవాడు సాధారణ మనిషి శరీరమును ధరించినప్పటికీ తల్లిగర్భమునుండి పుట్టుచున్నాడు, కావున అతను భగవంతుడే. ఎందుకనగా తల్లిగర్భము లోపలనుండి సజీవముగా పుట్టినవాడు భగవంతుడు. తల్లిగర్భము లోపల నుండి నిర్జీవ శరీరము పుట్టిన తర్వాత, ఆ శరీరములోనికి చేరిన వాడు (జీవుడు) భగవంతుడు కాడు, సాధారణ మనిషి అగును. మనిషికి భగవంతునికి తేడా పుట్టుకలోనే కలదు. తల్లిగర్భము (భగము) నుండి పుట్టువాడు భగవంతుడు. తల్లిగర్భములో జీవుడు ఏమాత్రము లేకుండా చైతన్యములేని శరీరము పుట్టిన తర్వాత, ఆ శరీరములోనికి చేరువాడు మనిషి అని, అతను భగవంతుడు కాడు అని చెప్పవచ్చును. ఎవరు సజీవముగా పుట్టుచున్నారు, ఎవరు సజీవముగా పుట్టలేదు అను విషయము ప్రసవ సమయములో ప్రసవములను (కాన్పులను) చేయు వైద్యులకు కూడ తెలియక పోవడము వలన, భగవంతున్ని గుర్తించుటకు వీలులేకుండ పోయినది. రాముని పుట్టుకను చూస్తే, తల్లిగర్భమునుండి రాముని శరీరము పుట్టిన తర్వాత బయటవున్న శరీరములోనికి, రాముడు అని పేరుపెట్టబడిన జీవుడు వచ్చి చేరాడు. కృష్ణుని పుట్టుకను వివరించుకొని చూస్తే, కృష్ణుడు ఎదురు కాళ్ళతో పుట్టడమే కాక, కాళ్ళు బయటపడినపుడు తన కాళ్ళను కదిలించాడు. అలా కదిలించి తాను తల్లిగర్భములోనే సజీవముగా ఉన్నట్లు బయటికి తెలియజేశాడు. దీనినిబట్టి కృష్ణుడు భగమునుండి పుట్టినవాడని

భగవంతుడని తెలియుచున్నది. ఈ ఒక్క ఆధారముతోనే రాముడు మనిషి, కృష్ణుడు భగవంతుడు అని చెప్పుచున్నాము. అంతేకాక భగవంతుడు దైవ ధర్మములను తెలియజేయుటకు వస్తాడు, కనుక కృష్ణుడు భగవద్గీతను బోధించాడు. రాముడు సాధారణ మనిషి, కావున రాముడు తన జీవితములో ఏ ఒక్క దైవధర్మమును తెలియచేయలేదు. రాముడు గతజన్మలో చేసుకొన్న ప్రారబ్ధకర్మచేత పుట్టి సుఖదుఃఖములను అనుభవించాడు. కృష్ణుడు గత జన్మలో చేసుకొన్న కర్మప్రకారము పుట్టలేదు. ప్రతి పుట్టుకకు కర్మ ఉంటుంది, అను సూత్రము ప్రకారము కృష్ణుడు కర్మవలననే పుట్టినప్పటికీ, ఆ కర్మ ఆయన చేసుకొన్నది కాదు. కృష్ణుని పుట్టుకగానీ, జీవితముగానీ, మరణముగానీ కర్మచేతనే జరిగినా, ఆ కర్మ అతను చేసుకొన్నది ఏమాత్రము కాదు. అతను వ్రాసుకొన్న కర్మ అని చెప్పవచ్చును. ఒక జన్మకు కావలసిన కర్మను కృష్ణుడు తానే సృష్ఠించుకొని, దానిప్రకారము వచ్చి పోయాడు. తాను సృష్ఠించుకొన్న కర్మ ప్రకారము ఆయన పనులు చేసినా, ఆ కర్మ వలన కృష్ణుడు బాధపడలేదు. ఎందుకనగా ఆయన కర్మ ఆయనకు ముందే తెలుసు. ఏమి జరుగుతుందో ముందే తెలిసి ఉండడము వలన ఆయనకు బాధలేదు. అదే రాముని విషయములోనికి వస్తే ఆయన కర్మ ఎలాగున్నదో ఆయనకు తెలియదు. కావున అనేక సందర్భములలో రాముడు బాధపడినాడు. సీతను పోగొట్టుకొన్నపుడు ముందు జరుగబోవునది తెలియదు, కనుక రాముడు చాలా బాధపడిపోయాడు. సాధారణ మనిషి జీవితములో కర్మ ఎలాగున్నదో, అలాగే రాముని జీవితములో కూడ కర్మ ఉన్నది. సాధారణ మనిషి కర్మవలన ఎటువంటి అనుభవములను పొందు చున్నాడో, అలాగే రాముడు కూడ అటువంటి అనుభవములనే పొందాడు. అందువలన రామున్ని మనిషి అని, కృష్ణున్ని భగవంతుడని చెప్పుచున్నాము. వీరిద్దరిలో ఎవరూ దేవుడు కాదు అన్నది అందరికి అర్థమై ఉంటుంది.

ఇట్లు ఎన్నో విధముల చూడగా రాముడు, కృష్ణుడు ఒక్కటి కాదని తెలియుచున్నది. ఆధ్యాత్మిక విషయములలో చూస్తే రాముడు యజ్ఞములను రక్షించి, యజ్ఞములను చేయువారిని ప్రోత్సహించాడు. కృష్ణుడు తన గీతయందు యజ్ఞములు రెండే ఉన్నవని, అవి శరీరములో జరుగుచున్నవని, శరీరాంతర్గత యజ్ఞము చేత మోక్షమును పొంది దైవములోనికి చేరవచ్చునని తెలిపాడు. అంతేకాక బయట అనేక రకముల పేర్లతో చేయబడు ఏ ఒక్క యజ్ఞము చేతగానీ దేవున్ని చేరుటకు, మోక్షము పొందుటకు వీలులేదని చెప్పాడు. బాహ్యయజ్ఞములు అధర్మములనీ, ధర్మములు కాని వాటిచేత దైవత్వము తెలియదని కూడ చెప్పాడు. ఈ విధముగ బయటి యజ్ఞములను ఖండించిన కృష్ణుడు భగవంతుడనీ, బాహ్యయజ్ఞములను ప్రోత్సహించి కాపాడిన రాముడు సాధారణ మనిషి అని చెప్పవచ్చును. ఇన్ని విధముల రాముడు, కృష్ణుడు ఒక్కటికాదు. వారిరువురు వేరువేరని, రాముడు దేవుడుకాదు మనిషియనీ, కృష్ణుడు కూడ దేవుడుకాదు, కానీ భగవంతుడనీ చెప్పవచ్చును.

త్రేతాయుగములో రామునికంటే ముందు పుట్టిన వాడు రావణుడు. రావణుడు లంకకు చక్రవర్తి, రాముని తండ్రియైన దశరథునికంటే రావణుడు పెద్దవాడే. రామునికంటే రావణుడు 65 సంవత్సరములు పెద్దవాడు. రావణుడు దైవధర్మములను సంపూర్ణముగ తెలిసినవాడు. త్రేతాయుగములో సంపూర్ణ జ్ఞానియై రావణబ్రహ్మ, త్రికాల జ్ఞాని అని పేరుగాంచిన వాడు రావణుడు. ఇంతవరకు జగతిలో బ్రహ్మ అను బిరుదును పొందినవాడు రావణుడు ఒక్కడే. బ్రహ్మవిద్యా శాస్త్రమును సవివరముగా తెలిసిన రావణునికి బాహ్యయజ్ఞములు అధర్మములని కూడ తెలియును. అంతేకాక భగవద్గీతలో చెప్పినట్లు వేదాధ్యయణము, తపస్సు కూడ అధర్మములనియే

తెలిసినవాడు. తన లంకారాజ్యములో దైవధర్మములకు విరుద్ధముగ వేదపఠనముగానీ, తపస్సులుగానీ, యజ్ఞములనుగానీ ఎవరూ చేయకూడదని శాసించాడు. లంకారాజ్యము ఆనాడు లంకాద్వీపములోనేకాక దక్షిణ భారతదేశములో కూడ వ్యాపించి ఉండెడిది. నేడు గల ఆంధ్ర, తమిళనాడు, కర్ణాటక, కేరళ నాలుగు రాష్ట్రములు ఆనాడు రావణబ్రహ్మ పాలనలోనే ఉండెడివి. ఆ కాలములో ఉత్తర భారతదేశములో యజ్ఞములు, తపస్సులు, వేదాధ్యయణములు ఎక్కువగా ఉండెడివి. ఉత్తరదేశము యొక్క అలవాట్లు దక్షిణ దేశములో కూడ అక్కడక్కడ ఉండెడివి. రావణబ్రహ్మ ఆధీనములో నున్న దక్షిణ భారత దేశములో ఎవరైన వేదములను చదివినా, యజ్ఞములను చేసినా, తపస్సులను చేసినా రావణబ్రహ్మ శిక్షించెడి వాడు. దైవధర్మములైన యోగములను ఆచరించమని, యోగములను ఆచరించక యజ్ఞ, తపస్సులను చేయువారు, వేదములు చదువువారు దేవునికి వ్యతిరేఖమైన అధర్మములను ఆచరించునట్లు అగునని, అట్లు చేసినవారు శిక్షార్హులని కూడ తెలియజేశాడు. అయినప్పటికీ ఉత్తర భారతదేశము వారు రావణబ్రహ్మకు వ్యతిరేఖముగా ఆయన చెప్పినట్లు వినకుండునట్లు కొందరిని ప్రేరేపించి దొంగతనముగా యజ్ఞములు చేయించెడివారు.

ఆ కాలములోనే రావణబ్రహ్మ యొక్క రాజ్యమైన దక్షిణ భారత దేశములోని వారు, లంకలోని వారు అందరూ రాక్షసులని, ఉత్తర భారత దేశములోని వారు దేవతలని ఉత్తర దేశములోని కొందరు ప్రచారము చేశారు. అందువలన లంకతో సహా దక్షిణ దేశమువారందరు ఒక తెగయని, ఉత్తర దేశము వారందరు మరొక తెగయని అందరికి తెలియునట్లు ప్రచారము జరిగిపోయినది. అప్పుడే కాదు ఈ కాలములో కూడ దక్షిణమువైపు ఉన్నవారంతా ద్రావిడులని, ఉత్తరమువైపు ఉన్నవారంతా

ఆర్యులని ప్రచారములో గలదు. ద్రావిడులందరు రాక్షసజాతియని, ఆర్యులందరు దేవతలజాతియని ఇప్పటికీ అనుకోవడము జరుగుచున్నది. ఆ లెక్క ప్రకారము ప్రస్తుతము ఆంధ్ర, కర్ణాటక, తమిళనాడు, కేరళ వారందరు రాక్షసజాతియని, ద్రావిడులమని చెప్పడము జరుగుచున్నది. కేవలము రెండు వందల సంవత్సరముల పూర్వము కూడ ఉత్తర భారతదేశములో సంస్కృతము వచ్చిన పండితులు ఎక్కువగా ఉండెడివారు. దక్షిణ భారతములో అందరూ చదువురాని పామరులుగా ఉండెడివారు. అంతకంటే పూర్వము ద్రావిడ రాజ్యములో ఎవరూ పాండిత్యము గలవారు లేరు. ఉత్తరదేశమంతా పాండిత్యముగలవారు, సంస్కృత భాషమీద పట్టున్నవారు ఉండుట వలన, తాము ఆర్యులమను భావము వారిలో ఉండుట వలన, ద్రావిడులందరు రాక్షసులను తక్కువ భావము దక్షిణ దేశము వారిమీద ఉండెడిది. ఆర్యులు వారి పాండిత్యముతో తమ ప్రాంతమువాడైన రామున్ని గొప్పగ చిత్రించి, ద్రావిడ ప్రాంతమువాడైన రావణున్ని నీచముగా చిత్రించి పుస్తకములను వ్రాయడము జరిగినది. వాటిని చదివిన వారందరు రామున్ని మంచివాడు, గొప్పవాడు అని అనుకొన్నారు. రావణబ్రహ్మను చెడ్డవాడు, నీచుడు అని అనుకొన్నారు. ఈ విధముగ ఆర్యులు రామున్ని గొప్పగ, రావణున్ని నీచముగ ప్రచారము చేశారు. గతమును గూర్చి యోచించని ప్రజలు, తాము చదివిందే నిజమనుకొని నమ్మి రామున్ని దేవునిగా రావణున్ని రాక్షసునిగా అర్థము చేసుకొన్నారు. వాస్తవానికి ఆర్యుల కుటిల కుతంత్ర రచనలను వదిలి సత్యమును గ్రహిస్తే, రాముడు సాధారణ మనిషి, రావణుడు బ్రహ్మజ్ఞాని. రామునికి ఆత్మజ్ఞానము ఏమాత్రము తెలియదు. రాముని చిన్నవయస్సులో విద్యాభ్యాసము జరుగగ తర్వాత 16 సంవత్సరములకే సీతతో పెళ్ళి జరిగినది. పెళ్ళి జరిగిన వెంటనే పట్టాభిషేకము యొక్క గొడవలు

జరుగడము, దాని తర్వాత ఊహించని రీతిగా రాముడు అరణ్యమునకు వెళ్ళడము జరిగినది. 14 సంవత్సరముల వనవాసము ముగియు చివరి సంవత్సరములో రావణుడు సీతను తన లంకకు తీసుకెళ్ళాడు. అప్పటికి రాముని వయస్సు కేవలము 30 సంవత్సరములు కాగా, రావణబ్రహ్మ వయస్సు దాదాపు 95 సంవత్సరములుండవచ్చును. తర్వాత రావణుని తమ్ముడు విభీషణునితో రాముడు కుట్రపన్ని రావణున్ని చంపి, దాదాపు ఒక సంవత్సరమునకు సీతను తెచ్చుకొన్నాడు, తర్వాత ఒక సంవత్సరమునకే సీతను అడవికి పంపాడు. అప్పటినుండి మానసిక క్షోభతో నిండిపోయాడు. తర్వాత దాదాపు పది సంవత్సరములకు కొడుకులైన లవకుశలను కలుసుకొన్నపుడు సీత తనవెంట వచ్చుటకు నిరాకరించినది. అప్పటికి రాముని వయస్సు దాదాపు 42 సంవత్సరములు. తర్వాత జీవితములో కూడ సీతను గురించి చింతించడము, తాను తప్పు చేశానని బాధపడడము జరిగినది. కానీ ఏనాడూ రాముడు దైవజ్ఞానమువైపు చూడలేదు. ఆయన జీవితములో దైవజ్ఞానమును తెలుసుకొను అవకాశమే రాలేదు. దైవజ్ఞానము మీద రాముడు ఏనాడూ శ్రద్ధ చూపలేదు. కొంతైనా దైవజ్ఞానములేని రామున్ని సంపూర్ణ జ్ఞాననిధియైన కృష్ణునితో పోల్చుటకు ఏమాత్రము వీలులేదు. కృష్ణుడు దైవమునుండి వచ్చి పుట్టిన దైవ అంశ అయిన భగవంతుడు. రాముడు దైవజ్ఞానమేదో తెలియని వ్యక్తి. కృష్ణుడు నశించుపోవుచున్న ధర్మములను తిరిగి పునరుద్ధరించిన ప్రవక్త, రాముడు ప్రపంచ సంబంధ నీతి, న్యాయమును కూడ ఆచరించక, తన స్వార్థము కొరకు వాలిని చంపిన హంతకుడు. అంతేకాక తనలో వేధిస్తున్న అనుమానముతో ఏదో ఒక సాకు చూపి భార్యను నిండు గర్భవతిని క్రూరముగ అడవికి పంపిన వాడు. ఏ శత్రుత్వము లేని వాలిని చంపడము కిరాయి హత్యకాదా అని ఒక

ముస్లీమ్ ప్రశ్నించినపుడు ఏమి జవాబు చెప్పలేక తల దించుకోవలసి వచ్చినది. సీతను అడవికి పంపడము అన్యాయము కాదా! అదే మీచెల్లెలునో, అక్కనో మీబావ మృగాలున్న అడివిలోగానీ, మానవమృగాలున్న పెద్ద సిటీలో గానీ ఒంటరిగా వదలివేస్తే మీ బావను మనిషేకాదని వానిని చంపివేస్తానని దూషించు మీరు, రామున్ని ఏమి అనకుండ దేవుడని పొగడుతారా! అని ఒక క్రైస్తవుడు అడిగినపుడు కూడ ఏమీ జవాబు చెప్పలేక పోయాము. అటువంటి సందర్భములన్నిటిని అతిక్రమించి, దైవాంశ సంభూతుడైన కృష్ణునితో సమానముగా పోల్చలేము. అందువలన రాముడు, కృష్ణుడు ఒక్కటి కానేకాదు అని చెప్పుచున్నాము.

ప్రాంతీయ ద్వేషముతో ఆర్యులు రావణబ్రహ్మను తక్కువ చేయడమే కాక, రాముని లోపములు కనిపించకుండ ఉండుటకు కృష్ణున్ని వాడుకొని రాముడు కృష్ణుడు ఇద్దరు ఒక్కటేనన్నారు. రామునికి దైవజ్ఞానము తెలియదని ఎవరైనా అంటే, ద్వాపరయుగములో రాముడే కృష్ణావతారమెత్తి దైవ జ్ఞానమును బోధించాడని కృష్ణున్ని వాడుకొనుచున్నారు. కృష్ణుడు అల్లరి వాడు, ఎంతోమంది ఆడవారితో సంబంధమున్నవాడు, ఎనిమిది మంది భార్యలున్నవాడు అంటే కృష్ణుని తప్పును కప్పి పుచ్చుటకు రామావతారములో ఏకపత్నీవ్రతుడని రామున్ని చూపుచున్నారు. ఈ విధముగా రాముని తప్పులు కప్పిపుచ్చుకొనే దానికి కృష్ణున్ని, కృష్ణుని తప్పులు అడిగితే రామున్ని చూపుటకు ఆర్యులు రాముడు కృష్ణుడు ఒక్కటే అన్నారు. కానీ అది ఎటు చూచినా సత్యముకాదు.

రాముడు అయోధ్యలో పుట్టకముందే 'రామ' అను రెండక్షరముల పేరు ఉంది. కానీ కృష్ణుడు మధురలో పుట్టకముందు 'కృష్ణ' అను పేరు ఎక్కడా లేదు. రాముడు త్రేతాయుగములో పుట్టాడు. అయితే రామ అను

పదము కృతయుగములోనే ఉన్నది. రామ అను రెండక్షరముల పదములో ఎంతో గొప్ప దైవజ్ఞాన భావము ఇమిడి ఉన్నది. అది ఏమనగా! "రామ" అను రెండక్షరముల శబ్దమును ప్రజలకు కృతయుగములోని జ్ఞానులే పరిచయము చేశారు. రాముడు పుట్టని ఆ కాలములో 'రామ' అను రెండక్షరములకు ఆధ్యాత్మికరీత్యా విశేషమైన అర్థముండెడిది. 'ర' అనగా అర్థము నాశనము అని ముందే తెలుసుకొన్నాము. 'ర' అనినా 'రా' అనినా రెండు ఒకే అర్థము నిచ్చుచున్నవని, దశరాపండుగను గురించి చెప్పుకొన్నపుడే తెలుసుకొన్నాము. 'మ' అనగా **నేను** లేక **నా** అను అర్థముగలదని, మమ అనగా నాయొక్క అనియు **"సుబోధ"** గ్రంథములో 'మామ' ను గురించి చెప్పుకొన్నపుడు తెలుసుకొన్నాము. ఆ ప్రకారము చూస్తే రామ అను మాటలో నా అనునది నాశనము కావలెనని అర్థమిమిడి యున్నది. నేను అనువాడినైన జీవున్ని నాశనమై పోవాలని అర్థము, ఆ రెండక్షరముల శబ్దములో గలదు. జీవుడు నాశనమైతే దేవునిగా మారిపోగలడు, అనగా దేవునిలో కలిసి పోగలడు. ఒక జీవుడు జన్మరాహిత్యమును కోరుకొంటూ, దేవునియందైక్యమగు అర్థము "రామ" అను శబ్దములో ఇమిడివున్నది. బ్రహ్మజ్ఞానము ప్రకారము ప్రతి జీవుడు దేవునియందైక్యమగునట్లు కోరుకోవలెను. ఆ విధముగానే ప్రవర్తించవలెను. జీవుడు ఎప్పటికైనా దేవునియందు చేరి పోవలసినవాడే. జీవుడు అను మాట లేకుండ పోయి, దేవుడను మాటగా మార్పు చెందవలసినదే. అందువలన భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగము అను అధ్యాయమున జీవున్ని క్షరుడు అన్నారు. క్షరుడు అనగా నాశనమగువాడని అర్థము. "నాశనము చెందువాడిని నేను" అను జ్ఞాపకమును ఎల్లపుడు మనిషి మరిచి పోకుండునట్లు "రామ" అను మాటను సందర్భములోగానీ, అసందర్భములో గానీ అపుడపుడు పలుకునట్లు పెద్దలు అలవాటు చేశారు. పూర్వము రెండక్షరముల రామ అను మాటలో

ఎంత అర్థముందో అందరికి తెలిసియుండెడిది. కృతయుగములోనే రామ అను శబ్దము ఆధ్యాత్మికమునకు ఆదర్శముగా ఉండెడిది. నేను నాశనమగువాడినని అందరిలో దృఢభావము రామ అను రెండక్షరముల వలన ఉండెడిది. భగవద్గీతలో చెప్పిన క్షర భావము, అనగా నాశన భావము 'ర' వలన, నేను అను భావము 'మ' వలన కల్గుచున్ననది. కావున 'రామ' శబ్దము పరమ పవిత్ర అర్థముతో కూడుకొన్న శబ్దముగా పూర్వము భావించెడివారు. గొప్ప భావమున్న రామ శబ్దమును దశరథపుత్రునికి నామధేయముగా పెట్టుకొన్నారు. ఆనాటి నుండి ఆధ్యాత్మిక జ్ఞానము ప్రజలలో తగ్గిపోవడము వలన, రామ అను రెండక్షరములు శ్రీరామ అని మూడక్షరములుగా మారిపోవడమూ, దశరథ పుత్రునినుండే రామ అను పేరు వచ్చినదనీ, రామ అనగా దశరథ రాముడే నను భావము అందరిలో ఉండిపోయింది. అదే భావము ఈనాటికీ మిగిలి పోయినది.

రామ అంటే దశరథపుత్రుడే అని రామదాసు అనుకొనగా, రామదాసుకంటే పెద్దవాడైన కబీర్‌దాసు తాను అనుకొను రామ దశరథ రాముడు కాదన్నాడు. అందువలన ఒక సందర్భములో దశరథ రాముడే కనిపించినా "నీవు నా రాముని కాదు పో!" అన్నాడట. నేను తలచు రాముడవు నీవుకాదు అని శ్రీరామున్ని కబీర్ అన్నాడంటే, కబీర్‌కు పూర్వపు జ్ఞానము ఆధ్యాత్మికము ప్రకారము తెలుసునన్నమాట. రామదాసుకు ఆధ్యాత్మికము తెలియక రామ అను మాట శ్రీరాముని పేరేననుకొన్నాడు. ఒక రామదాసే కాదు, ఆనాటి త్రేతాయుగమునుండి ఎందరో దశరథ రాముడే నిజమైన రామ అని తలచిన వారు కలరు. అటువంటి వారందరు శ్రీరాముని మీద భక్తితో గుడికట్టి రామున్ని పూజించుచున్నారు. విశేషమే మంటే కృష్ణుని గుడి ఒక్కటుంటే రాముని గుడులు వంద ఉంటాయి. ఆ

లెక్క ప్రకారము కృష్ణునికంటే రాముడే ప్రజలకు గొప్పగ కనిపించాడని అర్థమగుచున్నది. రాముడు కృష్ణుడు ఇద్దరు ఒకటేనని చెప్పు వారు కూడ రాముని భక్తులుగానే ఉంటారు. కృష్ణుడు పుట్టిన ఉత్తరదేశములో కూడ కృష్ణుని గుడులు తక్కువగా ఉండడమును గమనించవచ్చును. రామ అను రెండక్షరములు ఎంతో జ్ఞానముతో కూడుకొన్నవై ఉండుట వలన, ఆ రెండక్షరములను ఒక్కమారు ఉచ్చరించినా దాని అర్థమును బట్టి ఎంతో సార్థకత కల్గునని జ్ఞానులు చెప్పియున్నారు. అదంతయు వాస్తవమే అయినా రామ అను పదము అయోధ్య రామునికంటే ముందునుండి ఉన్నదని ఎవరికీ తెలియకుండ పోవడము, నేడు మనుషులలోని పెద్ద అజ్ఞానమైనది. ఇటువంటి పరిస్థితి భవిష్యత్తులో వస్తుందనేమోనని త్రేతాయుగములోనే ఊహించిన పెద్దలు అటువంటి పరిస్థితి రాకుండుటకు, 'రామ' అను రెండక్షరముల శబ్దమునకు ఆధ్యాత్మిక విలువ ఉండుటకు, దశరథపుత్రునికి రామ అని పేరు పెట్టిన రోజుననే ఒక నిర్ణయానికి వచ్చారు. ఆధ్యాత్మిక 'రామ' కు, మనిషిగా పుట్టిన 'రామ' కు తేడా ఉండునట్లు, ఆ తేడాను ప్రజలు సులభముగా గ్రహించునట్లు చేయాలనుకొన్నారు. అందువలన పుట్టిన వ్యక్తి పేరు 'రామ' అనినా ఇది వ్యక్తి పేరు అని తెలియునట్లు గుర్తునుంచాలనుకున్నారు. అందువలన పుట్టిన రామున్ని 'దశరథ రామ' అని రామకంటే ముందు తండ్రి పేరును గుర్తుగా ఉచ్చరించునట్లు చేశారు. ఆధ్యాత్మిక రామ శబ్దమునకు ముందు వెనుక గుర్తు ఏమీ ఉండదు. శరీరముతో పుట్టిన రామకు మాత్రము ముందు చాలా గుర్తింపులున్నవి. వాటిని చూస్తే సీతారామ, అయోధ్య రామ, కోదండరామ, పట్టాభిరామ, దశరథరామ, కౌసల్యరామ అని రామునికి చాలా గుర్తులు కలవు. ఈ విషయము తెలియని రామదాసు కనిపించే అయోధ్య రామున్ని ఆరాధించాడు. గుర్తుల జ్ఞానము తెలిసిన కబీర్‌దాస్ కనిపించని ఆత్మా

రామున్ని ఆరాధించాడు. అందువలన అయోధ్య రాముడు కనిపించినా నీవు నా రామునివి కాదు పో అన్నాడు.

కొంత జ్ఞానము తెలిసి నిత్యము రామ శబ్దమును ఉచ్ఛరించిన కబీర్‌దాసే అయోధ్య రామున్ని, నీవు నా రాముడవు కాదనినపుడు, దైవము యొక్క అంశగా వచ్చిన భగవంతుడైన కృష్ణున్ని కేవలము మానవ మాత్రుడైన రామున్ని కలిపి ఒక్కటనడము పొరపాటగును. అందువలన అన్ని విధముల యోచించి రాముడు కృష్ణుడు ఒక్కటికాదని పెద్దలైన జ్ఞానులంటున్నారు. వారి మాటనే సమర్థిస్తూ మనము కూడ రాముడు వేరు, కృష్ణుడు వేరు అంటున్నాము. ఈ విధముగా చెప్పడము వలన అయోధ్య రాముని భక్తులకు కొంత బాధగా ఉండవచ్చును. ఇక్కడ గమనించదగిన విషయమేమంటే ఇద్దరూ ఒకటి కాదంటున్నాము తప్ప అయోధ్య రామున్ని పూజించవద్దనిగానీ, ఆయనను వదలి కృష్ణున్ని పట్టుకోమనిగానీ చెప్పలేదు కదా! ఆధ్యాత్మిక జ్ఞానరీత్యా ఇద్దరు ఒక్కటి కాదంటున్నాము తప్ప, ఆరాధించుటకు అనర్హుడని చెప్పడము లేదని గ్రహించవలెను. అయోధ్య రామున్ని పూజించినా అంతరంగములోని రామున్ని మరువవద్దని, రామ అను రెండ క్షరముల శబ్దము పవిత్రమైనదని, రామ జపమును చేసినవారు ఎందరో పవిత్రులైనా రని తెలుపుచున్నాము.



## శ్రీకృష్ణుడు నెమలి పింఛమును ఎందుకు ధరించాడు?

బహుశ నెమలిపింఛమును చూడనివారుండరు. నెమలిపింఛమును బాగా గమనిస్తే అందులో నాలుగు గుండ్రని భాగములు నాలుగు ప్రత్యేకమైన రంగులలో ఉండును. నాలుగు రంగుల వలయాకారములున్న నెమలి

పింఛమును కృష్ణుడు తలమీద అందరికి కనిపించునట్లు ధరించాడు. ఆ విధముగా రంగుల పింఛమును ధరించడము అందముకొరకని కొందరను కొని ఉండవచ్చును. పింఛమును గురించి ఏమీ ఆలోచించని వారు కూడ కొందరుకలరు. కృష్ణుడు ఎంతో గొప్పవాడు, ధనికునిగా ఉన్నవాడు, ఏదో అర్థముతో ధరించి ఉంటాడని అనుకొన్నవారు కొందరు గలరు. కొందరేమో దృష్టిదోషము (జిష్ఠి) తగలకుండుటకు అలా పెట్టుకొన్నాడని అనుకొన్నారు. మరికొందరు స్త్రీల ఆకర్షణ కొరకు దానిని పెట్టుకొన్నాడని అనుకోవడము జరిగినది. ఈ విధముగా ఎవరికి తోచినది వారు అనుకోవడము జరిగినది. కృష్ణుడు సాక్ష్యాత్తూ భగవంతుడు కదా! భగవంతుడు మనుషులకు దైవ ధర్మములను, ఆత్మజ్ఞానమును అందించను భూమిమీదకు వచ్చాడు కదా! అంతగొప్పవాడు నెమలిపింఛమును దృష్ఠి దోషమునకో, అందమునకో, ఆకర్షణకో ధరించాడనుకోవడము పొరపాటు. ఆయన జీవితమంతా జ్ఞాన సందేశముతోనే కూడుకొని ఉండును. ఆయన నెమలిపింఛమును ధరించినా జ్ఞానసందేశముతో కూడుకొన్న అర్థమే ఉంటుంది. అలా ధరించడము ఏ భావముతో కూడుకొన్నదో మనము వెతికి చూచుకోవలెను. అలా వివరించు కొని చూస్తే, కృష్ణుడు నెమలిపింఛమును తలమీద ధరించడము దేనికి అని మొదట చూడవలెను. మనిషికి శిరస్సే అజ్ఞానమునకుగానీ, జ్ఞానమునకు గానీ నిలయమై ఉన్నది. భగవంతుడైన కృష్ణుడు తన తలమీద పింఛమును ధరించాడు. కృష్ణుని తల జ్ఞానమునకు నిలయమైనది. తలయందున్న జ్ఞానమును బాహ్యముగా చూపుటకు నెమలిపింఛమును ధరించాడని అర్థమగుచున్నది.

ప్రతి మనిషి తలలోపల, తల మధ్యభాగములో భ్రూమధ్య స్థానమున నాలుగుచక్రముల సముదాయమున్నది. ఈ నాలుగు చక్రములు బ్రహ్మనాడి

లోని ఆత్మను ఇరుసుగా చేసుకొని అమరి ఉండును. అన్నిటికంటే పైన ఉన్న చక్రము పేరు బ్రహ్మచక్రము. దానికంటే క్రిందనున్న చక్రము యొక్క పేరు కాలచక్రము, దానికంటే క్రిందగల చక్రము పేరు కర్మచక్రము. కర్మచక్రముకంటే క్రింద చివరిలోనున్న చక్రము పేరు గుణచక్రము. ఈ విధముగానున్న నాలుగు చక్రములకు ఆధారముగా ఇరుసుగానున్న బ్రహ్మనాడిలో ఆత్మగలదు. ఈ నాలుగు చక్రములు మరియు ఇరుసుగా ఉన్న బ్రహ్మనాడిని క్రింది చిత్రపటములో చూడుము.




**బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములు**

పైనున్న బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములలో క్రింది చక్రమైన గుణచక్రమును తీసుకొందాము. మిగత మూడు చక్రములకంటే మనిషి ఎక్కువగా తెలుసుకోవలసినది గుణచక్రమును గురించేనని అందరు గుర్తుంచుకోవాలి. ఈ చక్రములోనే మాయ ప్రతిష్ఠింపబడి ఉన్నది. అందువలన దీనిని మాయచక్రమని కూడ చెప్పవచ్చును. గుణ అనినా

మాయ అనినా రెండూ ఒకే అర్థము అని తెలుసుకోవలెను. పైనుండి నాల్గవ చక్రమైన గుణచక్రమును గురించి సంపూర్ణముగా తెలిసిన వానిని సంపూర్ణజ్ఞానమును తెలిసినవానిగా లెక్కించవచ్చును. నాల్గవచక్రమునకు ఎందుకంత ప్రాధాన్యతవుందనగా! ఆ నాల్గవచక్రములోనే నీవు ఉన్నావు. ప్రతి జీవుడు నివాసముంటున్నది క్రింది చక్రమైన నాల్గవచక్రములోనే. నాల్గవ చక్రములోనే మాయ ఉన్నది. నాల్గవ చక్రములోనే జీవుడు ఉన్నాడు. జీవుడు మాయలో చిక్కుకున్నాడు అంటే అది గుణచక్రములోనే అనీ, జీవుడు మాయనుండి బయటపడాలి అంటే అది కూడ గుణచక్రము లోనేననీ జ్ఞాపకముంచుకోవలెను. ఆత్మజ్ఞానమును తెలుసుకోవలసినది జీవుడేననీ, దేవుడు భగవంతునిగా వచ్చినది జీవునికి ఆత్మజ్ఞానము తెలియ జేయుటకేననీ, ఆత్మజ్ఞానమును తెలుసుకొను జీవుడు నివాసమున్నది గుణ చక్రములోనేననీ, అందువలన గుణచక్రమును తెలుసుకోవడము విశేష జ్ఞానమని తెలియవలెను. భగవంతునికి ఈ విషయము తెలియుట వలన గుణచక్రముతో సమాన పోలికలున్న నెమలిఫించమును తల మీద ధరించి చూపించాడు.

ఒక మనిషిని గుర్తించుటకు, ఇతను ఫలానా మనిషి అని తెలియుటకు ముందు అతని ముఖమును చూచి అతను ఎవరైనది తెలుసు కొంటాము. ముందు పరిచయమున్నవానిని, ముందు చూచిన వానిని వాని ముఖమును చూచి వీడు ఫలానావాడని తెలియవచ్చును. ముందు ఏమాత్రము పరిచయము లేని వ్యక్తిని కూడ ముఖమును చూచిన తర్వాత ఇతను క్రొత్తవ్యక్తి అని గుర్తిస్తాము. అందువలన ఒక మనిషిని గుర్తించుటకు శరీరములో పై భాగమున ఉన్న తలభాగమునే చూస్తాము అని చెప్పవచ్చును. కృష్ణుడు నేను ఫలానావాడినని తెలియచెప్పుటకు, ప్రతి మనిషి తెలియ

వలసినది ఇదేనని గుర్తు చేయుటకు, తన తలమీద నెమలిపింఛమును ధరించాడు. నెమలిపింఛము గుణచక్రముతో సమానపోలికలు ఉండడము వలన నెమలిపింఛమును ఆయన ధరించి చూపాడు. అలా చూపడములో రెండు భావములు ఇమిడివున్నవని చెప్పవచ్చును. ఒకటి అందరికీ ముఖ్యమైన జ్ఞానము ఇదేనని, అందరు తెలుసుకోవలసిన జ్ఞానము ఇదేనని తెలుపు నిమిత్తము అందరు చూచునట్లు తలమీద ధరించడము జరిగినది. రెండవది నేను శరీరములో ఉండినా మాయలో లేకుండా, మాయకు అతీత మైన యోగిగా ఉన్నానని తెలుపునిమిత్తము కూడ ఆ విధముగా ధరించాడని తెలియుచున్నది. ఈ అర్థములలో కృష్ణుడు నెమలిపింఛమునే ధరించుటకు బలమైన కారణము కలదు. అది ఏమనగా **గుణచక్రమునకు సమానమైన పోలిక ప్రపంచములో ఒకే ఒక్క నెమలిపింఛమునకు మాత్రమే కలదు.** ఇపుడు నెమలిపింఛమునకు గుణచక్రమునకు ఎలా పోలికలున్నాయో గమనిద్దాము. నెమలిపింఛమును అందరూ చూచి ఉంటారు. కానీ గుణచక్రమును ఇంతవరకు ఎవరూ చూడలేదు. గుణచక్రము కంటికి కనిపించునది కాదు. కావున ఎవరూ చూడలేరని చెప్పుచున్నాము. కంటికి ఒక గుణచక్రమేకాదు, మిగత మూడు చక్రములు కూడ కనిపించవు. అలాంటి బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రముల చట్రమును కంటికి కనిపించు బొమ్మగా చూపించాము. అంతేకాక ఈ దినము **త్రైత సిద్ధాంతమును** తెలిసిన ప్రతి వ్యక్తి మతములకు అతీతముగా తన ముఖము మీద నుదుటి భాగమున నాల్గుచక్రముల గుర్తును పెట్టుకోవడము జరుగుచున్నది. నాల్గుచక్రములను చిత్రించి చూపినపుడు క్రింద చక్రమైన గుణచక్రమును కూడ వివరముగా తెలియునట్లు బొమ్మరూపములో చూపుచున్నాము. గుణచక్రము యొక్క చిత్రమును తర్వాత పేజీలో చూడవచ్చును.




**గుణచక్రము**

ఈ చిత్రములో కనిపించునట్లే మన శరీరములోని గుణచక్రము ఉన్నది. గుణచక్రములో ముఖ్యమైన నాలుగు భాగములు కనిపిస్తున్నవి. అందులో బయటినుండి మొదటకలదానిని తామస గుణభాగము అంటాము. అలాగే బయటినుండి రెండవది రాజసగుణభాగము అంటాము. మూడవ దానిని సాత్త్విక గుణభాగము అంటాము. నాల్గవది మరియు అన్నిటికంటే మధ్యలోనిది అయిన చివరి దానిని గుణరహిత యోగము అనవచ్చును లేక ఆత్మ అని కూడ అనవచ్చును. బయటినుండి మొదటి భాగమైన తామస భాగములో నున్న జీవున్ని తామసుడు అంటాము. రెండవ భాగములోనున్న జీవున్ని రాజసుడు అని అంటాము. మూడవ భాగములో నున్న జీవున్ని సాత్త్వికుడు అంటాము. ఇక నాల్గవ చివరి భాగము మధ్యలోనున్న జీవున్ని యోగి అంటాము. గుణచక్రము ఈ విధముగా నాలుగు భాగములుగా ఉండగా, ఆయా సమయములలో, ఆయా భాగములో నున్న జీవులకు ఆ భాగము యొక్క పేరునే పెట్టారు. జీవుడు కర్మానుసారము కొన్ని సమయములలో ఒక భాగములో ఉండును. మరికొన్ని సమయము లలో మరియొక భాగమునకు మారవచ్చును. శాశ్వతముగా ఒకే

భాగములోనే ఉంటాడని చెప్పలేము. ఎప్పుడు ఏ భాగములో ఉంటే అప్పుడు ఆ భాగము యొక్క పేరు ఆ జీవునికి వర్తిస్తుంది. దీని ప్రకారము ఎక్కువ కాలము తామస గుణభాగములోనున్న జీవుడు కొన్ని సమయములలో రాజసములోనికి పోవచ్చును, మరికొన్ని సమయములలో సాత్త్వికములోనికి కూడ పోవచ్చును. ఆ విధముగా పోయిన సమయములో ఆ భాగము పేరును అతనికి చెప్పవచ్చును. ఎక్కువ కాలము ఏ గుణభాగములలో ఉంటే ఆ భాగము యొక్క పేరునే వానికి పెట్టవలసివస్తుంది. ఒక దినములో 24 గంటల కాలములో, తామస భాగములో 23 గంటలుండి ఒక గంట కాలము మాత్రము రాజసములో కొంతసేపు, సాత్త్వికములో కొంతసేపు ఉన్నవానిని తామసుడనే పిలవాలి. అదే విధముగా మధ్య భాగమైన ఆత్మభాగములో ఎక్కువ కాలముండు వానిని యోగి అని పిలువవలెను. అట్లే మిగత రాజస, సాత్త్విక గుణస్తులను కూడ పిలవవచ్చును.

గుణచక్రము ప్రతి జీవరాసికి ఉన్నా, ప్రతి జీవుడు గుణచక్ర భాగములలోనే చిక్కుకొనే ఉన్నా, జీవుడు శాశ్వతముగా ఏ గుణభాగముల లోను ఉండక అప్పుడప్పుడు వేరు గుణ భాగములలోనికి పోవుచుండును. గుణచక్రముతో సమాన పోలికలున్న నెమలిపింఛములో గుణభాగములు మూడు, గుణములేని భాగము ఒకటి, మొత్తము నాలుగు భాగములు నాలుగు రంగులలో కనిపించుచున్నవి. కానీ ఆ నాలుగు భాగములలో జీవుని పోలిక అయిన ఏ రంగుగానీ, ఏ గుర్తుగానీ లేదు. ఈ విధముగా ఎంతో విశేషమైన జ్ఞానమును నెమలిపింఛము మనకు తెలియబరుస్తున్నది. సృష్ఠి మొదలుకొని ఇంతవరకు భగవంతునికి తప్ప ఎవరికీ గుణచక్రము మన శరీరములో ఉన్నదని, అందులోనే మనమున్నామని తెలియదు. ప్రతి జీవునికి నివాసస్థలము శరీరములోని గుణచక్రమే. శరీరములో గుణచక్ర

మందున్న జీవుడు బయటి ప్రపంచములో కలెక్టర్ ఉద్యోగము చేసినా, కండక్టర్ ఉద్యోగము చేసినా, తన అడ్రస్ (చిరునామ) తనకు తెలియని స్థితిలో ఉన్నాడు. తాను శరీరముకాదని, తాను శరీరములోనున్న జీవుడనని తెలియక నేను ఫలానా మనిషినను భావముతో ఉన్నాడు. ద్వాపరయుగము అంత్యములో ఇప్పటికి 5148 సంవత్సరముల క్రితము భగవంతుడు భగవద్గీతను చెప్పి, అందులో గుణములను గురించి వివరించినా, సాత్త్వికుడు, రాజసుడు, తామసుడు, యోగి అను నాలుగువర్ణముల మనుషులను చెప్పినా, ఇంతవరకు భగవంతుడు చెప్పిన జ్ఞానమును అర్థము చేసుకోలేని మనుషులు అజ్ఞాన చీకటిలో మునిగి నేను బిల్‌కలెక్టర్‌ను, నేను జిల్లా కలెక్టర్‌ను, నేను గుమస్తాను, నేను గూండాను అని అనుకొంటున్నారు. బయటి ప్రపంచములో ఎంత చదువు చదివినా, ఎంత హోదా ఉండినా తన అడ్రస్ తనకే తెలియని వానిని తెలివి తక్కువవాడని అనవచ్చును.

గుణచక్రమునే మాయచక్రము అని కూడ అనవచ్చునని చెప్పు కొన్నాము. మాయ చక్రములోనే మాయవలలో చిక్కుకొని తన స్థితిని తానే తెలియక ప్రతి జీవుడు బాధపడుచున్నాడని, గుణచక్రమును గురించి తెలుసుకోవడము ప్రతి మనిషి కర్తవ్యమనీ, అలా తెలుసుకోవడము స్వధర్మమును తెలుసుకొన్నట్లేనని భగవంతుడు గీతలో బోధించాడు. అలా బోధించడమేకాక తన చిన్నవయస్సులోనుండి కృష్ణుడు తన తలమీద నెమలిపింఛమును ధరించాడు. అలా ధరించడము వలన ఎదుటి వ్యక్తికి అది కనిపించును. దానిని చూచిన వ్యక్తి దాని సారాంశమును గురించి తెలుసుకొనునని కృష్ణుడు నెమలిపింఛమును ధరించాడు. అంతేకాక ఆయన ధరించడములో ఇంకొక ముఖ్యమైన భావముకూడ కలదు. అదే మనగా! నేను బయటికి ఒక వ్యక్తిగా కనిపించినా, ఎక్కడ తిరిగినా నేను మాత్రము

తలలో గుణచక్రమందు మధ్యభాగములో యోగినై ఉన్నానని తెలుపుటకు పింఛమును ధరించాడు. పింఛములో మధ్యలోగల ఆత్మభాగము ప్రత్యేకమైన గుర్తింపురంగుగా ప్రక్కనున్న మూడు రంగులకంటే ఘాడముగా కనిపించు చుండును. అలా కనిపించడము వలన మూడు గుణభాగములకంటే ముఖ్యమైనది మధ్యలోని ఆత్మభాగమని చూడగానే తెలియుచున్నది. ఘాడముగా కనిపించు మధ్యభాగములో ఉండి కృష్ణుడు పనులు చేయుట వలన ఆయన మాయకు అతీతుడుగా ఉన్నాడు. **"గుణమయి మమ మాయా"** అని గీతలో చెప్పినట్లు త్రిగుణములే మాయ. మాయకు మధ్యలో ఆత్మస్థానములో ఉన్నవాడే యోగి. నెమలి పింఛములో మధ్యలో ఘాడముగా నున్న రంగు గుర్తింపుగా కనిపించుట వలన అందులో నేనున్నాను మీరుకూడ అందులోనికి రమ్మని కృష్ణుడు తెలిపినట్లున్నది.

ఆధ్యాత్మిక రంగములో ఎంతో ప్రాముఖ్యతను కల్గియున్నది నెమలి పింఛము. నెమలిపింఛము యొక్క రహస్యము ఒక్క కృష్ణునికి తప్ప ఎవరికీ తెలియదు. పింఛము కృష్ణుడు తలమీద పెట్టుకొని చూపించినా దానిని గుర్తుపట్టలేని గ్రుడ్డివారుగా ప్రజలున్నారు. నెమలిపింఛమును దాని వివరమును తెలియాలంటే ముందు ఎవరికైన తన శరీర నిర్మాణము, శరీరములో జరుగు పనిని గురించి తెలిసివుండాలి. గీతలో చెప్పు జ్ఞానము అంతయు మరియు నెమలిపింఛము యొక్క గుర్తు యొక్క జ్ఞానము శరీరములోనిదే. కావున శరీరములోని పనితనము తెలిసిన వారికి సులభముగా నెమలిపింఛము యొక్క వివరము అర్థమగును. కానీ నేటి కాలములో నెమలిపింఛమును గురించి ఆలోచించువారే లేరు. దానిని ధరించిన కృష్ణుడు గొప్పవాడనిగానీ, ధరించబడిన పింఛము భగవద్గీతలో **జ్ఞానయోగమున** చెప్పిన **"చాతుర్వర్ణమ్"** అను శ్లోకము యొక్క భావము

అనిగానీ ఎవరికి తెలియకుండా పోయినది. మనిషి అజ్ఞానములో మునిగి మాయలో ఏ విధముగా చిక్కుకొన్నాడో ఆ విధానమును తెలుపునది నెమలిపింఛము యొక్క జ్ఞానము. నెమలిపింఛమును గుణచక్రముగా పోల్చి చెప్పాడు కదా! పింఛము ఆకారమును చూచి దాని పూర్తి నిర్మాణ వివరమును గురించి తెలుసుకొందాము. నెమలిపింఛము యొక్క చిత్రమును క్రింది పటములో చూడుము.




నెమలిపింఛము యొక్క తల భాగమునే కాక క్రింది తోక భాగమును కూడ గమనిస్తే తెల్లని కాడకు రెండు ప్రక్కల పింఛము యొక్క కేశములు (వెంట్రుకలవలెవున్న రెమ్మలు) ఉండును. నెమలిపింఛమును చూచిన తర్వాత మన శరీరమున తల భాగములోని మెదడును దానిక్రింది భాగములోని వెన్నుపాము అను పెద్దనరమును గమనిస్తే ప్రక్క పేజీలో చూపిన చిత్రములో మాదిరి ఉండును.




**శరీరములోని మెదడు దాని నరము - నెమలిపింఛము దాని క్రిందికాడ**

మనిషి శరీరములోని నాడీమండలమును గమనిస్తే తలయందు స్థూలముగా కనిపించునది మెదడు మరియు మెదడునుండి క్రిందికి దిగిన వెన్నుపాము అను పెద్దనరము. అంతేకాక వెన్నుపాము అను పెద్దనరము నుండి రెండువైపులా చీలిపోయిన చిన్నచిన్న నరములు క్రింది వరకు కనిపించును. వెన్ను నరము నడుము క్రింది వరకు వ్యాపించిన వెన్నెముకలో అమరివుండును. తలనుండి నడుమువరకున్న వెన్నునరము (బ్రహ్మనాడి) తల నుండి రెండువైపుల క్రింది వరకు చిన్నచిన్న నరములను శరీరమంతా వ్యాపింపజేసి ఉండును. శరీరమును గురించి తెలిసిన ప్రతి ఒక్కరికి స్థూలముగానున్న మెదడు, దానినుండి క్రిందివరకున్న పెద్దనాడి, పెద్దనాడి నుండి క్రింది వరకు రెండువైపులా ప్రాకిన నరములు సులభముగా తెలిసి

వుండును. శరీరములోని బ్రహ్మనాడి దాని అమరిక ఆరవతరగతి చదివిన పిల్లవానికి కూడ తెలియును. కానీ మెదడులో సూక్ష్మముగ కనిపించకుండ వున్న గుణచక్రమూ, దాని భాగములు ప్రపంచములోని అన్ని తరగతులు చదివిన పెద్దవానికి కూడ తెలియదు. సూక్ష్మముగ కనిపించక ఉన్న నాలుగుచక్రములు గానీ, చివరకు క్రిందిచక్రమైన గుణచక్రముగానీ ఐదు శాస్త్రములను నేర్చిన శాస్త్రవేత్తలకు కూడ తెలియదు. ఐదు శాస్త్రములకంటే ముందు పుట్టిన బ్రహ్మవిద్యాశాస్త్రమును తెలిసిన వానికి మాత్రమే గుణచక్రము, మిగత నాలుగుచక్రముల వివరము తెలియును. గుణ (మాయ) చక్రము యొక్క నిర్మాణమును తెలిసినవాడు దానితో సమాన పోలికలున్న నెమలిపింఛమును, దాని వివరమును సులభముగా గ్రహించగలడు. ఆనాడు కృష్ణుడు శరీరములోని కనిపించని విధానము అంతయు మరియు నాల్గుచక్రముల జ్ఞానమంతయు తెలిసినవాడు. కావున గుణచక్రముతో పోలికలున్న నెమలిపింఛమును తలమీద ధరించి అందరూ చూచునట్లు చేశాడు.

శరీరములోనే మనిషిని నడిపించు యంత్రము తలయందు నాల్గు చక్రముల సముదాయములలో క్రింది చక్రములో అమర్చబడి ఉన్నది. క్రింది చక్రమైన మాయచక్రము మనిషిని ప్రపంచములో అనేక విధముల నడిపించు ముఖ్యమైన యంత్రము. దానిని గురించి తెలియనివాడు వాని జీవితమంతా దానినుండి బయటపడలేక దాని మాయలోనే ఉండును. దానినుండి బయట పడాలంటే దుస్సాధ్యమని భగవద్గీతలో విజ్ఞాన యోగమున 14వ శ్లోకమందు **"గుణమయీ మమ మాయా దురత్యయా"** అని భగవంతుడే చెప్పియున్నాడు. ఈ వాక్యమును బట్టి గుణచక్రములోని మాయ గుణముల రూపములో ఉన్నదని, దానిని జయించుట దుస్సాధ్యమని అర్థమగుచున్నది. ఏ మనిషి

అయినా నావలె మీరు ప్రవర్తించండి అనీ ఆ విధముగా ప్రవర్తించుట వలన మీరు కూడ మాయను జయించిన వారగుదురని అందరికి తెలియునట్లు కృష్ణుడు నెమలిపింఛమును ధరించి చూపించాడు. నెమలి పింఛము గుణములకు నిలయమైన గుణచక్రమును సూచిస్తున్నా, గుణములకు అతీతముగా ఆత్మ ఉన్నదని తెలియునట్లు మధ్యలో గాఢముగా నల్లగా కనిపించు భాగము కూడ కలదు. అందులోనే నేనున్నానని కృష్ణుడు తెలియబరిచాడు. గుణచక్రమందు నేను మధ్యలో ఉన్నాను, మీరు మధ్యలో లేకుండ ప్రక్కన మూడు భాగములలో ఉన్నారు. అందువలన నేను మాయలో లేను, మీరు మాయలో ఉన్నారు అని భగవంతుడు తన నెమలిపింఛము ద్వారా చూపించి, గీత ద్వారా బోధించాడు. జగతిలో మొట్టమొదట నెమలిపింఛమును గురించి వివరముగా తెలిసినవాడు, తెలిసి ధరించినవాడు కృష్ణుడు తప్ప ఎవరూ లేరు. నెమలిపింఛమును ద్వాపరయుగములో ఆయన ధరించి చూపించినా, అరచి బోధించినా, ఇంతవరకు దానిని గురించి ఎవరూ యోచించలేదు. నేను మేధావిననుకొన్న ఎవడూ దాని అర్థమును తెలియలేదు. చివరకు స్వాములు, గురువులు, పీఠాధిపతులు కూడ భగవంతుడు ధరించిన నెమలి పింఛము యొక్క అంతరార్థమును తెలుసుకోలేక పోయారు. అంతపెద్ద జ్ఞాన విషయమును నాద్వారా చెప్పించునట్లు తన పాలన ద్వార చేయించినందుకు సంతోషముతో దేవుని పాలకుల ద్వారా దేవునికి నమస్కారములు తెలుపుకుంటున్నాము.

ఇక్కడ ఎవరైనా ఒక ప్రశ్న అడుగుటకు అవకాశమున్నది. అదేమనగా! "నెమలిపింఛమును గురించి భగవంతునికి తప్ప ఇంతవరకు ఎవరికీ తెలియదని చెప్పిన మీరు, దేవుడు ఎవరి ద్వారానో మీతో చెప్పించినట్లు, మీరు దేవుని పాలకుల ద్వారా దేవునికి నమస్కారములు తెలిపినట్లు

వ్రాశారు కదా! అట్లు ఆయన పాలకుల ద్వార ఆయనకు నమస్కారములు తెలుపుటకంటే దేవుడా! నేను నిన్ను నమస్కరించుచున్నాను అని అనవచ్చును కదా! మీరు దేవునికి నేరుగా ఎందుకు నమస్కారములు తెలుపలేదు?" అని ప్రశ్నించవచ్చును. ఇటువంటి ప్రశ్నలు వచ్చునపుడు నా ప్రక్కవాడు "నీ వేలు తీసుకొని నీ కన్నునే పొడుచుకొన్నట్లు నీ ప్రశ్నను నీవే అడిగి, చిక్కులో పడి కష్టపడి జవాబును చెప్పడము దేనికి? ఎవరికి రాని ప్రశ్నను నీకు నీవే ఎందుకు ప్రశ్నించుకోవాలి? అని అడిగాడు. దానికి నేను "నా వేలుతో నా కన్నును నేనే పొడుచుకొన్నట్లు నీకు కనిపించి ఉండవచ్చును. నేను అలా నీవనుకున్నట్లు చేయలేదు. నా కన్నుకు దురుద పెడితే నా వేలితో నా కన్నును అదిమి దురదను లేకుండ చేసుకొంటున్నాను." అని జవాబు చెప్పాను. ఆ విధముగానే అనుమానము అను దురద పుట్టినపుడు కన్నును ఇలా దిద్దుకోవాలి అని ముందుగానే చూపుచున్నానని, మీరు ఎందుకు అనుకోకూడదు అని కూడ అడుగుచున్నాను. ఏది ఏమైన నా అనుమానమునకు నామాటే తిరిగి జవాబైతే, ఎవరి అనుమానమునకైనా అది జవాబగును అను నమ్మకముతో నేను ముందు ప్రశ్నించుచున్నాను. ఇపుడు మీరు అడిగినట్లు నేను నేరుగా దైవమునకు ఎందుకు నమస్కరించ లేదంటే! చెప్పెదను వినుము. భగవద్గీతలో విశ్వరూపసందర్శన యోగమందు 40వ శ్లోకమున అర్జునుడు దేవునికి నమస్కరించవలెనని, ఎక్కడ మ్రొక్కాలో తెలియక, ఎట్లు మ్రొక్కాలో తెలియక ముందుకు, వెనక్కు, ప్రక్కలకు, క్రిందికి, పైకి మ్రొక్కుచున్నానని చెప్పాడట. దేవుడు కనిపిస్తేనే అర్జునుడు ఎంతో తికమక పడిపోయి అన్ని ప్రక్కలా మ్రొక్కాడు. అంత పనిలేకుండ సులభముగా నేను చెప్పాను. నేను అలా చెప్పడమును సులభము అని ఎందుకు చెప్పుచున్నానంటే, దేవుని బయోడేటా (దేవుని సమాచారం) అర్జునునికి

అర్థముకానట్లు మనకు కూడ అర్థముకాదు. ఆయన బయోడేటా పేపరును చూస్తే ఈ విధముగా ఉంది.

| | |
|---|---|
| **1) పేరు - పెద్ద.** | **2) ఊరు - విశ్వము.** |
| **3) కులము - గోకులము.** | **4) తండ్రి - నేనే.** |
| **5) తల్లి - నేనే** | **6) వృత్తి - ఊరకుండడము.** |
| **7) ప్రవృత్తి - తెలియకుండడము** | **8) నీతి - జ్ఞానము.** |
| **9) న్యాయము - ధర్మము** | **10) భార్య - మీ అమ్మ.** |
| **11) పిల్లలు - మీరే** | **12) ఆకారము - కాలము.** |
| **13) ఆహారము - మోక్షము** | **14) మెలుకువ - ప్రభవము.** |
| **15) నిద్ర - ప్రళయము** | **16) రాజ్యము - పరలోకము.** |
| **17) పాలకులు - భూతములు** | **18) దండన - యమదండన** |
| **19) ప్రియకుమారుడు - యోగి** | **20) మనవడు - జ్ఞాని.** |

దేవుడు ఏ అంచనాకు దొరకనివాడు. అందువలన ఆయన జ్ఞానమును తెలిసినవారు భూమిమీద ఉండవచ్చునుగానీ, ఆయనను తెలిసినవాడు ఎవడూ భూమిమీద లేడు. ఇంతవరకు దేవున్ని చూచినానని చెప్పువాడు ఎవడూ లేడు. ఒకవేళ నేను దేవుని చూచాను అని ఎవడైనా అంటే ఆ మాట పూర్తి అసత్యము. ఎందుకనగా దేవుడు దేవులాడ (వెతుకులాడ) బడువాడు, దొరుకువాడు కాదు. దేవుని వృత్తి ఊరకుండడము అయితే, దేవుని ప్రవృత్తి తెలియకుండడము. అటువంటి ప్రవృత్తిగల దేవున్ని ఏ విధముగా కూడ నిరూపించలేము. బయటి నిరూపణలకు తెలియని వాడు దేవుడు, కావున ప్రత్యక్షముగా మ్రొక్కలేము. అందువలన మనకంటే దేవునికి దగ్గరగానున్న ఆయన పాలకుల ద్వారా నా నమస్కారములను దేవునికి తెలియజేశాము. ఎక్కడ ఏ నిరూపణకు రాని దేవుడు, విశ్వమంతా

వ్యాపించి ఉంటూ భగవంతునిగా జన్మించాడు, ఆ భగవంతుడే కృష్ణుడు. కృష్ణుడు సాధారణ మనిషిగా కనిపిస్తున్నా ఆయనను భగవంతుని రూపములో నున్న దేవుడని చెప్పవచ్చును. అందువలన ఒక సందర్భములో నన్ను చూస్తే దేవున్ని చూచినట్లేనని భగవంతుడు అన్నాడు.

దేవుడు సృష్టి పూర్వమే మాయను తయారుచేయగా, భగవంతుడు దానిని నెమలిపింఛరూపములో చూపించాడు. నెమలిఫించమును భగవంతుడు సూచించినట్లు అది మన తలలోని గుణచక్రమేనని మేము చెప్పుచున్నాము. అది ఒక చక్రమని తెలియుటకు నెమలిఫించము పాతబడి పోయినపుడు మేము తామస గుణభాగము అని తెలియజేసిన చివరి వలయము యొక్క బయటి అంచులో వలయము (చక్రము)వలె కనిపించు నట్లు రంగుపోయివుండును. చుట్టు అంచులో రంగుపోవడము వలన దానిని చక్రముగా గుర్తించుటకు సులభముగా ఉండును. రంగుపోయిన పింఛము యొక్క అంచు భాగమును తర్వాత పేజీ చిత్రములో చూడవచ్చును.

ఇంతవరకు నెమలిపింఛము యొక్క ముందు భాగములో కనిపించు నాలుగురంగుల గురించి మరియు క్రింది కాడ గురించి, కాడకు ఇరువైపుల నున్న కేశముల గురించి తెలుసుకొన్నాము. ఇవన్నియు ఆధ్యాత్మిక రంగములో ఎంతో అర్థముతో కూడుకొన్నవని కూడ అర్థమైనది. నెమలి పింఛములో ఎంతో జ్ఞానము ఇమిడి ఉండుట వలన భగవంతుడైన కృష్ణుడు ధరించాడని కూడ తెలుసుకొన్నాము. ఇవన్ని తెలిసిన తర్వాత మేము చెప్పునదేమనగా! దేవుడు కనిపించని వాడు అయినప్పటికీ కనిపించని మాయను, దాని గుణముల రూపమును, అది శరీరములో ఎలా వ్యాపించి పని చేయుచున్నదో ఆ విధానమును, కనిపించునట్లు నెమలిఫించములో అమర్చిపెట్టాడు. శరీరములోని కనిపించని మాయ విధానము, కనిపించు




**పాతబడిన నెమలిపింఛము**

నెమలి పింఛములో ఉన్నదని భగవంతుడు ధరించి దృశ్యరూపముగా చూపించాడు. దృశ్యరూపములో మూడుగుణములు, వాటియందు జీవాత్మ, గుణముల మధ్యలో ఆత్మ ఉన్నది. నెమలిపింఛములో ఎంత వెతికినా మూడవ ఆత్మ అయిన పరమాత్మ ఆచూకి కనిపించలేదు. అయితే సూత్రము ప్రకారము కనిపించని మాయకు, జీవునికి, ఆత్మకు, కనిపించు గుర్తులైన రంగులను నెమలిపింఛములో చూపినపుడు, అట్లే కనిపించని దేవుని (పరమాత్మ) గుర్తును కూడ పింఛములో చూపివుండవలెను కదా! అని యోచిస్తే కొంత సమాచారము తెలియుచున్నది. అదేమనగా!

సకల సృష్ఠిని తయారు చేయకముందు దేవుడు పని చేశాడు. సృష్ఠి తయారైన తర్వాత దేవుడు ఏ పనిని చేయనివాడై పోయాడు. సృష్ఠి

అంతటికి మూలకారణము పరమాత్మయే. పరమాత్మ పని చేయకున్ననూ ఆయన ఉంటేనే అన్నీ ఉన్నాయి. ఆయన కనిపించకున్ననూ ఆయన చేయనిది ఏదీ లేదు. సకల జీవరాసులను పుట్టించువాడు, సాకువాడు (పోషించువాడు), చంపువాడు దేవుడే. అయినా ఆయన ఎక్కడా కనిపించక అన్నిటిని ఆయన పాలకుల ద్వారా చేయించుచున్నాడు. దేవుడు లేకుండా మాయగానీ జీవాత్మగానీ ఆత్మగానీ ఎవరు లేరనుటకు చిన్న ఉదాహరణను చెప్పుకొందాము. పంచవన్నెల రామచిలుక బొమ్మను గీయాలని (చిత్రించాలని) ఒకడు అనుకొన్నాడు. పంచవన్నెల రామచిలుకను జూపార్కులో మనము చూడవచ్చును. పంచవన్నెల రామచిలుక అనగా ఐదు రంగులతోనున్న రామచిలుక అని అర్థము. చిత్రకారుడు ఐదురంగుల చిలుకను చిత్రించాలనుకొన్నపుడు ఐదురంగులను తీసుకొని, ఒక తెల్లని మందముగానున్న కాగితమును (ఆర్టు పేపర్‌ను) తీసుకొన్నాడు. ఐదురంగుల చిలుకను జూపార్కులో చూచినది చూచినట్లు గీయాలనుకున్నాడు. అట్లే మొదలుపెట్టి గీచాడు. జూపార్కులో చిలుక ఏ విధముగా ఉందో నూటికి నూరుపాళ్ళు అదే విధముగా ఉన్నట్లు గీయగలిగాడు. ఆ చిత్రపటమును చూస్తే పార్కులో చిలుకను చూచినట్లే ఉన్నది.

అలా చిత్రించిన పంచరంగుల చిలుక చిత్రపటమును గోడకు తగిలించి పెట్టాడు. ఆ చిత్రకారుడు పార్కులోనున్న చిలుక మాదిరి ఉన్న బొమ్మను గీచాడని తెలుసుకొన్న అతని స్నేహితుడు ఆ బొమ్మను చూడాలని వచ్చాడు. స్నేహితుడు వచ్చిన సమయానికి చిత్రమును గీచిన చిత్రకారుడు ఇంటిలో లేడు. వచ్చిన స్నేహితుడు గీచిన బొమ్మను చూడాలని వచ్చాడు, కావున ఇంటిలోనున్న గోడకున్న బొమ్మలను చూచాడు. కానీ చిలుక పటము కనిపించలేదు. దానికి కారణమేమనగా! ఆ స్నేహితుడు చిత్రకారుని

ఇంటికి రాకముందు ఒక గంటక్రితము పెద్దగాలి వీచింది. అలా వీచిన గాలికి ఆ చిత్రపటము తిరగబడింది. అది గోడకే ఉండినా గాలికి తిరగబడుట వలన, ముందువైపు కనిపించు చిలుకబొమ్మ గోడవైపుకు పోయింది. గోడవైపువున్న తెల్లని కాగితము ముందువైపుకు వచ్చింది. అలా ఉండుటవలన చిలుక బొమ్మ కనిపించక తెల్లని కాగితము మాత్రము కనిపిస్తున్నది. అప్పుడు చిత్రకారునికి అతని స్నేహితుడు ఫోన్‌చేసి చిలుక ఉన్న పటము ఎక్కడుంది అని అడిగాడు. మొదట హాలులో ఎదురుగా కుడిప్రక్కన ఉంది చూడు అని చిత్రకారుడు చెప్పాడు. అతను చెప్పిన స్థలములో ఏ బొమ్మ గీయని తెల్లని కాగితముండుటను స్నేహితుడు చూచి ఇది తిరగబడిందని తెలిసి త్రిప్పి చూచాడు. అప్పుడు ఐదు రంగుల చిత్రము కనిపించింది. చిత్రకారుని ఇంటికి వచ్చిన అతను స్నేహితుడు మొదట బొమ్మలేని తెల్లకాగితమును చూచాడు. తర్వాత బొమ్మ ఉన్న రంగుల భాగమును చూచాడు. దీనినిబట్టి ఇప్పుడు మనకు అర్థమగునది ఏమనగా!

బొమ్మను కాగితము మీద గీచాము. తెల్లని కాగితము బొమ్మకు ఆధారము. కాగితము మీద బొమ్మ ఉంది. కాగితము తెల్లనిదైనప్పటికీ ఒక ప్రక్క రంగుల బొమ్మను చూపుచున్నది. మరొక ప్రక్కన తన సహజత్వము అయిన బొమ్మలేని తెల్లని కాగితము కనిపిస్తున్నది. ఐదురంగుల చిలుకను చూపుచున్న కాగితము తన అసలు రంగును కనిపించకుండ దాచి పెట్టినట్లు రెండవవైపున కనిపించక ఉన్నది. చూచువారందరు ముందున్న పంచ వన్నెల చిలుకను మాత్రము చూస్తారు. కానీ ఆ బొమ్మకు ఆధారమైన కాగితము యొక్క అసలు రంగును ఎవరూ చూడరు. ఈ బొమ్మ ఉండాలంటే ఈ కాగితమే ఆధారము కదా అని ఎవరూ యోచించరు. బొమ్మకు కాగితము ఎలా ఆధారమో, ఈ కనిపించే ప్రపంచమునకు కూడ దేవుడు ఆధారముగా

ఉన్నాడు. కాగితము లేకపోతే పంచరంగుల చిలుక ఎట్లు లేదో, అలాగే దేవుడు లేకపోతే పంచభూతముల ప్రపంచము కూడ లేదని తెలియాలి. కనిపించే పంచవన్నెల చిలుకను చూచువాడు దానికి ఆధారమైన కాగితమును గురించి ఎలా యోచించడో, అలాగే కనిపించే పంచభూతముల జగతిని చూచువారు దానికి ఆధారమైన దైవమును గురించి ఎవరూ యోచించడము లేదు. వెనుకవైపు కనిపించక ఉన్న తెల్లని కాగితము ముందువైపు రంగుల చిలుకను చూపునట్లు, వెనుకవైపు కనిపించకుండ దాగివున్న దేవుడు ముందువైపు రంగుల ప్రపంచముగా కనిపించుచున్నాడు. ఇంతవరకు చెప్పిన కాగితము, రంగులచిలుక విధానములో కనిపించే ప్రపంచము, కనిపించని దేవుని విధానమున్నట్లు, నెమలిపింఛములో కూడ ఇలాంటి రహస్యమే కలదు. అదేమనగా!

మన శరీరములోని గుణచక్రములో ఉన్న మాయకు, జీవునికి, ఆత్మకు దేవుడే ఆధారముగా ఉన్నాడు. పంచరంగుల చిలుకతో సమానముగా మూడు గుణములు + జీవాత్మ + ఆత్మ అను ఐదు భాగములుగా గుణచక్రము గలదు. గుణచక్రము వెనుక తెలియకుండ ఉండి నడిపించు మూల పురుషుడు దేవుడే. కానీ దేవుని గురించి ఎవరూ యోచించడము లేదు. నెమలిపింఛము ముందు భాగములో రంగుల భాగములు కనిపిస్తున్నవి. నెమలిపింఛమును త్రిప్పి వెనుక భాగమును చూస్తే ముందున్న ఏ రంగూ కనిపించదు. చిలుకకు కాగితము ఆధారమైనట్లు నెమలిపింఛము యొక్క ముందువైపు కనిపించు మాయకు, జీవాత్మకు, ఆత్మకు దైవము ఒక్కడే ఆధారమన్నట్లు ఫించము వెనుక ఒకేరంగు కనిపిస్తున్నది. తనయందే మాయ ఉండినా, జీవాత్మ, ఆత్మ ఉండినా వాటి ఆనవాళ్ళు ఏమీ కనిపించకుండ దేవుడున్నాడు అనుటకు

గుర్తుగా నెమలి పింఛమునందు ముందువైపు మాయకు, జీవునికి, ఆత్మకు గుర్తుగా పింఛములోని రంగులు కనిపిస్తున్నా, వెనుక వైపు చూస్తే ముందువైపు వున్న రంగుల ఆనవాళ్ళు ఏమాత్రము కనిపించడము లేదు. దీనినిబట్టి దేవుడు ఒకవైపు అన్నీ తానైవున్నా, అన్నిటికంటే నేను వేరుగా ఉన్నాను అని తెలుపుటకు ఆ విధముగా పింఛమునకు ముందున్న రంగులు వెనుక కనిపించడములేదని తెలియుచున్నది. చిత్రపటములోని చిలుకమీద ధ్యాసను పెట్టి చూచువారు ఏ విధముగా దానికి ఆధారమైన కాగితమును ధ్యాసలో ఉంచుకోవడము లేదో, అదేవిధముగా ప్రపంచధ్యాసలో మునిగిపోయిన వాడు మాయకు జీవునికి, ఆత్మకు ఆధారమైన దేవుని మీద ధ్యాస ఉంచడము లేదని తెలియజేయుచున్నాము.

భగవద్గీతలో రాజవిద్యా రాజగుహ్య యోగమున 4వ శ్లోకములో **"మత్ స్థాని సర్వభూతాని"** అని కృష్ణుడు చెప్పాడు. నా స్థానములో అన్ని జీవరాసులున్నాయని దాని అర్థము. తర్వాత ప్రక్కన 5వ శ్లోకములోనే **"నచ మత్ స్థాని భూతాని"** అని ఆయనే చెప్పాడు. నాయందు ఏ జీవరాసి లేదు అని ఈ మాట యొక్క అర్థము. ఇక్కడ బాగా గమనిస్తే ముందు శ్లోకములో "మత్ స్థాని భూతాని" అన్నవాడు క్రింది శ్లోకములోనే "నచ మత్ స్థాని భూతాని " అనడములో బయటికి చూచుటకు ఒకదానికొకటి పూర్తి విరుద్ధ భావము కనిపిస్తున్నది. ప్రక్కప్రక్కనే శ్లోకములలోనే మొదట "నాయందు సర్వ జీవరాసులున్నాయి" అని చెప్పిన భగవంతుడు, రెండవ శ్లోకములోనే "నా యందు ఏ జీవరాసీలేదు" అని చెప్పాడు. వినే దానికి భగవంతుడే అబద్ధ మాడుచున్నాడే అని అనుమానము వచ్చును. భగవంతుని రెండు మాటలలో ఒకటి ఒప్పు అయితే రెండవది తప్పు అగును. కానీ ఇక్కడ రెండు మాటలు ఒప్పే అగును. భగవంతునికి అబద్ధము చెప్పవలసిన

అవసరములేదు. ఆయన రెండు మాటలు ఎలా సత్యమో వివరించు కొందాము. ఇంతకు ముందు చెప్పుకొనిన కాగితము బొమ్మ ఉదాహరణను తీసుకొందాము. కాగితము మీద చిలుకబొమ్మ బయటికి కనిపిస్తున్నపుడు "మత్ స్థాని చిలుక" (నా యందు చిలుక ఉన్నది) అని కాగితము చెప్పితే ఆ మాట వాస్తవమే అగును. కాగితము తిరగబడి, చిలుక బొమ్మ గోడవైపు వుండి బయటివైపు ఖాళీ కాగితము కనిపించునపుడు అదే కాగితము "నచ మత్ స్థాని చిలుక" (నా యందు చిలుక లేదు) అని చెప్పితే ఆ మాట అప్పటికి సత్యమే అగును. ఒకే కాగితము మీద ఒక ప్రక్క చిలుక ఉన్నది, ఒక ప్రక్క చిలుకలేదు. అలాగే ఒకే దేవునియందు ఒక విధముగ చూస్తే సర్వజీవరాసులు ఉన్నవి. మరొక విధముగ చూస్తే ఏ జీవరాసిలేదు. దీని ప్రకారము అర్థము చేసుకొంటే రెండు శ్లోకములలోని మాటలు సత్యమే అగును. ఆ విధానమును నెమలి పింఛము కూడ చూపుచున్నది. నెమలి పింఛములో మాయచక్రము (గుణచక్రము) ఉన్నది అని చెప్పవచ్చును. తర్వాత నెమలిపింఛములో మాయచక్రము ఏమాత్రములేదని కూడ చెప్పవచ్చును. రెండు మాటలు వాస్తవమే ఎందుకనగా! ఒక ప్రక్క పింఛములో మాయచక్రము కనిపిస్తున్నది. మరొక ప్రక్క మాయచక్రము ఏమాత్రము కనిపించడము లేదు. ఈ విధముగ భగవద్గీతలో భగవంతుడు చెప్పిన "**మత్ స్థాని భూతాని**" అను మాటకు, అట్లే "**నచ మత్స్థాని భూతాని**" అను మాటకు సరియైన పోలిక నెమలి పింఛములో కలదు. కావున అన్ని విధముల జ్ఞాన సందేశమునకు నిలయమైన నెమలిపింఛమును భగవంతుడైన కృష్ణుడు ధరించాడు. అలా ఆయన ధరించడము వలన అది ప్రజలకు జ్ఞానసందేశమైనది. అయినప్పటికి కృష్ణుని విలువ తెలియని మనుషులు, కృష్ణుడు ధరించిన నెమలిపింఛమును ఖాతరు చేయలేదు. అందువలన నెమలిఫింఛము అంటే ఏమిటో ఎవరికీ తెలియకుండ పోయినది.

ఇప్పటినుంచైనా కృష్ణుడు ధరించిన నెమలిపింఛమును గురించి తెలుసుకొనే దానికి, భగవంతుడైన కృష్ణున్ని అర్థము చేసుకొనే దానికి ప్రయత్నించి, దానివలన ముక్తి పొందమని తెలుపుచున్నాము.



## కృష్ణుడు బ్రహ్మాచారియా? స్వల్పాచారియా?

బ్రహ్మ అనగా పెద్ద అని అర్థము. పెద్దకు వ్యతిరేక పదము చిన్న అగును. చిన్న అను పదమును స్వల్ప అనికూడ చెప్పవచ్చును. ఆచారి అనగా ఆచరించువాడని అర్థము. బ్రహ్మాచారి అనగా బ్రహ్మ ఆచరణను ఆచరించువాడని అర్థము. దానినే పెద్ద ఆచరణను ఆచరించువాడని కూడ చెప్పవచ్చును. జగతిలో అన్నిటికంటే పెద్ద, దేవుడే అగును. అట్లే అన్నిటి కంటే పెద్ద ఆచరణ, దేవుని ధర్మాచరణ అగును. దేవుని ధర్మములను ఆచరించువానిని బ్రహ్మాచారి అని అనుచున్నాము. దేవునికి వ్యతిరేఖ దిశలోనున్న మాయయొక్క అధర్మ ఆచరణను ఆచరించువానిని స్వల్పాచారి అనవచ్చును. కృష్ణుడు స్వయముగా దేవుని ధర్మములను బోధించుటకు భూమిమీదికి వచ్చిన భగవంతుడు. ఆయన దైవ ధర్మములను ఆచరించి అందరికీ మార్గదర్శకుడుగా ఉన్నాడు. అందువలన కృష్ణుడు నూటికి నూరుపాళ్ళు బ్రహ్మాచారియేనని చెప్పవచ్చును.

పెళ్ళైన వానిని సంసారి అని, పెళ్ళి కానివానిని బ్రహ్మాచారి అని అంటుంటారు. ఆ మాట ఎంతవరకు సత్యమని కొందరడుగవచ్చును. దానికి జవాబు ఏమనగా! ప్రజలు అనునది సత్యమా కాదా అని ఆ పదములోని అర్థమును ఆధారము చేసుకొని మీరే చూడవచ్చును. బ్రహ్మాచారి అను పదమునకు అర్థము బ్రహ్మము యొక్క ధర్మముల ఆచరణను ఆచరించు

వాడు అని చెప్పుకొన్నాము కదా! అటువంటపుడు పెళ్ళైయిన వాడు, పెళ్ళికానివాడు ఎవడైన దేవుని ధర్మములను ఆచరించుటకు అవకాశము కలదు. ధర్మముల ప్రకారము ప్రవర్తించినపుడు పెళ్ళైన వానిని కూడ బ్రహ్మచారి అని అనవచ్చును. అలాగే పెళ్ళికాని వానిని కూడ ధర్మఆచరణను బట్టి చెప్పచ్చును. అంతేకాని బ్రహ్మచారికి పెళ్ళికి ఏమాత్రము సంబంధము లేదు. అదే విధముగా సంసారి అను పదమును తీసుకొని చూస్తే మంచిసారము కలది అని అర్థము కాగలదు. ప్రపంచములో మంచి సారమున్నది ఒకే ఒక దైవజ్ఞానము తప్ప ఏదీ లేదు. భార్యాపిల్లలను కలిగి ఉండడము సంసారము అని అనుకోకూడదు. భార్యాపిల్లలతో కాపురము చేయువానిని సంసారి అని, భార్య పిల్లలను వదిలిన వానిని సన్న్యాసి అనడము తప్పగును. భార్య పిల్లలతోనున్న వారిలో కొందరు గొప్ప సన్న్యాసులు కూడ కలరు. అలాగే భార్యాపిల్లలు లేనివారిలో గొప్ప సంసారులు గలరు. భగవద్గీతయందు ఆత్మసంయమ యోగమున మొదటి శ్లోకమందు కర్మ ఫలమును ఆశ్రయించక కార్యములను చేయువానిని నిజమైన సన్న్యాసి అనవచ్చును అని అన్నారు. ఈ శ్లోకములో సన్న్యాసి అంటే భార్య పిల్లలను వదలినవాడని చెప్పలేదు కదా! ఈ విధముగ నిజమైన అర్థముతో చూస్తే నిజమైన భావము తెలియగలదు.

సరియైన భావముతో చూస్తే కృష్ణుడు గొప్ప బ్రహ్మచారి. ఆయన పెళ్ళికాకముందు బ్రహ్మచారియే! అలాగే పెళ్ళైన తర్వాత కూడ బ్రహ్మ చారియే!! కృష్ణునికి పెళ్ళికాకముందు కూడ కృష్ణుడు సంసారియే, అలాగే పెళ్ళైయిన తర్వాత కూడ సంసారియే. కృష్ణునికి పెళ్ళికాకముందు కూడ ఆయన సన్యాసియే. పెళ్ళైయిన తర్వాత కూడ సన్యాసియే. కృష్ణుడు బ్రహ్మచారియే కాక ఆయనకు అస్కలిత బ్రహ్మచారి అని కూడ బిరుదు

కలదు. బ్రహ్మచారి అంటే వివరము తెలిసినది. స్కలిత, అస్కలిత పదములకు అర్థము కొందరికి తెలియకపోవచ్చును. ఇపుడు దాని వివరము చెప్పుకొందాము. స్కలిత్ అను పదమును సంస్కృత భాషలో స్ఖలిత అంటాము. తెలుగులో మనము స్కలిత అంటున్నాము. దీని అర్థము జారిపోవుట, పడిపోవుట. మనిషి ఒక్కొక్కప్పుడు తానున్న ఉన్నత స్థాయినుండి జారిపోయి లేక పడిపోయి తగ్గుస్థాయికి వచ్చుచుండును. అంతేకాక తననుండి ఏదైనా జారి పోయినపుడు స్కలిత అను పదమును వాడుచున్నాము. మగ మనుషులలో వీర్యము జారిపోవడమును స్కలితము అంటాము. దీర్ఘనాడి, మధ్యనాడి, స్వల్పనాడి లేక ధీర్ఘస్కలన, మధ్యస్కలన, శీఘ్రస్కలన అను మూడు రకముల వ్యక్తులుంటారని వైద్యులు చెప్పగా విన్నాము. స్కలనము లేక స్కలితము అనునవి భౌతికముగ మరియు మానసికముగ రెండు రకములు ఉండును. మనిషిలో వీర్య స్కలనమును భౌతిక స్కలనము అంటాము. అలాగే యోగ భావమునుండి తప్పి పోవడమును మానసిక స్కలనము అంటాము. మనిషి మనోబలము చేత కర్మయోగమును చేయుచుండును. మనస్సును లేకుండ చేయడము బ్రహ్మయోగమగును. **కర్మయోగి మనోబలమును కోల్పోతే యోగభ్రష్టుడు అగును.** అలాగే **బ్రహ్మయోగి మనోబలమును కల్గితే యోగభ్రష్టుడగును.** మనిషి చేయు కర్మయోగముకానీ, బ్రహ్మయోగముకానీ రెండూ దేవుని ధర్మములను ఆచరించు ప్రక్రియలే. కావున ఆ రెండు యోగములను కానీ, రెండిటిలో ఒక్క యోగమునుకానీ ఆచరించువానిని బ్రహ్మచారి అని అనవచ్చును. కృష్ణుడు కర్మయోగమును ఆచరించుచుండుట వలన ఆయనను బ్రహ్మచారి అన్నాము. ఒక మనిషి యోగమును ఆచరిస్తూవుండి కొంత కాలమునకు మాయా ప్రభావముతో యోగమును ఆచరించడములో చేతకాకపోతే వానిని యోగభ్రష్టుడు అంటాము. అటువంటి వానిని

యోగమునుండి జారి పోయినవాడని అనవచ్చును మరియు అతనిని స్కలిత బ్రహ్మాచారి అని కూడ అనవచ్చును. కృష్ణుడు తన జీవితములో కర్మయోగము నుండి ఎప్పుడూ జారిపోలేదు. యోగమునుండి జారిపోని విధానమును ప్రజలకు తెలియజేసిన వ్యక్తి కృష్ణుడు. తపస్సులు, యజ్ఞములు, వేదములు తప్ప యోగమంటే ఏమిటో తెలియని కాలములో భూమిమీదికి వచ్చి యోగమును గురించి తెలియజేసిన ఏకైక వ్యక్తి కృష్ణుడు. యోగము యొక్క రహస్యములను తెలియ చెప్పిన కృష్ణుడు తాను స్వయముగా కర్మయోగమును ఆచరించి మానవులందరికి మార్గ దర్శకుడయ్యాడు. కర్మయోగములో మార్గదర్శకుడైన కృష్ణుడు ఎప్పుడూ తన యోగమునుండి జారిపోలేదు. కృష్ణుడు యోగభ్రష్టుడయ్యాడని అంటే శరీర వ్యాయామమును నేర్పించువాడు (ఫిజికల్ ట్రయినింగ్ మాస్టర్) వంగలేడు అంటే ఎంత అసత్యమగునో, అంతే అసత్యమగును. కృష్ణుడు యోగము యొక్క పుట్టుపూర్వోత్తరములను తెలిసినవాడు. ఆయన కర్మయోగము నుండి ఎప్పుడూ తప్పిపోవడముగానీ లేక జారిపోవడముగానీ జరుగలేదు. అందువలన ఆయనను అస్కలిత బ్రహ్మాచారి అని అంటున్నాము. కృష్ణుడు బ్రహ్మాచారియేకాక అస్కలిత బ్రహ్మాచారి అని ఆయనను ఒక్కనినే చెప్పవచ్చును. భూమిమీద ఆయనకు ఒక్కనికే ఆ బిరుదు దక్కుతుంది.



## కృష్ణుడు యుద్ధములో పారిపోయాడా ?

అవును కృష్ణుడు యుద్ధములో జరాసంధుని చేతిలో ఓడిపోయి పారిపోయాడనుటలో ఎటువంటి సంశయము లేదు. జరాసంధుడు కంసునికి బిడ్డలనిచ్చిన మామ అగును. ఆస్తి, ప్రాస్తి అను పేర్లుగలవారు జరాసంధుని

ఇద్దరు బిడ్డలు, కంసుని భార్యలగుదురు. కృష్ణుడు కంసుని చంపుట వలన, తన ఇద్దరు బిడ్డలు విధవలు అగుట వలన, జరాసంధుడు కృష్ణుని మీద శతృత్వము వహించి యుద్ధమును ప్రకటించి మధురమీద దండెత్తి వచ్చాడు. కంసున్ని చంపిన వెంటనే జరాసంధునితో కృష్ణుడు యుద్ధము చేయవలసి వచ్చినది. అప్పటికి కృష్ణుని వయస్సు కేవలము 12 సంవత్సరములు మాత్రమే. బలరాముడు కృష్ణునికంటే 9 సంవత్సరములు పెద్ద అగుట వలన ఆయన వయస్సు 21 సంవత్సరములు. ఆ యుద్ధములో కృష్ణ బలరాముల చేతిలో జరాసంధుడు ఓడిపోయి పారిపోయాడు. అలా కృష్ణబలరాముల చేతిలో ఓడిపోవడము జరాసంధునికి చాలా అవమానమైనది. ఆ అవమానమును భరించలేక తర్వాత సంవత్సరమునకు తిరిగి మధుర మీదికి యుద్ధమును ప్రకటించి అప్పుడు కూడ ఓడిపోయాడు. ఈ విధముగ ప్రతి సంవత్సరము కృష్ణుని మీద యుద్ధమునకు రావడము, ఓడిపోవడము జరిగెడిది. అట్లు 18 మార్లు జరాసంధుడు ఓడిపోయాడు. కృష్ణునికి 30 సం॥ వయస్సులో 19వ మారు కాలయవనునితో కలిసి మధుర మీద దండెత్తి వచ్చాడు. అప్పుడు కృష్ణుడు ఓటమిని పొందాడు. జరాసంధుడు యుద్ధములో గెలిచి మధురలోనున్న కృష్ణ బలరాములను సంహరించాలని అనుకొన్నాడు. కానీ జరాసంధుడు మధురను చేరేలోపలే కృష్ణ బలరాములు ఇరువురూ రహస్య మార్గము ద్వారా ద్వారకకు పారిపోయారు.

కృష్ణుడు సాధారణ మనిషికాదు భగవంతుడని చెప్పారు కదా! అలాంటపుడు భగవంతుడు సాధారణ మనిషికి భయపడి పారిపోవడమేమిటి అని కొందరడుగ వచ్చును. దానికి జవాబు ఏమనగా! కృష్ణుడు దైవ జ్ఞానమును చెప్పుట కొరకు భగవంతునిగా వచ్చాడు. కానీ భూమిమీద

యుద్ధములు చేసి జయించుటకు రాలేదు కదా! భగవద్గీతలో కూడ ధర్మములను తిరిగి పునరుద్ధరించుటకు వస్తానని చెప్పాడు తప్ప ఏ రంగములోనైనా తాను గొప్పగ కనిపిస్తానని చెప్పలేదు కదా! భగవంతుడు భూమిమీదకు వచ్చినపుడు తాను భగవంతుడనని తెలియునట్లు ప్రవర్తించడు. తనను ఎవరూ గుర్తించలేనట్లు సాధారణ మనిషివలె కనిపించును తప్ప ప్రపంచ విషయములలో ప్రత్యేకతను కల్గియుండడు. భగవంతుని ప్రత్యేకత అంతా ఒక్క దైవజ్ఞానములోనే ఉండును. ముఖ్యముగ చెప్పుకొంటే భగవంతుని ప్రత్యేకత స్థూలముగా ఎక్కడా కనిపించదు. ఆయన ప్రత్యేకత అంతా సూక్ష్మముగా ఉండును. మనుషులకు సూక్ష్మము యొక్క విధానము ఏమీ తెలియదు. మనుషులు కేవలము స్థూలముగానున్న దానినే చూడగలరు. సూక్ష్మముగానున్న భగవంతుని ప్రతిభ ఏమిటో తెలియని దానివలన భగవంతున్ని ఎవరూ గుర్తించలేరు. దైవజ్ఞానములో ఎవరూ చెప్పలేని, ఎవరికీ తెలియని ధర్మములను కృష్ణుడు చెప్పినా, ఆనాటి ప్రజలుగానీ, ఈనాటి ప్రజలుగానీ కృష్ణున్ని భగవంతుడని నమ్మలేదు. జరాసంధుడు 19వ మారు యుద్ధములో గెలిచిన సమయానికి కృష్ణుడు దైవజ్ఞానమును ఎక్కడా చెప్పలేదు. దైవజ్ఞానమును కూడ చెప్పకుండ సాధారణ మనిషివలె ప్రవర్తించాడు. అప్పటి వరకు సాధారణ మనిషిగానే ఉన్నాడు. కృష్ణుడు 18 మార్లు గెలిచి, ఒకమారు ఓడిపోవడముతో ఆయన భగవంతుడేనా అని ప్రశ్న వచ్చుటకు అప్పటికి ఆయన భగవంతుడని ఎవరికీ తెలియదు కదా! అందువలన భగవంతుడైతే ఓడిపోతాడా? అని అడుగుటకు అవకాశమే లేదు. ఒకవేళ అడిగినా భగవంతుడు ప్రపంచములో ఓడిపోకూడదను నిర్ణయము ఏమిలేదు కదా! భగవంతుడైన అతను కూడ నిర్ణయించుకొన్న కర్మ ప్రకారమే నడువవలెనునది శాసనము. అందువలన భగవంతుడు ఓడిపోవడములో ఆశ్చర్యము లేదు.

కృష్ణుడు చిన్న వయస్సులోనే జ్ఞానమును ఇతరులకు చెప్పాడని భాగవత పురాణములో వ్రాశారు. భాగవతము శాస్త్రముకాదు, పురాణము. పురాణములోని అన్ని మాటలను నమ్మకూడదు. కృష్ణుడు భారతయుద్ధములో కురుక్షేత్రమున దైవధర్మములైన గీతను బోధించాడు. అంతవరకు తనకు జ్ఞానము తెలియనట్లు, అజ్ఞానివలె ప్రవర్తించాడు. 90 సంవత్సరములు జీవితమును గడిపాక అప్పుడు ధర్మములను తెలియచేశాడు. క్షీణించి పోవుచున్న ధర్మములను ఉద్ధరించుటకు వచ్చానని తెలిపాడు. ఆయన చిన్నతనమునుండి దైవధర్మము ప్రకారమే నడుచుకొనుచున్నాననీ, కర్మ యోగమును ఆశ్రయించి ఉన్నానని తెలిపాడు. అప్పటివరకు కృష్ణుడు జ్ఞాని అను విషయము కూడ ఎవరికీ తెలియదు. ఆయన ఫలానావాడు అని తెలియకుండుటకు జరాసంధునికి భయపడినట్లు, ప్రాణ భయముతో పారిపోయినట్లు మనకు కనిపించాడు.



## కృష్ణుడు దైవధర్మములను అర్జునునికే ఎందుకు చెప్పాడు?

అధర్మములుగా మారివున్న ధర్మములను తిరిగి ధర్మములుగా తెలియజెప్పుటకు కృష్ణుడు భూమిమీద ఉద్భవించాడు. కృష్ణుడు చెప్పవలసిన ధర్మములు అధర్మములుగా మారిపోయి ముఖ్యమైన వారి తలలో కూర్చున్నవి. ఆ కాలములో ఏ విషయమైన గ్రంథరూపములో వ్రాయగలుగు వ్యక్తి వ్యాసుడు. అటువంటి వ్యాసుడు ఏమి చెప్పినా, ఏమి వ్రాసినా నమ్మే ప్రజలు ఆనాడు ఉండెడివారు. ఆనాడు నాల్గువేదములను, పదునెనిమిది పురాణములను వ్యాసుడు వ్రాసిపెట్టాడు. విద్యాసంపన్నుడైన వ్యాసుడు ఆ విధముగా ఉండగా, అధర్మములైన యజ్ఞములు, తపస్సులు, వేదపఠనములు

ప్రజలలో చొచ్చుకొని పోయి, అవియే ధర్మముల రూపములో వారియందు ఇమిడిపోయినవి. ఈ విధముగా అధర్మములు, ధర్మముల రూపములో ప్రజలలో ఉండిపోయినవి. వ్యాసుడు నాలుగు వేదములను వ్రాసిన దానివలన ఆయన పేరు ముందర 'వేద' అను పదము అప్పటినుండి ఉండిపోయినది. వేదములను వ్రాయకముందు వ్యాసుడు అను పేరుండగా, వేద రచన వలన ఆయన పేరు వేదవ్యాసునిగా మారిపోయినది. వ్యాసునికంటే ముందు వేదములులేవా? అని ప్రశ్నిస్తే లేవనియే చెప్పాలి. నేను సత్యమునే చెప్పినా నా మాట కొట్టివేయబడుతుంది. ఎందుకనగా శ్రీమహావిష్ణువు వేదములను రక్షించుట కొరకు హిరణ్యాక్షుని, వరాహావతారము (పంది అవతారము)తో చంపాడని భాగవత పురాణములోనే కలదు. అక్కడ పురాణములో వ్రాసిన దానినిబట్టి సృష్ఠి ఆదినుండి వేదములున్నాయని చెప్పుటకు వ్యాసుని మాటయే ఆధారమైనది. ఆనాడు వ్యాసుడు సాక్షాత్తు విష్ణువు యొక్క అవతారమేనని ప్రజలు చెప్పుకొనెడివారు. "వ్యాసో నారాయణో హరి" అను మాటను వ్యాసుని గురించి చెప్పెడివారు. అంతేకాక "వ్యాస భగవాన్" అని కూడ అనెడివారు. దీనినిబట్టి వ్యాసుడు ప్రజలలో ఆనాడు ఎంత పూజ్య భావముతో ఉన్నాడో అర్థమగుచున్నది. అటువంటి స్థానములోనున్న వ్యాసుడు ఏది చెప్పినా అది అందరు ఆమోదించేవారు. అటువంటి సమయములో కృష్ణుడు చెప్పవలసిన ధర్మములన్ని వ్యాసునికి వ్యతిరేకమైనవే. ఎక్కడ చెప్పినా, ఎవరికి చెప్పినా వెంటనే వ్యతిరేకత వస్తుందని కృష్ణునికి బాగా తెలుసును. పైగా కృష్ణుడు ఎక్కడా కూడ జ్ఞానిగా కనిపించలేదు.

సాధారణ మనిషి స్థానములో భగవంతుడైన కృష్ణుడుండగా, భగవంతుని స్థానములో సాధారణ మనిషియైన వ్యాసుడున్నాడు. ఆనాడు ధర్మము అధర్మముగా, అధర్మము ధర్మముగా ఎట్లున్నదో అట్లే భగవంతుడు మనిషిగా, మనిషి భగవంతునిగా ఉన్నట్లు తెలియుచున్నది. ఆనాడు

ధర్మములుగానున్న యజ్ఞ, దాన, వేద, తపస్సులను అధర్మములనినా, భగవంతునిగా, విష్ణువుగా, నారాయణునిగా పేరుగాంచిన వ్యాసుని మాటలకు విరుద్ధమైన ధర్మములను బోధించినా, ఎవరూ వినకపోవడమే కాకుండ చెప్పే వానికి ముప్పు ఏర్పడును. అందువలన వినేవాడు తన అనుచరుడై ఉండాలి. అనుచరుడైనా చెప్పే మాటలను తప్పనిసరిగ వినే పరిస్థితి ఉండాలి. తప్పక వినే పరిస్థితి ఏర్పడినా, వినేవాడు తన అనుచరుడైనా, వినే సమయములో ప్రక్కవారు ఎవరూ వినని సందర్భము ఉండాలి. ఇవన్నియు సరిపోవుటకు కృష్ణునికి 90 సంవత్సరముల కాలము పట్టింది. చివరకు కురుక్షేత్రములో, కృష్ణుడు చెప్పేటప్పుడు ఎవరూ గమనించకుండ, ఎవరి ధ్యాసలో వారుండు యుద్ధసమయములో, అర్జునుని మనస్సు ప్రపంచ విషయములలో విసిగి, జ్ఞానబోధ కావాలనుకొన్న సందర్భములో, అదియు వినేవాడు విధేయుడైన అర్జునుడు దొరికినపుడు తన ధర్మములను తెలియజెప్పాడు. కృష్ణుడు అంతవరకు ఎవరికీ జ్ఞానమును చెప్పకపోవడానికి కారణములన్ని ఉన్నాయి. అప్పటి ప్రజలకు ప్రత్యక్షముగా చెప్పితే వినరని, వినకపోవడమేకాక చెప్పేవాని మీదికి తిరగబడే అవకాశము ఉన్నదని కృష్ణుడు చెప్పలేదు. అయితే అటువంటి పరిస్థితిలో అర్జునుడు విన్న జ్ఞానమును బయటికి చెప్పినా ఎవరూ వినరు. ఒక్క వ్యాసుడు చెప్పినా, వ్రాసినా అవియే ధర్మములని విశ్వసించు ప్రజలకు వ్యాసుని చేతనే తన ధర్మములను చెప్పించితే, అవి బయటి ప్రజలకు, తెలియు అవకాశము కలదు. ఆనాడు వ్రాయగల సంస్కృత పాండిత్యము కలవాడు వ్యాసుడు ఒక్కడే. ఆ కాలములో సంస్కృత భాషలో ఏది వ్రాసినా అదియే జ్ఞానము, ధర్మము అను ప్రజలుండెడివారు. నేడు కూడ కొందరు సంస్కృత భాషకు ఎక్కువ విలువనిచ్చుచూ సంస్కృతము తెలిసినవాడే స్వామి, గురువు అనీ,

సంస్కృతములోనున్న రచనలే జ్ఞానముతో కూడుకొన్నవని చెప్పువారున్నారు. వాస్తవానికి సంస్కృతము ఒక భాష మాత్రమే, అది జ్ఞానము కాదు. నేడు స్వామీజీలుగా మారాలనుకొన్న వారందరు ముందు సంస్కృతమును నేర్చు కొనుచున్నారు. ఇప్పుడు ఎవడు సంస్కృతమును నేర్చుకొంటే వాడు స్వామి పోస్టును, గురువు స్థానమును, పీఠాధిపతి అను పీఠమును సంపాదించు కొన్నట్లే. జ్ఞానమున్నా, లేకున్నా సంస్కృతముంటే చాలు బయటి ప్రపంచములో వాడు పూజ్యుడై పోవుచున్నాడు.

సంస్కృత భాషను ఎంత గొప్పగ చెప్పుకొనినా ఆ భాషను లిపిలేని భాషగానే చెప్పవచ్చును. హిందీ లిపితో సంస్కృతమును వ్రాసుకొంటున్నాము తప్ప ఇంతవరకు సంస్కృతమునకు ప్రత్యేక లిపి లేదు. అది ఒక లిపిలేని 'ఎరికల', 'సుగాలి' మొదలగు భాషలలాగవున్న ప్రత్యేకమైన భాష అని చాలా మందికి తెలియదు. ఈనాడు కలియుగములోనే ఎంతో విలువను కల్గియున్న సంస్కృతము ఆనాడు ద్వాపరయుగములో ఇంకా పెద్ద ప్రాధాన్యతతో ఉండెడిదని అర్థమగుచున్నది. ఆనాడు కృష్ణునికి హిందీ భాష తప్ప సంస్కృత భాష తెలియదు. సంస్కృతములో చెప్పితేనే జ్ఞానము, హిందీలో చెప్పితే జ్ఞానము కాదను మనుషులు ఆ రోజులలో ఉండుట వలన, ఎటు తిరిగి కృష్ణుడు వ్యాసునిచేతనే సంస్కృత భాషలోనే తన జ్ఞానమును చెప్పించాలనుకొన్నాడు. 90 సంవత్సరములు కాచుకొన్న కృష్ణుడు, చివరకు తాను అనుకొన్న పనిని నెరవేరునట్లు చేశాడు. అధర్మయుక్తుడైన వ్యాసుడు కళ్ళు తెరచి తాను ఇంతవరకు బోధించినది అధర్మములని పశ్చాత్తా పడునట్లు చేశాడు. తన పాపపరిహారము కొరకు ధర్మములతో కూడుకొన్న భగవద్గీతను వ్రాయాలనుకొన్నాడు. వ్యాసుని చేతనే గీతను వ్రాయించాడు కృష్ణుడు. "కొట్టిన వానితోనే చీమిడి

తీయించినట్లు" అను సామెత ప్రకారము తనకు వ్యతిరేఖమైన అధర్మములను వ్రాసిన వ్యాసునితోనే, తన గీతను వ్రాయించుకొన్నాడు. కృష్ణుడు ఎవరికి ఎట్లు కనిపించినా మా లెక్కలో మాత్రము ఆయన మహామేధావి అని తెలియుచున్నది. ఎంతో తెలివిగా యుద్ధరంగములో కృష్ణుడు అర్జుననికి ధర్మములను చాటుగా చెప్పగా అవి చివరకు వ్యాసునికి చేరినవి. ఆనాడు అందరికీ తెలియునట్లు ప్రత్యక్షముగా చెప్పియుంటే, వ్యాసుడు కూడ దానిని వినేవాడు కాడు. కృష్ణుడు చాటుగా చెప్పిన దానివలన అందులో ఏముందోనని చూచాడు, అందులోనే చిక్కుకున్నాడు, చివరకు సత్యమును గ్రహించాడు.

కురుక్షేత్రయుద్ధము 18 రోజులు జరిగింది. మొదటి దినము కృష్ణుడు అర్జుననికి ధర్మములను తెలియజేశాడు. చివరకు తన విశ్వరూపమును చూపాడు. విశ్వరూపము ఇంతవరకు ఎవరూ చూడలేదు అని కృష్ణుడే స్వయముగా చెప్పుట వలన, ఎవరికీ దక్కనిది తనకే దక్కినదని, ఆ లెక్కలో అందరికంటే నేనెంతో గొప్పవాడినని అర్జునుడు అనుకొన్నాడు. యుద్ధము అయిపోయిన తర్వాత తాను గొప్పవాడినని, ఏ మనిషికిగానీ, ఏ దేవతలకు గానీ దొరకని విశ్వరూప సందర్శనము తనకు దొరికిందని తన గొప్పను బయటకు చెప్పుకోవాలనుకొన్నాడు. అలా చెప్పుట వలన నా గొప్పతనము అందరికీ తెలియును, దానివలన అందరూ నన్ను గొప్పగ ప్రత్యేకముగా చూస్తారని, గౌరవిస్తారని అర్జునుడు అనుకొని, మొదట ఆ విషయమును వ్యాసునికే చెప్పాలనుకొన్నాడు. కృష్ణుడు ఊహించినట్లే అర్జునుడు వ్యాసుని వద్దకు పోయి చెప్పడము జరిగినది. ఎవరికీ దొరకనిది, ఏ దేవతలకూ ఇంతవరకు సాధ్యముకానిది అని రహస్యముగ అర్జునుడు వ్యాసునికి చెప్పాడు. అర్జునుని మాటలు విన్న వ్యాసునికి దిమ్మతిరిగి పోయింది. అక్కడ కృష్ణుడు

చెప్పిన శాసనములైన సూత్రములను అర్జునుని ద్వారా తెలుసుకొన్నాడు. అంతవరకు అర్జునునికి కూడ అర్థముకాని జ్ఞానము వ్యాసునికి అర్థమైనది. కృష్ణుడు తెలిపిన ధర్మములను అర్జునుని ద్వారా విన్న వ్యాసునికి యజ్ఞములు, వేదములు, దానములు, తపస్సులు పూర్తి అధర్మములని అర్థమైనది. తాను అంతకుముందు వ్రాసిన వేదములు, పురాణములు, అధర్మములని తెలిసి బాధపడిన వ్యాసుడు, తన పాపమునకు ప్రాయశ్చిత్తముగా కృష్ణుడు తెలిపిన ధర్మములను గ్రంథరూపములో వ్రాయాలనుకొన్నాడు, అలా సంకల్పించుకొని వ్రాసినదే శ్లోకముల రూపములోనున్న భగవద్గీత.

కృష్ణుడు చెప్పిన ధర్మములకు గీత అని పేరు పెట్టినవాడు వ్యాసుడని చాలామందికి తెలియదు. కృష్ణుడు తెల్పిన ధర్మములు "గీత" అను పేరుతో వ్యాసుని చేత చందోబద్ధమైన శ్లోకముల రూపముగా వ్రాయబడినవి. అలా వ్యాసుడు వ్రాసిన శ్లోకములు 578 మాత్రమే. తర్వాత కాలములలో కొందరు సంస్కృత పండితులు తమ స్వార్థముతో కొన్ని శ్లోకములను గీతలో చొప్పించారు. అలా చొప్పించిన కల్పిత శ్లోకములతో కలిపి 700 ల శ్లోకముల రూపములో నేడు గీత మనముందరున్నది. కృష్ణుడు బ్రతికివున్న కాలములోనే వ్యాసుడు గీతను వ్రాయగలిగాడు. వ్యాసుడు తాటి ఆకుల మీద సంస్కృత భాషలో హిందీలిపితో గ్రంథమును వ్రాసాడు. ఆనాడు వ్యాసుడు తాలపత్రముల మీద వ్రాసిన ప్రతి ఒక్కటే. ఇప్పటి కాలములోవలె అచ్చుయంత్రములు లేవు. అందువలన వ్యాసుడు వ్రాసిన ఏకైక ప్రతి ఒక్కటే చాలా కాలముండెడిది. కొంత కాలమునకు తాటి ఆకుల గ్రంథము శిథిలావస్థకు రాగా కలియుగములో జనమేజయుడు రాజ్యమేలిన సమయములో కొందరు సంస్కృత పండితులు, గీతను వేరొక తాటి ఆకుల గ్రంథములోనికి వ్రాశారు. అలా ఎత్తి వ్రాయు సమయములో అంతకువరకు

ఎవరికీ తెలియని గీతలోనికి కొన్ని స్వార్థపూరిత శ్లోకములను చేర్చి వ్రాశారు. ఆ విధముగా పండితుల చేతిలో 700 శ్లోకములతో గీత తయారైనది. తర్వాత కొంత కాలమునకు మరికొందరు సంస్కృత పండితులు కొన్ని తాటి ఆకుల ప్రతులను తయారు చేసుకొని, దానిని బోధిస్తూ కాలమును గడిపెడివారు. కృష్ణుడు అధర్మములని చెప్పిన యజ్ఞములను తర్వాత వ్రాసినవారు యజ్ఞములను చేయవలెనని, యజ్ఞము చేయనివాడు దొంగతో సమానమని విడ్డూరముగా వ్రాశారు. దీనివలన స్వయముగా భగవంతుడు చెప్పిన గీతలో కూడ జ్ఞానము యొక్క ముసుగులో అధర్మములు అక్కడక్కడ ఉన్నాయని తెలియుచున్నది.

ఆ విధముగా తయారైన గీత నేడు భగవద్గీతగా చలామణి అగుచున్నది. మొదట వ్యాసుడు, కృష్ణుడు చెప్పిన ధర్మములకు "గీత" అని పేరు పెట్టగా, తర్వాత కొన్ని శ్లోకములను కలిపి వ్రాసిన పండితులు తమ మాటలను ఎవరూ గుర్తుపట్టనట్లుగా, వారి మాటలను విమర్శనా దృష్టితో ఎవరూ చూడనట్లుగా గీతకు, **"భగవద్గీత"** అని పేరు పెట్టారు. భగవద్గీత అంటే భయముతో తమ శ్లోకములను ఎవరూ విమర్శించరను ఉద్దేశముతో, ఆ విధముగా గీతను భగవద్గీతగా చేశారు. పండితులు అజ్ఞానముతో గీతను భగవద్గీత అనినా, అది నిజముగా భగవంతుడు చెప్పినదే, కావున నిజముగా గీత భగవద్గీతయే. ఒకనాడు వ్యాసుడు వ్రాసిన గీత, భగవద్గీతయై నేడు దాదాపు మూడువందల ఇరవై మంది చేత అనేక భాషలలో వివరము వ్రాయబడింది. ద్వాపరయుగములో కృష్ణుడు చెప్పిన జ్ఞానము భగవద్గీతలో ఉండినా, ఆయన జ్ఞానమును ఎవరూ అర్థము చేసుకోక స్వామీజీలు సహితము అధర్మ ప్రవర్తనయైన యజ్ఞములను చేయుచున్నారు. ఏనాడో త్రేతాయుగములో యజ్ఞములు అధర్మములని చెప్పిన మహాజ్ఞాని

అయిన రావణబ్రహ్మనే రాక్షసునిగా నేడున్న పండితులు చిత్రించి ప్రచారము చేశారు. ఉన్నదున్నట్లు వ్రాయు మమ్ములను పరమతమును బోధిస్తున్నారని చెడుగా ప్రచారము చేశారు.

ఎవరు ఏమనినా, ద్వాపరయుగములో కృష్ణుడు సమయమును సందర్భమును చూచి, అన్ని అనుకూలములు సరిపోయినపుడు, తన ధర్మములను తెలియజేశాడు. అంతేకాక యుక్తిగ వ్యాసుని చేతనే వ్రాయించాడు. ఆనాడు కూడ అజ్ఞాన ప్రజలు తమకు తెలిసినదే జ్ఞానమను కొని, తాము చేయునదే ధర్మమనుకొని, కృష్ణుని జ్ఞానమును అర్థము చేసుకోక అజ్ఞానముగా ప్రవర్తించుదురను ఉద్దేశముతో, భగవంతుడు 90 సంవత్సరములు వేచిచూచి గీతను చెప్పాడు. ఆనాడే ద్వాపరయుగములో అట్లుంటే, నేడు కలియుగమున ధర్మవిరుద్ధులు ఎందరుంటారో చెప్ప నవసరము లేదు. తమకు తెలిసినదే ధర్మము, జ్ఞానము అనీ తాము హిందూమతమును కాపాడువారమని చెప్పుకొనువారికి, మనది ఇందూ ధర్మము అని మేము చెప్పితే, 'ఇందూ' అను పదమునకు అర్థము తెలియని వారు, మేము చెప్పునది పరమతము అనునట్లు మాట్లాడుచున్నారు. ఇందూ అనగా అర్థముంది, కానీ హిందూ అంటే అర్థమేలేదు. అయినా విని తెలుసుకొందాము. మన పూర్వ సంస్కృతి సాంప్రదాయములు మనకు తెలియవు కదా! అని ఏమాత్రము అనుకోకుండ గ్రుడ్డిగ మాట్లాడు వారున్నారు. మేము కేవలము ఆధ్యాత్మిక విద్యను తెలపాలని దాదాపు అర్థశతక గ్రంథములను వ్రాస్తే, చదువురాని వారంతా పుస్తకములు వ్రాస్తున్నారని మమ్ములను అంటున్నారు. ఇలా చెప్పుకోలేనన్ని ఆటంకములు వచ్చినా, భగవంతుడు తెల్పిన జ్ఞానమునకు సరియైన అర్థమును చేకూర్చ వలెనను ఉద్దేశముతో మతములకతీతముగా గీతజ్ఞానమును త్రైత సిద్ధాంతము

మీద శాస్త్రపద్ధతిగా మేము చెప్పితే, దాని వివరమును చూడకనే కొద్దిమాత్రముగానైనా చదవకనే హిందు (ఇందు)వులమనుకొను వారంతా సిగ్గుతో తల దించుకొనేలాగ, మా ముందరే భగవద్గీతను తగులబెట్టిన హిందూ రక్షకులను పేరుగలవారున్నారంటే, ఇప్పటి ధర్మముల పరిస్థితి ఎలాగుందో చెప్పకనే అర్థమగును. మేము హిందు (ఇందు)వులకు జ్ఞాన కేంద్రము భగవద్గీత అంటే, హిందూ సంస్థలను పేరు పెట్టుకొన్న కొందరు, కాదు వేదములే జ్ఞానము అంటున్నారు. కృష్ణుడు వేదములు అధర్మములని చెప్పాడని మేము వ్రాస్తే, ఇటువంటి పుస్తకములను బయట ప్రజలు చదవకుండ ప్రభుత్వము నిషేధించాలని హిందువులలో అగ్రస్థానములోనున్న వారే అంటున్నారు. జాతీయపక్షి నెమలి దానిని కాపాడుతాము అంటారు, కానీ దొరికితే కోసుకొని తింటారు. అలాగే భగవద్గీతను కోర్టులో సాక్షుల దగ్గర విలువగా చూపుతాము, కానీ ఇంటిలో గీతను ముక్క కూడ చదవము. నేడు గీత అచ్చుయంత్రముల పుణ్యాన ఎన్నో ప్రతులుగా వచ్చినా ఏమి ప్రయోజనము లేదు. కృష్ణుడు యుక్తిగా అర్జునునికి బోధించి, వ్యాసుని చేత వ్రాయించినా కలియుగములో మతమును అడ్డము పెట్టుకొని, వేదములను ప్రచారము చేయువారి ముందర ఆయన శ్రమంతా వృథా అగుచున్నది. హిందువులమని బొట్టుపెట్టుకొన్న వారంతా హిందువులేనా? వారిలో హిందూ (ఇందూ) ధర్మములున్నాయా? అని అనుమానము వస్తున్నది. అటువంటి వారందరికి ఎదురీదుచు త్రైత సిద్ధాంత భగవద్గీత బయటికి వచ్చి భగవంతుని భావములను నిర్భయముగా తెల్పుచున్నది. ఆనాటి దేవుని ధర్మములు ఈనాడు స్వచ్ఛముగా త్రైతసిద్ధాంత భగవద్గీత రూపములో వచ్చాయని అనుకుంటున్నాము.



# కృష్ణుని మరణము లోకమునకు కనువిప్పు

క్రీస్తుపూర్వము 02-02-3102వ సంవత్సరము కృష్ణుడు మరణించాడు. జనవరి 14వ తేదీ తర్వాత ఉత్తరాయణ కాలము వస్తుంది. కావున కృష్ణుడు చనిపోయినది ఉత్తరాయణములోనని తెలియుచున్నది. ఒకనాడు కృష్ణుడు ఒక చెట్టుపొదవద్ద కాలు మీద కాలు పెట్టుకొని పడుకొని కాలును కదిలించుచుండగా, ఆ ప్రాంతమునకు వేటకు వచ్చిన బోయవాడు పొదచాటున కాలు కదులుటను చూచి, అక్కడ జింక కదులుతున్నదని తలచి పొరపాటుగా బాణమును వేయగా, అది కృష్ణుని కుడికాలు బొటన వ్రేలుకు తగిలింది. బొటనవ్రేలుకు చిక్కుకొన్న బాణము వలన కృష్ణుని శరీరము నుండి రక్తము కారిపోయి ఆయన చనిపోవడము జరిగినది. విశ్వవ్యాప్తమై అణువణువున ఉన్న శక్తి ఏదో, ఆ శక్తిలోని భాగము ఒక శరీరమును ఏర్పరుచుకొని వచ్చి, 126 సంవత్సరములు మానవులతో సహజీవనము చేసి తన ధర్మములను తెలిపి, శరీరములో లేకుండ అంతటావున్న తనశక్తిలో కలిసిపోయింది. అలా వచ్చి పోయినది సాధారణ జీవాత్మకాదు, పరమాత్మ శక్తి అని ఒక భీష్మునికి తప్ప ఎవరికీ తెలియదు. భీష్ముడు కృష్ణునికంటే ముందే చనిపోయాడు. అందువలన కృష్ణుడు చనిపోయినపుడు ఆ శరీరములోని జీవాత్మగా ఇంతకాలమున్నది దైవశక్తి అని ఎవరికీ తెలియదు. 126 సంవత్సరములు శరీరముతో బ్రతికిన ఆ శక్తిపేరు "కృష్ణ" అను రెండక్షరములు మాత్రమే. కృష్ణ అను శబ్దము యొక్క అర్థము నల్లని రంగు అని తెలియుచున్నది. కృష్ణ పదము నల్లని రంగును తెలుపుచున్నది. చీకటి నల్లగా ఉండును. కటిక చీకటిలో ఏమీ కనిపించక నల్లని రంగు మాత్రము అగుపడుచున్నది. మనిషి ఎల్లప్పుడు ఏదో ఒకటి కనిపించు వెలుతురునే కోరుకొంటాడు. కానీ ఏమి కనిపించని చీకటిని కోరుకోడు. అదే విధముగ భూమిమీద ప్రతి మనిషి ఏదో ఒక

విషయమును తెలియజేయు మాయనే కోరుకొంటాడు. కానీ ఏ విషయములేని, ఏ గుణములేని దైవమును కోరుకోడు. దేవుడు ఎవరికీ కనిపించువాడు కాడు. దేవున్ని ఎవరూ కోరుకోవడము లేదు అని తెలియుటకు గుర్తుగా భగవంతుడు తన పేరుగా నల్లని రంగుకు గుర్తు అయిన నలుపు (కృష్ణ) అను పేరును పెట్టుకొన్నాడు.

విశ్వమంతా వ్యాపించి ఎవరికీ తెలియని శక్తియే కృష్ణ శరీర మందుండి చివరికి మరణించింది. కృష్ణ శరీరములోని శక్తియు బయట విశ్వమంతా అణువణువున వ్యాపించియున్న శక్తియు రెండు ఒకటే. కావున నీరు నీరులో కలిసి పోవునట్లు, బయటి శక్తి, కృష్ణ శరీరములోని శక్తి రెండు ఒకటిగా కలిసిపోయినవి. పుట్టిన మనిషి ఎవడైన చనిపోయిన తర్వాత జన్మించకుండా మోక్షమును పొందాలంటే అనగా దేవునిలో కలిసిపోవాలంటే భగవద్గీతలో చెప్పిన సూత్రము ప్రకారము చనిపోయిన వ్యక్తి యోగియై ఉండాలి. చనిపోయిన యోగి ఉత్తరాయణము, శుక్లపక్షము, పగలు, సూర్యరశ్మి కలిగిన సమయములో చనిపోయి ఉండాలి. అటువంటి వాడు మాత్రము మోక్షమును పొందును. ఈ సూత్రమును చెప్పిన కృష్ణుడు ఈ సూత్రము ప్రకారము చనిపోయాడా? అని అడుగవచ్చును. దానికి సమాధానము ఏమనగా! గీతలో చెప్పిన సూత్రము ప్రకారము కృష్ణుడు కర్మయోగియై ఉన్నాడు. ఉత్తరాయణములోనే పగటిపూటే, సూర్మరశ్మి కలసిన సమయములోనే చనిపోయాడు. కానీ ఆయన చనిపోయినది శుక్లపక్షములో కాదు. కృష్ణపక్షములో చనిపోయాడు. మోక్షము పొందవలసిన యోగి శుక్లపక్షములో చనిపోవలసివుంది. కానీ కృష్ణుడు కృష్ణపక్షములో చనిపోవడము వలన, భగవద్గీతలో భగవంతుడైన కృష్ణుడు చెప్పిన సూత్రము ప్రకారము కృష్ణుడే మోక్షమునకు పోలేదని, తిరిగి జన్మకే

పోయాడని చెప్పవచ్చును. అయితే కృష్ణుడు దేవునిలోనికే పోయాడు, కానీ జన్మకు పోలేదు. ఇక్కడ కృష్ణుడు భగవద్గీతలో చెప్పిన సూత్రము కృష్ణునికి వర్తించదా అని కొందరడుగవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! నీరు నీరులో కలిసే దానికి ఏ అడ్డంకులేదు. కానీ మంచు ముక్కలు నీటిలో కలియాలంటే అవి నీరుగా మారుటకు కొంత ఉష్ణోగ్రత అవసరము. కృష్ణుడు చెప్పినది మంచుముక్కలు నీరుగా మారుటకు ఉష్ణోగ్రత అవసరమన్నట్లు మనుషులు దేవునిగా మారుటకు ఫలానా సమయములోనే మరణము పొందాలి అని చెప్పాడు. కృష్ణుడు నీరులాంటివాడు కావున మరణకాల నియమము ఆయనకు లేదు. కానీ మనుషులు మంచుముక్కలులాంటివారు వారికి ఉష్ణము అను జ్ఞానము అవసరము. కావున వారికి మరణకాలనియమము ఉన్నది. **"జగమెరిగిన బ్రాహ్మణునికి జంధ్యమేల"** అన్నట్లు కాలమే తానైన వానికి మరణకాల నియమము వర్తించదు. కర్మ అను చలికి గడ్డకట్టిన మనుషులకు వేడి అను జ్ఞానము అవసరము. అందువలన సాధారణ మనుషులకు మాత్రమే మరణకాల నియమము వర్తించునని తెలియాలి. మరణకాలము తనకు వర్తించదని తెలుపు నిమిత్తమే ఆయన కృష్ణపక్షములోనే చనిపోయాడు.

పొదమాటున చల్లని నీడలో పడుకొనివున్న కృష్ణున్ని బోయవాడు వేట నిమిత్తము అక్కడికి వచ్చి, కదలుచున్న కాలును లేడి అనుకొని బాణము వేయగా, అది కృష్ణుని కుడికాలు బొటనవ్రేలిని తాకి రక్తము కారుచున్న సమయములో, ఆ బోయవాడు వచ్చి చూచి నేను ఎంత పనిచేశానని రోదిస్తున్నపుడు, కృష్ణుడు ఇలా ***"నీవు బాధపడవలసినది ఏమీ లేదు. నిర్ణయము ప్రకారమే అన్ని జరుగుచున్నవి. నా పుట్టుక, చావు రెండూ జరుగుటకు ఒక కారణమున్నది. నేను అశుభ్రమైన స్థలములో జైలునందు***

***తల్లి ప్రక్కన తండ్రి తప్ప ఎవరు లేకుండ పుట్టవలెనను నిర్ణయమున్నది. ఆ నిర్ణయము ప్రకారమే దీనస్థితిలో పుట్టాను. అలాగే మరణము కూడ ఒంటరినైన సమయములో, ఇతరుని ఆయుధము వలన గాయపడినవాడినై రక్తముకారి చనిపోవలెనని నిర్ణయము కలదు. దాని ప్రకారమే ఇపుడు ఒంటరిగానున్న నన్ను నీ బాణము గాయపరిచినది. పుట్టుక, చావు రెండు ఇలా జరగవలెనని ఉన్నది. కావున నీవు బాధపడవలదు"*** అన్నాడు. ఆ మాటలు విన్న బోయవాడు "మీరు ఎంతో కలిమి, బలిమి రెండూ కలవారు. మీరు ఏమీలేని వారివలె దీనస్థితిలో పుట్టడము, అలాగే ఒంటరిగా గాయపడి ప్రక్కన ఎవరు లేకుండ చనిపోవడము మీరు నిర్ణయమనినా నాకు చెప్పలేని బాధకల్గుచున్నది" అన్నాడు. అలా బాధగా మాట్లాడిన బోయవానిని ఓదారుస్తూ కృష్ణుడు "దీనస్థితిలో పుట్టిన నా జననము, గాయపడి ఒంటరినై మరణించు నా మరణము భావితరమునకు అవసరము. ఇప్పటి నుండి కలియుగము ప్రారంభమగుచున్నది. కలియుగములో ఇంతవరకు లేని అజ్ఞానము ప్రారంభమగును. ఇంతవరకు లేని మతములు కలియుగములో పుట్టుకొచ్చును. సృష్ట్యాదినుండి ప్రపంచ వ్యాప్తముగ ఉన్నా ఇందూ ధర్మములు క్షీణించి పోయి, మచ్చుకు మాత్రము ఇందూదేశము లోనే మిగిలి అదియు బలహీనముగా ఉండును. ఇందువులు తమ ధర్మములను తామే తెలియక, తమను తాము హిందువులుగా చెప్పుకొందురు. ఇందూపథమును (జ్ఞానమార్గమును) హిందూమతముగా ప్రకటించు కొందురు. 'పథము' అను శబ్దము చివరకు 'మతము' అను పదముగా మారిపోవును. **పథము అనగా మార్గము, మతము అనగా ఇష్టము** ఇది నా మార్గము అను అర్థమును వదలి, ఇది నా ఇష్టము అను మాటను చెప్పుదురు.

ఆదినుండి ఇందూ ధర్మములు విశ్వవ్యాప్తముగా ఉన్నవి. కలి యుగములో మతములు తయారై ఇందూపథము యొక్క స్థానమును క్రైస్తవ మతము ఆక్రమించుకొనును. హిందువులందరు ఒక్కొక్కరుగా ఆ మతములో చేరిపోవుచు హిందూమతము క్షీణించిపోవును. అటువంటి సందర్భములో హిందూమతమును కాపాడుకొనుటకు కొన్ని సంఘములు ఏర్పడును. అటువంటి హిందూసంఘములకు, తమ మతమునకు సంబంధించిన ధర్మములు తెలియక పోవడము వలన, వారి వలన హిందూ మతమునకు నష్టము ఏర్పడును. జ్ఞానములేని హిందూసంఘముల పనులను చూచి హిందువులే ఏవగించుకొందురు. హిందూ దేశములో కూడ క్రైస్తవ మతము విరివిగా వ్యాపించి పోవును. అట్లు పెరిగి పోవుచున్న మతమును చూచి ఆ మతప్రవక్తకు పూర్తి వ్యతిరేఖులుగా హిందువులు తయారగుదురు. తమ మతమును హిందువులు కించపరుస్తున్నారని హిందువుల ప్రవక్తనైన నా గురించి క్రైస్తవమతము వారు అసూయగా వ్యతిరేఖముగా మాట్లాడుదురు. మా దేవుడు గొప్ప, మీ దేవుడు దిబ్బ అని హిందువులు అనగా, మా దేవుడే గొప్ప అని క్రైస్తవులు అందురు. క్రైస్తవమత ప్రవక్త అయిన ఏసును చూచినా, ఆయన పేరును వినినా హిందువులు కొందరు మండిపడుదురు. అట్లే హిందువుల దేవున్ని, దేవతలను క్రైస్తవులు తక్కువ భావముతో మాట్లాడుదురు. ఇట్లు మా దేవుడు గొప్ప అని క్రైస్తవులు అనగా, హిందూసంఘములోని వారు కొందరు మీ దేవుడు దేవుడే కాదని ఏసును దూషించుచుందురు. హిందువులు క్రైస్తవ ప్రవక్త అయిన ఏసును దూషించే కొలది, క్రైస్తవులు తమ బైబిలులోని వాక్యములను చెప్పుచు, వారి మతప్రచారము చేయుదురు. జ్ఞానమును బోధిస్తూ మా మతములో రక్షణ ఉన్నదని చెప్పుచుండుట వలన, దేవతా భక్తి తప్ప దేవుని భక్తి హిందూమతములో లేనిదానివలన, చాలామంది హిందువులు క్రైస్తవులుగా మారిపోవుదురు. చివరకు

హిందువులు తమ మతమును రక్షించుకొను ప్రయత్నములో పడిపోవగా, క్రైస్తవులు తమ మతమును పెంచుకొందురు. పరమతమని హిందువులు క్రైస్తవమతమును, దాని ప్రవక్తను దూషించగా, క్రైస్తవులు హిందూమతము మాయ (సాతాన్) మతమని హిందూమతమును, హిందువుల దేవుళ్ళను దూషించుదురు. ఈ విధముగా మత ద్వేషములు ఏర్పడి, దాని వలన భూమిమీద మతహింసలు ఏర్పడును. భూమిమీద మతముల కొరకు యుద్ధములే వచ్చును. వీటన్నిటికి మనిషి ఆచరించదగిన ధర్మములేవో, మనిషి తెలుసుకోదగిన జ్ఞానమేమిటో, మతముల పేర్లు పెట్టుకొన్న మనుషులకు తెలియకుండ పోవడమే ముఖ్య కారణము. ప్రతి మనిషి పుట్టినప్పటి నుండి యుక్తవయస్సు వరకు బ్రతుకు తెరువుకొరకు చదువుకొని, దాని తర్వాత ధనార్జనలో పడిపోయి, మిగత కాలములో మతమును మతభక్తిని, మత ప్రచారమును చేయుచు నా మతము గొప్ప, నా మతము గొప్ప అని ద్వేషములు పెంచుకొందురు. క్రైస్తవులను చూస్తే హిందువులు, హిందువులను చూస్తే క్రైస్తవులు ఒకరికొకరు అజ్ఞానులమనుకొను స్థితి ఏర్పడును. ప్రతి మతము వాడు దేవుని పేరే చెప్పుచు, దేవునివద్దకే చేరాలని చెప్పినా వారివారి ప్రవక్తలు, వారివారి మతములు వేరువేరైన దానివలన వారివారి దేవుడు కూడ వేరువేరని చెప్పు కాలమువచ్చును.

ఈ విధముగ భూమిమీద కలియుగమునందు మతముల పేరుతో అధర్మములు పెరిగి పోవును. వేరు మతములు లేని ద్వాపరయుగములో ఒక్క ఇందువులకు సంబంధించిన ధర్మములనే నేను చెప్పాను. నేను చెప్పిన ధర్మములు సర్వమానవులకు, సర్వమతములకు సంబంధించినవని ఎవరికీ, ఏ మతము వారికీ తెలియకుండ పోవుట వలన, క్రైస్తవులు మా జ్ఞానము, మా ధర్మములు ప్రత్యేకమైనవని, మా ప్రవక్త చెప్పినవి కృష్ణుడు

చెప్పినవి వేరని అనుకొందురు. ద్వాపరయుగములో కృష్ణుడు చెప్పిన ధర్మములనే తమ ప్రవక్త చెప్పాడని ఎవరూ గుర్తించలేరు. ఇందూధర్మము లను దేవుడు చెప్పాడని, ఇందూ ధర్మములులేని మతము భూమిమీదలేదని ఎవరూ గ్రహించలేరు. ఇందూధర్మములు దైవజ్ఞానము తెలియాలనుకొను ప్రతి మతస్థునికి అవసరమైనవే. ఎందుకనగా వారి మత గ్రంథములలో ఏమి చెప్పారో అవియే నేను చెప్పిన ఇందూ ధర్మములు, ఇందూ అనగా దైవ జ్ఞానము అని తెలియని ప్రతి మతము, తమ మతములకు ప్రత్యేకమైన పేర్లు పెట్టుకొందురు. చివరకు దైవజ్ఞానము (ఇందుత్వము) తెలియని ఇందువులు కూడ తమది కూడ ఒక మతమని, దానిపేరును హిందూ మతమని చెప్పుకొందురు. నేను చెప్పిన ధర్మములను తెలియక వేదములను ఆశ్రయించి, మేము హిందువులము అని కొందరు చెప్పగా, అలాగే నేను చెప్పిన ధర్మములనే తమ ప్రవక్త చెప్పాడని తెలియక, తమది క్రైస్తవ మతమని కొందరు చెప్పుకొందురు. నేను చెప్పిన ధర్మములలో కూడ కొన్ని అధర్మములు కలిసిపోయి భగవద్గీతగా మీముందు నా బోధ ఉండును. నా బోధ అయిన భగవద్గీతలో కూడ అధర్మములు కలిసి ఉండుట వలన, వాటినే కొందరు హిందువులు ఆశ్రయించి, నేను చెప్పిన ధర్మములను అర్థము చేసుకోలేరు. ఆ విధముగ భగవద్గీత ఎవరికీ అర్థము కాకుండ పోతుంది.

జగతిలో అతి పెద్ద మతముగా క్రైస్తవమతము పేరుపొందినా, ఆ మత ప్రవక్త చెప్పిన బైబిలు గ్రంథములో కూడ అధర్మములు కలిసిపోయి క్రైస్తవులు కూడ దైవజ్ఞానమును (ఇందుత్వమును) తెలియలేరు. బైబిలును చదివిన ప్రతి క్రైస్తవుడు, బైబిలును బోధించిన ప్రతి బోధకుడు, అందులో వున్న నా ధర్మములను తెలియలేరు. అందువలన క్రైస్తవ ప్రవక్త అయిన

ఏసు ప్రజలనుద్దేశించి ఒక మాట చెప్పి పోవును. **నేను చెప్పిన ధర్మములు మీకిప్పుడు అర్థము కావు. నా తర్వాత కొంతకాలమునకు ఒక వ్యక్తి వచ్చి నేను చెప్పిన నా మాటలనే వివరముగా చెప్పును.** అప్పుడు నేను చెప్పిన మాటలు అర్థమగును అని చెప్పును. ఏ వ్యక్తి అయితే బైబిలు వాక్యములను వివరించి చెప్పునో, అదే వ్యక్తి భగవద్గీతలో శ్లోకరూపములోనున్న నా ధర్మములను కూడ వివరించి చెప్పును. అంతవరకు భగవద్గీతకానీ, బైబిలు గానీ సరిగా ఎవరికీ అర్థము కావు. ఇటు బైబిలును అటు భగవద్గీతను ఏక కాలములో చెప్పునతడే రెండు గ్రంథములలోని ధర్మములు ఒక్కటేనని, ఆ రెండు గ్రంథములను ఒక్కడే చెప్పాడని సంచలన మాటను చెప్పును. రెండు గ్రంథముల లోను దేవుడు చెప్పిన ధర్మములతోపాటు, మనుషులు వ్రాసిన అధర్మములు కూడా ఉన్నాయని, వాటిని వదలి ధర్మములకు మాత్రమే వివరమును చెప్పును. ఆ వ్యక్తి గురువుగా గానీ, స్వామిగా గానీ చలామణి కాడు. ఏ ఆధారములేని ఆయనను గుర్తించుట చాలాకష్టము" అని కృష్ణుడు బోయవానికి చెప్పాడు.

ఇక్కడ మనము ఆలోచింపదగిన విషయమేమంటే దైవధర్మములను గీతరూపములో ధనస్సు, బాణములు ధరించిన అర్జునునికి మాత్రము చెప్పాడు. అక్కడ కృష్ణుడు అర్జునుడు తప్ప మూడవ వ్యక్తి లేడు. పైగా అర్జునుడు ధర్మములను గురించి అడుగనూ లేదు. దారిన పోయేవానికి పిలిచి పిల్లను ఇచ్చినట్లు, ధర్మముల మీద ధ్యాసలేని అర్జునునికి ధర్మములను గురించి కృష్ణుడు చెప్పాడు. అట్లే కలియుగములో జరుగబోవు భవిష్యత్తును గురించి, క్రైస్తవ మతమును గురించి, హిందూమతము క్షీణించి పోవడమును గురించి, ధనస్సు బాణములు ధరించియున్న బోయవానికి చెప్పాడు. అర్జునునకు గీతా జ్ఞానమును చెప్పినట్లు, భవిష్యత్తును గురించి అడుగకున్నా

బోయవానికి కలియుగ ఆధ్యాత్మిక భవిష్యత్తును గురించి చెప్పాడు. కలియుగ ఆధ్యాత్మిక భవిష్యత్తును గురించి చెప్పునపుడు అక్కడ కృష్ణుడు, బోయవాడు తప్ప మూడవ వ్యక్తి ఎవరూ లేరు. యుద్ధరంగమున గీతను చెప్పినపుడు కృష్ణుడు అర్జునునికి చెప్పగా, తర్వాత అర్జునుడు వ్యాసునికి చెప్పుట వలన గీత అర్జునుని ద్వారా బయటపడినదని చెప్పవచ్చును. కానీ కలియుగ ఆధ్యాత్మిక భవిష్యత్తును కృష్ణుడు బోయవానికి చెప్పినపుడు అక్కడ మూడవ వ్యక్తి లేడు. చెప్పిన కృష్ణుడు వెంటనే చనిపోయాడు. ఇక బోయవాడు మాత్రము మిగిలాడు కలియుగ ఆధ్యాత్మిక భవిష్యత్తు ఒక్క బోయవాని ద్వారానే బయటికి రావాలి. కానీ బోయవాడు కూడ తాను చేసిన తప్పుకు అప్పుడే నిరాహారదీక్ష చేసి అక్కడ కృష్ణుని ముందరే చనిపోయాడని వ్రాశారు. ఇక్కడ ప్రత్యేకించి నేను అడిగే ప్రశ్న ఏమంటే! నీ తప్పు ఏమీ లేదని, అంతా నా కర్మ ప్రకారము జరిగిందని కృష్ణుడు బోయవానితో చెప్పినా, అతను వినకుండా నేను చేసిన తప్పుకు శిక్ష ఉండాలని, నిరాహారదీక్ష చేసి వెంటనే చనిపోయాడని, తర్వాత కృష్ణుని రథసారధియైన దారకుడు అక్కడికి వచ్చాడని వ్రాశారు. నిరాహారదీక్ష చేసి ఒక మనిషి చనిపోవాలంటే కనీసము 40 రోజులైనా పడుతుంది. అలాంటిది నిరాహారదీక్ష చేసి నిమిషానికే చనిపోయాడని చెప్పడము పచ్చి అబద్ధము కాదా?

భాగవతములో కృష్ణున్ని బాణముతో బోయవాడు కొట్టినట్లు వ్రాసిన వారు, జరిగిన సంఘటనను చూచి కృష్ణుడు నివారించినా వినకుండ నిరాహార దీక్షతో చనిపోయాడని వ్రాశారు. కృష్ణుడు, బోయవాడు తప్ప అక్కడ ఎవరులేని సమయములో ఏమి జరిగిందో, ఏమి మాట్లాడారో ఎవరికీ తెలియదు. వాస్తవానికి బోయవాడు చనిపోలేదు. బోయవాడు బాధపడగా కృష్ణుడు అంతా కర్మప్రకారమే జరిగిందని ఓదార్చిన తర్వాత కలియుగ

ఆధ్యాత్మిక భవిష్యత్తును గురించి కృష్ణుడు బోయవానికి చెప్పి, ఈ విషయమును నేను నీకు తప్ప ఎవరికీ చెప్పలేదన్నాడు. కృష్ణుడు చెప్పిన చివరి సందేశమైన కలియుగములో ఆధ్యాత్మిక భవిష్యత్తును వినిన బోయవాడు, నేనెంతో అదృష్టవంతున్ని అని సంతోషపడినాడు. నా జీవిత అంత్య భాగములో నేను చెప్పు పెద్ద రహస్యము ఇది. దీనిని నీవు తప్ప వినినవాడు ఎవరూ లేరని కృష్ణుడు చెప్పిన మాటను బట్టి నేను గొప్పవాడినని బోయవాడు అనుకొన్నాడు. యుద్ధరంగమున కృష్ణుని ద్వారా గీతను విని, ఈ రహస్యము నీకు తప్ప ఎవరికీ తెలియదని కృష్ణుడు చెప్పగా, అర్జునుడు తనకు తాను గొప్పగ ఊహించుకొన్నట్లు కృష్ణుడు చెప్పిన కలియుగ ఆధ్యాత్మిక భవిష్యత్తు, దైవజ్ఞాన రహస్యమును విన్న బోయవాడు కూడ అర్జునుడు అనుకొన్నట్లు అనుకొన్నాడు. ఆ కాలములో యుద్ధము అయిపోయిన తర్వాత అర్జునుడు వ్యాసునికి చెప్పగా, అది వ్యాసుని ద్వారా అందరికీ తెలిసినది. కృష్ణుడు చెప్పిన గీతను అర్జునుడు వ్యాసునికి చెప్పినట్లు, భారతములోగానీ, భాగవతములోగానీ వ్రాయలేదు. అయినా ఇట్లే జరిగింది, అర్జునుడే స్వయముగా వ్యాసునికి చెప్పాడని మేము చెప్పాము. ఇక్కడ బోయవానికి కృష్ణుడు చెప్పిన విషయము కూడ భారత, భాగవతములలో వ్రాయలేదు. అయినా ఈ విధముగా జరిగిందని మేమే చెప్పుచున్నాము. ఈ నా మాటవిన్న కొందరు పండితులు, కవులు ఈయన ఎవరు? స్వయముగా ఇట్లే జరిగిందని చెప్పడానికి? అని అడుగవచ్చును. దీనికి జవాబును తర్వాత చెప్పెదము, కానీ ఈ ప్రశ్నలో ఈయన ఎవరు అను ప్రశ్న నాకు బాగా నచ్చింది.

నేను సత్యమును చెప్పితే విశ్వసించలేని వారు నిరాహారదీక్షతో బోయవాడు చనిపోయాడన్నపుడు, నిరాహారదీక్షకు నిమిషాలలో ఎవరు

చనిపోరు కదా! అని ఎందుకు అడగలేకపోయారు? కృష్ణుడు రక్తస్రావము వలన చనిపోయాడని సత్యమును మేము చెప్పితే నమ్మలేని వారు, కృష్ణుడు రథమునెక్కి వైకుంఠమునకు పోయాడు అని భాగవతములో వ్రాసిన మాటను ఎలా నమ్మారని అడుగుచున్నాము. నిరాహారదీక్షతో నిమిషాల వ్యవధిలో చనిపోతాడను మాటగానీ, కృష్ణుడు రథము మీద వైకుంఠమునకు పోయాడనుట గానీ పూర్తి అశాస్త్రీయము, అసత్యము. కల్పిత పురాణములను గ్రుడ్డిగా నమ్మువారు ఆధారపూరిత విషయములను ఎందుకు నమ్మరని మేము అడుగుచున్నాము. కృష్ణుడు బోయవానికి ఇంకా కొన్ని విషయములను చెప్పాడు. ఆ విషయములు క్రైస్తవ, హిందూమతములకు రెండిటికి కనువిప్పు కల్గించు విషయములుగా ఉన్నవి. కృష్ణుడు దేవుని ధర్మములను తెలియ బరచుటకు అవతరించి వచ్చాడు. ద్వాపరయుగ అంత్యములో దైవ ధర్మములను భారతదేశములో తెలియబరిచాడు. అలాగే కలియుగ ప్రథమములోనే వచ్చి మరియొకమారు ధర్మములను ఇతర దేశములో తెలియ బరుస్తానని చెప్పాడు. ఇశ్రాయేల్ దేశములో ఏసుగా ఉద్భవించి ధర్మములను చెప్పిపోతానని, అవసరమునుబట్టి తర్వాత కూడ వస్తానని చెప్పాడు. బోయవానిని అడ్డము పెట్టుకొని చెప్పిన మాటలు నేటికి సత్యములుగా కనిపిస్తున్నవి. ఇంకా ఆయన చెప్పిన మాటలు ఇలా ఉన్నవి. కృష్ణునిగా వచ్చిన నేను కలియుగ ప్రథమాంకములోనే ఏసుగా వస్తాను. అలా వచ్చిన నన్ను ఎవరూ గుర్తించలేరు. ఇప్పుడు చెప్పిన గీతగానీ, అప్పుడు చెప్పు వార్తగానీ రెండు నా ధర్మములనే తెలియబరుచును. ఎక్కడ ఏ వాక్యము బేధము కల్గియుండదు. నేనే ఏసును, ఏసే నేను అయినప్పటికీ శరీరములు, పేర్లు వేరైనా ఇద్దరు ఒక్కరేనని ఎవరికీ తెలియదు. నా బోధ, ఏసు బోధ రెండు ఒక్కటే అయినప్పటికీ, గ్రంథములు వాటి పేర్లు వేరువేరైనప్పటికీ, రెండూ ఒక్కటేనని ఎవరూ గుర్తించలేరు. అంతేకాక నేను చెప్పిన గీత,

ఏసు చెప్పిన నాలుగు సువార్తలు తిరిగి వివరముగా మరొక వ్యక్తి చెప్పేంత వరకు ఎవరికీ అర్థముకావు. ఆ వ్యక్తిని గురించి ఏసు చెప్పిన వార్తలలో ఆదరణకర్త అని వ్రాయబడివుండును. ఏసు చెప్పిన "ఆదరణకర్త" అను పేరులోని మొదటి అక్షరము, చివరి అక్షరము రెండు అక్షరములు మొదటిది మొదలులోను, చివరిది చివరిలోను ఉండు పేరు ఆయనకుండును. ఆ.....ర్త అను రెండక్షరముల పేరు కల్గినవాడే నేను చెప్పిన బోధనూ, అలాగే ఏసు చెప్పిన వార్తలనూ ఏక కాలములో వివరించి చెప్పును. అలా చెప్పువాడే కాలజ్ఞానమును చెప్పిన వీరబ్రహ్మముగారికి, సమస్త మానవులకు గురువగును.

ఏసుప్రభువును విశ్వసించిన వాడు నన్ను (కృష్ణున్ని) విశ్వసించడు. అలాగే గీతను చదివినవాడు ఏసును విశ్వసించడు. ఇటు నేను అటు ఏసు ఉత్తర దక్షిణ ధృవములవలె కనిపించుచుండుట వలన హిందువులు క్రైస్తవులను, క్రైస్తవులు హిందువులను ఏవగించుకొను స్థితిలో ఉందురు. ఆ సమయములో ఏసు చెప్పిన ఆదరణకర్త తప్ప ఎవరూ రెండు మతములకు సమాధానములు చెప్పలేరు. అలాగే సమన్వయపరచలేరు. క్రైస్తవులలో ఆదరణకర్త, హిందువులలో ఆ.....ర్త అయిన వాడు ఒక్కడే. ఆ ఒక్కడే రెండు మతములలోని ఏసు చెప్పిన వాక్యములకు, నేను చెప్పిన గీతకు సరియైన భావమును చెప్పి, రెండు బోధలను ఒక్కటిగానే చూపును. రెండు మతములలో చెప్పిన నన్ను, ఏసును ఒక్కనిగానే చూపించును. నేను మూడు వేలసంవత్సరముల తర్వాత పుట్టి, ఈ జన్మలో చెప్పినది తిరిగి అప్పుడు చెప్పగలను. అలా చెప్పిన నేనే, ఏసు పేరుతో కొంతకాలముండి పోగలను. తర్వాత కొంత కాలమునకు వచ్చినవాడే రెండు జన్మలలో ఉన్నది నేనేనని, చెప్పినది నేనేనని తెలియజెప్పును. అలా చెప్పుట వలన ఆయన ఇటు

హిందువులకు, అటు క్రైస్తవులకు వ్యతిరేకియై కనిపించును. సమాజములో ఎంత వ్యతిరేఖత వచ్చినా నా పని ఇదేనన్నట్లు ఆయన మాత్రము ఎవరికీ జంకక తాను చెప్పవలసినది చెప్పి పోవును. రెండు బోధలను వివరించి చెప్పువాడు ప్రత్యేకించి రెండు మతములలో ఇటు నేను, అటు ఏసు చెప్పక వదలివేసిన బోధలను తెలియజెప్పును. అంతేకాక ఆదినుండి తెలియని ఆధ్యాత్మిక రహస్యములను తెలియజెప్పి, ఆయన ప్రత్యేకత ఏమిటో ఇతరులకు అర్థమగునట్లు చేసినా, ఆయనను ఎవరూ గుర్తించలేరు. మానవునికి కావలసిన జ్ఞానమును నేను ఒక విధానముతో చెప్పగా, ఏసు దానినే మరొక విధముగా చెప్పగా, రెండు ఒకటేనని చెప్పిన ఆదరణకర్త, రెండిటిని వివరించి చెప్పుచూ, రెండిటియందు ఉన్నదానినే తన విధానముతో చెప్పి పూరించును." అని చెప్పాడు. కృష్ణుడు చెప్పిన విధానమును చూస్తే వచ్చే మూడవ వాడు ఎలా ఉంటాడో కొద్దిగ అర్థమవుతుంది.

మనిషి బ్రతుకుటకు ఆహారము తినాలి. ఆహారములో మనము అన్నమును తింటున్నాము. అన్నమును ఒక్క దానినే తినినా ఆకలి తీరును. కానీ అన్నములోనికి కూరను కలుపుకొని తింటే రుచిగా ఉంటుంది. అన్నము లోనికి కూరను కలుపుకొని తిని ఆకలి తీర్చుకొనువారు చాలామంది ఉన్నా, కొంతమంది అన్నమును కూరతో తిన్న తర్వాత చివరిలో మజ్జిగతో తింటారు. అలా మజ్జిగతో తింటే పూర్తి తృప్తిగా తిన్నట్లగును. ఈ విధముగా ఆహారమును మూడు భాగములుగా చెప్పుకోవచ్చును. ఒకటి అన్నము, రెండు కూరలు, మూడు మజ్జిగ. ఈ మూడింటిని సంపూర్ణమైన ఆహారమని చెప్పవచ్చును. అన్నమును, కూరను,. మజ్జిగను మూడింటిని తిన్నవాడు సంపూర్ణ ఆరోగ్యముతో ఉండును. మూడు ఆహార భాగములలోను పోషక పదార్థములు సంపూర్ణముగ ఉండుట వలన మూడు భాగముల ఆహారమును

తిన్నవాడు శరీరములో తృప్తిగా ఆరోగ్యముతో జీవించును. అన్నము, కూర, మజ్జిగను గురించి ఇప్పుడు చెప్పుకోవలసిన అవసరమేమొచ్చిందని కొందరనుకోవచ్చును. దీనిని ఉపమానముగా చెప్పుచున్నాము. ద్వాపర యుగములో కృష్ణుడు గీతను చెప్పాడు. గీతను ఆధారము చేసుకొని ముందుకు పోవువారుండినా, కలియుగములో ఏసు కూడ జ్ఞానమును చెప్పాడు. ఏసు చెప్పిన జ్ఞానమును ఆధారము చేసుకొని పోవువారు కూడ ఎందరో కలరు. ఈ రెండు జ్ఞానములను ఆహారములోని రెండు భాగములుగా పోల్చి చూచుకొందాము. కృష్ణుడు చెప్పిన గీతాజ్ఞానమును ఆహారములో ఒకటవదైన అన్నముగా పోల్చుకొందాము. అన్నము ఆహారములో ముడిపదార్థములాంటిది. అన్నము ఒకే రంగుకలిగి, ఒకే రుచికల్గివుంటుంది. అన్నమును ఒక దానినే తినాలంటే కొంత కష్టముగా ఉంటుంది. అన్నమును ఒక దానినే కడుపునిండా తినవచ్చును. అట్లు ఒక అన్నమును కడుపునిండా తినినా మనిషి బ్రతకవచ్చును. కానీ తినే ఆహారము రుచిగా ఉండుటకు, దేవుడు కృష్ణున్ని పంపి గీతాజ్ఞానమును చెప్పించినట్లు, ఏసును పంపి వార్తా జ్ఞానమును చెప్పించును. ఏసు చెప్పిన వార్తా జ్ఞానము అన్నముతో సహా అన్నము కలుపుకొని తిను కూరలాంటిది. అన్నము రుచివేరు, కూర రుచివేరు అయినా రెండూ మనిషికి అవసరమైన ఆహారపదార్థములే. ఏసు చెప్పిన జ్ఞానమును, కృష్ణుడు చెప్పిన జ్ఞానమును అర్థము చేసుకోగలిగితే, అన్నమును వడ్డించిన వ్యక్తి, కూరను వడ్డించిన వ్యక్తి వేరు వేరైనా, అన్నము కూర వేరువేరైనా రెండూ తినే పదార్థములేనని తెలుసుకోగలిగితే, రెండు పదార్థములను కలుపుకొని తినగలిగిన వాడు పొందు రుచివలె, గీతా జ్ఞానమును, వార్తా జ్ఞానమును రెండిటిని సమన్వయముగా అర్థము చేసుకోగల్గితే, ఎంతో అభిరుచి తృప్తి ఏర్పడును. అట్లు కాకుండ అన్నము తెల్లగున్నది, కూర నల్లగున్నది అది వేరు ఇది

వేరు నేను అన్నమును ఒకదానినే తింటానని, అన్నమును మాత్రము తినినా కడుపు నిండును. అలాగే కూరను మాత్రము తింటానని కూరనొకదానినే తినినా కడుపు నిండును. అలా తినడములో గల రుచివేరుగా ఉండును. రెండిటిని కలుపుకొని తినడము వలన రుచి వేరుగావుండి బాగుండును.

ఇప్పుడు భూమిమీద మేము అన్నమును మాత్రము తింటామన్నట్లు కృష్ణునియొక్క గీతా జ్ఞానమును మాత్రము చదవగల్గిన హిందువులనువారు కొందరున్నారు. అలాగే మేము కూరను మాత్రము తింటామన్నట్లు ఏసు యొక్క వార్తా జ్ఞానమును మాత్రము చదవగల్గిన క్రైస్తవులను వారు ఎందరో ఉన్నారు. ఇలాంటి సమయములో అన్నము కూర రెండిటి విషయము తెలిసిన ఆదరణకర్త వచ్చి రెండిటి వివరమును వివరించి రెండిటిని కలుపు కొమ్మన్నట్లు గీతలోని జ్ఞానమును, వార్తలలోని జ్ఞానమును వివరించి చెప్పును. అంతవరకు కృష్ణుడు వేరు, ఏసు వేరని అట్లే గీతాజ్ఞానము వేరు, వార్తాజ్ఞానము వేరని అనుకొనుచుందురు. భూమిమీద క్రైస్తవ పాస్టర్ ఫాదర్‌లను బోధకులకు, హిందూ గురువులను బోధకులకు విభిన్నముగా అంతవరకు రెండిటియందు ఎవరికీ తెలియని వివరమును ఆదరణకర్త బోధించగా, వివరము తెలిసినందుకు కొందరు మాత్రము సంతోష పడుదురు. చాలామంది బోధకులు ఆయనను వ్యతిరేఖిస్తారు. ఆయన మీద దాడులు కూడ చేస్తారు. అయినా ఆయన ఎవరికీ భయపడకుండా తన పనిని తాను చేయునని కృష్ణుడు కూడ చెప్పాడు. రెండిటికి సమన్వయకర్త అయిన ఆయనను ఏసు ఆదరణకర్త అని చెప్పగా, ఆయన పుట్టుక హిందూమతములో ఉండుట వలన మరియు ఆయన రెండు మతములకు ఆదర్శముగా ఉన్న దానివలన, ఏసు చెప్పిన ఆదరణకర్త, హిందువులలో "ఆదర్శకర్త" అను పేరుతో చలామణి అగునని కృష్ణుడు బోయవానికి చెప్పి

పోయాడు. కృష్ణుడు చెప్పిన ఆదర్శకర్త, ఏసు చెప్పిన ఆదరణకర్త ఇద్దరు ఒక్కరేనని తెలిసిపోయినది. ఆదరణకర్త అయిన ఆదర్శకర్త అను పేరు ఎవరికున్నదో వెతికితే ఆ పేరును బట్టి సులభముగా మూడవవ్యక్తిని గుర్తించగలము. ఆ పేరున్న వాడు వచ్చిపోయాడా, లేక వచ్చివున్నాడా, లేక రాబోవు కాలములో వస్తాడా, అను విషయము మాత్రము అర్థముకాని విషయము.

ఆదర్శకర్త అను పేరున్నవాడు ఆదరణకర్తగా ఇటు ఏసు, అటు కృష్ణుని జ్ఞానమును వివరించి చెప్పునదేకాక, ఇంకా అర్థము కాకుండ మిగిలియున్న ధర్మములను అనగా ఇంకా తెలియకున్న ధర్మములను క్రొత్త విధానములో తెలిపి పూరించునని కృష్ణుడు చెప్పిపోయాడు కదా! ఆయన పూరించు ధర్మములను ఎలా పోల్చవచ్చునో వివరించుకొందాము. మనిషికి సంతృప్తి నిచ్చు పూర్తి భోజనము మూడు భాగములుగా ఉండునని, ఆ మూడు భాగములను అన్నము, కూర, మజ్జిగ (పెరుగు) అని చెప్పుకొన్నాము. అన్నమును రుచికరమైన కూరతో తినినా, చివరిలో మజ్జిగతో తింటేనే తృప్తిగా ఉంటుంది, పూర్తి భోజనము అయినట్లు ఉంటుంది. అలాగే రాబోవు ఆదర్శకర్త, కృష్ణుడు గీతను చెప్పగా అందులో కూడ తెలియనిది ఏదైతే ఉందో, అట్లే ఏసు తన వార్తను చెప్పగా అక్కడ కూడ తెలియనిది ఏదైతే ఉందో, రెండు చోట్ల తెలియక మిగిలిన దానిని పూర్తిగా తెలియజేయును. దేవుని ధర్మముల విషయములో ఎవరివద్ద ప్రశ్న అనునది గానీ, సంశయమనునది గానీ లేకుండ చేయును. దీనినిబట్టి ఆదర్శకర్త అను పేరుతో వచ్చువాడు నాస్తికులవద్దగానీ, హేతువాదులవద్దగానీ దేవుని గురించి అడుగు ప్రశ్నే లేకుండ చేయును. అందువలన ఆదర్శకర్త ఇటు నాస్తికులకు, అటు ఆస్తికులకు తెలియని జ్ఞాన విధానమును తెలుపునని అర్థమగుచున్నది.

ద్వాపరయుగములో కృష్ణుడు చనిపోతూ చెప్పిన ఆదర్శకర్త, కలియుగములో ఏసు బోధిస్తూ చెప్పిన ఆదరణకర్త, ఎంతో గొప్ప జ్ఞానము కలిగి క్రైస్తవులకు, హిందువులకు మ్రింగుడు పడనివాడై ఉండును. ఆదరణ కర్త, ఆదర్శకర్త అయినవాడు చెప్పిన బోధను గ్రహించిన హిందువులు, క్రైస్తవులు ఆయనలోనే కృష్ణున్ని, ఆయనలోనే ఏసును చూచుకొందురు. నేను ఇప్పుడు చెప్పిన విషయములు హిందూ మత ప్రచారమునకో, లేక క్రైస్తవ మతప్రచారము కొరకో కాదు. రెండు మతములకు అతీతమైన దేవున్ని గురించి తెలుపు విధానమని తెలియాలి. అంతేకాక కృష్ణుడు పోతూ పోతూ చివరిగా చెప్పిన కలియుగ ఆధ్యాత్మిక భవిష్యత్తులో ఆదర్శకర్త పేరుండడము విశేషము. ఈ దినము భూమిమీదవున్న జ్ఞానమును గురించి, అజ్ఞానమును గురించి, పుట్టుకొచ్చిన మతముల గురించి కృష్ణుడు ఆనాడే చెప్పాడు. ఇదంతయు కృష్ణుడు చివరి రోజున చెప్పిన భవిష్యత్తు వివరమని తెలియవలెను.

ఇప్పుడొక ప్రశ్నరాక తప్పదు. అదేమనగా! కృష్ణుడు యుద్ధ రంగములో బోధ చెప్పగా వినిన అర్జునుడు తర్వాత వ్యాసునికి చెప్పాడనీ, వ్యాసుని ద్వారా అందరికీ తెలిసిందని చెప్పారు. దానిని ఒక విధముగా సత్యమేనని ఒప్పుకోవచ్చును. కానీ కృష్ణుడు చనిపోవు చివరి సమయములో కలియుగ ఆధ్యాత్మికమును గురించి చెప్పాడని, దానిని బోయవాడు విన్నాడని చెప్పారు. అక్కడ ఎవరూలేని ఆ సమయములో కృష్ణుడు చెప్పిన సమాచారమును వినిన బోయవాడు ఆ విషయమును తర్వాత ఎవరికీ చెప్పినట్లు ఆచూకి లేదు. బోయవాడు చెప్పినట్లు ఎక్కడా లేనపుడు అక్కడ జరిగిన విషయము మీకెలా తెలిసింది? మీరెలా ఈ విషయములన్నిటిని చెప్పగలుగుచున్నారని ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! అర్జునుడు గీతను వ్యాసునికి చెప్పినట్లు కూడ భారతములోగానీ,

భాగవతములోగానీ లేదు. అక్కడ వ్యాసుడు తెలివిగా ప్రవర్తించి, అర్జునుడు చెప్పినట్లు తెలియకుండ చేసి, సంజయుడు దృతరాష్ట్రునికి చెప్పినట్లు వర్ణించాడు. ఎలాగైతే ఏమి, చివరకు కృష్ణుడు అర్జునునికి చెప్పిన విషయము బయటికి వచ్చినది. కానీ ఇక్కడ భాగవతములో బాణముతో కొట్టిన బోయవాని పాత్రను చంపివేసి బోయవానిని పూర్తిగా లేకుండ చేశారు. అందువలన కృష్ణుడు చెప్పిన విషయము ప్రస్తావనకే రాలేదు, తర్వాత ఎవరికీ తెలియకుండ పోయినది. ఆ బోయవాడు తనకు కలియుగ ఆధ్యాత్మిక భవిష్యత్తు తెలిసినా, ఆ విషయమును ఎవరికీ చెప్పాలనుకోలేదు. తనకు పరిచయమున్న వారంతా నిత్యము వేటకు పోయి బ్రతుకువారే, కావున వారికి ఈ విషయము అవసరము లేదనుకొన్నాడు. ఎవరికైనా చెప్పాలను కొనినా వీనికి చెప్పే దానికీ కుదరలేదు. ఈ విధముగ ఆ విషయము వానితోనే లేకుండ పోయినది. అలా వాడు ఆ జన్మలో చనిపోయి తర్వాత జన్మలో పుట్టుతూవస్తూ అప్పటినుండి ఇప్పటి వరకు ఎన్నో జన్మలు ఎత్తాడు. ఆ విధముగా ఆ జీవుడు జన్మిస్తూ, మరణిస్తూ ఎన్నో జన్మలను ధరించినా అతని వెంట ఆత్మ వస్తూనే ఉండును. ఆ జీవుడు ఎన్ని జన్మలు మారినా వానితో పాటు శాశ్వతముగా వున్న ఆత్మకూడ వాని వెంటనే ఉంటూ అన్ని జన్మలకు సాక్షిగా ఉండును. వెనుకటి జన్మ విషయము కూడ జీవునికి తెలియదు. కానీ ఆది నుండి అన్ని జన్మలకు సాక్షిగానున్న ఆత్మకు అన్ని జన్మల విషయములు తెలియును. ద్వాపరయుగ అంత్యములో చివరిగా కృష్ణుడు బోయవానికి చెప్పిన విషయమంతా అతని ఆత్మకు తెలియును. అతను ఇప్పుడు ప్రస్తుత జన్మలో ఒక రోగముతో బాధపడుచు నావద్దకు రావడము జరిగినది. అప్పుడు నేను అతనికి కర్మను ఉదహరించుటకు దైవజ్ఞానమును చెప్పు సమయములో, ఆ జీవుడు నిద్రావస్థలోనికి పోయి లోపలనున్న ఆత్మయే వినుటకు మొదలుపెట్టింది. నేను కృష్ణున్ని గురించి

ఆయన చెప్పిన జ్ఞానమును గురించి చెప్పు సమయములో, అతనిలోని ఆత్మ కృష్ణుని మరణ సమయములో జరిగిన వృత్తాంతమునంతటిని వివరముగా నాకు చెప్పింది. కావున దానినే నేను మీకు చెప్పాను.

ఇదేదో కాకమ్మ గువ్వమ్మ కథలాంటిది అనుకోవద్దండి. మనిషికి జన్మలున్నది వాస్తవము, పునర్జన్మలో జ్ఞాపకము అరుదుగా ఎవరికైనా రావచ్చును. అలా వచ్చిన సంఘటనలు కూడ ఎన్నో ఉన్నాయి. జరిగి పోయిన జన్మలలోని విషయములు జ్ఞాపకము వచ్చుటకు ఒకే ఒక ఆత్మయే కారణము. జీవునికిగానీ, మనస్సుకుగానీ, బుద్ధికిగానీ గతజన్మ జ్ఞాపకాలు ఉండవు. విషయములను జ్ఞాపకము పెట్టుకొను స్థోమత శరీరములోని మనస్సుకు మాత్రముండును. మనస్సు చనిపోయిన జన్మలోనే పోతుంది. తర్వాత జన్మలో క్రొత్త మనస్సు వస్తుంది. కావున ప్రస్తుత జన్మలో గతజన్మ జ్ఞాపకాలు ప్రస్తుతమున్న మనస్సుకు తెలియవు. మనస్సు తర్వాత జ్ఞాపకమును కలుగజేయునది ఆత్మ. ఒక మనిషి నిద్రపోవు సమయములో మనస్సు బయట అవయవముల సంబంధము కోల్పోయి, బ్రహ్మనాడిలో అణిగి ఉండును. అప్పుడు ఆ శరీరములోని ఆత్మ మనస్సువలె పనిచేసి ఎవరైనా పిలిస్తే, ఆ పిలుపును బుద్ధికి జీవునికి చేర్చి నిద్రనుండి లేచునట్లు చేయుచున్నది. అంతేకాక ఆత్మ శరీరములో రాత్రింబగళ్ళు అన్ని విషయములకు సాక్షిగా ఉన్నది. ఒక మనిషి ఎన్ని జన్మలు ఎత్తినా వానిని వీడకుండ ఉండునది ఆత్మ ఒక్కటియే. ఆనాడు కృష్ణుడు చనిపోయినపుడు బోయవాని శరీరములో జీవునితో పాటు ఉన్న ఆత్మ, కృష్ణుని మరణ సమయములో ఏమి జరిగినది, ఏమి సంభాషణ జరిగినది అన్నిటిని చూచి ఉన్నది. ఇది సర్వ మానవులలో జరుగు ప్రక్రియయే. కానీ ఎవరికీ శరీరములోపల జరుగు తతంగము తెలియదు. బోయవాని శరీరములోని

ఆత్మ నాకు తెలియజెప్పడము కొందరికి వింతగా కనిపించినా, ఇది వాస్తవముగా కొన్ని సందర్భములలో జరుగునదే. కృష్ణుని మరణమునకు ఆత్మ సాక్షి అయినందున అప్పటి విషయము ప్రస్తుత జన్మనుండి, ప్రస్తుత వ్యక్తినుండి చెప్పడము జరిగినది. ఇక్కడ ఇంకొక విశేషము కూడ ఉన్నది. అదేమనగా! ద్వాపరయుగములో కృష్ణుని మరణ సమయమున ఉన్న అప్పటి బోయవాడు అప్పటినుండి ఎన్నో జన్మలు ధరిస్తూ వచ్చి, చివరికి ప్రస్తుత జన్మలో నా ముందరకు రావడము జరిగినది. అలా నా ముందరకు వచ్చిన ప్రస్తుత వ్యక్తి క్రైస్తవ మతమునకు చెందిన వాడు. అప్పటి హిందూమతములోని బోయవాడు ఇప్పటి క్రైస్తవమతములోని వ్యక్తి అని తెలియుచున్నది.

ఇప్పటి క్రైస్తవుడు అప్పటి విషయమును చెప్పడమేమిటి అని ఆశ్చర్య పోనవసరములేదు. మనిషి బ్రతికి ఉన్నంతవరకే మతము, చనిపోయిన తర్వాత ఎవరు ఏ మతములోనైన కర్మప్రకారము పుట్టవచ్చును. గత జన్మలోని క్రైస్తవులు ఈ జన్మలో హిందువులుగా పుట్టవచ్చును. ఈ జన్మలోని హిందువులు రాబోవు జన్మలో క్రైస్తవులుగా పుట్టవచ్చును. ఒక మనిషి ఏ మతములో మనుగడ సాగించాలో వాని కర్మే నిర్ణయిస్తుంది. దానిప్రకారమే కొందరు హిందువులుగా, కొందరు క్రైస్తవులుగా పుట్టుచున్నారు. **ఎవనికైనా పుట్టుకతో వచ్చిన మతము దేవుని సమ్మతితో వచ్చిన దానిగా లెక్కించాలి.** ఎవడైనా ఒక హిందువు, క్రైస్తవ మతములోనికి మారాలని తలచినా, ఒకవేళ క్రైస్తవునిగా మారినా, అది దేవునికి వ్యతిరేఖ చర్య అగును. దేవుని పరిపాలనను ధిక్కరించినట్లగును. అట్లే ఒక క్రైస్తవుడు హిందువుగా మారాలనినా, ఒకవేళ మారినా అతను కూడ దేవునికి వ్యతిరేఖి అగును. దేవుని పాలకులు అతని మీద కోపము కల్గియుందురు. అందువలన **మతమార్పిడి మహాపాపమని, దైవ నిర్ణయమునకు విరుద్ధముగా చేసినట్లగు**

**నని తెల్పుచున్నాము.** నేటి కాలములో మత మౌఢ్యము అన్ని దేశములలో ప్రాకిపోయినది. దానివలననే యుద్ధములు జరుగుచున్నవి. హింస చెలరేగు చున్నది. ఒకరికొకరు కొట్టుకొని చస్తున్నారు. చివరకు మాలాంటివారిని కూడ అగౌరవముగా మాట్లాడుచున్నారు. ఇటువంటి కాలము వస్తుందని ద్వాపరయుగములోనే కృష్ణుడు చెప్పాడు, అలాగే వచ్చింది. నాది క్రైస్తవము నీది హిందుత్వము అను అజ్ఞాన రోగము పోవుటకు, ఆ రోజే మందును కూడ తయారుచేసి ఇచ్చిపోయినట్లు తెలియుచున్నది. ఆనాడు కృష్ణుడు రాబోవు మత రోగమును గురించి చెప్పాడు. ఆయన చెప్పినట్లే ఆ రోగము వచ్చింది. అయితే రోగమును గురించి చెప్పినపుడే, రోగము వ్యాప్తి చెందకుండ, రోగము పూర్తి నివారణ అగుటకు ఔషధ జ్ఞానమును కూడ తెలిపాడు. మతమను రోగమునకు, జ్ఞానమను ఔషధము ఏమిటో ఆ రోజు ఆయన సూచించినా, ఈ రోజు దానిని తెలియలేని స్థితిలో ఉన్నాము. అందువలన మత రోగము ముదిరి పోవుచున్నది. అలా కాకుండ ఇప్పుడు మనము కృష్ణుడు సూచించిన విధానమును తెలుసుకొందాము.

దేవుడు మతాన్ని సృష్టించలేదు. దేవుడు తన జ్ఞానాన్ని ధర్మముల రూపములో తెలిపాడు. దేవుడు తన శక్తిని తన వ్యక్తిగ మలచి భూమిమీద జ్ఞానాన్ని బోధించునట్లు చేశాడు. అలా వచ్చిన వ్యక్తిని భగవంతుడని హిందువులు, ప్రవక్త అని క్రైస్తవులు అంటున్నారు. ఎవరు ఏమనినా వచ్చిన వ్యక్తి దేవుని శక్తియేనని జ్ఞాపకముంచుకోవలెను. అపారమైన దైవశక్తిలో కొంత భాగము వ్యక్తిగా వచ్చినపుడు, ఆ వ్యక్తికి కూడ ప్రపంచములో గుర్తింపు కొరకు పేరుండును. ఒక కాలములో ఒక ఊరిలో ఉన్న ప్రవక్తకు గానీ, భగవంతునికి గానీ ఒక పేరుండును. ద్వాపరయుగములో దైవ భాగములలో ఒక భాగమై వచ్చిన వ్యక్తి పేరు కృష్ణ. కృష్ణుడు ద్వాపరయుగములో ఉత్తర

భారతదేశమున మధురలో పుట్టాడు. భగవంతుడైన కృష్ణుడు దేవుని ధర్మములను తెలిపిపోయాడు. ఆయన పోయిన తర్వాత దాదాపు మూడు వేల సంవత్సరములకు దైవశక్తి కలియుగమున ఇజ్రయేల్ దేశమున జెరూసలేము నగరమున ఒక వ్యక్తిగా పుట్టినది. ఆ వ్యక్తి ఏసు అను పేరుతో పిలువబడినాడు. ద్వాపరయుగములో పుట్టిన దైవశక్తి పేరు కృష్ణ అను రెండు అక్షరములు. కలియుగములో పుట్టిన దైవశక్తి పేరు ఏసు అను రెండక్షరములు. దైవశక్తి భూమిమీదకు రావడమే అరుదు. కొన్ని లక్షల సంవత్సరములకొకమారు వచ్చు దైవశక్తి, మూడువేల సంవత్సరములకు రెండవమారు రావడము ఆశ్చర్యపడవలసిన విషయము. భగవద్గీతలో కూడ ధర్మములకు ముప్పు ఏర్పడినపుడు, అధర్మములు చెలరేగినపుడు, అధర్మములను అణచివేసి తిరిగి ధర్మములను తెలియజేయుటకు యుగ యుగమందు వస్తానన్నాడు. ఆయన మాట ప్రకారము చూచినా ఒక్కొక్క యుగము కొన్ని లక్షల సంవత్సరముల కాలముంటుంది. అలాంటపుడు అవసరమొచ్చి ప్రతి యుగమునందు వచ్చినా, ఒక రాకడకు మరొక రాకడకు కొన్ని లక్షల సంవత్సరముల వ్యవధి ఉండును. అలాంటిది ద్వాపరయుగము అంత్యములో వచ్చిన భగవంతుడు, వెంటనే కలియుగమున కేవలము మూడువేల సంవత్సరములకే రావడము ఆశ్చర్యపడవలసిన విషయమే అగును. ఒకమారు భూమిమీదకు దైవశక్తి అయిన భగవంతుడు వచ్చి ధర్మములను నెలకొల్పి పోతే, తిరిగి అవి అధర్మములుగా మారుటకు కొన్ని లక్షల సంవత్సరములు పట్టును. ఆ నేపథ్యములో ఒక్కొక్కమారు భగవంతుని రాక దాదాపు పది యుగములకు ఒకమారు ఉండవచ్చును. అటువంటిది కృష్ణుడు చనిపోతూనే కలియుగము వెంటనే ప్రారంభమైనది. భగవంతుడు వచ్చి ధర్మములను తెలియజేసి పోయిన తర్వాత మూడు

వేల సంవత్సరము లకే తిరిగి దైవశక్తి భూమిమీద పుట్టిందని చెప్పితే, మూడు వేల సంవత్సరము లకే ధర్మములు అధర్మములైనాయా? అను ప్రశ్నరాగలదు. ఒకవేళ అంత తొందరగా ధర్మములు, అధర్మములుగా మారిపోతే, దైవశక్తి భగవంతునిగా ధర్మములను తెలియజేయుటకు ఒక యుగములోనే ఎన్నో వందలమార్లు భూమిమీదకు రావలసివస్తుంది. అలా జరుగుతుందా? ఒక యుగములోనే ధర్మములు అధర్మములుగా ఎన్నో వందల మార్లు మారిపోవునా? అని ప్రశ్నించుకొంటే దానికి జవాబు ఈ విధముగా గలదు.

దైవశక్తి భగవంతునిగా రావాలంటే అధర్మములు ఒక స్థాయికి పెరగాలి. అధర్మములు ఒక స్థాయిని అందుకొంటూనే భగవంతుని జన్మ తనకు తానుగా వచ్చును. అలా భగవంతుడు భూమిమీదకు వచ్చి ఒకమారు ధర్మములను నెలకొల్పిపోతే తిరిగి అవి అధర్మములుగా మారుటకు కొన్ని యుగముల కాలము పట్టును. ఒక అంచనా ప్రకారము దాదాపు పది యుగములకు ఒకమారు దైవశక్తి మనిషిగా భూమిమీదకు రావచ్చును. దీనినిబట్టి దాదాపు ఒక కోటి సంవత్సరముల తర్వాత 8 లక్షలనుండి 10 లక్షల సంవత్సరముల లోపల భగవంతునిరాక ఉండవచ్చునని అను కుంటాము. ఒకమారు భూమిమీద ధర్మములను నెలకొల్పిపోతే తిరిగి అవి అధర్మములుగా మారుటకు దాదాపు పదియుగముల కాలము పట్టునని తెలియుచున్నది. దీనినిబట్టి భగవంతుని రాక తొందరగా ఉండదని తెలియు చున్నది. అలాంటపుడు కృష్ణుని తర్వాత కేవలము మూడువేల సంవత్సరము లకే తిరిగి ఏసుగా పుట్టాడని చెప్పడమేమిటి? అని కొందరు నన్ను ప్రశ్నించ వచ్చును. దానికి మా వద్దనుండి వచ్చు జవాబు ఏమనగా! దేవుడు భూమిమీద ఒకమారు ధర్మములను నెలకొల్పుటకు కొంతకాలము పట్టును.

ద్వాపరయుగ అంత్యములో కృష్ణుడు వచ్చి ఒకమారు అర్జునునికి మాత్రము ధర్మములను తెలిపాడు. అదియు ఆయన వచ్చిన తర్వాత, సమయమును చూచి దాదాపు 90 సంవత్సరముల వయస్సులో కేవలము ఒక్కమారు చెప్పడము జరిగినది. ధర్మములను నెలకొల్పుటకు దాదాపు కోటి 10 లక్షల సంవత్సరములకు ఒకమారు వచ్చు భగవంతుడు కేవలము పది నిమిషముల లోపల ధర్మములను బోధించునా? అలా బోధించడము సంపూర్ణముగా అధర్మములను లేకుండా చేసినట్లగునా? ధర్మములను నెలకొల్పడము ఎంతో ఉన్నతమైన పనికాగా, ఆ పని కృష్ణుని జన్మలోనే చేశాడా? ఒకమారు నెలకొల్పబడు ధర్మములు పది కాలములకు పైగా అనగా పది యుగములకు పైగా ఉండవలసి వస్తున్నది. అంత దీర్ఘ కాలముండవలసిన ధర్మములు అంత సులభముగా కేవలము కొన్ని నిమిషములలో బోధించునా అని యోచించవలసిన పని ఉన్నది.

అలా యోచిస్తే తెలియు రహస్యమొకటి కలదు. ఈ రహస్యము సులభముగా తెలియుటకు ఒక చిన్న ఉదాహరణను తీసుకొందాము. ఒక వ్యక్తికి పది లీటర్ల పాలను అమ్మవలెనని అతని యజమాని చెప్పాడు. అప్పుడు ఆ వ్యక్తి ఒక ఊరిలోనికి పోయి పాలను అమ్మడము మొదలు పెట్టాడు. పాలు ఎవరికి అవసరమో అడిగి పాలను అమ్మినాడు. కానీ ఆ ఊరిలో కేవలము ఐదులీటర్ల పాలనే అమ్మినాడు. ఇంకా ఐదు లీటర్ల పాలు మిగిలి ఉన్నాయి. అప్పుడు ప్రక్క గ్రామానికి పోయి మిగిలిన పాలను అమ్మాడు. అమ్మిన పాలు పది లీటర్లు, తిరిగిన ఊర్లు రెండు, అమ్మినవాడు ఒక్కడే. కానీ ఇక్కడ ఒక తతంగమును గమనిద్దాము. మొదట పాలు అమ్మిన ఊరిలో అందరు శూద్రులే ఉన్నారు. కాబట్టి అమ్మేవాడు ఏ ఆటంకం లేకుండా అమ్మేశాడు. రెండవ ఊరిలో అందరు బ్రాహ్మణులే

ఉన్నారు. వారు బ్రాహ్మణులు అమ్మే పాలనే కొంటారు. కానీ శూద్రులు అమ్మే పాలనుకొనరు. అమ్మేవాడు బ్రాహ్మణుడు కాడు. కానీ అమ్మవలసిన పాలు ఐదు లీటర్లు మిగిలి ఉన్నాయి. అందువలన అమ్మవలసిన వ్యక్తి పై అంగీని తీసివేసి, ఒక జంధ్యమును మెడలో వేసుకొని, పంచెకట్టుకొని ఆ ఊరిలోనికి పోయి పాలను అమ్మినాడు. అంగీలేకుండ క్రింద పంచె మాత్రము కట్టుకొని వుండుట వలన, అతను బ్రాహ్మణునివలె కనిపిస్తున్నాడు. పైగా తన పేరు శంకరయ్య అయితే శంకరశాస్త్రి అని చెప్పుకొన్నాడు. పేరులోను, ఆకారములోను బ్రాహ్మణునిగా కనిపించి అమ్మడము వలన అతని ఐదు లీటర్ల పాలను అక్కడి బ్రాహ్మణులు కొన్నారు. పది లీటర్ల పాలను అమ్మిన తర్వాత పాలవానికి జంధ్యముతో పనిలేదు అలాగే పంచెతో పనిలేదు. అందువలన వాడు ఇంటికి పోయి జంధ్యమును, పంచెను తీసివేసి తాను ఎప్పుడూ కట్టుకొనే లుంగీని కట్టుకొని పడుకొన్నాడు. అక్కడ పది లీటర్ల పాలను అమ్మడము ముఖ్యమైన ఉద్దేశము. ఎన్ని ఊర్లలో అమ్మినావు అనిగానీ, ఎంతసేపుకు అమ్మినావు అనిగానీ పాల యజమాని అడగడము లేదు. పాల యజమాని యొక్క పాలను పాలవాడు (పాలను అమ్ముువాడు) అమ్మి పెట్టాలి అన్నది నియమము. అంతేగానీ ఈ వీధిలోనే అమ్మాలి, ఆ ఊరిలోనే అమ్మాలి, గంటలోపే అమ్మాలి, అరగంటలోపే అమ్మాలి అను నియమము లేదు. అందువలన పాలవాడు పది లీటర్ల పాలను అమ్మితే పాల యజమాని లెక్కలో పాలవాడు ఒకరోజు పని చేసినట్లగును.

పై విధముగ పోల్చుకుంటే పాలయజమాని ఉన్నట్లు పరమాత్మ ఉన్నాడు. పాలవాడు ఉన్నట్లు భగవంతుడున్నాడు. పాలవాడు అమ్ము పాలు పాలయజమానివి అయినట్లు, భగవంతుడు బోధించు ధర్మములు పరమాత్మవి (దేవునివి). అమ్మవలసిన పాలు పదిలీటర్లు అయినట్లు తెలుప

వలసిన ధర్మములు నూరు శాతము. పాలవాడు పాలను రెండు ఊర్లలో అమ్మినా పరవాలేదు అన్నట్లు, భగవంతుడు నూరు శాతము ధర్మములను రెండు దేశములలో చెప్పినా ఫరవాలేదు. పదిలీటర్ల పాలను అమ్మినపుడే పాలవానికి ఒకరోజు పని అయినట్లు లెక్కించబడును. నూరు శాతము ధర్మములను తెలపినపుడే భగవంతునికి ఒకమారు ధర్మములను బోధించినట్లగును. పాలవాడు పది లీటర్ల పాలను అమ్ముటకు రెండు ఊర్లలోనికి పోయి రెండు ఊర్లలో కనిపించినట్లు, భగవంతుడు నూరుశాతము ధర్మములను తెలుపుటకు రెండు దేశములలోనికి పోయి రెండు దేశములలో కనిపించును. ఒక ఊరిలో శూద్రునిగా, ఒక ఊరిలో బ్రాహ్మణునిగా కనిపించినట్లు ఒక దేశములో ఒక హిందువుల ప్రవక్తగా, మరొక దేశములో క్రైస్తవ ప్రవక్తగా కనిపించును. పాలవాడు ఉదయము ఆరు గంటలకు ఒక ఊరిలో కొన్ని పాలను అమ్మి, తర్వాత కొంతసేపటికి ఏడు గంటలకు రెండవ ఊరిలోనికి పోయి అక్కడ వారి కులస్థునిగా కనిపించి, ఏడు గంటలకు పాలను అమ్మినట్లు, భగవంతుడు కృష్ణునిగా ద్వాపరయుగ చివరిలో దేవుని ధర్మములను బోధించి తర్వాత కొంత కాలమునకు (మూడువేల సంవత్సరములకు) ఇజ్రాయేలు దేశములోనికి పోయి అక్కడ వారి మతప్రవక్తగా కనిపించి, కలియుగములో దైవధర్మములను బోధించాడు. పది లీటర్ల పాలను రెండు ఊర్లలో అమ్మినపుడు పాలవానికి ఒకరోజు పని అయినట్లు, భగవంతుడు వేరు వేరు సమయములలో వేరు వేరు దేశములలో నూరుశాతము ధర్మములను బోధించినపుడే ఆయనకు ఒక అవతారము పనిపూర్తి అయినట్లగును. పాలవాడు యజమాని పాలను ఎన్ని ఊర్లలో అమ్మినా, ఎంత సమయములో అమ్మినా పదిలీటర్ల పాలను అమ్మినపుడే యజమాని దృష్టిలో ఒకరోజు పాలవాడు పనిచేసినట్లు

లెక్కించబడును. అదే విధముగ భగవంతుడు ఎన్ని దేశములలో ధర్మములను చెప్పినా, ఎంత కాలములో చెప్పినా, నూరుశాతము ధర్మములను తెలియజేసినపుడే, దేవుని దృష్టిలో భగవంతుడు ఒకమారు భూమిమీద ధర్మములను బోధించినట్లగును.

| | | |
|---|---|---|
| పాల యజమాని | – | ధర్మములకు అధిపతి అయిన దేవుడు |
| పాలు | – | ధర్మములు |
| పాలవాడు | – | భగవంతుడు |
| పదిలీటర్ల పాలు | – | నూరుశాతము ధర్మములు |
| రెండు ఊర్లు | – | రెండు భూ భాగములు |
| శంకరయ్య | – | కృష్ణ |
| శంకరశాస్త్రి | – | ఏసు |
| పాలవాడు (శూద్రుడు) | – | భగవంతుడు కృష్ణుడు |
| పాలవాడు (బ్రాహ్మణుడు) | – | భగవంతుడు ప్రవక్త |
| అమ్మిన సమయము | – | బోధించిన కాలము |
| ఆరు గంటలపుడు | – | ద్వాపరయుగములో |
| ఏడు గంటలపుడు | – | కలియుగములో |
| పాలను అమ్మడము | – | ధర్మములను బోధించడము |
| ఒక రోజు పని | – | ఒక అవతారము యొక్క పని |
| పాలను కొన్నవారు | – | ధర్మములను తెలుసుకొన్న వారు |
| పాలను కొన్న ఒక ఊరు | – | మొదట ధర్మములను తెలిసిన దేశము **భారత దేశము.** |
| పాలను కొన్న రెండవ ఊరు | – | తర్వాత ధర్మములను తెలిసిన దేశము **ఇజ్రాయేల్ దేశము.** |

ఒక పొడుగాటి సరళరేఖ ఉందనుకొనుము. ఆ రేఖకు రెండు

ధృవములుండును. ఆ రెండు ధృవములను కలుపు మధ్యరేఖ ఉండును. రేఖ అనగా గీచిన గీత అని అందరికి తెలుసు. ఒక గీతకు రెండు ధృవములు, ఆ రెండు ధృవములను కలుపు గీత ఉండును. క్రింది చిత్ర పటములో చూడుము.




చిత్రములో కనిపించు ఒకటవ కొన ఉత్తర ధృవము, అలాగే రెండవకొన దక్షిణ ధృవము. ఒకటి రెండు కొనలను కలుపుచున్న రేఖను రెండు ధృవములను ఏకస్థాయిగా సమతలముగా చూపుగీత అని అంటున్నాము. గీత ఉంది అంటే ధృవములుంటాయి. రెండు ధృవములు ఉన్నాయి అంటే చూచే దానికి అవి ఒకదానికొకటి వ్యతిరిక్త దిశలలో ఉండును. వ్యతిరేఖ దిశలలో రెండు ధృవములున్నా, రెండిటిని సమానముగా చూపు గీత ఉండును. మొత్తము మీద చెప్పాలంటే ఒక గీత మూడు భాగములుగా ఉన్నదని చెప్పవచ్చును. దీనినిబట్టి గీయబడిన గీత కూడ త్రైతముతో కూడుకొని ఉన్నదని తెలియుచున్నది. ఇపుడు అసలు విషయానికి వస్తాము. భగవంతుడు తెలియ చెప్పినది భగవద్గీత, భగవంతుడు చెప్పిన గీతకు కూడ త్రైతము వర్తిస్తున్నది. భగవంతుని గీత మూడు భాగములుగా ఉంటూ ముగ్గురు పురుషులను తెలియజేస్తున్నది. భగవంతుని చేత గీయ బడిన గీతకు కూడ రెండు ధృవములు కలవు. భగవద్గీత కూడ ఒకకొన ఉత్తర ధృవముగా, రెండవకొన దక్షిణ ధృవముగా ఉన్నది. ఉత్తర ధృవము దేవుడు, దక్షిణ ధృవము జీవుడని దీని అర్థము. ఉత్తర ధృవముగానున్న మొదటి కొన భాగము పరమాత్మయని, దక్షిణ ధృవముగానున్న రెండవ కొన భాగము జీవాత్మయనీ, వాటికి మధ్యలోనున్న గీత జీవాత్మను

పరమాత్మను ఏకము చేయు ఆత్మ అని తెలియుచున్నది. సమస్త జగతిలో ఏ జీవాత్మ అయిన పరమాత్మను చేరాలంటే ఆత్మ ద్వారానే సాధ్యమగును. జీవాత్మకు దారి ఆత్మయే. ఆత్మ దారిలో ప్రయాణిస్తేనే పరమాత్మ అను గమ్యమును చేరవచ్చును. అందువలన దేవున్ని చేరాలను ఏ జీవుడైనా ఆత్మను అధ్యయనము చేసి తీరాల్సిందే, ఇది శాసనము. ఆత్మను గూర్చి ఆధ్యయనము చేయడమునే ఆధ్యాత్మికము అంటాము. ఆధ్యాత్మికము తెలియనిది జగతిలో ఎవనికీ ముక్తి లభించదు.

గీయబడిన గీత మూడు భాగములుగా ఉన్నట్లు, చెప్పబడిన గీత మూడు భాగములుగా ఉన్నది. తన గీత త్రైతముతో కూడుకొన్నదనీ, మూడు భాగములుగా ప్రజలకు తెలియబడునని తెలిసిన కృష్ణుడు, ఆ రహస్యమును చివరిలో బోయవానికి చెప్పిపోయాడు. పాలవాడు రెండు ఊర్లలో పాలు అమ్మినట్లు, భగవంతుడు రెండు సమయములలో రెండు దేశములలో తన బోధను తెలుపవలసి ఉన్నది. భోజనము చేయువాడు మజ్జిగతో తిన్నపుడే అది సంపూర్ణ భోజనమని అనుకొనునట్లు, చివరిలో మూడవ మారు బోధయొక్క వివరమును తెలిపినపుడు సంపూర్ణముగా చెప్పినట్లు అగును. గీయబడిన గీత మూడు భాగములున్నట్లు, చెప్పబడిన గీత మూడు భాగములుగా ఉండాలి. అలాగే చెప్పబడిన గీత మూడు ఆత్మలను తెలుపునదిగా ఉండాలి. ఈ సూత్రము వర్తించినపుడు అది భగవంతుడు మానవునికి బోధించిన బోధ అగును. ఎప్పుడైతే కృష్ణుడు అర్జునునకు ధర్మములను యుద్ధరంగములో తెలియజేశాడో, అప్పుడు పాలవాడు తన పాలను ఒక ఊరిలో అమ్మినట్లైనది. ఇంకా కొన్ని ధర్మములనుగానీ లేక ఒక ధర్మమునుగానీ మరియొక కాలములో మరియొక దేశములో చెప్పవలెనని కృష్ణునికి తెలుసు. అలా రెండవ మారు రెండవ

చోట తానే చెప్పవలెనని, అలా చెప్పిన దానినే మూడవమారు తానే వివరించవలెననీ కూడ కృష్ణునికి తెలుసు. అలా మూడుమార్లు చేసినపుడు తాను ఒకమారు భూమిమీద ధర్మములను తెలియజేసినట్లగును. అందువలన తన ప్రణాళికను లేక పథకమును ముందే తెలియజేసినట్లు ఆధారము కొరకు, బోయవానికి తన రెండవ రాకను, మూడవ రాకను గురించిన సమాచారమును తెలియజెప్పి పోయాడు. ఆ సమాచారముతో బోయవానికి ఏమాత్రము అవసరము లేదు. అయినా కృష్ణుడు తన మరణకాలములో చెప్పాడు. రెండవమారు వచ్చినపుడు ఈ సమాచారమును చెప్పితే ఎవరూ నమ్మరు. కృష్ణుని పేరు చెప్పుకొని ఏసు గొప్పవాడనిపించు కొన్నాడని ఎవరైనా అంటారు. ఉదాహరణకు ఇప్పుడు మనకు తెలిసిన ఒక ఉద్యోగి నేను పోయిన జన్మలో మహాత్మాగాంధీనని చెప్పుకొంటే ఎవరూ నమ్మరు. ఆ ఉద్యోగి చెప్పినట్లు, అతను పోయిన జన్మలో నిజంగా గాంధీయే అయినప్పటికీ ఎవరూ నమ్మే స్థితిలో ఉండరు. పైగా ఆ మాటను చెప్పుట వలన వీడు తన అధికారుల వద్ద గౌరవమును సంపాదించుకొనుటకు అలా బొంకుచున్నాడని అందురు. అట్లుకాక గాంధీ బ్రతికి ఉన్నపుడు, చనిపోకముందు రాబోవు జన్మలో ఫలానా వ్యక్తిగా పుట్టి, ఫలానా ఉద్యోగము చేస్తానని చెప్పియుంటే ప్రస్తుత కాలములో ఆ వ్యక్తి ఆ ఉద్యోగిగా ఉన్నప్పుడు, ఎవరైనా ఈయన ఫలానా గాంధీ అని గుర్తించగలరు మరియు గౌరవముగా చూడగలరు.

ఏదైనా జరుగకముందు చెప్పితే చెప్పినవానికి జరిగిన కార్యమునకు విలువ ఉంటుంది. అట్లుకాక జరిగిన తర్వాత చెప్పితే జరిగిన పనికి గానీ, చెప్పిన వ్యక్తికిగానీ విలువ ఉండదు. అందువలన కృష్ణుడు జరుగబోవు దానిని గురించి ముందే చెప్పాడు. ఆ విలువైన సమాచారమును వినిన

వ్యక్తి అప్పుడే బయటికి చెప్పకపోయినా, తర్వాత చెప్పుట వలన కృష్ణుడు చెప్పిన సమాచారమునకు విలువ చేకూరినది. కృష్ణుడు బ్రతికివున్నపుడు చెప్పిన గీతయందు, నేను ధర్మములను సంస్థాపన చేయుటకు యుగ యుగమునందు, నన్ను నేను సృజించుకొని వస్తానని చెప్పాడు. అలాగే ఏసుగా వచ్చిన సమయములో కూడ తర్వాత నేను వస్తానని చెప్పాడు. కృష్ణునిగా వచ్చినశక్తి, ఏసుగా వస్తానని భగవద్గీతలోను, ఏసుగా వచ్చిన వ్యక్తి ఆదరణ కర్తగా ఫలానా అడ్రస్‌లో వస్తానని బైబిలులోనూ చెప్పలేదు. ముఖ్యముగా ఈ కారణము చేత కృష్ణుని భక్తులైన వారు ఏసును, ఏసు భక్తులైన వారు కృష్ణున్ని ఏమాత్రము నమ్మకున్నారు. కృష్ణున్ని, ఏసును వేరు వేరు వ్యక్తులుగా లెక్కించి కృష్ణున్ని క్రైస్తవులు, ఏసును హిందువులు అసూయతో దూషిస్తున్నారు. ఇరువురి రెండు మతాలను సృష్టించుకొని మతముల మబ్బులో ఒక మతమునకు మరొక మతము విరోధము అన్నట్లు ప్రవర్తించుచున్నారు. దీనికంతటికి కారణము కృష్ణ అను పేరుతో ఐదువేల నూట పదిహేడు (5117) సంవత్సరముల క్రితము వచ్చిన వ్యక్తియే, రెండువేల పదహారు (2016) క్రిందట ఏసుగా వచ్చాడని ఎవరూ గుర్తించలేక పోయారు. ఇపుడు నేను చెప్పు ఈ సమాచారము కొంతమంది క్రైస్తవులకు నచ్చక పోవచ్చును. అలాగే కొంతమంది హిందువులకు కూడ నా మీద కోపమును తెప్పించును. అయినా దేవుని విషయమును తెలిసి, సత్యమును మూసిపెట్టి బయటికి చెప్పకపోతే అది భయంకర పాపమగును. అందువలన ఎవరు ఏమనుకొనినా తప్పనిసరిగా చెప్పవలసి వచ్చినది.

**“సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యముకాదు”** అను సూత్రమును అనుసరించి చూస్తే, ఎందరు కాదు లేదు అనినా సత్యము జీవించియే ఉంటుంది. చివరకు ఎవరైనా సత్యమును ఒప్పుకోక తప్పదు.

కృష్ణుడు ఏసుగా వచ్చాడని చెప్పుట సత్యము, కనుక ఆ మాటను ఆలోచించి చూస్తే ఎవరికైనా సత్యముగా కనిపించును. కృష్ణుని జీవితము గడిచిపోయి 5117 సంవత్సరములైనది. అలాగే ఏసు జీవితము గడచిపోయి ఇప్పటికి 2016 సంవత్సరములైనది. ఇద్దరి జీవితములు గడచిపోయినవే కనుక గడచిన వారి చరిత్రను ఎవరూ కాదనలేరు. కృష్ణుడు పుట్టాడు, అలాగే ఏసు పుట్టాడు. ఎవరికైన జీవితములో జననము మరియు మరణములు రెండు ముఖ్యమైన ఘట్టములు. ఇపుడు ముఖ్య ఘట్టమైన కృష్ణుని పుట్టుకను, ఏసు పుట్టుకను గమనించి చూస్తాము. కృష్ణుడు పాతబడిన చెరసాలలో, అశుభ్రమైన చోట, తల్లి ప్రక్కన తండ్రి తప్ప ఎవరూలేని దీనస్థితిలో పుట్టాడు. ఏసు కూడ పాతబడిన పశువులశాలలో, అశుభ్రమైన చోట, తల్లి ప్రక్కన తండ్రి తప్ప ఎవరూ లేని ధీనస్థితిలో పుట్టాడు. జీవితము యొక్క ప్రారంభ ఘట్టములో జరిగిన విధానమును ఇటు హిందువులు, అటు క్రైస్తవులు యుక్తినుపయోగించి యోచిస్తే కృష్టుడు, ఏసు ఇద్దరు ఒక్కరే అనుటకు మొదటనే సాక్ష్యము దొరుకుచున్నది. తర్వాత చూస్తే కృష్ణుడు పుట్టడము ప్రమాద సమయము, అలాగే ఏసు పుట్టడము కూడ ప్రమాద సమయమే. కృష్ణుడు పుట్టాడని తెలియగానే అతనిని చంపుటకు ఆ దేశరాజు సిద్ధముగా ఉన్నాడు. అలాగే ఏసు పుట్టాడని తెలియగానే అతనిని చంపుటకు కూడ ఆ దేశరాజు సిద్ధముగా ఉన్నాడు. కృష్ణుడు పుట్టగానే కొద్దిసేపటికే పుట్టిన చోట లేకుండ తండ్రిగానున్న వసుదేవుడు ప్రక్క ప్రాంతమునకు తీసుకెళ్ళాడు. అలాగే ఏసు పుట్టిన కొద్దిసేపటికే ఆయన తండ్రిగానున్న యోసేపు, పుట్టిన చోట లేకుండ ప్రక్క ప్రాంతమునకు తీసుకెళ్ళాడు. కృష్ణుడుగానీ, ఏసుగానీ ఇద్దరూ రాత్రిపూటే పుట్టారు. రాత్రి పూట పుట్టినవారు ఆ రాత్రికే పుట్టిన స్థలములో లేకుండ పోయి అక్కడికి దూరముగా కొంతకాలము అజ్ఞాతముగా పెరిగారు. కృష్ణుడు ఏసు ఇద్దరు ఒకటేనని తెలియుటకు ఒకే పోలికగల

సంఘటనలు వారు పుట్టిన రోజు చోటు చేసుకొన్నాయి. కొంచెము తెలివిని ఉపయోగించి చూచినా, వారిరువురి జనన రహస్యము తెలిసిపోతుంది. వారు ఇద్దరు ఒక్కరుకాదు అనుటకు వీలులేకుండ, వారిరువురి పుట్టుకలు ఒకే విధముగా జరిగాయి.

తర్వాత కృష్ణునికి ముప్ఫయి సంవత్సరముల వయస్సులో అతని జీవితమందు చెప్పుకోదగిన మార్పువచ్చింది. అలాగే ఏసుకు కూడ ముప్ఫయి సంవత్సరముల వయస్సులో మార్పు కనిపిస్తున్నది. ముప్ఫయి సంవత్సరముల వయస్సులో కృష్ణుడు మధురను వదలి ద్వారకకు పోయాడు. అలాగే ఏసు కూడ తనకు ముప్ఫయి సంవత్సరముల వయస్సు రాగానే తల్లి తండ్రులను వదలి వెళ్ళిపోయాడు. చివరిలో ముఖ్య ఘట్టమైన మరణములో కృష్ణుడు గాయపడి రక్తము కారి చనిపోయాడు. అలాగే ఏసు కూడ గాయపడి రక్తముకారి చనిపోయాడు. కృష్ణుడు చనిపోవు సమయములో తనవారు ఎవరూ కృష్ణునివద్ద లేరు. అలాగే ఏసు చని పోవునపుడు కూడ ఆయనవద్ద తనవారు ఎవరూ లేరు. కృష్ణుడు మరణించునపుడు ఆయన త్రాగేదానికి నీళ్ళు కూడ అక్కడ లేవు. అలాగే ఏసుకు కూడ నీరు దొరకలేదు. కృష్ణుడు తన కాలికి బలముగా నాటుకొన్న బాణము వలన చనిపోయాడు. అలాగే ఏసు తన కాళ్ళకు బలముగా నాటుకొన్న సీల వలన చనిపోయాడు. ఈ విధముగా కృష్ణుని మరియు ఏసుని జనన మరణములు ఒకే స్థితిగా జరిగిపోయినవి. భూమిమీద ఆ విధముగ ఎవరికీ జరుగకుండ, కేవలము వీరిద్దరి విషయములలోనే అలా జరగడము, వీరిరువురు విశేషముగా ఇద్దరు ప్రవక్తలుగా ఉండడము వలన వీరి జనన మరణములను విశ్లేషించి చూడవలసి వచ్చినది. అలా చూస్తే వీరు ఇద్దరు ఒక్కరేనని తెలియనివారు కూడ తెలుసుకొనునట్లు అలా

జరిగిందని తెలియుచున్నది. కృష్ణుడు చనిపోతూ చెప్పిన మాట సత్యమని తెలియుటకు ఏసు జననము, మరణము రెండు కృష్ణుని జనన మరణములతో సరితూగునట్లు జరిగినవి. కనిపించని దానిని నమ్మము. కనిపించు దానినే నమ్ముతామను హేతువాదులకు, కనిపించనిది అసత్యము కనిపించునదే సత్యము అను నాస్తికవాదులు కూడ ఒప్పుకొనునట్లు కనిపించు సంఘటనలుగానే కృష్ణుని, ఏసుని జననమరణములు జరిగినవి.

భౌతికముగా కృష్ణుడు ఏసుగా పుట్టాడనీ, కృష్ణుడుగానీ ఏసుగానీ ఇద్దరు ఒక్కరేనని, ఆ ఒక్కరు దైవమునందలి శక్తియేనని, ఆ దైవశక్తియే, ఒక వ్యక్తియై, అదియే రెండు కాలములలో, రెండు ఆకారములలో, రెండు పేర్లతో చలామణి అయినదని తెలియుచున్నది. ఒకే దైవశక్తి ధర్మములను పూర్తిగా తెలియజేయుటకు, ధర్మములు అందరికి తెలియ చేయుటకు మొదట ఒక కృష్ణునిగా పుట్టి, తర్వాత రెండవసారి ఏసుగా పుట్టవలసి వచ్చినది. కనిపించు దానినే నమ్ము ప్రజలు, వేరు వేరుగా కనిపించు కృష్ణున్ని, ఏసును వేరు వేరుగానే భావించుకొనుచున్నారు. కృష్ణుడుగానీ, ఏసుగానీ చెప్పని మతములను మనుషులు ఏర్పరచుకొని, ఇది కృష్ణునిది, ఇది ఏసుది అంటున్నారు. అజ్ఞానుల దృష్టిలో కృష్ణుడు, ఏసు ఇద్దరు వేరు వేరు వ్యక్తులైనా, జ్ఞానుల దృష్ఠిలో ఇరువురు ఒకే శక్తిగానున్న వ్యక్తులని తెలియుచున్నది. నేటి కాలములో జ్ఞానుల సంఖ్య తగ్గిపోయి, అజ్ఞానుల సంఖ్య పెరిగి పోయినది. అజ్ఞానుల సంఖ్యను తగ్గించి, జ్ఞానుల సంఖ్యను పెంచుటకు ఎత్తిన ప్రారంభ అవతారమే శ్రీకృష్ణునిది. అలా ప్రారంభమైన అవతారము మూడు అవతారములతో ముగియును. ఇప్పటికి పరమాత్మ శక్తి మొదటి అవతారముగా కృష్ణుని రూపములో వచ్చి ధర్మములను తెలియ చెప్పినది. భూమిమీద మనుషులయందు అజ్ఞానమును తీసివేసి జ్ఞానమును కల్గించు

కార్యములో మొదటి భాగము ద్వాపరయుగమున జరిగినది. మూడు భాగములలో ఒక భాగము కృష్ణుని రూపములో నెరవేరినది. రెండవ భాగము కూడ ఏసు రూపములో నెరవేరినది. ఇప్పటికి రెండు భాగముల కార్యము పూర్తి అయినది. రెండు భాగముల యందు ధర్మములు చెప్పబడినవి. ఇప్పటికి ప్రత్యక్షముగా ధర్మ సంస్థాపన కార్యము రెండు భాగములుగా, రెండు దేశములలో, రెండు శరీరముల ద్వారా, రెండు పేర్లు కల్గిన వ్యక్తుల ద్వారా జరిగినప్పటికీ మేము జ్ఞానులము అనుకొను వారు ఎవరు కూడ ఇంత పెద్ద మహత్‌కార్యమును గుర్తించలేక పోయారు.

ఒక గీత మూడు భాగములున్నట్లు, త్రైతముతో కూడిన ధర్మములు, త్రి భాగములుగా, త్రి వ్యక్తులద్వారా బోధించబడును. బోధించువాడు ఒక్కడేనని, బోధించబడునవి ఒకే దేవుని ధర్మములని జ్ఞప్తికుంచుకోవాలి. దైవ ధర్మములను పూర్తిగా బోధించుటకు కొన్ని వేలసంవత్సరముల కాలము అవసరము. ఇప్పటికి మొదట కృష్ణుడు బోధించినప్పటినుండి దాదాపు ఐదువేల సంవత్సరములు గడచిపోయినవి. అట్లని ఐదువేల సంవత్సరముల పొడవునా ధర్మములు బోధించబడలేదు. ద్వాపరయుగ అంత్యములో కృష్ణుని ద్వారా కొన్ని నిమిషముల కాలము ధర్మములు బోధింపబడినవి. అది మొదటి భాగముకాగా, అప్పటినుండి మూడు వేల సంవత్సరముల తర్వాత ఏసు ద్వారా మూడు సంవత్సరముల కాలము ధర్మములు బోధింపబడినవి. ఏసు బోధించినది రెండవ భాగముకాగా, అప్పటినుండి ఇప్పటికి రెండు వేల సంవత్సరములు గడచినవి. మూడవ భాగములోని ధర్మబోధ కృష్ణుడు ఆదర్శకర్త ద్వారా బోధింపబడునని చెప్పగా, ఏసు ఆదరణకర్త ద్వారా బోధించ బడునని తెలియజేశాడు. ఆదరణకర్త గానీ, లేక ఆదర్శకర్త గానీ ఎప్పుడు ఎన్ని సంవత్సరములకు వస్తారో, ఏ దేశములో బోధిస్తారో ఎక్కడ చెప్పబడి

ఉండలేదు. ఎప్పటికైనా మూడవ బోధకుడు వస్తాడు, ఈ మారు పూర్తి ధర్మములను తెలియబరుస్తాడు. అలా మూడవ పురుషునితో ధర్మముల పునరుద్ధరణ, అధర్మముల అణచివేత కార్యము పూర్తి కానున్నది. మూడు కాలములలో, ముగ్గురు బోధకుల రూపములో చెప్పబడునవి ఒకే దేవుని ధర్మములని తెలియవలెను. మొదట కృష్ణుడు చెప్పినవి ఒక దేవుని ధర్మములు, తర్వాత ఏసు చెప్పినవి మరొక దేవుని ధర్మములు కానేకావు. ఇద్దరు చెప్పినవి తర్వాత రాబోవు మూడవవాడు చెప్పబోవునవి, అన్నియు ఒకే దేవుని ధర్మములని తెలియవలెను. కృష్ణుడు చెప్పినవి హిందూమత ధర్మములని, ఏసు చెప్పినది క్రైస్తవ మత ధర్మములని పొరపాటున కూడ అనుకోకూడదు. కృష్ణుడుగానీ, ఏసుగానీ మతధర్మములను బోధించలేదు. వారు ఇరువురు బోధించినవి ఒకే దేవుని ధర్మములు మాత్రమేనని జ్ఞాపకముంచుకోవాలి.

ధర్మముల పునరుద్ధరణ కార్యమును మొదలుపెట్టింది కృష్ణుడు. కృష్ణుడు చాలా తెలివైనవాడు. ముందుగానే తనయందున్న, తనకు తెలిసిన, తన ధర్మముల ప్రచార కార్యక్రమ పథకమును ఎవరికీ చెప్పక తనయందే నిగ్రహించి పెట్టుకొని, చివరకు చనిపోయే ముందు బోయవానికి చెప్పాడు. బోయవాడు ఆ విషయమును ఎవరికీ చెప్పడని కృష్ణునికి తెలుసు. బోయవానికి తప్ప ఎవరికి చెప్పినా, అది వెంటనే అందరికి తెలిసిపోయి, కొంత కాలమునకు బలహీనపడిన రహస్యమై, చివరకు తెలియకుండ పోవునని కృష్ణుని భావము. అందువలన జీవితకాలమంతయు తనయందే దాచుకొన్నాడు. ఎక్కడ కొడితే ఎక్కడ తగులుతుందో కృష్ణునికి బాగా తెలుసు. అందువలననే అడుగకున్నా అర్జునునకు గీతను చెప్పాడు. నీవు నాకు ప్రియుడవు, స్నేహితుడవు కావున నీకు చెప్పుచున్నానని అర్జునున్ని

ఉబ్బిపోవునట్లు చేశాడు. వాస్తవానికి కృష్ణునికి అర్జునుడు ప్రియుడేమి కాదు. కృష్ణునికి జరుగబోవు విషయములన్ని తెలుసు. ముందే తెలిసిన వాడు కనుక ఎవరితో ఎట్లు మాట్లాడాలో, ఎట్లు మాట్లాడితే జరుగబోవు పనికి సరిపోతుందో తెలిసి మాట్లాడేవాడు. కృష్ణునికి జరుగబోవు విషయములు తెలుసుననుటకు ఆధారముగా గీతలో విజ్ఞానయోగమందు 26వ శ్లోకమున ఇలా కలదు.

శ్లో॥ వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున ।
భవిష్యాణిచ భూతాని మాంతు వేద న కశ్చన ॥

**భావము :-** జగతిలో సర్వ జీవరాసులకు జరిగినది, జరుగుచున్నది, జరుగ బోవు విషయములు నాకు తెలుసు. అయితే నేను ఇటువంటి వానినని ఎవరికీ తెలియదు అన్నాడు.

కృష్ణుడే స్వయముగా పై శ్లోకమున నాకు మూడు కాలములు తెలియునన్నాడు. కానీ ఆయన అంతటి గొప్పవాడని, ఆయన సాక్షాత్తు దైవములోని అంశ అనీ, జరుగబోవు విషయములు ఆయనకు తెలియునని ఎవరికీ తెలియదు. జ్ఞానము మీద ఆసక్తి ఉన్నవారు ఎందరో భూమిమీద ఉండగా జ్ఞానము మీద ఆసక్తిలేని అర్జునునికి గీతను చెప్పాడు. అలా చెప్పాడంటే అన్నీ ముందే తెలిసిన కృష్ణుడు అలా చెప్పడమే మంచిదని తలచి చెప్పి వుంటాడు. అలాగే బోయవానికి కూడ చెప్పియున్నాడు. జరుగబోవు కాలములో ఏమి జరుగును అని కృష్ణునికి తెలియును. అందువలన అన్నిటిని ఆయన తెలిసే చేశాడని చెప్పవచ్చును. ఆ జన్మ అయిపోయిన తర్వాత మూడువేల సంవత్సరములకు తానే ఏసుగా వస్తానని కృష్ణునికి తెలుసు. ఆ రహస్యమును బోయవానికి చెప్పినా, అది బయటికి

పొక్కదని కూడ తెలుసు. తర్వాత చివరికి ఆ రహస్యము ఎవరికి తెలుస్తుందో కూడ ఆయనకు తెలుసు. ఐదువేల సంవత్సరములకు తన మాట క్రొత్తగా తెలిసినపుడు తెలిసినవారు గ్రంథరూపములోనికి ఈ విషయమును వ్రాస్తారని కూడ తెలుసు. కృష్ణుడు చెప్పిన రహస్యము ఏసు వచ్చి పోయిన తర్వాత తెలియడమే మంచిదని కృష్ణుడు అనుకొన్నాడు. కృష్ణుడు స్వయముగా ఏసుగా జన్మించి అక్కడ కూడ తాను ఎంతటివాడైనది, ఎవరైనది, ఎవరి అంచనాకు దొరకకుండా చేశాడు. అలా చేయుటకు కారణము ఏమనగా! కృష్ణ, ఏసు పాత్రలలో కేవలము దైవధర్మములను చెప్పిపోవడమే అక్కడి ఉద్దేశము. అక్కడ ఆయన ఎవరనునది తెలియుట అవసరము లేదు.

జరిగిపోయినవి, జరుగుచున్నవి, జరుగబోవునవి తెలిసిన కృష్ణుడు తాను ఎవరైనది కేవలము జ్ఞానులకు, యోగులకు మాత్రమే తెలియాలనీ, అజ్ఞానులకు ఏమాత్రము తెలియకూడదనుకొన్నాడు. అందువలన కృష్ణుడు ఎవరో, అజ్ఞానులైన వారికి ఎవరికీ తెలియకుండ పోయినది. కృష్ణుడు తన పథకమును జ్ఞానులకు, యోగులకు మాత్రము తెలియునట్లు చేశాడు. జ్ఞానులకు, యోగులకు ఏసుగా రాకముందే తెలిస్తే జ్ఞానుల వలన, యోగులవలన తన పనికి ఆటంకమేర్పడునని, తాను రచించుకొన్న పథకము ప్రకారము ఏసుగా తన జీవితము సాగదని తెలిసి, ఏసు పోయిన తర్వాత రెండువేల సంవత్సరములకు తన జన్మల రహస్యమును తెలియునట్లు చేశాడు. అలా చేయుట వలన కృష్ణునికి మూడవరాక, ఏసుకి రెండవ రాక అయిన ఆదరణకర్త విషయము జ్ఞానులకు, అజ్ఞానులకు తెలిసినా ఫరవాలేదనుకొన్నాడు. కృష్ణుని మొదటి రాకలో ఆయన గొప్ప ధనికుడుగా వచ్చాడు. ఆయనకు రెండవ రాకలో ఏసు చాలా బీదవాడు, కట్టుకొనే దానికి రెండవ వస్త్రము కూడాలేని వాడు. కృష్ణుడు బంగారు ఆభరణములు

ధరించి పట్టువస్త్రములు కట్టినవాడు, ఏసు జన్మలోనున్నపుడు నూలువస్త్రము కూడ సరిగాలేనివాడుగా కనిపించాడు. ఇక మూడవ అవతారములో ఎవరికి తెలియకుండునట్లు ధనికుడుకాక, బీదవాడుకాక మధ్య రకముగా ఉండునని తెలియుచున్నది.

భగవంతుడి మొదటి జన్మయందు కృష్ణుడు అర్జునునికి చెప్పిన భగవద్గీతలో తాను దేవుడనని ప్రకటించుకొనినా, విశ్వరూపమును చూపినా దానిని ఎవరూ నమ్మకుండునట్లు ప్రవర్తించాడు. రెండవ జన్మ అయిన ఏసుగా వచ్చినపుడు తాను దేవుడు పంపగా వచ్చిన దేవుని కుమారుడనని ఒక ప్రక్క చెప్పుచూనే, మరొక ప్రక్క తాను దేవుడు ఇద్దరము ఒక్కటేనను సత్యమును చెప్పాడు. మూడవ రాక అయిన ఏసు చెప్పిన ఆదరణకర్త తాను దేవుడనని కానీ, దేవుడు పంపగా వచ్చిన వాడననిగానీ ఏమాత్రము చెప్పకుండ సాధారణ వ్యక్తిగానే ప్రకటించుకొనును. సాధారణ వ్యక్తిగానున్న ఆదరణకర్తను కనుగొనుటకు వీలుకాదు. కానీ కృష్ణుడు ఆయన పేరును గురించి చెప్పాడు, మూడవ వాడు "ఆదర్శకర్త" అను పేరుతో చలామణి అగునని చెప్పుట వలన మూడవ అవతారమును గుర్తించుటకు అవకాశము గలదు. దైవ ధర్మములను తెలుపు సుధీర్ఘకార్యము మూడవ రాకతో అయిపోవును. మూడవ రాకతో దైవమార్గములో అంతవరకు తెలియని విధానమంతయు తెలియబడును. దైవధర్మములలో అతి చిన్న సూత్రములు కూడ తెలియబడును. అట్లు తెలియబడడమే కాక మూడవరూపములో వచ్చిన భగవంతుడు తన మొదటి జన్మ అయిన కృష్ణావతారముతో తెలిపిన ధర్మములను, రెండవ జన్మ అయిన ఏసు అవతారములో చెప్పిన వాక్యములను, తన మూడవ జన్మలో వివరించి చెప్పును. మూడవ జన్మతో దైవధర్మములను తెలుపు కార్యము ముగియుచున్నది. అంతవరకు ఏమి తెలియకుండినా తెలియ చెప్పవలసిన బాధ్యత మూడవ జన్మలోనే ఉన్నది.

ఐదువేల సంవత్సరముల పూర్వము భగవద్గీతను చెప్పినా, అది వ్యాసుని చేత సంస్కృతములో వ్రాయబడినా, వ్యాసుడు వ్రాసిన దానిని ఎందరో పండితులు, స్వాములు తమ తమ భాషలలోనికి మార్చి వివరించి వ్రాసినా, కృష్ణుడు మూడవ అవతారముగా వచ్చు వరకు దాని నిజార్థము ఎవరికీ తెలియదు. అంతవరకు అందరు చెప్పుకొన్నది కృష్ణుడు చెప్పిన భావము కాదు. ఎంత పెద్ద పేరుపొందిన స్వామీజీలు చెప్పినా, వ్రాసినా దేవుని ధర్మముల వాస్తవ భావములు దేవునికే తెలుసు మనుషులకు తెలియదు అను సూత్రము ప్రకారము భగవద్గీత సరిగా ఎవరికీ తెలియదనే చెప్పాలి. ఈ మాటతో స్వామీజీలందరు నాకు వ్యతిరేకులై పోతారని తెలుసు. అయినా సూత్రము ప్రకారము చెప్పుచున్నానని, ఎవరినీ కించపరుచుటకు కాదని గ్రహించవలెను. భగవద్గీత పుట్టి ఐదువేల సంవత్సరములైనా, అది మనకు అర్థము కాలేదని ఒప్పుకోక తప్పదు. భగవద్గీత అర్థము కావాలంటే తిరిగి కృష్ణుడే వచ్చి, ఆనాడు ఏ భావములో చెప్పాడో ఆ భావమును వివరించి చెప్పితే, అప్పుడు భగవద్గీత యొక్క భావము తెలియును. అందువలన కృష్ణుడు మూడవ అవతారములో, మూడవ పురుషునిగా వచ్చినపుడు గీతను సంపూర్ణముగా తెలియజెప్పును. కృష్ణుడు చెప్పిన మాటను కృష్ణుడే వివరించి చెప్పితే అప్పుడు అర్థమగును తప్ప వేరేవారు ఎవరు చెప్పినా చెప్పువారికి కూడ తెలియదనే చెప్పవచ్చును. కావున అది మనకు కూడ తెలియదు.

రెండవ అవతారమైన ఏసు జన్మలో తాను చెప్పినదంతా చెప్పి చివరిలో ఇలా అన్నాడు. **"ఇప్పుడు నేను చెప్పినది మీకు ఎవరికీ అర్థము కాదు. నా తర్వాత వచ్చు ఆదరణకర్త నేను చెప్పిన విషయములను తీసుకొని వివరించి చెప్పును. అప్పుడు మీకు నా మాటలు అర్థమవును"** అన్నాడు. కృష్ణుడు ఏసుగానున్నపుడు చెప్పిన ఈ మాటను బట్టి రెండు వేల

సంవత్సరముల నుండి ఏసు చెప్పిన మాటలు అర్థము కాలేదని తెలియుచున్నది. కృష్ణుని మూడవ అవతారములోనే ఏసు చెప్పిన మాటలు కూడ వివరించి చెప్పబడును. అప్పుడు ఏసు ఎవరో, ఆయన చెప్పిన మాటలు ఏమిటో, ఆయన మాటలకు భావము ఏమిటో తెలియును. అంతవరకు మేము బోధకులము అని ఏసు పేరును చెప్పుకొనుచు, ఆయన బోధలను వివరించినా, ఏసు చెప్పినట్లు ఆదరణకర్త చెప్పువరకు అర్థముకావు. ఏసు మాటప్రకారము ఆదరణకర్త ద్వారానే ఏసు చెప్పిన మాటల వివరము ఏమిటో తెలియును. కానీ అంతవరకు ఏ బోధకుడు చెప్పినా అర్థము కావు. అట్లు అర్థమైనాయంటే ఏసు మాట అసత్యమగును. ఏసు మాట ఎప్పటికీ అసత్యముకాదు. కావున మనకు ఇంతవరకు ఏసు చెప్పిన మాటలు ఎంత విలువైనవో అర్థము కాలేదని ఒప్పుకోవడము మంచిది.

ఏసు చెప్పిన మాటలేకాదు, కృష్ణుడు చెప్పిన గీత కూడ అర్థము కాలేదని ఒప్పుకోక తప్పదు. మనకు ద్వాపరయుగములోని గీత, కలియుగములోని ఏసు వాక్యములను వివరించి చెప్పుటకే మూడవ అవతారమున్నదని తెలియవలెను. మూడవ అవతారములో కృష్ణుడు, ఏసు కలిసివున్నారు. కావున కృష్ణుని మాటకు కృష్ణుడు, ఏసు మాటలకు ఏసు మూడవ పురుషుని నుండి వివరించి చెప్పగలరని అనుకోవచ్చును. మూడవ వాడు అలా గతములోని వాక్యములకు వివరమును చెప్పుచు, సందర్భాను సారము తాను చెప్పవలసిన దానిని కూడ చెప్పుచూ పోవును. ఒకవైపు గతములో తానే చెప్పిన గీతకు, వాక్యములకు సరియైన భావమును తెలియజేస్తూ మధ్య మధ్యలో అంతవరకు మిగిలిపోయిన ధర్మములను, సృష్ట్యాదినుండి తెలియని క్రొత్తగానున్న ధర్మముల వివరమును తెలియజేస్తూ పోవును. ఇక్కడ కొందరు ఒక ప్రశ్న అడుగవచ్చును. అది ఏమనగా!

మూడవ అవతారములో కృష్ణుడు, ఏసు కలిసి ఉన్నారు. గతములో కృష్ణుడు చెప్పిన మాటకు కృష్ణుడు, ఏసు చెప్పిన మాటలకు ఏసు మూడవ అవతారము నుండి చెప్పునన్నారు. ఒక మనిషిలో రెండు దయ్యాలు దూరుకొని వుండి మాట్లాడినట్లు మూడవ అవతారమైన మనిషిలో దయ్యాలవలె కృష్ణుడు, ఏసు ఇద్దరు ఉన్నారా? అని అడుగవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! మీకు సులభముగా అర్థమగుటకు మేము అలా చెప్పాము. కానీ మూడవ అవతారములో ప్రత్యేకించి కృష్ణుడు, ఏసు ఉండరు. ద్వాపర యుగములో ధర్మ ప్రచార నిమిత్తము దేవుని నుండి భగవంతునిగా ఏ శక్తి కేటాయించ బడిందో, ఆ శక్తియే రెండవమారు పుట్టింది. అప్పుడు గుర్తింపుకొరకు ఆ శరీరమునకు ఏసు అని పేరు పెట్టబడింది. పాలవాడు బ్రాహ్మణ వీధిలోనికి పోయి శంకరయ్య అను తన పేరును శంకరశాస్త్రి అని మార్చుకొని పాలను అక్కడ అమ్మినట్లు, కృష్ణుడే ఇజ్రాయేల్ దేశమున తన పేరును ఏసుగా చెప్పుకొని ధర్మములను తెలియజెప్పాడని గ్రహించవలెను. అలా పేరును మార్చుకొని చెప్పిన శక్తి అయిన కృష్ణుడే, మూడవ అవతారములో "ఆదర్శకర్త" అను పేరును పెట్టుకొని వస్తాడని ద్వాపరయుగములో చివరి సమయములో బోయవానికి చెప్పి పోవడము జరిగినది. ఏసుగానున్నపుడు "ఆదరణకర్త" వస్తాడని చెప్పిన కృష్ణుడు మొదట ద్వాపరయుగములో బోయవానికి చెప్పినపుడు వచ్చే మూడవ వాడు "ఆదర్శ కర్త" అను పేరు కల్గివుంటాడని చెప్పాడు. ఇక్కడ ఆదరణకర్త, ఆదర్శకర్త అను రెండు పేర్లు కనిపిస్తున్నవి. చెప్పినవాడు ఒకే శక్తి (ఒకే వ్యక్తి) అయినపుడు రెండు పేర్లు చెప్పడమేమిటి? ఏది నిజమని నమ్మాలి అని కొందరడుగవచ్చును. దానికి జవాబు ఏమనగా!

ఈ ప్రపంచమును, అందులోని జీవరాసులను సృష్ఠించిన దేవుడే సాక్షాత్తు భగవంతునిగా అవతరించినపుడు, తన మూడు అవతారములలో

ఒక దానిలో ఒక పేరును చెప్పి, రెండవ దానిలో మరొక పేరును చెప్పడ మేమిటి? అని నా బుద్ధికి కూడ మీకు వచ్చిన ప్రశ్నే వచ్చింది. మీకు బాగా అర్థమగుటకు శరీరములో ప్రశ్న ఎలా పుట్టుచున్నది. దానికి జవాబు ఎలా వస్తున్నదో, శరీరము లోపల జరుగు దానిని వివరిస్తూ చెప్పుకొందాము. నాలోని బుద్ధి రెండు పేర్లు ఎందుకు చెప్పాడని ఒక ప్రక్క ప్రశ్నించింది, అదే బుద్ధే దేవుడు నిజమే చెప్పుతాడు అబద్దము ఎందుకు చెప్పుతాడని మరొక ప్రక్క నుండి జవాబు చెప్పింది. నేను నా బుద్ధికి ప్రక్కన వుండి చూస్తున్నాను. నా బుద్ధి ఒక ప్రక్క ప్రశ్నవేసింది. మరొక ప్రక్క జవాబు చెప్పింది. తర్వాత వెంటనే బుద్ధి మరొక ప్రశ్నను ప్రశ్నించింది. నీవన్నట్లు దేవుడు నిజమే చెప్పితే ఏదో ఒక దానిని చెప్పవచ్చును కదా! బుద్ధియే ఇలా జవాబు చెప్పుచున్నది. అలా రెండు పేర్లు చెప్పుటకు కారణము ఉంటుంది. దానికి నా బుద్ధియే మళ్ళీ అడిగింది. ఆ కారణమేదో చెప్పు లేకపోతే భగవంతుడు చెప్పింది తప్పు అని ఒప్పుకో అన్నది. ఆ మాటకు భగవంతుడు తప్పు చెప్పునా ఎప్పటికీ చెప్పడు. అలా రెండు పేర్లు చెప్పడానికి కారణమును చెప్పుతాను విను అని బుద్ధి బుద్ధికే చెప్పింది. నేను గమనిస్తుండగా నా ప్రక్కనున్న బుద్ధి రెండు రకములుగా ప్రశ్న జవాబుగా మాట్లాడుకోవడము జరిగింది. నా ఒక్కనికే కాదు ప్రతి శరీరములోను బుద్ధి రెండు రకములుగా ప్రతి విషయమును విడదీయును. ప్రస్తుతానికి నా శరీరములో నేను చూస్తుండగా నా బుద్ధి భగవంతుడు రెండు పేర్లను ఎందుకు చెప్పాడో వివరిస్తుంది. దానినే బయటికి మీకు తెలియునట్లు వివరిస్తున్నాను చూడండి.

భూమి మీదున్న మనుషులలో మూడు రకములవారున్నారని చెప్పవచ్చును. ఒక రకము మనుషులు దేవుని మీద విశ్వాసము కలవారు,

రెండవ రకము వారు దేవుని మీద విశ్వాసములేనివారు. మూడవ వారు దేవుడను విషయమే తెలియక తటస్థముగా ఉండువారు. మూడవ రకము వారు త్రవ్వేది లేదు, పూడ్చేది లేదు అన్నట్లు దేవుని గురించి ఉన్నాడనిగానీ, లేడనిగానీ మాట్లాడరు. ఎవరైనా దేవుడున్నాడని చెప్పినా వింటారు. అంతేకాని తర్వాత ఆ మాటను పట్టించుకోరు. దేవుడు లేడని చెప్పే వారి మాటలను కూడ వింటారు. కానీ ఆ మాటలను కూడ పట్టించుకోరు. మేము అలాంటి వారిని చాలామందిని చూచాము. మంచి జ్ఞానముగల గ్రంథములను వారికి ఇచ్చాము. ఇస్తే తీసుకొంటారు కానీ వారు చదువరు. వారు చదవరని తెలిసి, మనమే జ్ఞానమును అర్థమయ్యేటట్లు వివరంగా చెప్పాలని చెప్పితే వింటారు. కానీ విన్నదానికి ఏమాత్రము స్పందన ఉండదు. అటువంటివారు ఎవరు చెప్పినా వింటారు. కానీ వారిలో మార్పు ఉండదు. అటువంటి మనుషులందరిని ఒక రకముగా చెప్పవచ్చును. అటువంటి వారు భూమిమీద ఎక్కువ శాతము మంది ఉన్నారు. వారి దారిలో వారు పోవడము తప్ప వారు ఎవరి దారికీ రారు. మిగత మనుషులలో కొందరు దేవుని మీద విశ్వాసము గలవారు గలరు. అయితే వారికి దేవుని మీద విశ్వాసము ఉండినా, అందరు ఒకే దారిలో పోకుండ అనేకరకములుగా వారు దేవున్ని ఆరాధిస్తున్నారు. వారిలో కొందరిది మంచి మార్గముకావచ్చు, కొందరిది అంత మంచి మార్గము కాకపోవచ్చు. ఇట్లు విశ్వాసుల రకమే కాకుండ అవిశ్వాసము గలవారు కూడ భూమిమీద కొందరున్నారు. వారే పూర్తి నాస్తికులు, అటువంటి వారు పూర్తిగా దేవుడే లేడనుచుందురు.

స్థూలమైన ప్రపంచ చదువులు చదివిన కొందరు, తమకు కొద్ది మాత్రము విజ్ఞానము తెలిసినంత మాత్రమున, విజ్ఞానమంతా తెలిసి

పోయిందను భ్రమలో మునిగిపోయి, చివరకు దేవుడే లేడనుచుందురు. దేవుడు అనుమాట కేవలము కొందరి భ్రమయేనని చెప్పుచుందురు. అన్నీ తామే చేసుకొంటున్నామని, మనము కనుగొన్న యంత్రముల చేత పరికరముల చేత మనము సుఖములను అనుభవిస్తున్నామని చెప్పు కొంటున్నారు. మన మేథస్సు చేత ఎన్నో కనుగొన్నాము, తర్వాత ఎన్నో కనుగొంటాము అని చెప్పచూ, ఈ దినము సెల్‌ఫోన్‌లో మాట్లాడుచున్నా మన్నా, కంప్యూటర్ల చేత పనిని చేయిస్తున్నామనినా, విమానములో క్షణాలలో గమ్యమును చేరుచున్నామనినా ఇదంతయు మనిషి కనుగొన్న సైన్సు వలన జరుగుచున్నది. సైన్సును తెలియని మనుషులు తమను తాము నమ్మక దేవున్ని మూఢముగా నమ్ముచున్నారని చెప్పుచు, దేవున్ని నమ్మువారిని తెలివి తక్కువ వారిగా భావించుచుందురు. దేవున్ని అసూయతో మాట్లాడు చుందురు. ఇటువంటి వారిని గురించి ఒక ఉదాహరణను చెప్పుకొందాము. ఒకడు తన తమ్మునికి నీతిని చెప్పుచు నేను వేరొకరి మీద ఆధారపడి బ్రతకడము లేదు, నా కాళ్ళమీద నేను నిలబడి బ్రతుకుచున్నావు. నీవు అలాగే నీ కాళ్ళ మీద నిలబడు అన్నాడట. ఆ మాటను విన్న వాని తమ్ముడు నీవు నీ కాళ్ళ మీద నిలబడలేదు, నేను నా కాళ్ళ మీద నిలబడలేను. ఇద్దరము కలిసి భూమిమీద నిలబడినామని అన్నాడట. తమ్ముడు తెలివి తక్కువవాడని అన్న తమ్మునికి తెలివిగా నీతిని చెప్పాడు. కానీ తమ్ముడు అడిగిన మాటను బట్టి అన్నయే తెలివితక్కువవాడని తెలియుచున్నది. నా కాళ్ళ మీద నేను నిలబడినాననుకోవడము కేవలము భ్రమ మాత్రమే. అట్లు అనుకొనువాడు తాము ముందునుండి భూమిమీద నిలబడినానను మాటను మరచి పోయాడు. దీని ప్రకారము విజ్ఞానము తెలిసినవాడు తమ విజ్ఞానమునకు ఆధారమైన మెదడును దేవుడే ఇచ్చాడని, దేవుడిచ్చిన మెదడు

లేకుండ ఎవడు విజ్ఞానికాడని, శరీరములోని మెదడే సమస్త విజ్ఞానములకు ఆధారమని తెలియక, నేను విజ్ఞానినని అనుకోవడము నేలను విడిచి సాము చేసినట్లగును. అలాగే భూమిమీద నిలబడిన విషయమును మరచిపోయి నా కాళ్ళ మీద నేను నిలబడినాను అన్నట్లుంటుంది.

సమస్త జ్ఞానమునకు, విజ్ఞానమునకు దేవుడే ఆధారమని తెలియక, మేము విజ్ఞానులమనుకొను వారి మెదడులోని ఆలోచనలను, ఊహలను దేవుడే అందిస్తుండగా, ఏ శాస్త్రజ్ఞుడు ఏది కనిపెట్టినా అతనికి ఆ ఊహను అందించిన వాడు శరీరములోని దేవుడే అయివుండగా, అది తెలియక నేనే కనుగొన్నాననుకోవడము, భూమిని వదలి తన కాళ్ళమీద తాను నిలబడినా నని చెప్పినట్లుంటుంది. అటువంటి వాడు తమ మేథస్సుకు తామే కారకులమను అహముతో నిండినవాడై, తమ శరీరములోని దేవున్ని కూడ నిందించుచున్నారు. నాకు తెలియకుండ నాలో ఎవడున్నాడని ప్రశ్నించు చుందురు. అటువంటి వారిని గురించి కృష్ణుడు భగవద్గీతలో దైవాసుర సంపద్విభాగ యోగము అను అధ్యాయమున 18వ శ్లోకమందు ఇలా అన్నాడు.

18 శ్లో॥ అహంకారం బలం దర్పం కామం క్రోధంచ సంశ్రితాః ।
మా మాత్మ పరదేహేషు ప్రద్విషన్తో భ్య సూయకాః ॥

**భావము :–** "అటువంటి వారిలో అహంకారము పూర్తిగ ఉండగా కామము, క్రోధము, గర్వము బలముగా పనిచేయగా, తమ శరీరములలోను మరియు ఇతరుల శరీరములలోను ఉన్నటువంటి నన్ను అసూయతో ద్వేషించు చున్నారు." అని కృష్ణుడు చెప్పాడు. అటువంటి వారిని తాను ఏమి చేయునో కూడ ప్రక్క శ్లోకములలో చెప్పాడు.

19 శ్లో॥ తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।,
క్షిపా మ్యజస్ర మశుభా నాసురీ ష్వేవ యోనిషు ॥

20 శ్లో॥ ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని ।,
మా మప్రా ప్యైవ కౌన్తేయ! తతోయాన్త్యధమాం గతిమ్ ॥.

**భావము :** "క్రూరులు, ద్వేషులు, శుభమును దూషించు ఆ నరాధములను అసుర యోనులయందే త్రోసి, సంసార దుఃఖగతులను పొందునట్లు చేయుదును. అట్లు అసుర యోనులందు జన్మించినవారు జన్మ జన్మకు అజ్ఞానులగుచు, నన్ను పొందు జ్ఞానము యొక్క విధానమే తెలియలేరు. అటువంటివారు జన్మ జన్మకు అధమగతిని పొందుచుందురు. వారికి నా జ్ఞానము యొక్క గట్టే దొరకదు" అని కృష్ణుడు నాస్తికవాదులను గురించి ముందే చెప్పాడు.

దేవుని మీద ఎటువంటి నమ్మకము లేకుండ దేవున్ని దూషించు వారు, దేవుని స్థాయిని కించపరుస్తూ మాట్లాడువారు, అన్ని పనులకు తమ తెలివి తప్ప దేవుని ప్రమేయము లేదనువారు, విజ్ఞానము (సైన్సు)ను అడ్డము పెట్టుకొని సైన్సుకు ఆధారమైన దేవున్ని లేడనువారు ఎవరయితే ఉన్నారో, అటువంటి వారు ఎప్పుడైనా దేవుని జ్ఞానమేమిటో చూడాలనుకొనినా, వారికి తన జ్ఞానము యొక్క గట్టు దొరకకుండా చేస్తానని దేవుడే చెప్పాడు. నేటికాలములో దైవజ్ఞానము ఎన్నో గ్రంథరూపములలో మరియు దృశ్య రూపములైన డి.వి.డిలలోను దొరుకుచున్నది. అటువంటపుడు జ్ఞానమును తెలుసుకొనుటకు గురువు దగ్గరకు పోనవసరములేదు. దేవుడు నా జ్ఞానము మీకు దొరకదు అనినా, అది బజారులో డబ్బు పెట్టితే గ్రంథరూపములలో, దృశ్యరూపములలో దొరుకుచున్నది కదా! అని కొందరు తెలివైనవారు అనుకొనుచున్నారు. మేము గురువు దగ్గరకు పోకున్నా ఆయన జ్ఞానము

మా ఇంటికే వస్తావుంది, మాకు జ్ఞానము తెలుస్తావుంది అనుకొను వారు కలరు. దేవుని మీద విశ్వాసము లేనివారికి, జ్ఞానము మీద శ్రద్ధ కలిగినా, గురువు మీద విశ్వాసము లేనివారికి గురువు యొక్క జ్ఞానము మీద శ్రద్ధ కలిగినా, ఆ జ్ఞానము గ్రంథరూపములలో దొరికినా గ్రంథములోని జ్ఞానము తలలోనికి ఎక్కదు. అది ఎందుకు ఎక్కదు అనగా! తెలియబడే జ్ఞానములో అనేక సంశయములు ఏర్పడి జ్ఞానము అర్థము కాకుండాపోవును. ఒకవేళ అర్థమైనా, దాని అనుభవము లేక ఆచరణ వారిలో లేకుండ పోవును. ఇట్లు రెండు రకములుగా జ్ఞానము వానికి అంటకుండ పోవుచున్నది.

ఇపుడు అసలు విషయానికి వస్తాము. పరమాత్మ శక్తి భగవంతునిగా భూమిమీదికి వచ్చినపుడు దాని కార్యము పూర్తి అగుటకు మూడుమార్లు భగవంతుడు అవతరించాలనుకొన్నాము. మొదటి అవతారముగా వచ్చిన వాడు కృష్ణుడు. రెండవ అవతారముగా వచ్చినవాడు ఏసు, తర్వాత మూడవ అవతారము వస్తుందని మొదటి అవతార కృష్ణుడు చెప్పాడు. కృష్ణుడు మూడవ అవతారమును గురించి “ఆదర్శకర్త” అను పేరును చెప్పాడు. ఏసు రెండవ అవతారమును గురించి “ఆదరణకర్త” వస్తాడని చెప్పాడు. ఈ విధముగా కృష్ణుడు, ఏసు రెండు వేరు వేరు పేర్లను చెప్పడము వలన కృష్ణుడు, ఏసు ఇద్దరు ఒకటికాదు అని తెలిసిపోవును. ఇద్దరు ఒకటైతే మూడవ అవతారమును గురించి వేరు వేరు పేర్లను ఎందుకు చెప్పుదురను ప్రశ్నవచ్చును. ప్రత్యక్షముగ ఏసు, కృష్ణుడు వచ్చే వ్యక్తి పేరును వేరువేరుగా చెప్పుట వలన, చెప్పిన వీరు ఇరువురు ఒకటికాదని నిరూపణగా తెలిసిపోవు చున్నది. అలా కృష్ణుడు, ఏసు వేరు వేరని ఆధారముతో తెలియడము వలన అజ్ఞాన ద్వారము తెరుచుకొన్నట్లే, జ్ఞాన ద్వారము మూసుకొన్నట్లే అగుచున్నది. దీనినిబట్టి అవిశ్వాసులకు, నన్ను దూషించు అసూయపరులకు

నా జ్ఞానము లభించదు అనుమాట ఇక్కడ జ్ఞాపకము వస్తున్నది. దేవుని మీద అసూయ కల్గి జ్ఞానము మీద ప్రేమకల్గినంత మాత్రమున వారికి జ్ఞానము లభించదు అను వాక్యము ఇటువంటి చోట నెరవేరుతుందని అర్థమగుచున్నది. వాస్తవముగ కృష్ణుడు, ఏసు ఇద్దరు ఒకటేనని చెప్పుకొంటూ, మనము ఎన్నో ఆధారములను చూపుకొంటూ వచ్చాము. ఇక్కడికి వచ్చిన తర్వాత ఇటు కృష్ణుడు, అటు ఏసు అదే పనిగా ఇద్దరూ రాబోవు వానిని గురించి వేరువేరు పేర్లను చెప్పారు. ఇక్కడ అలా చెప్పవలసిన పని ఏమొచ్చింది అని యోచిస్తే, అవిశ్వాసులకు తమ జ్ఞానము దొరకకూడదని, వారికి వీరి మీద అనుమానము వచ్చి వారు ఇద్దరు ఒకటికాదని నిర్ణయించుకొనుటకు అలా పేర్లను ముందుగా చెప్పారని తెలియుచున్నది. కృష్ణుడు మేథావి అగుట వలన, తనకు ఇష్టము లేనివారిని దూరము చేయుటకు అల్లిన పథకమే మూడవవాని పేరును రెండు రకములుగా చెప్పడమని అర్థమగుచున్నది. ఈ పేర్లు అజ్ఞానులకు, అవిశ్వాసులకు తప్ప జ్ఞానులకు, విశ్వాసులకు అవసరములేదు.

మూడవ అవతారముగా రాబోవు వాడు ఆదర్శకర్త అయినా, ఆదరణ కర్త అయినా సృష్ఠికర్తలోని భాగమే అగును. ఆదరణకర్త, ఆదర్శకర్త అను పేర్లు అజ్ఞానుల కొరకు కృష్ణుడు, ఏసు తెలివిగా చెప్పారు. అజ్ఞానులకు అనుమానము వచ్చుటకు, ఆ అనుమానము పెనుభూతమై జ్ఞానమార్గము నకు ఆటంకమేర్పరుచుటకు ఉద్దేశపూర్వకముగ కృష్ణుడు, ఏసు రెండు పేర్లను చెప్పారు. ఆ పేర్లు అజ్ఞానుల మీద ప్రభావము చూపును, జ్ఞానులు ఆ పేర్ల మాయలో చిక్కుకోకుండ ఒక నిర్ణయానికి వస్తారు. కృష్ణుడు, ఏసు చెప్పిన రెండు పేర్లను ఏక పేరుగా మార్చుకొంటారు. అదెలా అనగా! కృష్ణుడు చెప్పిన "ఆదర్శకర్త" లోనూ, ఏసు చెప్పిన "ఆదరణకర్త" లోనూ

సమానముగానున్న అక్షరములు, సమానముగా లేని అక్షరములు గలవు. రెండిటిలోను సమానముగానున్న అక్షరములు ఆ...కర్త, రెండిటియందు సమానముగా లేనివి దర్శ, దరణ. రెండు పేర్లలోను సమానముగా లేని అక్షరములను తొలగించి చూస్తే రెండిటియందు "ఆకర్త" మాత్రము మిగులును. దీనిప్రకారము జ్ఞానులైనవారు మూడవ అవతారములో వచ్చువానిని "ఆకర్త" అను పేరుతో చెప్పుకుంటే సరిపోతుంది. ఆకర్త అను పదము కృష్ణుడు చెప్పిన దానికి, ఏసు చెప్పిన దానికి సరిపోవును. రెండు పేర్లను వడపోస్తే వచ్చినది "ఆకర్త" ఇక ఆయనవస్తే ఎట్లుంటుందో!

మూడవ అవతారము కృష్ణుని లెక్కలో "ఆదర్శకర్త", ఏసు లెక్కలో "ఆదరణకర్త" ఇప్పటినుండి మా లెక్కలో "ఆకర్త". కృష్ణుడు, ఏసు ఇద్దరు చెప్పిన రెండు పేర్లలోను దర్శ, దరణ అను శబ్దములను తీసివేస్తే మిగిలినది ఆకర్త. కావున ఆకర్త అను పేరు ఇద్దరు చెప్పిన దానికి సంబంధించినదేనని అనుకోవలెను. భగవంతుని మూడవరాకలో ఒకమారు దైవ ధర్మముల ప్రచార కార్యము పూర్తి అగును. దీనినిబట్టి

**"దేవుడు మూడు ఆత్మలుగా (జీవాత్మ, ఆత్మ, పరమాత్మలుగా) ఉన్నాడు." అని తెలియుచున్నది.**

**"భగవంతుడు మూడు (కృష్ణ, ఏసు, ఆకర్త) అవతారములుగా ఉన్నాడు." అని తెలియుచున్నది.**

**"మనిషి మూడు మాయలు (తామస,రాజస,సత్వగుణములు)గా ఉన్నాడు." అని తెలియు చున్నది.**

మూడు మాయలలో చిక్కుకొన్న మనిషికి దైవ ధర్మములను తెలుపుటకు, మూడు అవతారములుగా భగవంతుడు వచ్చి, మూడు ఆత్మల త్రైతమును (భగవద్గీత పురుషోత్తమ ప్రాప్తి యోగమున 16,17 శ్లోకముల భావమును) తెలుపుచున్నాడు. అందువలన భగవంతున్ని ఒక అవతారము

నకు పరిమితి చేయకూడదు. రెండు, మూడు వేల సంవత్సరముల తేడాతో ఆయన మూడు అవతారములు అయిపోవును. ఆ లెక్క ప్రకారము ఐదు ఆరు వేల సంవత్సరములలోనే భగవంతుని మూడు రాకలు ఒకమారు అయిపోవును. అలా ఒకమారు మూడు రూపములతో వచ్చిన భగవంతుడు ప్రతిష్ఠించిన ధర్మములు దాదాపు పది యుగముల కాలమునకు తిరిగి అధర్మములుగా మారవచ్చును. అప్పటికి తిరిగి భగవంతుని అవసరము ఏర్పడవచ్చును. ప్రస్థుతము ధర్మప్రతిష్ఠాపన కార్యక్రమములో భగవంతుని రెండు అవతారములు వేరువేరు దేశములలో, వేరువేరు పేర్లతో, వేరువేరు మతములయందు వచ్చి పోయినవి. ఇక మిగిలినది కృష్ణుడు చెప్పిన ఆదర్శకర్త, ఏసు చెప్పిన ఆదరణకర్త, మేము చెప్పిన ఆకర్త యొక్క అవతారము. మూడవ అవతారము ముఖ్యమైనదిగా ఉంటుంది. ఎందుకనగా! కృష్ణుడు గీత రూపములో చెప్పిన జ్ఞానము గానీ, ఏసు వాక్యము రూపములో చెప్పిన జ్ఞానముగానీ ఇంతవరకు ఎవరికీ అర్థము కాలేదు. అర్థము కాలేదు అని చెప్పుటకు ఆధారము ఆ రెండు జ్ఞానములు రెండు మతములుగా మారిపోయినవి. మతము ఎప్పటికీ దేవున్ని తెలుపలేదు. దేవుడు చెప్పిన జ్ఞానము, మతము నీడలో ఎప్పటికీ అర్థము కాదు. అందువలన మతాభిమానులు ఎప్పటికీ జ్ఞానాభిమానులు కాలేరు అను సూత్రము ప్రకారము, ఏ మతములోనైనా మతమును గురించి గొప్పగా చెప్పుకొను వాడుకానీ, మతవ్యాప్తి చేయాలనుకొను వాడుగానీ, దేవుని జ్ఞానమును తెలియలేడు.

భగవంతుడు రెండుమార్లు భూమిమీదకు వచ్చి దైవధర్మములను రెండు దేశములలో తెలిపిపోయినా, ఇప్పటికీ కూడ వాటి సారాంశము తెలియబడలేదు. మతముల ప్రభావము ఎక్కువగావున్న ఈ కాలములో,

దైవముకంటే ధనమునే ఎక్కువ విలువగా చూచు ఈ కాలములో, భగవంతుని మూడవ రాక రావలసియున్నది. భగవంతుని మూడవ రాకలో భగవంతుడు ఎక్కువ మతఛాందస్సులతో ఇబ్బందులు పడవలసి వస్తుంది. అంతేకాక ఇంతవరకు మిగిలిపోయిన ధర్మములను కూడ తెలుపవలసియున్నది. ఒక ప్రక్క మాయా ప్రభావముతో బాగా ప్రచారమైన, కొన్ని లక్షలమంది అభిమానమును పొందిన గురువుల మధ్యలో, వారికి వ్యతిరేకమైన ధర్మము లను వివరించవలసియున్నది. "ఆకర్త" తెలుపు ధర్మములు ఇటు నాస్తికులకు కానీ, అటు ఆస్తికులకుకానీ మ్రింగుడుపడవు. మూడవ అవతారమైన ఆకర్త యొక్క బోధలు కొందరికి అర్థముకానివై, ఈయన దేవుడున్నాడని ఆస్తికత్వమును బోధిస్తున్నాడా? లేక దేవుడు లేడని నాస్తికత్వమును బోధిస్తున్నాడా? అని అనుకొందురు. మరికొందరు మూడవ రూపములో భగవంతుడు చెప్పు బోధలను అందుకోలేక అవగాహనలోపముతో, ఈయన పరమతమును బోధిస్తున్నాడా? లేక స్వమతమును బోధిస్తున్నాడా? అని అర్థము కాని స్థితిలో ఆయనను గురించి చర్చించుకొందురు. బయటి గురువులను పోల్చిచూచితే వారివద్ద లక్షలమంది చేరి గొప్పగ కనిపిస్తుంటే, వారికంటే అన్నివిధముల తక్కువగా కనిపించి, జ్ఞానములో గురువుల అందరి కంటే గొప్పగ కనిపించును. దేశములోని గురువులు, గురు శిష్యులు ఏదో ఒక సాధన చేసి మోక్షమును పొందాలని ప్రయత్నము చేయుచుండగా, ఆకర్త మాత్రము దేవుని జ్ఞానమును తెలుసుకొనుటకంటే ధ్యానము చేయుట వృథాపని అని బోధించును. భూమిమీద గురువులు వారివారి మత సాంప్రదాయములను వారు అనుసరిస్తూ, వారి శిష్యులను అనుసరించునట్లు చేయుచుండగా, ఆకర్త మాత్రము అన్ని మతములవారిని ఒకే దేవుని జ్ఞానము క్రిందికి తెచ్చి, నాది ఫలానా మతము అని చెప్పకుండ, అందరిది ఒకే

మతమన్నట్లు చేయును. అన్ని మతముల వారు ఆకర్త వద్ద ఏకమతముగా ప్రవర్తించుదురు. ఒకే జ్ఞానము, ఒకే దేవుడు అను సూత్రమునకు కట్టుబడి యుందురు.

సృష్ఠి మొదటి కాలములో మనుషులయందు మతము అనునది లేదు. తర్వాత కాలములో మాయ ప్రభావము వలన మనిషి మేధస్సులో మతము అనునది ముఖ్య స్థానమును ఆక్రమించినది. ఆకర్త దృష్ఠిలో మనిషిని దేవుని మార్గమునుండి తప్పించునది మతమని, మొదట తన జ్ఞానము ప్రారంభించడములో మతమును నిర్మూలించడమే ధ్యేయముగా పెట్టుకొనును. మతము లేని మనిషిగా ఎవడు మారగలడో వాడు నావాడని ఆకర్త చెప్పును. ఇక్కడ మీకు ఒక ప్రశ్న రాగలదు. అదేమనగా! రాబోవు భగవంతుని మూడవ అవతారము పేరు "ఆకర్త" లేక "ఆదర్శకర్త" లేక "ఆదరణకర్త" అని చెప్పుకొన్నాము. ఆకర్త రాబోతాడని మీరే చెప్పారు. ఆకర్త వచ్చిన తర్వాత మిగిలిన ధర్మములను బోధించును, ముందు బోధించిన ధర్మములను వివరించును అన్నారు. ఇప్పుడేమో ఆయన రాక ముందే ఆయన ఈ విధముగా తన బోధలను చెప్పునని, ఈ విధముగా మతముల నుండి మనిషి దృష్ఠిని దేవునివైపు మరల్చునని, మతములేని మనుషులను తయారు చేయునని చెప్పుచున్నారు. ఈ విషయములన్నిటిని ఆకర్త మీకు నిద్రయందు కలలో చెప్పాడా? మెలుకువయందు చెవిలో చెప్పాడా? అని ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! నాకు ఆకర్త చెవిలో చెప్పలేదు, కలలో చెప్పలేదు. ఆకర్తగా రాబోవు కృష్ణుడు ఆకర్తను గురించి బోయవానికి కొన్ని విషయములను చెప్పిపోయాడు. ఆ విషయములనే బోయవాని ఆత్మ నాకు చెప్పగా, నేను మీకు చెప్పుచున్నాను తప్ప స్వయముగా నేను చెప్పలేదు. ఈ నా మాటలను వినిన తర్వాత కూడ

బుద్ధిలో చురుకుదనము కలవారు, పెద్దగా మెదడును ఉపయోగించువారు కొందరు ఇంకొక విధముగ కూడ అడుగవచ్చును. అదేమనగా! భారత, భాగవతములలో కూడ చెప్పని బోయవాని పాత్రను నీవే కల్పించి, కృష్ణుడు బోయవానికి చెప్పాడని, బోయవాని ఆత్మ నాకు చెప్పిందని నమ్మించి మీస్వంత భావములను మాకు చెప్పుచున్నారు తప్ప కృష్ణుడు బోయవానికి చెప్పలేదు, బోయవాడు నీకు చెప్పలేదు అని నన్ను నిలదీసి అడుగవచ్చును. దానికి నా జవాబు ఏమనగా!

పూర్వము పెద్దలు, ఒక సామెతను చెప్పేవారు, **"కడుపు చించు కొనినా గారడివిద్య అనే వారుంటారు."** అని పెద్దలు చెప్పిన సమత (సామెత) నాకు ఇక్కడ జ్ఞాపకము వచ్చింది. అంతేకాక **"అతి తెలివి దురిత లక్షణము"** అని కూడ పెద్దలనెడివారు. ఏ దానికైనా ఒక పరిమితి ఉంటే బాగుంటుంది. అందువలన గీతలో కృష్ణుడు కూడా మితమైన నిద్ర, మితమైన ఆహారము, మితమైన పని అని అన్నాడు. మితమైన పని అనగా శరీరముతో చేసేది కాదు. బుద్ధితో చేసే పనిని కూడ లెక్కించుకోవాలి. అందువలన పెద్దలు అతి తెలివి దురిత లక్షణము అన్నారు. ఒక పరిమితి లేకుండా అతిగా యోచిస్తే అది చెడుకు దారితీస్తుంది. ఎంతో వివరముగా శాస్త్రబద్ధముగా చెప్పుచున్నప్పటికీ చెప్పిన దానిని గురించి ఇందులో మంచివుందా, చెడువుందా అని తెలుసుకోక, నాకు తెలివివుంది అని ప్రశ్నించడము చెడుకు దారితీస్తుంది తప్ప మంచికి దారితీయదు. వాలి వాలము (తోక) దగ్గర పుట్టాడు అని రామాయణములో వ్రాస్తే ప్రశ్నించని వారు, ద్రోణుడు దొన్నెయందు (కుండయందు) పుట్టాడు అని భారతములో చెప్పితే విని ప్రశ్నించనివారు, హనుమంతుడు పర్వతమును ఎత్తుకొని వచ్చాడని వ్రాస్తే అడ్డముగా నమ్మేవారు, భీముడు గాలికి పుట్టాడు, కర్ణుడు చెవిలో పుట్టాడు

అంటే వినేవారు  అక్కడ ప్రశ్నించకుండ, ఆ మాటలు శాస్త్రబద్ధత కాదని తెలిసినా ఊరకుండి, ఇక్కడ నేను చెప్పిన మాటలు అశాస్త్రీయము కాకున్నా ప్రశ్నించడము మంచిదా అని అడుగుచున్నాను.  ఇటువంటి సందర్భములోనే పెద్దలు "కడుపు చించుకొనినా గారడివిద్య అనువారుంటారు." అని అన్నారు.

గారడివిద్యలో మనిషిని అడ్డముగా సగభాగానికీ రంపముతో కోసి రెండు ముక్కలుగా విడదీసి చూపుతారు. అలా చూపినపుడు మనిషి నడుము భాగమునుండి విడిపోయి రెండు భాగములుగా కనిపించును.  కానీ అక్కడ రక్తము కారదు.  రక్తము కారలేదంటే మనిషి రెండు ముక్కలుగా తెగి పోయాడు అన్నది అసత్యము.  మనకు తెలియని పద్ధతిని ఉపయోగించి అసత్యమును సత్యముగా చూపుచున్నారు.  అయినా అది అసత్యమని చెప్పుటకు అక్కడ రక్తము కారలేదు.  అది నిజము కాదని, అలా చూపడము గారడివిద్య యొక్క పనితనమని మనందరికి తెలుసు.  మనిషిని రెండు ముక్కలుగా చేయడము స్టేజి (వేదిక) మీద గారడివిద్య కావచ్చును.  అదే నడి బజారులో ఒకరు ఇంకొకరిని కత్తితో రెండు ముక్కలు చేస్తే అక్కడ రక్తము కారిపోతుంది.  ముక్కలైన వాడు చనిపోతాడు.  అప్పుడు అది గారడివిద్య కాదు, జరిగినది సత్యమని తెలియుచున్నది. అలా జరిగిన దానిని గారడివిద్య  అని ఎందుకు అనలేదనగా,  ముక్కలైనవాడు చనిపోయాడు.  వానినుండి రక్తము కారిపోవడము వలన వాడు చనిపోయాడు.  చంపినవానిని హంతకుడు అంటాము.  జరిగిన దానిని హత్య అంటాము.  అప్పుడు చంపినవాడు గారడివాడు కాదు, జరిగినది గారడివిద్య కాదు.  ఇన్ని విపులముగా తెలిసినపుడు, దాని ప్రకారమే శాస్త్రబద్ధముగానున్న విషయములను మేము చెప్పినపుడు, మా మాటలు సత్యమా, అసత్యమా అని ఎందుకు తెలియలేదని ప్రశ్నించుచున్నాను. కొన్ని

ఆధారములతో యోచిస్తే ఏది నిజమో, ఏది నిజము కాదో మీకే అర్థమవుతుంది. ఎదురుగా కనిపిస్తున్నా త్రొంగి చూడడము, నిక్కి చూడడము, ఎగిరి చూడడమునకు అర్థమే లేదు.

ఈ ఆధ్యాయము మొదటిలో కృష్ణుని మరణము లోకానికి కనువిప్పు అని మొదలుపెట్టి చెప్పాము. నరకాసురుడు చనిపోతే ప్రజలకు సంతోషమైనది. కానీ ఇక్కడ కృష్ణుడు చనిపోతే లోకానికి కనువిప్పు అని మేము చెప్పలేదు. కృష్ణుని మరణము లోకానికి కనువిప్పా? అన్నాము. దానినిబట్టి మరణసమయములో ఏదో గొప్ప రహస్యమున్నదనీ, అది తెలిస్తే ఇంతవరకు కన్నులు మూసుకొన్నవారు కళ్ళు తెరుచుకొంటారని అర్థమవుచున్నది. ఇక్కడ ముఖ్యమైన ఘట్టము ఏమనగా! ఇంతవరకు ఏ విషయములో గ్రుడ్డిగా ఉన్నాము? ఇప్పటినుండి దేనియందు చూపుకల్గి వుండాలి? అని ప్రశ్న వచ్చుచున్నది. మనకు ఇంతవరకు వున్న గ్రుడ్డి తనమేమిటో, అది కృష్ణుని మరణమును తెలుసుకొనుట వలన ఎలా చూపుగల్గుతుందో, అందరము తెలుసుకోవాలి. నేడున్న ప్రపంచ జనాభాలో 80 శాతము క్రైస్తవులున్నారు. రెండవస్థానమును ఆక్రమించినది ఇస్లామ్‌మతము. తర్వాత బౌద్ధమతము, ఆ తర్వాత హిందూమతము. హిందూమతము నేడు చివరి స్థానములో ఉన్నది. కృతయుగము, త్రేతాయుగము గడిచిపోగా ద్వాపరయుగము మొదటిలో హిందూమతము ప్రపంచ వ్యాప్తంగా ఖండాంతరముల వరకు వ్యాపించి ఉండెడిది. నేడు మనము హిందూమతముగా పిలుచుకొనునది ఆనాడు హిందూమతము అను పేరుతో లేదు. ద్వాపరయుగము మొదటి కాలములో "మతము" అనుపేరు భూమిమీదనే లేదు. అప్పటికాలములో "పథము" అను పేరుండెడిది. హిందూ అను పదము 'ఇందూ' అను పదముగా, అర్థముతో కూడుకొన్నదై ఉండెడిది. ఆనాడు ఇందూపథము

అనునది ప్రపంచవ్యాప్తముగా ఉండెడిది. ప్రపంచములోని మనుషులందరు మేము ఇందువులము అని చెప్పుకొనెడివారు. పథము అనగా మార్గము అని అర్థము 'ఇందు' అనగా చంద్రుడు అని అర్థము. జ్యోతిష్యశాస్త్రము ప్రకారము జ్ఞానమునకు చంద్రుడు అధిపతియైన దానివలన, ఆ రోజు దైవ జ్ఞానముకలవారిని ఇందువులు అని చెప్పెడివారు. జ్ఞానమార్గములో నడిచేవారందరిని జ్ఞానపథములోని వారని అనెడివారు. అందువలన జ్ఞానులు మాది ఇందూపథము అని చెప్పెడివారు. మేము ఇందువులము, మాది ఇందూపథము అని తల ఎత్తి చెప్పుకొను రోజులు పూర్వముండెడివి. కాలక్రమమున మాయా ప్రభావము ఎక్కువై పోయి, మనుషులందరు గ్రుడ్డివారై పోయి పథమును మతముగా, ఇందువును హిందువుగా మార్చుకొన్నారు.

ఒకానొకరోజు ప్రపంచ వ్యాప్తముగానున్న ఇందువులకు కేంద్ర బిందువుగా భారతదేశముండెడిది. దైవజ్ఞానము మొదట భారతదేశములోనే పుట్టింది. అది పెరిగి విశ్వవ్యాప్తమైనది. కానీ నేడు అది తరిగిపోయి చివరకు భారతదేశములో కూడ 'ఇందువు' అను పేరు కనిపించకుండ పోయినది. భారతదేశములో మిగిలిన కొద్దిమంది తమ చరిత్రను మరచి పోయి, మేము హిందువులము అని అర్థమేలేని పేరును చెప్పుకొంటున్నారు. దైవజ్ఞానమునకు సంబంధించిన ఇందువు అను పేరును వదలిపెట్టి, భౌగోళిక సంబంధమైన ఒక ప్రాంతము పేరును, ఒక నది పేరును చెప్పుకొంటూ మేము హిందువులము అంటున్నారు. అలా చెప్పుకోవడము తప్పు. మనలను మనము తగ్గించుకొని చెప్పుకొంటున్నాము. మనది ఉన్నతమైన పేరు, ఉన్నతమైన పథము అని మేము చెప్పినా వినే స్థితిలో లేని చెవిటివారై పోయారు. మన చరిత్ర ఇది, మనము ఇందువులము,

మనది ఇందూ పథము అని మేము ఒక గ్రంథమును వ్రాసి ఉచితముగా పంచితే, మహానందిలో మేము పరమతమును గురించి ప్రచారము చేస్తున్నామని మా మీద కేసులు పెట్టి కోర్టుకు త్రిప్పుచున్నారంటే, మనది పూర్వపు ఇందూ జాతేనా అని అనుమానము రాక తప్పదు. ఇవి మన సాంప్రదాయములు అని **"ఇందూ సాంప్రదాయములు"** అను పేరుతో ఒక గ్రంథమును వ్రాసి విడుదల చేస్తే, ఇందూ అని పేరు పెట్టడము తప్పు అని విశ్వహిందూ పరిషత్‌వారు గుంతకల్లులో మామీద భౌతిక దాడులకు పూనుకోవడము పర మతముల ముందర సిగ్గుచేటు కాదా! అడిగితే వివరముగా మీకు అర్థమయ్యేటట్లు చెప్పుతామనినా వినకుండా, మేము వ్రాసిన **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** ను చూపించినా, ఆ భగవద్గీతను నడి బజారులో హిందూ సమాజమువారే నిప్పుపెట్టి కాల్చారంటే, పూర్వమున్న ఇందువుల ఆత్మలు ఆ దృశ్యమును చూచి వారిని శపించకుండ వదలరనిపిస్తుంది.

నేడు ఏమాత్రము ఇందూ సంస్కృతిని తెలియని హిందూసంస్థలు అనేకము పుట్టుకొచ్చాయి. ఆ సంస్థలలో ఉన్నవారికి పూర్వము ఇందూ మతము విశ్వవ్యాప్తముగ వుండెడిదనిగానీ, ఈశ్వరుడు తన తలమీద చంద్రవంకను ధరించడము వలన, మనకు ఆ రోజు సంపూర్ణ జ్ఞానముండుట వలన, మనము ఇందువులుగా ఉండెడివారమని గాని తెలియదు. ఇందూ మతము (ఇందూపథము) యొక్క పుట్టు పూర్వోత్తరములు తెలియనివారు, కృష్ణుడు చెప్పిన భగవద్గీతకు విలువనివ్వనివారు, మేము హిందువులమని, మతాన్ని రక్షించేదానికి మేము సంఘములుగా ఏర్పడినామని చెప్పు కొంటున్నారు. హిందూమతము ఎందుకు క్షీణించుచున్నదో, దానికిగల కారణమేమిటో ఏమాత్రము అర్థము చేసుకోవడము లేదు. ఇతర

మతములవారు వారి ప్రవక్తలు చెప్పిన మాటలను చెప్పి, వారి మతములను అభివృద్ధి చేసు కొంటూ పోతుంటే, దిన దినమునకు హిందూమతము క్షీణించి పోవుచున్నది. హిందూసంస్థలు తమ జ్ఞానమును తెలుసుకొని, జ్ఞానమును బోధించి క్షీణించి పోవుచున్న మతమును రక్షించుకోవాలి. కానీ అలా కాకుండ పర మతముల మీద దాడులను చేస్తు హిందూ మతమును రక్షిస్తామనడము, రోగానికి మందు ఇవ్వకుండ విషము ఇచ్చినట్లవుతుంది. మేము చెప్పు బోధలు నేడు ఎంతో ప్రశంసింప బడుచున్నవి. దీనిని మించిన జ్ఞానములేదు అని ప్రజలందరు అనుచుండగా, మా జ్ఞానమును ఏమాత్రము చూడకుండ, చదవకుండ మమ్ములను అవమానపరిస్తే నేడున్న హిందూ సమాజము గ్రుడ్డిది అనక ఏమనాలి?

మతము అను పేరుతో అజ్ఞానము నిండిన మనుషులు గుంపులుగా చేరి, హిందువులే ఇందుత్వమునకు సమాధికట్టు సమయము వచ్చినది. కావున భగవంతుని మూడవ అవతారమైన ఆకర్త రాక ఇంతలోనే ఉంటుందనుకొంటాము. ఇందూ ధర్మములకు పూర్తి ముప్పు ఏర్పడిన ఈ సమయములోనే, భగవంతుని రాక ఉంటుందని అనుకుంటున్నాము. నేడు హిందూసంఘములు జ్ఞానములేనివైన దానివలన, ఇప్పటికే ఉత్తరాంధ్ర సగానికి సగము హిందూమతమును వదలి పోయినది. కావున హిందువుల సంఘములకు ఇప్పటికైనా కనువిప్పు కలిగి, జ్ఞాన ప్రచారముతోనే హిందూ మతము రక్షించబడుతుందని, జ్ఞానములేకుండా సంఘములు పెట్టుకొని రాజకీయపార్టీలవలె మెలిగితే ప్రజలు ఛీకొట్టి పరాయి మతములోనికి పోవుదురని తెలియాలి. అందువలన ఇప్పటికైనా జ్ఞానులకు, గురువులకు విలువనిచ్చి వారి సలహాలతో జ్ఞానమును ప్రచారము చేసి, దానిద్వారా హిందుత్వమును కాపాడు ప్రయత్నము చేయమని చెప్పుచున్నాము. రాబోవు

కాలములో ప్రజలు మతముల భ్రమలో మునిగిపోయి, దైవత్వమును మరచి పోవుదురను ఉద్దేశముతోనే మతముల విషయమును తన మరణములో కృష్ణుడు చెప్పి పోయాడు.

నేడు మతములను మార్చుకొను వారికి కనువిప్పు కలుగులాగున కృష్ణుడు తన మరణములో బోయవానికి రాబోవు క్రైస్తవమతమును గురించి చెప్పి దాని ప్రవక్తను నేనేనని చెప్పాడు. ఇప్పుడు మీకు అర్థమగుటకు మేము మతము అను పదమును వాడుచు చెప్పుచున్నాము. ఆనాడు కృష్ణుడు మతమను పేరును ఉపయోగించలేదని జ్ఞప్తికుంచుకోవలెను. ధర్మములను నెలకొల్పు కార్యములో మూడుమార్లు, మూడు కాలములలో చెప్పవలసిన బాధ్యత కృష్ణునికున్నది. అందువలన రెండవ అవతారముగా ఏసు పేరుతో వస్తానని చెప్పాడు. ఏసు పేరుతో వచ్చి అక్కడకూడ ధర్మములను తెలియజేస్తానన్నాడు తప్ప ఒక మతమును స్థాపిస్తానని ఆయన చెప్పలేదు. ఏసు చెప్పిన బోధ నలుగురు శిష్యులు వ్రాసిన నాలుగు సువార్తల రూపములో ఉన్నది. కానీ మొత్తము బైబిలు రూపములో లేదు. అందువలన ఈ గ్రంథములో ఎక్కడ బైబిలు అను పదమును వాడలేదని గ్రహించాలి. ఏసు చెప్పిన వాక్యములను ఎవడు గ్రహించునో వాడు నిజముగా ఏసు భక్తుడగును. ఏసు భక్తుడు అయినవాడు కృష్ణుడు ఏసు ఇద్దరూ ఒకరేనని గ్రహించును. అట్లు గ్రహించని వానికి ఏసు చెప్పిన జ్ఞానము అర్థము కాలేదని, వాడు ఏసు భక్తుడుకాదని అర్థమగును. నేడు ఎవరైనా నేను ఏసును విశ్వసిస్తున్నాను అనినా, వాడు నేను క్రైస్తవున్ని అని ఏసు క్రైస్తవ దేవుడని, హిందువుల దేవుడు వేరని అనుకోవడము వలన వాడు ఏసును విశ్వసించిన వాడు కాదని, కనుక నిజమైన క్రైస్తవుడుకాదని అర్థమగుచున్నది. దీనికంతటికి మూలము కృష్ణుని మరణములో జరిగిన సమాచారము ఎవరికీ

తెలియక పోవడము వలన, కృష్ణుడు ముందే చెప్పినట్లు ఏసుగా వచ్చినా, ఏసు నా దేవుడనుచు కృష్ణున్ని దూషించువారు కలరు. అలా ఏసు భక్తులు కృష్ణున్ని దూషిస్తే ఏసును దూషించినట్లే అగును. అదే విధముగ కృష్ణుని భక్తులు ఏసుని దూషించినా, ఏసే కృష్ణుడైన దానివలన వారు కృష్ణున్ని దూషించినట్లగును. కృష్ణుడు ఏసుగా పుట్టుతానని ముందే చెప్పినట్లు తెలియుట వలన, ఇటు హిందువులకు అటు క్రైస్తవులకు కనువిప్పు కలిగి, ఇప్పటి నుండి తమ ప్రవర్తనను మార్చుకొని, ఎవరు ఏ మతములో ఉండినా దేవుడే అందులో పుట్టించాడని తలచి, మతమును మారకుండా వుండి కృష్ణున్ని, ఏసును సమానముగా చూచు హిందువులు, ఏసును కృష్ణున్ని సమానముగా చూచు క్రైస్తవులు సమాజములో తయారు కాగలరని తలచుచున్నాను. ఏసు చెప్పిన నాలుగు సువార్తలను మాత్రము క్రైస్తవులు చదవాలి. నాలుగు సువార్తలతో సహా మొత్తము బైబిలును చదువువాడు ఏసును గౌరవించనట్లే, ఆయన బోధలకు ప్రాధాన్యత ఇవ్వనట్లే. అటువంటి వాడు క్రైస్తవుడు కాడు. అదే విధముగా కృష్ణుడు చెప్పిన కేవలము 17 అధ్యాయముల భగవద్గీతను హిందువులు చదవాలి. గీతతో సహా వేదములను చదివినా లేక గీతను వదలి వేదములను చదివినా వాడు కృష్ణున్ని గౌరవించనట్లే. ఆయన బోధలకు ప్రాధాన్యత ఇవ్వనట్లే. అటువంటివాడు హిందువు (ఇందువు) కాడు. ఈ విధముగా లెక్కించి చూచితే ఈనాడు సరియైన హిందువులేడు. అలాగే సరియైన క్రైస్తవుడు లేడు. అందువలన నేడు ఈ గ్రంథమును చదివి కృష్ణుని మరణ సమయములో జరిగిన రహస్యమును ఎవరైతే తెలుసుకొందురో వారందరికీ కనువిప్పుకల్గును. మనము నీది ఆ మతము, నాది ఈ మతమని చెప్పుకోవడము ఒకే వంశములో పుట్టిన ఇద్దరు అన్నదమ్ములు తమ వంశమును గురించి తెలియక అన్న ఒక వంశము పేరు, తమ్ముడు మరొక

వంశము పేరు చెప్పితే స్వంత తండ్రినే మార్చినట్లుగును కదా! అందువలన ఇప్పటినుండైనా కొన్ని వేల సంవత్సరముల వెనుక ఏమి జరిగినదని యోచించి, తమ తమ మతములు పూర్వము లేనేలేవని గ్రహించి, అప్పుడున్నది ఒకే ఒక పథము మాత్రమేనని, అదియే "ఇందూపథమని" తెలిసి, ఇందూపథములోనే నేడున్న క్రైస్తవులు, హిందువులు పూర్వముండెడి వారిని, ఆ ఇందూపథమును మరచిపోయిన దానివలన హిందూమతము, క్రైస్తవమతమని వేరువేరుగా చీలిపోయాయని తెలుసుకొంటే, ఈనాటికీ రెండిటియందు ఒకే బోధ ఉన్నదనీ, రెండిటినీ తెలిపినవాడు ఒకే భగవంతుడని తెలియగలదు.

జరుగబోవు విషయమును తెలిసిన కృష్ణుడు తన మరణ సమయము వరకు రాబోవు తన జన్మలను గురించి తెలుపలేదు. చివరి మరణ సమయములో బోయవానిని అడ్డము పెట్టుకొని, భవిష్యత్తు అవతారములను గురించి చెప్పాడు. బోయవాడు విన్న దానిని తిరిగి చెప్పు సమర్థుడు కాదని తెలిసి కృష్ణుడు వానికే చెప్పాడు. అట్లు చెప్పుట వలన వాని ఆత్మ ఆ విషయమును స్వీకరించి, తన మూడవ అవతార సమయము సమీపించి నపుడు ఆత్మే ఆ విషయమును బయటికి తెలుపునట్లు భగవంతుడు నిర్ణయించాడు. అప్పటికి పెరగవలసిన అజ్ఞానమంతా పెరిగి, మత ద్వేషములు ఎక్కువై మానవుడు ఆధ్యాత్మికమను దారిని వదలి, మాయ దారిన పోవునపుడు, మూడవ పురుషుడుగా వచ్చినవాడు తన జ్ఞానమును తెలియబరచి ధర్మములను పూర్తిగా నెలకొల్పును. ఇక్కడ ముఖ్యముగ గమనించ వలసిన విషయమేమనగా! నేను అన్నదానము చేస్తాను. నేను అన్నమును పెట్టడము వలన మా దగ్గరున్నవారంతా ఆకలి లేనివారగుదురు. ఎవరికీ ఆకలి లేకుండా చేస్తానన్నపుడు, నావద్దనున్న వారందరికి ఆహారము

దొరకకుండ పోయి పూర్తి ఆకలికొనిన వారైనపుడు, నేను ఇచ్చిన ఆహారము వలన వారి ఆకలి పూర్తిగ తీరిపోతే, అప్పుడు నేను చెప్పినట్లు అందరి ఆకలి తీర్చినట్లగును. నేను అన్నమును వండి సిద్ధముగా పెట్టుకొనినా, ఆ సమయానికి ఆకలికొనిన వారు ఎవరూ లేకపోతే నేను ఎవరి ఆకలీ తీర్చనట్లే కదా! అందువలన ఎదుటివారు ఆకలితోనున్నపుడే నా కార్యము నెరవేరును. అదే విధముగానే దేవుడు నేను భగవంతునిగా వచ్చి అధర్మములను లేకుండ చేస్తానన్నాడు. ఆయన పని అధర్మములను రూపుమాపి ధర్మములను తెలియపరచడమైనపుడు, ఆయన వచ్చినపుడు ధర్మములను ఆహారము లేకుండాపోయి అధర్మములను ఆకలి వుండాలి. అపుడు ధర్మములను ఆహారముతో అధర్మములను ఆకలిని తీర్చినవాడగును. అప్పుడు ప్రక్కవారి దృష్టిలో ఎదుటివాని ఆకలి తీర్చినవాడగును. భగవంతుడు కృష్ణుని రూపములో ఉన్నపుడు చెప్పిన మాట నెరవేరుటకు, తన మూడవ అవతార సమయము నకు భూమిమీద పూర్తి అజ్ఞానమును పెరుగునట్లు చేశాడు. ఇక దాన్ని రూపుమాపి ధర్మములను నెలకొల్పి తనమాటను నిలబెట్టుకొనును. ఈ విధముగా దేవుడు భూమిమీదకు భగవంతుడుగా వచ్చి, మూడు అవతారములను ధరించి తిరిగి దేవునిగా మారిపోవుచున్నాడు. ద్వాపర యుగములో దేవుడు కృష్ణునిగావచ్చి, ధర్మములను గీత రూపములో చెప్పి పోయి, తర్వాత మూడు వేల సంవత్సరములకు ఏసుగా వచ్చి అప్పుడు కూడ ధర్మములను తెలియజేసి, మూడవ అవతారముగ 'ఆకర్త' రూపములో వచ్చి తనకార్యమును అంతటితో పూర్తి చేయును. అలా పూర్తి చేసిన భగవంతుడు తిరిగి దేవునిగా మారిపోవును. అందువలన మొదట కృష్ణుడు దేవుడు, తర్వాత కృష్ణుడు భగవంతుడు ఆ తర్వాత కృష్ణుడు దేవుడగును. అందువలన కృష్ణుడు దేవుడు మరియు భగవంతుడని చెప్పవచ్చును.

# మా కృష్ణమందిరము

స్వార్థపరులు చెప్పినట్లు "మా కృష్ణమందిరము" అని అనడమేమిటని కొందరు మనసులోనైనా అనుకోవచ్చును. ప్రపంచ విషయములో స్వార్థ ముండకూడదు. కానీ దేవుని విషయములో అందరికీ స్వార్థముంటేనే మంచిది. దేవుని విషయములలో ఎంత స్వార్థముంటే అంత త్వరగా దేవున్ని చేరవచ్చును. దేవుని విషయములలో నేను స్వార్థపరున్నే, అందువలన కొన్ని అసలైన రహస్యములను ఇంతవరకు మీకు చెప్పలేదు, చెప్పనుకాక చెప్పను. అయినప్పటికీ నా లెక్కలో కాకుండ మీ లెక్కలో రహస్యములైన మా కృష్ణమందిరము యొక్క విషయములను కొన్నిటిని మాత్రమే తెలియజేస్తాము చూడండి. అనంతపురము జిల్లా, తాడిపత్రి మండలములో నున్న చిన్న పొడమల గ్రామమునందు క్రీస్తుశకము 2003 వ సంవత్సరము లో కృష్ణ మందిరమును నిర్మించాము. ఎటువంటి చందాలు వసూలు చేయకుండ మాస్వంత డబ్బుతో, మాచేతనైనంత వరకు నిర్మించు కొన్నాము. తర్వాత అదే విధానముగా ప్రతి సంవత్సరము మాచేతనైనంత వరకు అభివృద్ధి చేసుకొంటూ వచ్చాము. మొదట కృష్ణప్రతిమను ప్రతిష్ఠించునపుడు మేము అందరివలె మూడు రోజులు ధాన్యములో పెట్టి, మూడు రోజులు నీళ్ళలో పెట్టి, తర్వాత మూడు రోజులు యజ్ఞములు చేసి ప్రతిష్ఠించలేదు. ప్రతిష్ఠించునపుడు ఒక్క వేదమంత్రమును కూడ చదవలేదు. స్వయముగా నా చేతుల మీదుగా రాత్రిపూట అందరు నిదురించుచుండగా అక్కడున్న వారికి కూడ తెలియకుండ ప్రతిష్ఠించాము. ఇదేమైనా ప్రతిష్ఠా అని మీరనుకోవచ్చు. **"దేవున్ని పూజించడముకంటే దేవున్ని సేవించడము గొప్ప"** అను సూత్రమును చెప్పు నేను, ఆ దినము ఆర్భాటముగా చేయు ప్రతిష్ఠకంటే సేవ చేయడము మంచిదని అనుకొన్నాను, అలాగే చేశాను. అదే సంవత్సరము ఆ ప్రాంతములో మలేరియా వ్యాధి 90 శాతము తగ్గి పోయినట్లు అక్కడివారే చెప్పగా విన్నాము.

మేము 1980వ సంవత్సరము **"ప్రబోధాశ్రమము"** ను స్థాపించి, దాని ఆధ్వర్యములో 1991లో **"ప్రబోధ సేవాసమితి"** అను సంస్థను తయారు చేశాము. 2004వ సంవత్సరము **"ఇందూ జ్ఞానవేదిక"** అను మరియొక సంస్థను స్థాపించడము జరిగినది. ప్రబోధాశ్రమము యొక్క ఆధ్వర్యములో ప్రబోధ సేవాసమితి, ఇందూ జ్ఞానవేదిక అను రెండు సంస్థలు పని చేయుచున్నవి. శ్రీకృష్ణుని జ్ఞానమును ప్రచారము చేయుట మరియు మాచే రచించిన గ్రంథములను ప్రచురించుట మొదలగు జ్ఞానసేవా కార్యములను రెండు సంస్థలు చేయుచున్నవి. అద్వైతమును ప్రచారమును చేసిన ఆది శంకారాచార్యులవలె మరియు విశిష్టాద్వైతమును ప్రచారము చేసిన రామానుజాచార్యులవలె మేము త్రైత సిద్ధాంతముతో కృష్ణుని గీతను ప్రచారము చేయుచున్నాము. కృష్ణుని జ్ఞానమును సిద్ధాంతముతో శాస్త్ర బద్ధముగా ప్రచారము చేయుచున్న మాకు, కృష్ణుడే మూలదైవము. అందువలన మేము కృష్ణమందిరమును స్థాపించాము. నాకు నేను పాతవాడినే అయినా ప్రజలకు మాత్రము నేను క్రొత్త, నా సిద్ధాంతము క్రొత్త. కావున నేను త్రైత సిద్ధాంతమును ప్రచారము చేయడములో ఇటు హిందూసంస్థల నుండి, అటు క్రైస్తవసంస్థల నుండి కొన్ని ఆటు పోట్లు ఎదుర్కొనవలసి వచ్చినది. వాటిని లెక్కచేయక మేము 50 గ్రంథములను వ్రాసి, మా సంస్థల ద్వారా ప్రచారము చేయడము వలన ప్రజలు మా జ్ఞానము యొక్క ఔన్నత్యమును గురించి తెలుసుకొని మా గ్రంథములను మించిన గ్రంథములు ఇంతవరకు భూమిమీద లేవు అని చెప్పుకోవడము వలన, మరియు కాలజ్ఞానమును చెప్పిన బ్రహ్మముగారు తన కాలజ్ఞానము నందు **"ప్రబోధాశ్రమము ఉన్నతమైన జ్ఞానము కలది"** అని చెప్పడము వలన, మేము ఉత్సాహముతో జ్ఞానప్రచారము చేయుచున్నాము. అంతేకాక

బ్రహ్మముగారి కాలజ్ఞానములో **"ప్రబోధాశ్రమము వారి ఆది గుణమెల్ల శయనాధిపతికి ఉన్నది"** అని వ్రాయడము వలన వాటిని చూచిన కొందరు మమ్ములను గౌరవించను మొదలుపెట్టారు. ఇవన్నీ తెలియక ముందు త్రైతసిద్ధాంతము అని పేరు వింటూనే, మేము క్రైస్తవుల బోధను చెప్పువారమని హిందువులు, క్రైస్తవ మతములోని త్రిత్వము అను పేరుకు దగ్గరగా కనిపించు త్రైతము అను పదమును చూచి, ఈ పేరుతో మనలను దగ్గర చేసుకొని చివరకు, హిందుమతములోనికి మార్చువారమని క్రైస్తవులు అనుకోవడము జరిగినది. మొదట అలా అనుకొనినా ఇప్పుడు మా బోధలను చదివిన తర్వాత, హిందువులలో పెద్ద జ్ఞానులైన వారుకూడ మమ్ములను పొగడి మా వద్దకు రావడము, అలాగే క్రైస్తవులలో ఎందరో పాస్టర్లు, ఫాదర్లు వచ్చి మమ్ములను ప్రశంసించడము జరుగుచున్నది. ఇస్లామ్ మతము వారికి మా బోధలు బాగా నచ్చడము వలన మూడు మతములవారిలో కొందరు జ్ఞానములో మమ్ములను అనుసరించువారు కావడము జరుగుచున్నది.

బ్రహ్మముగారు కాలజ్ఞానమున కలియుగములో 5000 సంవత్సరములకు అనగా క్రీస్తు శకము 1900వ సంవత్సరములనుండి భూమిమీద అధర్మములు వృద్ధిపొంది ధర్మములు అడుగంటిపోవును అని వ్రాశారు. తర్వాత కలియుగములో 5108 సంవత్సరములకు (క్రీస్తుశకము 2008 నుండి) తన కాలజ్ఞానము నెరవేరుటకు ప్రారంభమగును అని చెప్పాడు. 5110 సంవత్సరములకు (క్రీ॥ 2010) ఆధ్యాత్మిక యోగ పురుషుడు ప్రకాశమగును అని వ్రాశారు. ఆయన చెప్పినట్లు మా బోధలు రెండు సంవత్సరముల నుండి ప్రచారములోనికి వచ్చుటవలన **"త్రైత సిద్ధాంత ఆదికర్త ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు"** అను పేరు బాగా ప్రచారమై పోయినది. ఇప్పుడు అసలు విషయానికి వస్తాము. మేము దాదాపు ఐదు

సంవత్సరముల క్రితము ఒక బోర్డును కృష్ణమందిరములో పెట్టాము. అందులో ఇక్కడికి కనిపించని దేవతలు, మహర్షులు, ఖగోళములోని అనేక గ్రహముల జీవులు వస్తుంటారు. అందువలన ఇక్కడికి వచ్చు మనుషులు ఎవరైనా చెడు భావముతో, చెడు ఉద్దేశముతో వస్తే వారికి కనిపించని దేవతల వలన, గ్రహముల వలన తీరని నష్టము ఏర్పడవచ్చును అని వ్రాశాము. ఈ మధ్యన ఆరు నెలల క్రిందట మాకు దొరికిన బ్రహ్మముగారి కాలజ్ఞానము లో **"మహాదేవతలందరూ ఆనందాశ్రమము వద్దే ఉన్నారు"** అని వ్రాసి యుండడమును గమనించాము. గతములో మేము ఎన్నోమార్లు కృష్ణమందిరములో ఉన్నది **కృష్ణుని విగ్రహము కాదు, కృష్ణుని ప్రతిమవున్నది**. ఇక్కడి కృష్ణ ప్రతిమ చాలాశక్తివంతమైనది. అందువలన భూమిమీద కనిపించకుండా ఉన్న దేవతలు, మహర్షులు, ఖగోళములోనున్న గ్రహములు ఇక్కడికి వచ్చి పోతున్నారని చెప్పాము. కృష్ణుని దర్శనార్థము వెంకటేశ్వర స్వామి కూడ వచ్చి పోయినట్లు మాకు తెలిసింది. మా మీద దురుద్దేశముతో ఇక్కడికి వచ్చిన ప్రజలు దేవతలు వచ్చిన సమయములో ఇక్కడేవుంటే వారి దృష్టిలో పడితే చెడు భావమున్న వారు దేవతల కోపమునకు గురి అగుదురు. అందువలన తీరని నష్టము ఏర్పడుతుందని వివరముగా చెప్పాము.

మేము స్వయముగా ప్రతిష్ఠించిన ప్రతిమలో భగవత్‌శక్తి ఉండుట వలన, దేవతలందరు ఆయనను దర్శించుకొనుటకు వచ్చుచున్నారు. వారికి భగవంతుని దర్శన భాగ్యమును కల్గించిన మమ్ములను దీవించి పోవు చున్నారు. ఇదంతా కట్టుకథ అని అనుకోవద్దండి. మీకు నమ్మశక్యము కాని విషయమైనప్పటికీ మేము చెప్పునది నూరుపాళ్ళు సత్యమే. ఎందుకనగా! బ్రహ్మముగారు కూడా తన కాలజ్ఞానములో **"శయనాధిపతికి సర్వథా ఆనందం, బ్రహ్మాది దేవతలెల్ల దీవించేరు. జారు వాక్యములు ఆడిన వారెల్ల**

**నాశనమై పోయ్యేరు. కీడు దలచిన వారెల్లా ధూళియై పొయ్యేరు".** అని వ్రాశారు. దీనినిబట్టి దేవతలు చాలామంది ఇక్కడికి వస్తున్నారని తెలియుచున్నది. బ్రహ్మముగారి వాక్యములు ఇప్పుడు ఆరు నెలల క్రితము మాకు తెలిసాయి. కానీ మేము ఐదు సంవత్సరముల పూర్వమే ఈ మాటలను చెప్పాము. కొందరు ఇక్కడికి వచ్చి పోయిన వారము దినములకే ఆరోగ్యము అంతా బాగున్నా చనిపోవడము జరిగింది. మమ్ములను దూషించిన కొందరు తీవ్రమైన కష్టాలలో కూరుకపోవడము, కొందరికి భయంకరమైన రోగములు వచ్చి ఎంతో కాలము అనుభవించడము జరిగినది. వీటన్నిటిని గమనించిన మేము దానికి కారణమును తెలుసుకొని ఐదు సంవత్సరములపుడే బోర్డుమీద దేవతలు వచ్చు విషయము వ్రాసి పెట్టాము. కొందరు ఇక్కడకు రాకముందే కొన్ని నయముకాని రోగములతో బాధపడువారు నావద్దకు వచ్చి తమ బాధను చెప్పుకొన్నపుడు, నేను ఎవరికీ నయము చేయలేను, నావలన ఎవరికీ స్వస్థత జరుగదు. కానీ నీకు కృష్ణుని మీద భగవంతుడను భక్తి కల్గి, కర్మలను పోగొట్టు యోగ్యత ఆయనకున్నదను భావముతో, కృష్ణ మందిరము వద్దకు వచ్చి మూడు లేక ఐదు రోజులు మందిరము ముందర నిద్రపోతే రాత్రిపూట వచ్చు దేవతలు వారిని చూచి, వారు వీరి రోగములను లేకుండ చేయవచ్చును అని చెప్పాను. మందిరమువద్ద నిద్రించు వారిని చూచి వీరు కృష్ణుని భక్తులని ప్రేమతో లేక దయతో వచ్చిన దేవతలు వారి రోగములను ఎందరికో లేకుండ చేయడము జరిగింది. కొందరు బాగైపోయిన తర్వాత కృష్ణున్ని, మమ్ములను మరచిపోయిన వారు కూడ ఉన్నారు. అటువంటి వారికి తిరిగి ఏదైనా రోగము వచ్చి అక్కడికి పోతే బాగవుతుందని వచ్చినా, వారు ఎన్ని రోజులున్నా వారికి ఏమాత్రము నయము కావడములేదు. దీనినిబట్టి కృష్ణమందిరము అక్కర తీర్చే ఆసుపత్రిలాంటిది

కాదని తెలియుచున్నది. మందిరములోనున్న నేనుగానీ, గర్భగుడిలోనున్న కృష్ణుడుగానీ తటస్థముగా ఉంటాము. ఎవరికీ రోగాలు పోవాలి అనుకోము. కృష్ణుడు ఎవరి గోడు వినడు, వినినా పట్టించుకోడు. దానివలన అక్కడికి పోయి ఆయనకెందుకు మ్రొక్కాలి అని అనుకోవద్దండి. కృష్ణుడు పట్టించుకోక పోయినా అక్కడికి వచ్చు ఆయన సేవకులైన దేవతలు ప్రజలను పట్టించుకొని వారి సమస్యలను తీర్చుతారు. ఒక సమస్యను పరిష్కరించుటకు తమ చేతకాకపోతే తమకంటే పెద్ద దేవతలకు చెప్పి వారిచేత పరిష్కరింపజేస్తారు. అది అక్కడికి వచ్చిన ప్రజల మనోభావములను బట్టి ఉంటుంది. చెడు భావముంటే చెడు, మంచి భావముంటే మంచి మా కృష్ణుని వద్ద జరిగి తీరుతుంది.

ఇంత చెప్పినా ఇదంతా తమ గొప్పను చెప్పుకునే దానికని అనుకొను వారు కూడ కలరు. అటువంటి వారికి కృష్ణమందిరము ఎంత శక్తివంతమైనదో చెప్పుటకు, ఒక జరిగిన సంఘటనను వివరిస్తాను చూడండి. కృష్ణ మందిరమునకు ముందు భాగమున ఒక చిన్న రూమును కట్టించి దానిలో మంగళషాప్‌కు కావలసిన సామగ్రిని సమకూర్చి, మా భక్తుడైన మంగళ వెంకటేష్ అను వ్యక్తిని అందులో పెట్టడము జరిగినది. కృష్ణమందిరములో కృష్ణుని వద్ద తల వెంట్రుకలు గొరిగించుకొను వారికి అందుబాటులో ఉంటాడను ఉద్దేశముతో అతనిని ఉంచడము జరిగినది. దాదాపు ఆరు సంవత్సరముల క్రితము సాయంకాలము ఆరుగంటల సమయములో చీకటి పడు సమయములో, మందిరము ముందర వెంకటేష్ షాప్ ప్రక్కన రోడ్డులో ముగ్గురు ఆడవారు పొలము పనులనుండి ఇంటికి పోతూ, సరిగ్గా మందిరము ముందర మంగళిషాప్ దగ్గరకు వచ్చినపుడు షాప్‌ను మూసివుండడము చూచి, ఊరకనే పోకుండా వారిలో ఒకామె చిన్న

మంగళోడు ఇక్కడుంటాడు, పెద్దమంగళోడు పైన మేడమీద ఉంటాడని నన్ను, వెంకటేష్‌ను ఎగతాళిగ మాట్లాడడము జరిగినది. ఆ మాటను అక్కడే చాటునవున్న వెంకటేష్ విన్నాడు. మాట్లాడినవారు వెంకటేష్‌ను గమనించలేదు. వెంకటేష్ కూడ ఆ విషయము విననట్లు పట్టించుకోలేదు. తర్వాత ఏడు రోజులకు మమ్ములను ఎగతాళిగ మాట్లాడిన ఆడ మనిషికి పాము కరవడము జరిగినది. ఆ ప్రాంతములో ఎవరికి పాము కరచిన ప్రక్కన పది కిలోమీటర్ల దూరములోనున్న కావేటి సముద్రము అను ఊరులో మందు ఇస్తారు. పాము కరచిన ఆడమనిషిని వారి బంధువులు కావేటి సముద్రమునకు తీసుకొనిపోయి మందును తిని బాగైందని నమ్మకము కల్గిన తర్వాత ఇంటికి రావాలని వచ్చారు. ఊరిలోని వారు మందిరము ముందర రోడ్డు ద్వారానే పోవాలి, రావాలి. సరిగ్గ వెంకటేష్ షాప్ ముందర వారము రోజుల క్రితము ఎగతాళిగ మాట్లాడిన స్థలములోనికి అడుగుపెట్టగానే మాట్లాడిన ఆమెకు ప్రాణము పోవడము జరిగినది. అక్కడికి వస్తూనే ఆమెకు ప్రాణము పోవడమును వెంకటేష్ ప్రత్యక్షముగ చూచాడు. తర్వాత ఆ విషయమును మాకు తెలిపాడు. ఏ జాగాలో మాట్లాడిందో అదే జాగాలోనికి రాగానే ప్రాణము పోయిందని, మొదట వారము క్రిందట మాట్లాడినపుడు చూచానని, తర్వాత ఇప్పుడు చనిపోయింది కూడ చూచానని చెప్పాడు. అప్పటి ఆ విషయము తెలియని మేము యోచించగా ఆమె మమ్ములను దూషించినపుడు ఎవరైన దేవతలు ఆ సమయానికి అక్కడ వుండి, ఆమె మాట్లాడడమును చూచి వుంటుంటారని వారికి కోపము వచ్చి వుంటుందని, వారే ఆ విధముగ చంపివుంటారని మాకు అర్థమైనది. మేము చంపినాము అని బయటికి తెలియుటకే ఏ స్థలములో దూషించినదో అదే స్థలములో ఆ దేవతలు ప్రాణము పోవునట్లు చేశారని అనుకున్నాము.

అనవసరముగా మమ్ములను దూషించడము వలన ఎంతటి అనర్థము జరిగిందో అర్థమైంది. దీనిని బట్టి భూమిమీద ఎక్కడలేని భగవత్ శక్తి కృష్ణ ప్రతిమయందు కలదని, ఆ శక్తిని దర్శించుకొనుటకు సకల దేవతలు వస్తున్నారని తెలియుచున్నది. వచ్చు దేవతలకు కోపము వస్తే చెడును, దయవస్తే మంచిని కూడా కలుగ చేస్తారనుటకు మరియొక నిదర్శనమును చూస్తాము. హైదరాబాద్‌లో నాకు పరిచయమున్న వ్యక్తి అన్నకు ఆరోగ్యము చెడిపోయింది. ఆసుపత్రిలో ఒకటి రెండు రోజులకంటే ఎక్కువ బ్రతకడని చెప్పారు. అటువంటి సమయములో నావద్దకు వచ్చి వారి పరిస్థితిని చెప్పుకొని బాధపడ్డారు. దానికి "నేను ఏమీ చేయలేను, మీకు కృష్ణుని మీద విశ్వాసముంటే కృష్ణమందిరము వద్దకు పోయి భక్తిగవుండండి" అని చెప్పాము. వారు వెంటనే కృష్ణమందిరము వద్దకు వచ్చి ఉండడము జరిగింది. 15 రోజులలో ఆయన పూర్తి ఆరోగ్యమును పొందాడు. రోగము బాగైన తర్వాత అతను తిరిగి దేవుడను భావముతో మందిరమునకు రాలేదు, కృష్ణుని జ్ఞానమును గురించి ఏమాత్రము తెలుసుకోలేదు. తర్వాత రెండు సంవత్సరములకు అతనికి అనారోగ్యమైంది. అప్పుడు వారు నన్ను అడిగితే "భక్తి, జ్ఞానమున్నపుడే ఇక్కడికి రావలెను. అట్లు కాకుండ ఇదేదో రోగములు నయము చేయుటకున్న ఆసుపత్రిలాగ ఎప్పుడు అవసరమైతే అప్పుడు వస్తే రోగములు పోవు" అని చెప్పి రావద్దని చెప్పాము. మేము ఆ మాట చెప్పిన తర్వాత వారము దినములకే అతను చనిపోవడము జరిగినది. మొదట రోగమొచ్చినపుడు ఒక చుక్క నీరుగానీ, ఒక మెతుకు అన్నముగానీ గొంతులోనికి పోయేదికాదు. శ్వాస ఆడుటకు గొంతులో జిగురు (మ్యూకస్)లాంటిది అడ్డుపడేది. అటువంటి ప్రమాద స్థితిలోనున్న వ్యక్తి బ్రతికి బయటపడడము ఇక్కడికి వచ్చిన దేవతల పనేనని అర్థమగుచున్నది.

మందిరములోని కృష్ణునికి ఎటువంటి శ్రమలేకుండ ఇక్కడికి వచ్చిన దేవతలే భక్తుల సమస్యలను కూడ తీర్చుచుందురు.

ఇక్కడి కృష్ణమందిరము ఖరీదైన ఆలయముగా కనిపించదు. స్థూలముగా కనిపించుటకు చిన్నదే అయినా, సూక్ష్మముగానున్న కృష్ణ భగవానుడు దేవతలందరికంటే గొప్పవాడు. భూమిమీద ప్రజలు మ్రొక్కుచున్న పెద్ద దేవతలు కూడ అప్పుడప్పుడు వచ్చి పోవడము జరుగుచున్నది. మాకు తెలిసిన తర్వాత, మేము దేవతలు ఇక్కడికి వస్తున్నారని ఒక బోర్డు మీద వ్రాయడము జరిగినది. దేవతలు వచ్చి పోవుచున్నారనుటకు ఎన్నో ఆధారములున్న తర్వాతనే మేము బయటికి తెలిపాము. నిత్యము రాత్రిపూట 1 నుండి 3 గంటల వరకు కనీసము పదిమంది చిన్న పెద్ద దేవతలు వచ్చి పోవడము జరుగుచున్నది. ఇంతగా ప్రభావముగల కృష్ణమందిరము ఇక్కడున్నదని ఈ ఊరి ప్రజలకుగానీ, ప్రక్కనేనున్న తాడిపత్రి ప్రజలకుగానీ తెలియదు. ఈ మందిరము యొక్క గొప్పతనము తెలిసిన కొందరు దూరప్రాంతమైన విజయనగరము, విశాఖపట్టణము నుండి కూడ వచ్చి రాత్రిపూట నిద్రించి పోవుచున్నారు. ఆ విధముగా భక్తిగా వచ్చి సేవ చేసుకొన్న వారికి భయంకర రోగములు కూడ పోయిన సంఘటనలు ఎన్నో కలవు. మేము ఇక ఎక్కువగా వ్రాయదలచుకోలేదు. చివరిగా చెప్పునదే మనగా! కృష్ణుడు భగవంతునిగా వచ్చిన దైవశక్తి. కావున భగవంతుడు దేవతలందరికీ పూజ్యుడే. దేశములో ఎన్నో కృష్ణ దేవాలయములుండినా అక్కడ ఎక్కడా లేకుండ ఇక్కడి కృష్ణ మందిరములోనే ఆ శక్తి వచ్చి చేరడము ఆశ్చర్యమే అయినా ఇది వాస్తవము. **కృష్ణుడు చెప్పిన జ్ఞానము ఎక్కడుంటుందో ఆయన అక్కడే ఉంటాడు** అను మాట ప్రకారము ఆయన చెప్పిన జ్ఞానము నూటికి నూరుపాళ్ళు ఇక్కడే

ఉన్నది. కావున కృష్ణుడు ఇక్కడే ఉన్నాడు. కృష్ణున్ని అన్ని దేవాలయములలో పూజించినట్లు కూడ మేము పూజించడము లేదు. మా గుడిలో ప్రస్థుతానికి పూజారే లేడు. **కృష్ణున్ని పూజించడముకంటే ఆయనకు సేవ చేయడము ముఖ్యమైన పని** అని మేము చెప్పినట్లు ఇక్కడ సాధారణ పూజ తప్ప ప్రత్యేక పూజలుండవు. **ఆయన సేవకంటే మించిన ఆరాధన లేదు.** కావున ఈ గ్రంథము చదివినవారు కూడ వచ్చి కృష్ణున్ని దర్శించుకొని ఆయన జ్ఞానమును తెలుసుకొని సేవ చేయండని తెలుపుచు ఇంతటితో ముగిస్తున్నాము.



## చివరి మాట - నేటి సమాజము

సమాజము అనగా సమానముగా పుట్టినదని అర్థము. మనకు రెండు సమాజములు కలవు. ఒకటి లోపలి సమాజము, రెండు బయటి సమాజము. బయటి సమాజమును గురించి అందరికి తెలుసు. కానీ లోపలి సమాజమును గురించి ఎవరికీ తెలియదనే చెప్పవచ్చును. సమాజము అనగా ఏమిటి? మాకు తెలియకుండ నీకు తెలిసిన సమాజ మేమిటి? అని కొందరు నన్ను ప్రశ్నించవచ్చును. దానికి నా సమాధానము ఏమనగా! సమాజము అను శబ్దములో రెండు పదములు ఇమిడివున్నవి. ఒకటి సమ, రెండు జము. "సమ" అనగా నీకు ఏదైతే ఉందో అందరికీ అదే ఉంది, లేక అందరికీ ఏదైతే ఉందో నీకూ అదే ఉంది అని అర్థము. దీనినిబట్టి సమానముగా పుట్టినది సమాజమని తెలియుచున్నది. ఇక్కడ అందరికి ఏది సమానముగా ఉంది అని ప్రశ్న వస్తే "జము" లేక "జమ్" అని కలదు. జమ్ అనగా పుట్టడము అని లేక జన్మించడము అని అర్థము.

ఒకే విధముగా బయటి ప్రపంచములోని మనుషులంతా జన్మిస్తున్నారు. కాబట్టి మనుషులందరిని సమాజము అంటున్నాము. ఇకపోతే లోపలి సమాజము అనగా శరీరములోపల జీవునితోపాటు సమానముగా పుట్టుచున్న పదునాలుగు (14) చైతన్య భాగస్వాములను మరియు జీవునితో సహా కలిపి లోపలి సమాజము అంటున్నాము. బయటి సమాజములో ఎంతమందైనా ఉండవచ్చును. కానీ లోపలి సమాజములో మొత్తము పదిహేనుమంది మాత్రము గలరని తెలియుచున్నది. బయటి సమాజము కనిపిస్తుంది కావున దానిని కనిపించే స్థూలసమాజము అంటాము. లోపలి సమాజము లోని పదిహేను మందికి పేర్లు ఉన్నా, పదిహేను మంది ఒక్కొక్కరు ఒక్కొక్క ప్రత్యేకమైన పనిని చేస్తున్నా, వారు మాత్రము ఎవరికి కనిపించరు. కావున లోపలి సమాజమును కనపరాని సమాజము అంటాము.

కనిపించే సమాజమును గురించి అందరికి తెలుసు, కనపరాని సమాజమును గురించి ఎవరికీ తెలియదు. కనపరాని సమాజములోని వారికి పేర్లున్నా మరియు పనులున్నా వారు కనిపించని దానివలన వారిని గూర్చి ఎవరికీ తెలియదు. పేర్లు, కార్యములు అన్నీ తెలిసినా కేవలము కనిపించని దానివలన, లోపలి సమాజమును ఏమాత్రము ఎవరు గ్రహించడము లేదు. బయటి సమాజములోని వారి అందరి పేర్లు తెలియకున్నా, అందరి పనులు తెలియకున్నా, కేవలము కనిపించే దానివలన దానిని గురించి అందరు తెలుసునని మాట్లాడుదురు. ఈ రెండు సమాజములలో మనిషికి ఏది ముఖ్యము అని ప్రశ్నవస్తే, బయట అందిరి మధ్యలో తిరుగుచున్నాము కాబట్టి బయటి సమాజములో ఎలా మెలగాలో తెలిసివుండాలి. అలాగే లోపలి సమాజములో నీ పాత్ర ఏమిటో తెలిసి వుండాలి. ఒక విధముగా రెండు సమాజములు మనిషికి ముఖ్యమైనవే.

ఒక మనిషి సంపూర్ణముగా జీవించాలి అంటే అతడు రెండు సమాజములను గురించి తెలిసివుండాలి. నేటికాలములో లోపలి సమాజమును గురించి ఎవరికీ తెలియదు. కావున అటువంటి మనిషి అసంపూర్ణముగా జీవించినట్లే, అనగా అతనిది సంపూర్ణ జీవితము కాదు. సమ్ అనగా బాగా అని, పూర్ణమ్ అనగా పూర్తిగా అని అర్థము. సంపూర్ణముగా అనగా బాగా తెలిసి అని అర్థము. భూమిమీద మానవులు సంపూర్ణముగా తెలియక అసంపూర్ణ జీవితమును గడుపుచున్నారని తెలియుచున్నది.

ఒక మనిషి భౌతిక సమాజములో జీవించునపుడు తన శరీరములోని ఆధ్యాత్మిక సమాజమును గురించి కూడ తెలిసివుండాలి. అలా ఆధ్యాత్మికము తెలియకుండ కేవలము భౌతికముగా జీవించువానిని అజ్ఞాని అనియు, అసంపూర్ణ జీవి అనియు అనవచ్చును. మనిషి అలా అజ్ఞాని కాకుండ, అసంపూర్ణ జీవితమును గడపకుండ, ఇటు బయట అటు లోపల సమాజములను గురించి తెలిసి బ్రతుకునట్లు, దేవుని ధర్మములను భగవంతుడు జ్ఞాన రూపములో తెలియజేసాడు. బయట సమాజములో ఒక మనిషి కార్యములను చేయుచున్నపుడు, మాట్లాడునపుడు, కుటుంబముతో ఉన్నపుడు, భార్య ఎడల, పిల్లల ఎడల, బంధువుల ఎడల సక్రమముగా ఎలా ప్రవర్తించాలో నియమించి తెలియజేయునది లోపలి సమాజము. బయటి సమాజములోనే మనిషికి ఘోరమైన పాపములు అంటుకొనుచున్నవి. బయటి సమాజములోనే ఘోరమైన బాధలు అనుభవించవలసియున్నది. బయటి సమాజములో పాపములను అంటించు కోకుండ, సక్రమముగా బ్రతకాలంటే భౌతికముతో పాటు, ఆధ్యాత్మికమును కూడ తెలిసివుండాలి. కనిపించని ఆధ్యాత్మికమును ధర్మబద్దముగా జ్ఞానరూపములో భగవంతుడు తెలియజేయుటకే వచ్చును. ఆధ్యాత్మికమును

తెలియజేయాలి అంటే దేవుని ధర్మములు మనిషికి తెలియాలి. దేవుని ధర్మములతో కూడుకొన్నదే ఆధ్యాత్మికము. దేవుని ధర్మములు ఇప్పటికి రెండుమార్లు భూమిమీద కేవలము మూడు వేల సంవత్సరముల వ్యవధిలోనే తెలియబడినాయి. ఇంత తక్కువ కాలములోనే దేవుని ధర్మములు సంపూర్ణ జ్ఞానరూపముతో తెలియబడినప్పటికీ, ఒక్క ధర్మమును కూడ మనిషి గ్రహించలేదు. దేవుని అంశ భూమిమీదికి భగవంతునిగా వచ్చి ధర్మములను తెలియజెప్పినా ఎందుకు మనిషి గ్రహించలేదు. గ్రహించకుండ పోవుటకు కారణమేమి అని చూచినట్లయితే ఈ విధముగా తెలియుచున్నది.

మనిషి శరీరములో ముఖ్యమైనది తల. పైకి కనిపించే తలలో కనిపించని రహస్యము ఎంతో ఉన్నది. అందువలన భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తియోగము అను అధ్యాయములో మొదటి శ్లోకములోనే

శ్లో॥ ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్।
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద సవేదవిత్॥

**భావము :** శరీరమునకు పైన మూలమున్నదని చెప్పాడు. దానికి కొమ్మలు క్రిందకలవని కూడ చెప్పాడు. దీనిని తెలిసినవాడు మాయను తెలిసినట్లేనని చెప్పాడు. పైన తలలోని మూలమును తెలిస్తే మాయనేకాక దేవుని జ్ఞానమును కూడ తెలిసినట్లే అగును. అందువలన తలలోని కొంత రహస్యమును మనము వివరించుకొందాము. తలలోని కొంత రహస్యమును తెలుసుకొనుట వలన ప్రస్తుత కాలములో దేవుని ధర్మములను మనిషి ఎందుకు తెలుసుకోలేక పోయాడో కొంత వరకు అర్థమగును. తలలో నాలుగు చక్రముల అమరిక ఒకటున్నదని ముందే చెప్పుకొన్నాము. అందులో క్రింది చక్రము ఒకటి కలదు కదా! దానినే మాయచక్రము

అనీ, గుణచక్రము అనీ చెప్పుకొన్నాము. ఈ చక్రము మూడు చుట్టు కొలతలలో, మూడు భాగములుగా విభజించబడి ఉన్నది. ఒక్కొక్క భాగమునకు ఒక్కొక్క పేరు కలదని ముందే చెప్పుకొన్నాము. గుణచక్రము ఆకారమును కూడ చిత్రరూపములో తెలుసుకొన్నాము. చక్రములోని ఒక్కొక్క భాగములో 6+6 గుణములు మొత్తము 12 కలవని కూడ చెప్పుకొన్నాము. వీటిలో ఆరు మంచి గుణములుకాగా, ఆరు చెడు గుణములుగా ఉన్నవి. మంచి చెడు 12 గుణములు పేర్లు కలిగివున్నవి. వీటికి అనుసంధానమై రెండు గుంపులకు ఒక శ్రద్ధ కలదు. ఒక గుణభాగములోని గుంపుకు ఒక శ్రద్ధ అనునది ఉండగా, మిగత రెండు గుణ భాగముల గుంపుకు రెండు శ్రద్ధలు ఉండును. శ్రద్ధ అనునది గుణము కాదు. శ్రద్ధ అనునది ప్రత్యేకమైనది. శ్రద్ధ అనునది ఒక చాయలాంటిది. దాని చాయ (నీడ) అరు గుణముల మీద పడుచుండును. గుణముల మీద శ్రద్ధయొక్క చాయపడడమేకాక అ గుణ భాగములోనున్న జీవున్ని అక్కడున్న గుణముల లోని ఒక గుణమునతో శ్రద్ధ అనుసంధానము చేయుచుండును. బాగా అర్థమగుటకు ఒక ఉదాహరణను చెప్పుకొందాము. సూర్యుడు ప్రకాశించు నపుడు సూర్యరశ్మిపడని స్థలములు కూడ ఎన్నో ఉండును. ఇంటిలోని అన్ని జాగాలలోనికి సూర్యరశ్మి పడదు కదా! అలాగే శరీరములో జీవుడు సూర్యుడులాంటివాడు జీవునికి కొంత వెలుగువుండును. జీవుని వెలుగు నేరుగా ఏ గుణము మీదపడదు. గుణము ఒక ఇల్లులాంటిది. జీవుని వెలుగు గుణము అను గృహము లోపలపడవలెను. సూర్యకిరణము సూర్యుని చుట్టు నిటారుగానే పయనించును, కానీ ఎక్కడ కిరణము వంగదు. సూర్యకిరణము వంగకపోవడము వలన గృహములోనికి సూర్యకిరణము అన్ని స్థలములోనికి పోజాలదు. ఇంటి ముఖద్వారము ద్వారా సూర్యకిరణము

నేరుగా ఎదురుగానున్న రూములోని గోడకు పడవలనంటే, సూర్య కిరణమును వంచి ద్వారము ద్వారా నేరుగానున్న గోడకు పడునట్లు చేయవచ్చును. అలా చేయుటకు ఒక పరికరము అవసరము. సూర్య కిరణమును వంచి పంపునది మనము ముఖము చూచుకొను అద్దము మాత్రమే. అద్దము సూర్యకిరణమును ఎక్కడికైనా పంపగలదు. అలాగే శరీరములోని జీవుడు తనకాంతిని నేరుగా ఏ గుణము మీదికి పంపలేడు. జీవుని కాంతిని ఎప్పుడు ఏ గుణము మీదికి పంపవలెనో అప్పుడు జీవుని కాంతిని ఆ గుణము మీదికి పంపుటకు మన శరీరములోని శ్రద్ధ అను అద్దము కలదు. అద్దము సూర్యకిరణమును ఎలాగ ఎక్కడికైనా వంచిపంపగలదో, అదే విధముగా శ్రద్ధ జీవుని కాంతిని ఏ గుణము మీదికైనా పంపగలదు. బయటి అద్దము ఎలాగ పనిచేయుచున్నదో, అలాగే లోపల శ్రద్ధ అనునది పని చేయు చుండును. బయటి అద్దము దానంతటికది పని చేయదు. దానిని పని చేయించుటకు ఒక మనిషి అవసరము. ఒక మనిషి అద్దమునుండి సూర్య కిరణమును ఎక్కడికి పంపవలెనో, ఏ ఇంటిలోనికి పంపవలెనో, ఆ ఇంటిలోని ఏ గదిలోనికి పంపవలెనో తెలిసిపంపును. అలాగే శ్రద్ధ అనునది స్వయముగ జీవుని కాంతిని ఏ గుణము మీదికి పంపలేదు. దానిని నియమించి పని చేయించునది ప్రారబ్ధకర్మ అనునది ప్రత్యేకముగా ఒకటి గలదు. ప్రారబ్ధకర్మకు శ్రద్ధను ఎప్పుడు ఏ గుణము మీదికి పంపవలెనో తెలిసివుండును. దానిప్రకారమే జీవుని వెలుగును శ్రద్ధ ద్వారా గుణముల మీదికి పంపుచున్నది. ప్రారబ్ధకర్మ తెలిపిన ప్రకారము శ్రద్ధ గుణము మీదికి జీవుని కాంతిని పంపుచున్నది. అప్పుడు జీవుడు ఆ గుణముతో ఏకమైపోవుచున్నాడు. అనగా ఆ గుణమును తగులుకొనినవాడగుచున్నాడు. అలా ఏ గుణము మీద జీవునిక్రాంతి

ప్రసరించుచున్నదో, ఆ గుణభావమును జీవుడు పొందుచున్నాడు. శరీరములో జీవుడు గుణముల భావమును ఈ విధముగా పొందుచున్నాడని ఇంతవరకు ఎవరికీ తెలియదు. మేము ఎంత సులభముగా చెప్పినా ఇది పెద్ద రహస్యమేనని తెలియవలెను. **ఇక్కడనే ఎవరికీ తెలియని రహస్యములలో కెల్ల రహస్యమైన విషయము ఇంకొకటి గలదు.** అదేమనగా!

గుణచక్రములోని మూడు గుణభాగములకు మధ్యలో ఒక భాగము కలదని, అదియే కృష్ణుడు ధరించిన నెమలిపింఛమందు మధ్యలోగల నల్లని గుర్తని చెప్పుకొన్నాము. ఆ మధ్యలోని గుర్తు ఆత్మకు నిలయమని చెప్పుకొన్నాము. మధ్యలోని భాగము చుట్టువున్న మూడు వలయములలో మూడు శ్రద్ధలు గలవు. అలాగే మధ్యలోనున్న ఆత్మ భాగములో కూడ ఒక శ్రద్ధ గలదు. ఈ శ్రద్ధ ప్రత్యేకమైనది. ఇది మూడు గుణములలోని శ్రద్ధలాగ ఉండదు. దీనిమీద ప్రారబ్ధకర్మ ప్రభావముండదు. ఈ శ్రద్ధ సర్వ స్వతంత్రమైనది. గుణచక్రములోని మూడు భాగములలో ఏదో ఒక భాగములోనున్న జీవుడు స్వయంప్రకాశముకలవాడు. అతని ప్రకాశము గుణ భాగములో మాత్రము ప్రాకగలదు. జీవుని కిరణములు ఒక గుణ భాగముకంటే ఎక్కువ దూరముపోలేవు. గుణముల మధ్యలోనున్న భాగములో గల ఆత్మ కూడ స్వయం ప్రకాశము గలదియే. అయితే ఆత్మ ప్రకాశము తన భాగములోనేకాక, తర్వాత మూడు గుణభాగములలోనేకాక, శరీరమంతా కాలు గోరు వరకు, తల వెంట్రుకల వరకు ప్రాకివుండును. జీవాత్మ ఆత్మ రెండు పరమాత్మనుండి వచ్చినవే, అయినా జీవాత్మ అనుభవించువాడు, ఆత్మ అనుభవింపజేయువాడు. అంతేకాక ఆత్మ శరీరములో అనేక పనులను ఎవరికీ తెలియకుండ చేయుచు శరీరమును నడిపించుచున్నది. శరీరము మొత్తము ఆత్మ కిరణములు ఆక్రమించి, శరీరములో ప్రతి పనిని

చేయుచున్నవి. జీవాత్మ గుణ భావమును పొందడము మరియు అహం భావమును పొందడము, ఆత్మ శరీరముద్వార చేయించిన పనిలోని కష్టసుఖములను అనుభవించడము మాత్రము చేయుచున్నది. గుణ భావమును, అహం భావమును పొందడములో జీవునికి ఏ అనుభూతి (అనుభవము) లేదు. కానీ కష్టసుఖములను మాత్రము అనుభవిస్తున్నాడు.

ఆత్మ శరీరమంతా వ్యాపించి జీవాత్మకంటే ఎన్నో విధముల గొప్పదిగా ఉన్నది. అయినప్పటికీ మూడు గుణ భాగములలో శ్రద్ధ ఉన్నట్లే ఆత్మ భాగములో కూడ శ్రద్ధ కలదు. ఆత్మ భాగములోనున్న శ్రద్ధ ప్రత్యేకమైనదని తెలుసుకొన్నాము కదా! ఈ శ్రద్ధ జీవునియొక్క కర్మ ఆధీనములోనిది కాదు. ఇది కేవలము జీవాత్మ ఇష్ట ప్రకారము మాత్రమే పని చేయును. గుణములలోని శ్రద్ధ జీవుని కిరణములను గుణముల మీదికి ప్రసరింపజేయుచుండగా, ఆత్మ భాగములోని శ్రద్ధ ఆత్మ కిరణములనే జీవుని మీదికి ప్రసరింపజేయును. గుణములలోనున్న శ్రద్ధను ప్రారబ్ధకర్మ పని చేయించగా, ఇక్కడ శ్రద్ధను జీవుని ఇష్టము పని చేయుస్తున్నదని చెప్పుకొన్నాము కదా! జీవుడు గుణములను ఏవగించుకొని, గుణముల మీద పని చేయునది తన శ్రద్ధకాదనీ, గుణముల మీద కర్మ శ్రద్ధ పని చేయిస్తున్నదనీ, మొత్తము శరీరము లోపలగల ఆధ్యాత్మిక సంఘమునంతటిని తెలిసినపుడు, తనకు కూడ శ్రద్ధవున్నదని తన శ్రద్ధ ఎంత పని చేస్తే అంత ఆత్మజ్ఞానము లభించునని అర్థమైనపుడు, ఆత్మ భాగములోని శ్రద్ధ కదిలి పనిచేయుటకు మొదలుపెట్టును. అప్పుడు శ్రద్ధ అక్కడ గల ఆత్మకిరణము లను జీవాత్మ మీదికి ప్రసరింపజేయును. అలా జీవుని యొక్క శ్రద్ధ ఆత్మ భాగమునుండి ఆత్మ కిరణములను ప్రసరింపగా, జీవునికి ఆత్మ యొక్క విషయము (ఆత్మజ్ఞానము) కొద్ది కొద్దిగా అర్థమగుటకు మొదలు పెట్టును.

ఇదంత జరుగుటకు మొదట బాహ్యసంఘములో ధర్మములు తెలిసివుండాలి. బాహ్య ప్రపంచములో దైవధర్మములు తెలిసినపుడు మనిషికి దైవజ్ఞానము అర్థమగును. అప్పుడు లోపలనున్న జీవాత్మ స్పందించి లోపలనున్న సంఘమును తెలుసుకొనుటకు మొదలుపెట్టును. లోపలనున్న సంఘమును తెలుసుకొన్న తర్వాత జీవునికి ఆత్మజ్ఞానము మీద ఇష్టము కల్గును. అప్పుడు జీవుని ఇష్టము ప్రకారము ఆత్మ భాగములోని శ్రద్ధ పని చేయును. ఒక మనిషి ధర్మవరునిగా మారాలంటే ఈ విధముగా బాహ్యములో జ్ఞానము, అంతరములో జ్ఞానము తెలిసినపుడే సాధ్యమగును. అనగా బాహ్య సంఘమును, అంతర్‌సంఘమును బాగా తెలియవలసివున్నది.

ప్రస్తుత కాలములో ఇప్పటికే భగవంతుడు రెండుమార్లు ధర్మములను తెలియజెప్పిపోయాడు. ఆయన ప్రచారములో భాగముగా మూడవ మారు వచ్చి చెప్పవలసివున్నది. ఇప్పటికి రెండుమార్లు చెప్పినా, బాహ్యసంఘములో దైవధర్మములనే ఎక్కువగా చెప్పడము జరిగినది. ఇక మూడవమారు వస్తే ఎక్కువగా అంతర్ సంఘమును గురించి చెప్పవలసివున్నది. అప్పటికి భగవంతుని ధర్మప్రచారము పూర్తి అగును. ఇంతవరకు మనుషులు ఎందుకు మారలేదు, ఇంతవరకు ధర్మములు ఎందుకు ప్రచారము కాలేదు. ధర్మములు ప్రచారమైనా అవి ఎందుకు పూర్తిగా అర్థము కాలేదు అని ప్రశ్నించుకొని చూస్తే, అలా జరుగుటకు ధర్మములు మూడవమారు ప్రచారము కావలసి వున్నది. మూడవమారు ప్రచారమైనపుడే ధర్మప్రచారము పూర్తి అగును. అంతేకాక ఇప్పటివరకు చెప్పియున్న బోధలలో రెండు సమాజములను చెప్పినప్పటికీ, మూడవమారు చెప్పు బోధలలో అంతర్ సమాజమును గురించి ఎక్కువ చెప్పబడును. ప్రస్తుత కాలములో శరీరాంతర్గత సమాచారమును గురించి ఎవరికీ ఏమాత్రము అర్థముకాలేదు. అందువలన

ఎక్కడైనా స్వాములు, గురువులు, బోధకులు చెప్పు బోధలలో శరీరాంతర్గత సమాచారమును గురించి చెప్పడము ఉండదు. భగవంతుడు రెండుమార్లు ధర్మములను చెప్పినా, వాటి మీద ఎవరికీ ఆసక్తి లేకపోవడము వలన, ఎక్కడైన ఆసక్తివున్నవారు ఉండినా, వారికెవరికి సరిగా అర్థము కాకపోవడము వలన, అంతర్గత సమాజమును గురించి తెలియకుండ పోయినది. మనిషి దైవత్వమును చేరుటకు అంతర్గతము ఎంత అవసరమో ఎవరికీ ఏమాత్రము అర్థము కాకుండపోయినది. అందువలన మూడవ మారు వచ్చు భగవంతుడు ముందు రెండుమార్లు చెప్పిన ధర్మములను వివరించి అర్థమగునట్లు చెప్పడమేకాక, అంతర్గత సమాజమును గురించి, అందులో జీవుడు ఎలా ఉండాలో దానిని గురించి వివరముగా చెప్పిపోవును.

గతములో రెండుమార్లు దేవుని అంశ భగవంతుని రూపములో దేవుని ధర్మములను తెలియజేస్తే, గుణరూపములోనున్న మాయ వాటిని అర్థమైనట్లు మానవున్ని మభ్యపరచి, దేవుని మార్గములోనికి మనిషి పోయినట్లు నమ్మించి, తన మార్గములోనే ఉంచుకొన్నది. అందువలన మూడవమారు వచ్చు భగవంతుడు మాయ ఉనికిని, మాయ విధానమును, మాయ కార్యములను కూడ వివరించి చెప్పి, మాయబారిలో పడిన మనిషిని బయటపడునట్లు చేయును. దేవునిది జ్ఞానమార్గమైతే, మాయది దేవుని మార్గమునకు వ్యతిరేఖమైన మార్గము. మనుషులను మాయ తన మార్గములో నడిపించుకొనుటకే ప్రయత్నించుచుండును. ఆ లెక్క ప్రకారము మాయది ఒక మార్గము, దేవునిది ఒక మార్గము మొత్తము రెండు మార్గములున్నవని తెలియుచున్నది. మాయ, దేవుని రెండు మార్గములను గుర్తించునట్లు రెండు మార్గములకు రెండు వేరువేరు పేర్లు కలవు. దేవుని మార్గమును పథము అంటాము. మాయ మార్గమును మతము అంటాము.

భగవంతుడు తన బోధలో ఎక్కడ మతము అను పదమును ఉపయోగించలేదు. భగవంతుడు ఎక్కడ చెప్పినా జ్ఞానమార్గమనియో లేక జ్ఞాన పథమనియో చెప్పాడు. మతము అనునది మాయకు సంబంధించిన దారి, కావున దేవుడు ఆ మాటను ఎక్కడ ఉపయోగించి ధర్మములను తెలుపలేదు. భగవంతుడు రెండుమార్లు జ్ఞానమును బోధిస్తే, దానిని మానవులకు అర్థమైనట్లు నమ్మించిన మాయ, భగవంతుని ఒక్కొక్క రాకను ఒక్కొక్క మతముగా మలిచి, కృష్ణుడు చెప్పినది హిందూమతమనీ, ఏసు చెప్పినది క్రైస్తవమతమనీ మనుషులను నమ్మునట్లు చేసింది. దేవుని అంశ అయిన భగవంతుడు చెప్పిన జ్ఞానము యొక్క సారాంశమును తెలియని మనుషులు, రెండుమార్లు రెండు రూపములలో, రెండు దేశములలో చెప్పిన భగవంతుడు ఒక్కడేనని తెలియక, తమ తలలోని మాయవలలో చిక్కుకొని కృష్ణుడు, ఏసు వేరువేరు మతముల, వేరువేరు వ్యక్తులనీ, వారు బోధించినది వేరువేరు బోధలను భ్రమలో పడిపోయారు. అలా దేవుని పథమును వదలి మాయ మతములో చిక్కుకొని మేము ఫలానా మతమువారమనీ చెప్పుకొనుచు, మా మతము అభివృద్ధి కావాలని తమ మతమును పెంచుకొను ప్రయత్నము చేయుచున్నారు. తమ మతమును పెంచు కోవాలంటే ఇతర మతమును తగ్గించాలి. ఇతర మతమువారు వారి మతమును వదలి తమ మతములోనికి వచ్చినపుడే తమ మతము పెరుగుతుంది. ఒక మతము తరగకుండ మరొక మతము పెరగదు. అలా ఒక మతము తగ్గిపోవాలంటే, అనేక విధముల ఆచరణలతో ఒక మతమును ఇతర మతమువారు తగ్గించవలసి ఉన్నది. తమ మతములోని బోధను చెప్పి బోధతో ఒప్పించి, ఇతర మతముల వారిని తమ మతము లోనికి చేర్చుకోవచ్చును. లేకపోతే దౌర్జన్యముతోకానీ, హింసతోకానీ,

బయటపెట్టికానీ ఇతర మతము వారిని తమ మతములోనికి వచ్చునట్లు చేసుకోవచ్చును.

ఈ కాలములో కొందరు తమ మతములోని జ్ఞానముతో కొందరిని ఆకర్షించుటకు ప్రయత్నించుచుండగా, చాలామంది హింసామార్గమును ఉపయోగించి పరమతమును నాశనము చేస్తే తమ మతము గొప్పదగునని, ఆ మతమువారు బయపడి తమ మతములోనికి వచ్చుదురని ప్రయత్నించు చున్నారు. ఈ విధముగ చివరకు మాయతో కూడుకొన్న మతములన్ని హింసామార్గములో పయణించుచున్నవి. మేము ఇందూ మతములో పుట్టిన దానివలన మనది ఇందూ మతముకాదు, మనది వాస్తవానికి ఇందూ పథము అని తెలియజెప్పుటకు ఇందూమతము ×, ఇందూపథము 4 అని ఒక గ్రంథమును ప్రచురించితే, మమ్ములనే క్రైస్తవులని ప్రచారము చేసి, మా మీద నంద్యాల కోర్టులో కేసులు పెట్టిన మహానంది హిందువులు ప్రస్తుత కాలములో ఉన్నారంటే మతము అను మాయ మనిషిలో ఎంత లోతుగా దూరిపోయిందో అర్థమగు చున్నది. దేవునికి సంబంధించిన జ్ఞాన పథము ఏమాత్రము మచ్చుకైన కనిపించకుండ పోయినది. ఈ మతము ఆ మతము అనకుండ అన్ని మతములు హింసా విధానమునే ఎన్నుకొని తమ మతమును పెంచుకొనుటకు ప్రయత్నించుచున్నారు. తలలోని మాయ నీ మతములోని దేవుడే నిజమైన దేవుడు, ఇతర మతములోని దేవుడు దేవుడే కాదు అని తెల్పుట వలన, మనిషి ప్రత్యక్షముగా రెండవ మతములోని దేవున్ని నిందించను మొదలు పెట్టుచున్నాడు. మనిషిలోని దేవుని మీద విశ్వాసమే అదే దేవున్ని దూషించునట్లు చేయడమేకాక, అదే దేవున్ని విశ్వసించిన వానిని చంపునట్లు కూడ చేయుచున్నది. అన్ని మతముల వారు అందరిని సృష్ఠించినది దేవుడే అంటారు. అంతలోనే నీ మతము, నీ దేవుడు అని

దేవున్ని రెండుగా చేసి మాట్లాడుతారు. దీనినంతటిని గమనిస్తే దైవపథము తెలియని దానివలన మనిషి మాయ మతములో పడిపోయి చివరకు దైవమును చేరలేడని అర్థమగుచున్నది.

ఇంతవరకు మనము చెప్పుకొన్న కోవలోనే హిందూమతము, క్రైస్త మతము అనునవి తయారైనవి. నేడు హిందూమతములో దేవుని గుడి ఉన్నా, దేవతల గుడులు అనేకము తయారైపోయి, ఎవరు దేవుడు అను గుర్తింపే లేకుండ పోయినది. అలాగే క్రైస్తవమతములో ప్రార్థనా మందిరమును కట్టుకొని ఏసునే చంపిన శిలువను (పెద్ద శిలువ లేక కొండ శిలువ) చర్చీల మీద పెట్టుకోవడము జరుగుచున్నది. హిందువులకు దేవతలంటే ఏమిటో, దేవుడంటే ఏమిటో అర్థము కాకుండ పోయినది. అలాగే క్రైస్తవులకు శిలువ అంటే ఏమిటో, దేవుడంటే ఏమిటో అర్థము కాకుండ పోయినది. ఈ విధముగ ప్రజలలో కొందరియందు దైవభక్తి ఉండినా, చివరకది దయ్యము భక్తిలాగ మారిపోయింది. ఇది దేవునిభక్తి అని చెప్పుటకు వీలు లేకుండ పోయినది. మా మాటలు కొంత విడ్డూరముగా ఉన్నా క్రైస్తవులు శిలువకు దగ్గరగా ఉండి, దేవునికి దూరముగానున్న మాట వాస్తవమే. అలాగే హిందువులు దేవతలకు దగ్గరగా ఉండి దేవునికి దూరముగానున్న మాట వాస్తవమే. ప్రజలందరూ దేవుని జ్ఞానమును తెలుసుకొని దేవునికి దగ్గర కావాలని చెప్పుచున్నాము తప్ప వేరు భావము ఏమిలేదని అందరు గ్రహించాలి. అంతేకాక మనుషులందరికి తండ్రి ఒక్కడేనని, అందరము ఆయన సృష్ఠిలోని వారమేనని, ఆయన తప్ప ఈ విశ్వములో వేరే దేవుడే లేడని తెలియాలి. మధ్యలో మనుషులు కల్పించు కొన్నవే మతములనీ, మతములను బట్టి దేవుడులేడని, జ్ఞానపథమును బట్టి దేవుడున్నాడని ప్రతి ఒక్కరు తెలియాలి. అప్పుడైతేనే మనిషి మాయనుండి

బయటపడగలడు. ఇప్పటికాలములో మతము పేరు చెప్పుకొను ప్రతి మనిషి మాయలోనున్నట్లేనని అర్థమగుచున్నది. అలా తనకు తెలియకుండానే మాయలో చిక్కుకొన్న మనిషి, నేను జ్ఞానములో ఉన్నాననుకొనినా, నాకు దేవుని మీద విశ్వాసముందని అనుకొనినా, ప్రత్యక్షముగా దైవభక్తిని వ్యక్తము చేయుచుండినా, అతడు మాత్రము దైవదూషకుడే, దేవునికి నిత్యము విరోధియే. ఈ మాట కూడ విచిత్రముగా కనిపించినా నా మాట వాస్తవమే అనుటకు ఈ విధముగా చెప్పుచున్నాను చూడండి.

ఎప్పుడైతే మతద్వేషము మదిలో ఉన్నదో, అప్పుడు అతడు ఆ మత దేవున్ని నిందించుచున్నట్లే అగును. ఇతర మత దేవున్ని అసూయతో, ద్వేషముతో అతను దేవుడే కాడు అన్నపుడు ఆ మాట నేరుగా తన దేవునికే తగులును. తన దేవుని మీద విశ్వాసముతో ఉంటూ, మా దేవుడే నిజమైన దేవుడు అని పొగిడినప్పటికీ, ఇతర మత దేవున్ని దూషించుట వలన అది తన దేవున్ని దూషించినట్లే అగును. ఉదాహరణకు ఒక క్రైస్తవుడు తన ఏసు మీద భక్తితో హిందూమతములోని కృష్ణున్ని దేవుడే కాదనినా, తన ఏసే దేవుడని కృష్ణున్ని దూషించినా, ఆ దూషణ ఏసును దూషించినట్లే అగును. క్రైస్తవుడు కృష్ణున్ని దూషించితే అతను వాస్తవముగ ఏసును దూషించినట్లగును. అలాగే ఒక హిందువు ఏసును చులకన భావముతో చూచినా, ఆయనను దూషించినా అది కృష్ణున్ని దూషించినట్లగును. అట్లగుటకు కారణము మరొకమారు జ్ఞాపకము చేస్తే కృష్ణుడు, ఏసు ఇద్దరు ఒక్కరే కనుక ఒకరిని దూషించితే మరొకరిని దూషించినట్లగును. ఇప్పుడు కొందరు ఒక ప్రశ్న అడుగవచ్చును. అదేమనగా! ఇద్దరు ఒకటేనను విషయము మాకు తెలియదు. మా మతముయొక్క ఏసును వందమార్లు నమస్కరించిన మేము కృష్ణున్ని దేవుడుకాడు అని ఒకమారు అనినా,

ఆయననే వందమార్లు మ్రొక్కినట్లు, ఒకమారు దూషించినట్లు అగును కదా! తెలియక ఒకమారు దూషించినా, వందమార్లు నమస్కరించాము కదా! అప్పుడు దూషణకంటే మ్రొక్కినదే ఎక్కువగును కదా అని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! నీవు బజారులో పోవునపుడు ప్రతి దినము నిన్ను చూచి ఒక మనిషి నమస్కారము పెట్టుచుండెననుకొనుము. అట్లు ఒక సంవత్సరకాలము జరిగినది. అనగా 365 దినములు నిన్ను చూచి నమస్కరించిన మనిషి ఒక రోజు నిన్ను చూచి పొరపాటుగ వేరే వ్యక్తి అనుకొని, తనకు సరిపోని పాత శత్రువువలె కనిపించడము వలన అతనికి కోపము వచ్చింది. ఆ కోపములో ఉన్నట్లుండి కాలులోని చెప్పును తీసుకొని నీవైపు చూపి దగ్గరకురా చెప్పుతో కొట్టుతానన్నట్లు సైగ చేశాడు. అప్పుడు నీవు ఇతను 365 రోజులు నాకు నమస్కరించాడు ఒకరోజు చెప్పుతో కొట్టితే కొట్టనీలే అని అనుకుంటావా? లేక అతని మీద కోపమును తెచ్చుకొంటావా? ఎవరికైనా కోపమే వస్తుంది. ఇన్ని రోజులు మ్రొక్కినాడు ఒకరోజు కొట్టితే ఏమైతుంది అని ఎవడు అనుకోడు. ఎంతటి తెలివున్న వాడైనా ఎదురు దాడికైనా దిగుతాడు. లేకపోతే తర్వాత నీకత చూస్తానని అనుకుంటాడు.

ఆ విధముగ ఏ దేవున్నయినా ఒక ప్రక్క మ్రొక్కుచూ, ఒక ప్రక్క దూషిస్తే మ్రొక్కిన దానికంటే ఎక్కువగా దూషించిన దానినే తీసుకుంటారు. నీవు ఏ మతములో ఉండినా, నీవు మ్రొక్కుచున్న దేవుడు ఎవరైనా, ఇతర మతములో ఉండు దేవుడు కూడ నీ దేవుడే అగుట వలన, నీవు ఎవరిని దూషించినా అది నీ దేవున్ని దూషించినట్లే అగును. అందువలన కృష్ణున్ని దూషించినా ఏసును దూషించినా అసలైన సృష్టికర్తను దూషించినట్లే అగును. మొత్తము మీద క్రైస్తవులు చాలామంది హిందువులను తమ మతములోనికి

ప్రవేశించునట్లు చేసుకొన్నారు. మిగిలిన హిందువులు తమ మతమును కాపాడుకోవాలని మతభక్తిని పెంచుకొనుటకు, కొన్ని సంఘములను తయారు చేసుకొన్నారు. బలప్రయోగముతో మతమును కాపాడుకోవాలని హిందువులు ప్రయత్నించుచుండగా, ఆశలను చూపి రోగాలు పోతాయని, సుఖాలు వస్తాయని, కష్టాలుపోతాయని క్రైస్తవులు ప్రచారము చేసి తమ మతమును పెంచుకొనుచున్నారు. చివరకు ఇరు మతముల వారు దేవుడు చెప్పిన జ్ఞానమును మరచిపోయారు. ఏ మతములలో ఉండినా, ఏ మతములో చేరినా ఏమి ప్రయోజనములేదు. దేవుడు చెప్పిన జ్ఞానపథములో పయణించి నపుడే మనిషి జీవితమునకు సార్థకత ఏర్పడును. అంతవరకు మతము మనిషికి ఏ విధముగా ఉపయోగపడక పోగా, మనిషిని నాశనము చేయును. అందువలన ఇప్పటినుండైన నీవు ఎవరో, ఈ సమాజమేమిటో తెలుసుకో, దానికి జవాబు దొరకాలంటే కనిపించని నీ శరీరములోపలి సమాజమును గురించి తెలుసుకో. అప్పుడు సర్వ జగత్తుకు సృష్టికర్త ఎవరో, అందరికి అధిపతి ఎవరో, పరమాత్మ అనబడు దేవుడు ఎవరో కొంతవరకైనా అర్థమగుతుంది.



**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**



**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

# ఇందూ - హిందూ

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇందు | = | చంద్రుడు | = | జ్ఞాని | ప్రబోధానంద యోగీశ్వరులు |
| హిందు | = | అర్థరహితము | = | జ్ఞానములేని | |
| హిందు | = | దొంగ | = | దయానంద సరస్వతి (గురూజీ సమగ్ర గ్రంథావలి) | |
| హిందు | = | బేవకూఫ్ | = | నృసింహానంద భారతి (హైందవ శంఖారావము) | |

- చినజీయర్ మొదలగు చాలామంది స్వామీజీలు హిందూ శబ్దమును వాడకూడదన్నారు. ఆ పదమును వాడితే మన తలను మనమే నరుక్కున్నట్లని తమ ఉపన్యాసములలో చెప్పారు. చాలామంది స్వామీజీలు ఈ శబ్దమును విదేశీయులైన ముస్లీమ్‌లు మనకు అంటగట్టారన్నారు. వారి భావములో హిందు అంటే తెలివి తక్కువ వారని అర్థమట.
- బృహస్పతి ఆగమమును అనుసరించి పూర్వము నేడు మనము పిలుచు హిందూ మహాసముద్రమును **"ఇందూ సరోవరమని"** పిలిచెడి వారు.
- నెహ్రూ తన కూతురు ఇందిరాగాంధీని ముద్దుగా ఇందూ అని పిలిచెడివాడు. ఇందూ అంటే **'జ్ఞాని'** అని అర్థము.
- కాశీ మున్నగు నగరాలు 'చంద్రవంక' ఆకృతిలో నిర్మింపబడినాయి.
- అలహాబాద్‌లో గంగానది అద్భుతముగా చంద్రవంక ఆకృతిలో వంపు తిరిగినది. చంద్రున్ని **'ఇందువు'** అంటారు.
- హిందూ సముద్రము జ్ఞాన నిలయమునకు గుర్తు కావున దానిని పూర్వము 'ఇందూ మహా సముద్రము'గా పిలిచెడివారు. (**"త్రైతాకార రహస్యము"** గ్రంథములో గలదు.)
- భారత దేశము పూర్వము జ్ఞానముగల దేశము. కావున భారత దేశమును ఇందూ దేశమనీ, భారతీయులను ఇందువులనెడివారు.

1) నాలుగు అధర్మములు పది శాతము మనుషులలో ఉండగా,
ఒక్క మతమను అధర్మము 99 శాతము గలదు.

2) యజ్ఞ, దాన, వేద,తపస్సులు నాల్గుకాగా, ఐదవ అధర్మము మతము.

3) దైవ మార్గమునకు పెద్ద ఆటంకము మతము.

4) అన్ని అధర్మములను మించినది మతమను అధర్మము.

5) ప్రపంచ మార్గములో మతము ఉంటే
దైవ మార్గములో హతమై పోతావు.

6) కలియుగములో క్రొత్తగా పుట్టుకొచ్చిన ఐదవ అధర్మమే మతము.

మతాలు నిషేధము, నిషిద్ధము. కులాలు అహేతుకము, అశాస్త్రీయము.

**భగవద్గీత, బైబిలు, ఖురాన్** మూడు ఒకే దైవగ్రంథములోని భాగములే.

మీ మనోభావము కులమతాలకు అతీతమైతే వెంటనే "ప్రబోధ సేవాసమితి" లో

సభ్యులుగా చేరండి. దేవుడు మిమ్ములను జ్ఞానులుగా చేయాలని కోరుతున్న...



--- శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

ఫోన్ : 09948947630, 09491040963, 09440556968

మూలకర్త

త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

# ద్రావిడ శ్రేష్ఠి సంఘం




**ద్రావిడ శ్రేష్ఠి సంఘం** (D.S.S)

**(Regd.No.: 266/2015)**

కృష్ణానగర్ కాలనీ, కొత్తకోట (మం), మహబూబ్‌నగర్ (జిల్లా), తెలంగాణ-509381

e-mail id : info@dravidashreshtisangham.org

*www.dravidashreshtisangham.org*

# శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!

తామసము

రాజసము

ఆత్మస్థానం

సాత్త్వికము

బ్రహ్మనాడి

శరీరమంతా
ప్రాకిన నరములు

*Author :*

***The Only GURU of Three Religions***

***The Spiritual Emperor, Thraitha Theorem Originator***

***Sri Acharya Prabodhananda Yogeeshwarulu***



**www.thraithashakam.org**